ఇ. కజకేవిచ్

# మిత్రుని హృదయం

కథ

విదేశభాషా ప్రచురణాలయం
మాస్కో

అనువాదం: గిడుతూరి సూర్యం
కూర్పు: ఎ. బెల్యకిన్

Э. КАЗАКЕВИЧ

# СЕРДЦЕ ДРУГА

Повесть

*На языке телугу*

# విషయసూచిక



ఆ ధ్యా య ం  ఒ క టి

# పదాతిదళంలో నావికుడు

## 1

సమరం తీవ్రతరమైన దశలో ఉంది. ఓర్ష విముక్తికోసమని జర్మన్ రక్షణల్ని ఛేదించేందుకై పదేపదే ప్రయత్నం చేయడంవల్ల రెజిమెంటు బలహీనమైపోయింది. తమ స్థానే వేరే రెజిమెంటువారు రాబోతున్నట్టు విన్నారు. మైళ్లకొద్దీ తెరచుకొని బురదగా ఉన్న కొండ పగుళ్ల పొడుగునా రక్షణకై కందకాలు త్రవ్వి వాటిలో స్థావరాలు ఏర్పరచుకుని పోరాడుతూన్న మనుషుల స్థానే కొత్త వాళ్లను ఏర్పాటు చేయవలసి ఉంది. ఆపై వారు పొడిగా ప్రశాంతంగా ఉన్న ఏదో ఒక స్థలంలోకి విశ్రాంతి కొరకై, శరదృతువు తెచ్చిపెట్టిన చలినీ, జలుబుల్నీ, పుండ్లనీ స్వస్థత పరచుకొనేందుకై వెళ్లాలి.

రెజిమెంటు కమాండరు మేజర్ గొలొవీన్ తన సహాయకులను, ముగ్గురు బటాలియను కమాండర్లను, తన ఛీఫ్ ఆఫ్ స్టాఫ్‌నీ సమావేశ పరచాడు. వారికా వార్తను తెలియ జేసినప్పుడు అతని ముఖంలో మరుగుపడని సంతృప్తి వెలుగొందింది.

సమావేశం జరుగుతున్న సమయంలో పాత వాళ్లదగ్గరనుండి చార్జి తీసుకోబోతున్న డివిజన్‌నుండి యిద్దరు ప్రతినిధులు — వయసులో పెద్దవాడైన ఒక కర్నలూ, యువకుడైన మేజరూ — వచ్చారు. ఏదో ఒక విధంగా ఏర్పాటు చేసిన దీపం కాంతిలో ఆ చెమ్మగా ఉన్న కందకంబసలోకి వారు ప్రవేశించి, తమ కాగితాల్ని చూపించి తడి ఆర్చుకోను వెచ్చగా ఉండేందుకై ఒక చిన్న యినుపపొయ్యి ప్రక్క ఉన్న మడతమంచంమీద కూర్చున్నారు.

కొంచం సేపు నిశ్శబ్దంగా వుంది. ఆ కొద్ది సేపటిలోనూ ఒకేస్వరంతో గగ్గోలు పెడుతున్న గాలీ, గలగలా శబ్దం చేసే కందకంబస ద్వారమూ కేవలం వీటివల్లనే ఆ నిశ్శబ్దం భంగమైనప్పుడు వారు ఒకరినొకరు శ్రద్ధగా చూసుకున్నారు.

రెజిమెంటల్ ఆఫీసర్లకూ ఆ కొత్తగా వచ్చిన వాళ్లకీ కొట్టొచ్చినట్లుగా ఎంతో భేదం కనిపిస్తోంది. కొత్తగా వచ్చిన వాళ్లు శుభ్రంగా క్షౌరం చేసుకున్నారు. మంగలి షాపు సువాసన యింకా వాళ్లనుండి వస్తూనే ఉంది. ఎంతో కాలం విశ్రాంతి తీసుకోవడం వల్లా, మంచి భోజన సదుపాయాలు ఉండడం వల్లా వారి మొహాలు తేటగా, నున్నగా ఉన్నాయి. కొద్దిగా బురదా బంకమన్నూ కొట్టుకున్నప్పటికీ వారి బూడ్సులు, సైనిక జీవితంయొక్క సదుపాయంతోనూ క్రమంతోనూ సంబంధం ఉన్నట్టుగా యింకా మైనపు మెరుగుతో తళతళలాడుతూనే వున్నాయి.

తన తాబేదార్ల మోటుముఖాలకీ స్వయంగా తన అసహ్యమైన ఆకృతికీ గొలొవీన్ వ్యాకులత పడ్డాడు. క్షౌరంలేక మాసి ఉన్న ఆ బటాలియను కమాండర్ల గడ్డాలని ముఖం ముడుచుకుని చూస్తూ: "అవును మనంతటికి మనమే తప్పుచేసి దొరికిపోయాం," అని భావించాడు. "మనం అంతా ఆ వెధవ రాబిన్‌సన్ క్రూసోలాగా తయారయ్యాం!" కాని బటాలియను కమాండర్లు మాత్రం ఏ విధంగానూ సిగ్గు పడ్లేదు; "మేం కూడా మీరిప్పుడున్నట్లే ఉండేవాళ్లం; ఒకటి రెండు వారాల తర్వాత మీరెలా ఉంటారో చూస్తాంగా," అని అంటున్నట్టు వాళ్లు ఆ కొత్తగా వచ్చిన వాళ్లవంక దాదాపు సవాలు చేస్తున్నట్టుగానే చూశారు.

అదే ఆలోచన బహుశా ఆ యువకుడైన మేజర్‌కు కూడా తట్టి ఉండొచ్చు. రెజిమెంటల్ ఆఫీసర్లను చూసిన ఆతని చూపులో కనికరం కనిపిస్తుంది. బహుశ, యుద్ధరంగంలోని ఆ కష్టభూయిష్ఠమైన విభాగంలో తన రెజిమెంటుకి ఏం జరుగ నుందో అనే సానుభూతీ, కొంత వ్యాకులతా ఆ చూపులో ద్యోతకమౌతాయి. కాని ఆ నెరసిన జుట్టున్న కర్నల్‌ని చూడగానే అతడు యుద్ధాల్లో బాగా ఆరితేరిన మనిషని స్పష్టమౌతుంది. అతడీ క్రింది విధంగా గొణిగినప్పుడు ఆతని కళ్ళు తళతళలాడాయి:

"మీరెందుకు క్షౌరం చేసుకోరు? మీరు సరిగ్గా గెరిల్లాల లాగు కనబడు తున్నారు."

గత్యంతరం లేదన్నట్టుగా రెజిమెంటల్ కమాండరు సౌంజ్ఞ చేశాడు. "అవును కర్నల్. బహుశ కావొచ్చు, కాని నిర్మొహమాటంగా చెప్పాలంటే ఇక్కడి పరిస్థితులు ఏమీ బాగులేవు. మొత్తం ప్రదేశమంతా నిర్మానుష్యంగా ఉంది. శత్రువులు తిరోగమించి నప్పుడు ప్రతిదానికీ నిప్పంటించారు. స్నానానికి వేడినీళ్లు కాగబెట్టాలంటే చెట్లుగానీ వంటకట్టెలుగానీ ఏమీ లేవు. ఒక నెలంతా కుంభవర్షం కురుస్తూ వచ్చింది. కందకం బసల గోడలు కూలి పోతున్నాయి. వాటికి దన్ను పెట్టాలంటే ఎక్కడ చూసినా బురదా, నీళ్ళా తప్ప మరేవీ లేవు. ఆయుధాల్ని పరిశుభ్రం చేయాలంటే ఎక్కడా స్థలమే దొరకదు. మన మెషీన్‌గన్‌లు 'జామ్' అయిపోయాయి, ఎప్పుడూ జరగకూడనిది జరిగింది — ఏం చెప్పేది!" 'జరిగింది' అనే పదాన్ని ప్రయోగించడంలో అతనికి కొంత ఆనందం కలిగినట్లనుపిస్తుంది. అంటే, తన కష్టాలన్నీ తొలిగాయనీ ఏదో భిన్నమైనటువంటిదీ, పోల్చడానికి వీల్లేనటువంటిదీ అయిన మంచి భవిష్యత్తు ఉందనీ దాని భావం.

కర్నల్ చీదరింపుతో కనుబొమల్ని ముడుచుకొని క్లుప్తంగా యిలా అన్నాడు: "అసలు విషయానికొద్దాం రండి."

ఆ యుద్ధశ్రేణి విభాగంలోని పరిస్థితిని వారతనికి చెప్పారు. యుద్ధరంగం మ్యాపునూ, రికన్నాయిసెన్స్ మ్యాపునూ అతనికందిచ్చారు. వారంతకు ముందే తయారు చేసినటువంటి, చార్జి ఒప్పగించే విషయానికి సంబంధించిన నివేదికను ఆయన ముందు పెట్టారు. కాని గొలొవీన్‌కు ఆశాభంగం అయ్యేట్టు, కర్నలు లాంఛనంతో సరి పెట్టుకునేవాడు కాకుండా బహుసూక్ష్మ విషయాలను కూడా ఎక్కువ లక్ష్యమిచ్చి చూసే వానిగా తేలేడు.

''ముందు ప్రదేశాన్ని నేనే స్వయంగా చూసుకుంటాను. అక్కడ ఎలాంటి పరిస్థితి ఉన్నదీ కచ్చితంగా తెలుసుకుంటాను,'' అని ఆయన అన్నాడు. కొంత విరామం తర్వాత మళ్లీ అన్నాడు: ''శత్రువులు, వారి ఆయుధబలం, రక్షణవిధానం, వారి సైన్యాల వ్యూహం, వాటి బలం, వీటన్నిటికీ సంబంధించిన మీా భోగట్టాతో నేనే విధంగానూ సంతృప్తి పొందలేదని ప్రస్తుతానికి చెప్పితీరాలి. మీారు చార్జి ఒప్పగించే ముందు, మీరు రికన్నాయ్‌సెన్స్ పోరాటం సలిపితీరాలని డివిజన్‌వారు అంగీకరించారు, అలా అని మీకు కొన్ని గంటల్లోనే ఆజ్ఞవస్తుంది.''

''రికన్నాయిసెన్స్ పోరాటం సలిపితీరాలా?'' అని గొలోవీన్ తిరిగి అన్నాడు. ఆతని మొహం ఒక్కక్షణం సేపు బాధతో మెలితిరిగినట్లయింది.

రికన్నాయ్‌సెన్స్ పోరాటం అంటే, ఇదివరకే తగినంతగా నష్టాలకు గురి అయిన రెజిమెంటు యింకా ఎక్కువగా బాధలు పడడం అన్నమాట. మొత్తంమీద శత్రువులు అనుకూలమైన స్థావరాలలో స్థిరపడి కనుచూపు మేరవరకూ మైళ్లకొద్దీ మన వైపు వున్న శూన్యప్రదేశాన్ని వాళ్ల స్వాధీనంలో ఉంచుకోవడంవల్ల మనకు యీా నీళ్లతో నిండిన కొండకనుమ తప్ప వేరే గత్యంతరం లేకపోయింది. వాస్తవానికి డివిజన్‌నుండి వచ్చిన కర్నల్ చార్జి తీసుకొనే ముందు రికన్నాయ్‌సెన్స్ విషయంలో గట్టిగా పట్టుబట్టడం న్యాయసమ్మతమైందే. అలా చేసేందుకై అతనికి సర్వహక్కులూ ఉన్నాయి. బాధ్యత కూడా ఉంది. కాని అతడు అసహ్యకరమైన మనిషి, రాతిగుండెకల వ్యక్తి, దురభిప్రాయాలతోనిండిన వృద్ధుడూ తప్ప మరేంకాదనీ, అతనికి కష్టమైన విభాగాన్నివ్వడంచే ద్వేషంతోనూ, విశ్రాంతి తీసుకోను వెళ్తున్న వారంటే ఈర్ష్యతోనూ, రికన్నాయ్‌సెన్స్ విషయాన్ని గట్టిగా కోరేందుకు నిశ్చయించుకొన్నాడని గొలోవీన్ భావించాడు.

''సరే మంచిదే,'' అని అతడు కటువుగా అన్నాడు. ''మేం రికన్నాయ్‌సెన్స్ పని చేస్తాం.'' అతడు తన ఆఫీసర్లను కలయచూశాడు. ఆ కష్టమైన పనిని ఏ బటాలియను కమాండరుకు ఒప్పగించాలనేది అతడు నిశ్చయించుకోవాలి. సహజంగా, రెండవ బటాలియను కమాండరైన కాప్టెన్ లబ్‌జీన్‌కు ఆ పనిని ఒప్పగించగలడు. అతడంటే గొలోవీన్‌కి ఏమంత యిష్టంలేదు — అతడు అతి జాగ్రత్తైన మనిషి. దాదాపుగా పిరికివాడనే చెప్పాలి — మిగతా యిద్దరిపైనున్నంత కనికరం ఆయనకు అతనిపై లేదు. కాని ఆ భావం ఆయనకు తట్టీతట్టడంతోనే తనమీాద తనకే కోపంవచ్చి దానిని మనసునుండి తొలగించాడు గొలోవీన్. అటుగ్గింజలా వున్న ఆ వృద్ధ కర్నల్ ఏం తలపెట్టినా, అతని

భావాలు ఏమైనప్పటికీ విధి విధే: శత్రువులని గనక తగినంతగా పరిశీలించని పక్షంలో, వెళ్లిపోతున్న దళంవారు తమ చార్జిని ఒప్పగించే ముందు, రికన్నాయిసెన్స్ పనిని బాధ్యతతో నిర్వహించాలి — అదే రణరంగంలోని శాసనం. స్థిరచిత్తుడైనట్టిన్నీ అతనికి యిష్టుడైనట్టిన్నీ మొదటి బటాలియను కమాండర్‌కి ఆయన ఆ పనిని యివ్వవలసి వచ్చింది.

''కాప్టెన్ అకీమొవ్, నువ్వు సిద్ధంగా ఉండు,'' అన్నాడు గొలొవీన్ అతనివైపు బడలినట్లు చూస్తూ.

''మంచిది,'' అని తన పొడుగాటి శరీరాన్ని నిక్కపొడుచుకుంటూ, ఒక నెలకు పైగా బాగా పెరిగి ఉంగరాలు తిరిగి నిగనిగలాడుతూన్న నల్లని తన గడ్డంమీద చిరునవ్వు తొణికిసలాడగా, సమాధానం చెప్పాడు అకీమొవ్. లోతుగా, కంచులాగా మ్రోగిన అతని కంఠధ్వని మ్యాపుల్నీ కాగితాల్నీ చూసుకుంటున్న కర్నల్ ధ్యానాన్ని చెదరకొట్టింది. అతడా మాట్లాడిన వ్యక్తి వైపు తటాలున చూశాడు. విశాల శరీరంపై కండపుష్టితో ఉన్న అతని శిరస్సును పరికించాడు. బొంతలాగా కుట్టిన అకారంలేని ఆ కోటు కూడా అతని శరీర దార్ఢ్యాన్ని దాయలేకపోయింది. వెల్లివిరిసిన శక్తినే మీరు అకీమొవ్‌లో గమనిస్తారు. అతని వైఖరి గనక బిఱ్ఱుగానూ బిగువుగానూ ఉన్నట్లైతే అతడు ప్రగల్భాలు కొట్టే వాడిలాగా, యించుమించు ఆడంబరం కలిగినవాడిలాగా కనిపించేవాడే. బహుశ అందుకే కావొచ్చు అతడు తనభుజాలను కొద్దిగా దించుకున్నాడు. మోటుగా ఉన్నాడు. అతడు కదిల్తే భల్లూకం కదిలినట్లే ఉంది. కావాలనే ఎలాగో చురుకుతనం లేని వాడిలాగా కనిపించాడు. అతని మెడ — ఆ ఒక్క భాగమే నగ్నంగా ఉంది — అది ఏ మాత్రమూ సన్నగా లేకపోయినా చాలా తెల్లగా మృదువుగా ఉంది. అది అతని దుస్తుల క్రిందున్న బలీయమైన కండరాలని బైటపెట్టడానికి యిష్టంలేనట్లుగా కనిపించింది.

ఎత్తుగా స్పష్టంగా ఉన్న నుదురు మినహాయించి ఆతని మొహంనిండా స్ఫోటకపు మచ్చలున్నాయి. పచ్చరంగూ గోధుమవన్నే యివి రెండూ కలసిన వర్ణంగల ఆతని చిన్న కళ్లల్లో ప్రశాంతత, ఆత్మవిశ్వాసం గోచరిస్తుంది.

బటాలియను కమాండరు ఆకృతి కర్నల్ మనసులో నాటుకుపోయింది. కాని వ్యక్తుల స్వభావాన్ని వారు చేసే క్రియల్నిబట్టి నిర్ణయించే అలవాటు ఆయనకు ఉంది కాబట్టే, లేదా ఆ యువకుని నిండువిగ్రహం కలిగించిన ఆకర్షణకు బహుశా ప్రతికూలంగా పోరుసలుపుతున్నందువల్లా ఆయన ''క్రియాచరణలో అతడే విధంగా ఉంటాడో చూద్దాం,'' అనే భావం తన మనసులో పరుగెత్తగా, మళ్లీ ఆ కాగితాల్లో మునిగిపోయాడు.

''మన రెజిమెంటల్ ఫిరంగులూ, ఫిరంగి రెజిమెంటుయొక్క బేటరీ, వీటన్నిటి సహాయం నీకుంటుంది,'' యీలోగా అకీమొవ్‌తో అన్నాడు గొలొవీన్. ''కొన్ని అదనపు ఫిరంగులకోసం నేను డివిజనల్ కమాండర్‌ను అడుగుతాను. మనకున్న వాటన్నిటినీ నీకిస్తాను. సాపర్ కంపెనీను కూడా పంపుతాను.'' అతడు ఒక్క క్షణం తటపటాయించి చేదుమాత్రకి పంచదార పూసే చివరి ప్రయత్నంతో మళ్లీ అన్నాడు: ''రికన్నాయ్‌సెన్స్ ప్లాటూన్ కూడానూ.''

''సరే,'' అదే అకీమొవ్ సమాధానం.

అతని మొహంపై కొంచం చిరునవ్వు యింకా తారాడుతూనే ఉంది.

''ఎందుకా నవ్వు?'' అని భావిస్తూ మళ్లీ అతనివైపు చూసి వృద్ధ కర్నల్ చికాకుతో ఆశ్చర్యపోయాడు.

రికన్నాయ్‌సెన్స్ పోరాటం సంగతి వినగానే, ఆ పనిని గొలొవీన్ తప్పక తనకే ఒప్పగిస్తాడని అకీమొవ్ వెంటనే గ్రహించాడు. అతడు భావించినట్టుగానే జరగడంవల్ల ఒక వింత చిరునవ్వు అతని ముఖవర్చస్సులో మెరిసింది — సరిగ్గా ఊహించగలిగినందుకు కొంత వినోదం, యథేచ్ఛతో కూడిన కొంత అహంకారం, అదే సమయంలో కొంత వ్యాకులత గోచరమయ్యాయి.

గోడకు వ్రేలాడుతూ ఉన్న టామీగన్‌ను అకీమొవ్ తీసుకొన్నాడు. అక్కడ ఉన్న ఉద్యోగులలో కర్నలే పెద్ద హోదాగలవాడు గనక, తాను వెళ్లేందుకై అతని అనుమతిని అడిగాడు.

కర్నల్ తల పంకించి అన్నాడు: ''నేను త్వరగానే వచ్చి మిమ్మల్ని చూస్తాను.''

''తప్పకుండా దయచేయండి,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. ''మంద తప్పిన గొర్రె మాకొకటి దొరికింది. ఈ వేళ దాని మాంసంతో వేపుడుకూర తయారు చేస్తున్నాం. వచ్చి మాతో కలవండి. కాని రేపు మీరు మా నుండి చార్జి తీసుకుంటున్నారని మా ఆఫీసర్లతో మాత్రం చెప్పకండి.''

''ఎందుకు చెప్పకూడదు?'' అని అడిగాడు కర్నల్ నిరుత్సాహంగా.

మొదట అకీమొవ్ సమాధానం చెప్పలేదు. చివరికి నిర్మొహమాటంగా అన్నాడు: ''ఎందుకంటే ఆ సంగతి వాళ్లకు తెలుస్తే అంత శక్తివంచనలేకుండా పాటుపడరేమోనని భయం.'' ఏమైనా అభ్యంతరాలు వస్తాయేమోనని అతడు ఆగాడు. ఎవరూ ఏమీ మాట్లాడక పోవడంవల్ల అతడు ఏ వ్యక్తినీ ఉద్దేశించకుండా మళ్లీ

అన్నాడు: ''ఆ విషయం నేను మరిచిపోతే బాగుండు ననుకున్నాను కాని అనక తప్పింది కాదు.''

అతడు తన టామీగన్‌ను తేలికగా భుజంమీద పెట్టుకొని వెలుపలికి వెళ్లి పోయాడు.

అపరాహ్ణం తిరిగి ఎంతసేపో కాకపోయినా అప్పటికే బాగా చీకటి పడిపోయింది.

కొండకనుమ ఎడమవైపు పల్లంలోకి గుహనూదిరిగా కోసుకుపోయిన రెజిమెంటల్ కమాండరు కందకంబసనుండి ఒక సన్నని సొరంగం కనుమలోకే దారితీసింది. చీకటికి అలవాటు పడేందుకై ప్రయత్నిస్తూ, మురికినీళ్లలోకి జారకుండా తప్పించుకొనేందుకై అకీమొవ్ ఆ సొరంగం తడి గోడల్ని పట్టుకొని నెమ్మదిగా ముందుకు వెళ్లాడు. చివరికి అతడా సొరంగం ముఖద్వారాన్ని చేరుకున్నాడు. అతని ముందు నల్లగా అనంతంగా కొండకనుమ ఉంది. మొద్దుబారిపోయిన సైనికుల కంఠధ్వనులను అప్పుడప్పుడు వెంట తీసుకువస్తూ, నిరాటంకంగా పల్లంలోని బురదనీరును రాచుకొని పోవడంచే యీలలాగు శబ్దంచేస్తూ తీవ్రంగా వీస్తున్న గాలి తప్ప చుట్టుపట్ల అంతటా నిశ్శబ్దంగా ఉంది.

''కామ్రేడ్ కాప్టెన్?'' అని అతని ఆర్డర్లీ సార్జెంట్ మాయ్‌బొరొద కంఠధ్వని వినిపించింది.

''అవును. నేనే,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. ''ఇలా రా.''

అతడు చీకటికి అలవాటు పడ్డాడు కాబట్టి యిప్పుడు త్వరగా వెళ్తున్నాడు. చీకటిగా ఉన్న ఆకాశాన్నీ నల్లగా ఉన్న భూమినీ విడదీస్తున్నట్టి అస్పష్టమైన రేఖను కూడా అతడు తెలుసుకోగలుగుతున్నాడు. అతనికి ఎగువగా సమీపంలోనే వున్నట్టి, ముందుకు చొచ్చుకున్న కనుమ అంచును కూడా అతడు కనుక్కోగలుగుతున్నాడు.

''చలిగా ఉందా?'' అని వెనుక నడుస్తున్న సార్జెంటును అతడు అడిగాడు.

''ఒక మాదిరిగా ఉంది,'' అని సమాధానం.

కొంత సేపటివరకు నిశ్శబ్దం. ఆ తర్వాత సార్జెంటు: ''కామ్రేడ్ కాప్టెన్,'' అని మళ్లీ అకీమొవ్‌ను పిలిచాడు.

''ఏం?''

''రెజిమెంట్ కమాండర్ మీ పీకమీదికేమైనా తెచ్చాడా యేమిటి?'' అని మాయ్‌బొరొద తటపటాయిస్తూ అడిగాడు.

''ఏమలా అడుగుతున్నావ్,'' అకీమొవ్ హేళనగా నవ్వుతూ అన్నాడు, ''ఈ చీకట్లో కూడా నువ్వు కనిపెట్టగలుగుతున్నావా?''

సార్జెంటు నెమ్మదిగా నవ్వాడు. కాని గోడమీది పిల్లి వాటంగా చెప్పిన ఆ సమాధానానికి అసంతృప్తి చెందాడు. అతడు మళ్ళీ అడిగాడు, ''మామూలు వార్తేనా లేక ఏదైనా ప్రాముఖ్యం ఉన్న వార్తా?''

''ఈ దరిదాపుల్లో మార్గం ఎగువకు వెళ్తుంది.'' అకీమొవ్ అన్నాడు. ''మనం మార్గం తప్పకూడదు. మాయ్‌బొరొద, జాగ్రత్త సుమా, కిందికి ఉండు. టామీగన్నుని బురదలోకి పడేయకుండా చూడు. వచ్చేశాం. బాగుంది. మనం బయటబడ్డాం.''

వాళ్లు శిఖరంపైనుండి నెమ్మదిగా మందంగా ఎగురుతూ మండుతూన్న ఒక జర్మన్ మతాబీచువ్వ చూశారు. నల్లగా అగపడుతూ వున్న ఒక దెబ్బతిన్న టాంకు మైదానంమీద పడివుంది. వాళ్లు దాని పక్కనుండి వెళ్లారు.

''మనం యుద్ధం చేయబోతున్నాం,'' అన్నాడు అకీమొవ్ చాలాసేపు నిశ్శబ్దంగా ఊరుకొని. ''మనం ఓర్ష పట్టుకోబోతున్నాం. వార్సాదాకా వెళ్తాం. ఆ తర్వాత — నీకు మిలిటరీ రహస్యం చెబుతున్నా — మనం బెర్లిన్ మీదికి దండెత్తుతాం. అదీ కబురు. అంతకు మించి కావలసిందేముంది గనక.''

ఆ మాటలు సార్జెంట్ వదరుబోతుతనానికి తాళం వేశాయి.

తమ బటాలియను ఉన్న కనుమదగ్గరికి వారు మౌనంగా వెళ్తున్నారు. అది మ్యాపులో పేర్కొన్న ఒక గ్రామం పొలిమేరలో ఉంది. ఆ గ్రామంలో కేవలం పొగగొట్టాలు మాత్రమే మిగిలాయి. వాటిల్లో చాలావరకు శిధిలావస్థలో ఉన్నాయి. కాలిపోయిన యిండ్ల తాలూకు ఆ నల్లని చిమ్నీగొట్టాలు అనాగరిక ప్రజలు పూజించే దేముళ్ల శిలాప్రతిమల్లాగా వరుసలుతీర్చి నిలబడ్డాయి. వాటి వాసనను మరచిపోవడం అసంభవం. అవి నాశనాన్నీ, నిప్పులయొక్క బాధాకలిత మధుర వాసననీ వెదజల్లుతున్నాయి.

అకీమొవ్‌కూ సార్జెంటుకూ ఆ ప్రదేశం ప్రతి అంగుళమూ తెలుసుగనక వారు తమ కనుమయొక్క పల్లపు ప్రదేశంలో త్వరత్వరగా వెళ్తున్నారు. అంతే కాకుండా వర్షం కూడా బాగా కురుస్తోంది. బటాలియను మోర్టారులుండే స్థలాల్ని దాటారు. అజాగ్రత్తగా ముయ్యడంచేత కందకంబసలనుండి వెలుగు కిరణాలు దూరంలో మసగ్గా కనిపిస్తున్నాయి. బటాలియను వంటిల్లు ఎక్కడున్నదీ పొగజాడలు తెలుపుతున్నాయి.

తన కందకంబస గుమ్మంవద్ద అకీమొవ్ అన్నాడు: ''వెళ్లి ఆఫీసర్లందర్నీ పిలు.''

అకీమొవ్ తన కందకంబసను 'ఓడ వెనుకతట్టు' అని పిలుస్తాడు — యుద్ధ భాగ్యంగానీ లేదా యితర ఉద్యోగంగానీ వారినెక్కడికి తీసుకు వెళ్లినా నావికులు ఆ పదాన్ని వాడుతారు. అతడు నావికుడుగా ఉండేవాడు. తలవనితలంపుగా తమ యుద్ధనావనుండి దిగి భూమిమీద యుద్ధం చేస్తున్న సమయంలో సెవాస్టోపోల్‌లో అతడు గాయ పడ్డాడు. ఆ తర్వాత సైన్యంలోకి రావలసి వచ్చింది. భూమిమీద పదాతిదళంలో ఉండ డం అతనికి యింకా ఎక్కువ సంతృప్తిని కలిగించింది. ఎందువల్లనంటే తానెప్పటి కైనా ఓడలో బెర్లిన్ చేరాలంటే ఆ నగరం సముద్రానికి చాలా దూరంలో ఉందని భావించే వాడు. ఆ భావంవల్లనే అతడు అప్పుడప్పుడు సమాధానం పడుతూండేవాడు. ఏమై తేనేం, నౌకాదళంలో ఆఫీసర్ల అవసరం లేనందువల్లనేం, లేదా ఏ ఆఫీసులోనైనా అటంకం కలగడంవల్లనైతేనేం తనను నౌకాదళంలోకి బదిలీ చేయుమని అతడు పెటుకున్న అనేక దరఖాస్తులకు సమాధానం లేకపోవడంవల్ల అతని అహంభావం దెబ్బతిందనే ఒప్పుకోవాలి.

నాల్గవ తరగతికి చెందిన సబ్‌మెరైన్‌లను వెంటాడే ఓడను కమాండ్‌చేస్తూ లెఫ్టినెంట్‌గా నల్లసముద్రంలో నౌకాదళసేవ చేశాడు. యుద్ధసమయంలో లక్కపిడత లాంటి ఆ చిన్న నావ మునిగిపోయింది.

నావికులంటే జనానికి అంత ఆకర్షణ ఎందుకో సరిగ్గా చెప్పడం కష్టమైన విషయం: తమ వృత్తి అపాయకరమైనదీ అద్భుతమైనదీ అవడం వల్లనో, హోమర్ 'ఒడెస్సీ' గ్రంథాన్ని వ్రాసిననాటినుండి ఓడలంటేనూ సముద్రం అంటేనూ ఏమీ తెలియనటువంటి వారిని ఉప్పగా ఉన్న సముద్రంగాలి ఆకర్షించడం వల్లనో, కలిసి పని చేసే ఉత్సాహాన్నీ అతిభయంకరమైన పంచభూతాల నెదుర్కొనేందుకు నిర్భయాన్నీ సముద్ర జీవితం వారికి నేర్పడం వల్లనో, అపారమైన రష్యన్ భూమిలో బహు అరుదుగా నావికులు కనిపించడం వల్లనో కావచ్చు. కారణం ఏమైనా కావచ్చుగానీ పైనచెప్పిన నావికుడు సముద్రంనుండి వచ్చినందుకుగాను అతనిని పదాతిదళంలోని వ్యక్తులంతా ఆ నావికుని అధికంగా గౌరవించారు. మొదటి బటాలియన్‌లోని సైనికులు యితర యూనిట్లలోని తోటిస్నేహితులతో డంబాలు పలికేవారు: "మా కమాండరు నావికుడు. చాలా మంచివాడు. మీరు అతనితో ఎక్కడైనా సరే క్షేమంగా ఉంటారు!"

కొద్దికాలంలోనే అకీమొవ్ కాప్టెన్ హోదాలోకి రాగలిగాడు. కంపెనీ కమాం డరుగా ఆతర్వాత బటాలియను కమాండరుగా అతనిని నియమించారు. ఒకవేళ వారతనిని తిరిగి నౌకాదళంలోకి బదిలీ చేసినట్లైతే అది కొంత ఆందోళన కలిగించి ఉండేదేమో కూడాను. ఎందుకంటే అతడు నౌకాదళంలో కేవలం లెఫ్టినెంటుగా మాత్రమే ఉండే వాడు. అతని విజ్ఞానంగానీ అనుభవంగానీ లెఫ్టినెంట్-కమాండర్ హోదాకు సమాన మైన ఉద్యోగాన్ని చేపట్టేందుకై అవకాశాన్నిచ్చేదికాదు. నౌకాదళ సాంకేతిక చిక్కులూ అనేక వైవిధ్యాలూ అంతకంతకు మరింత సంక్లిష్టాలతోనూ కూడి ఉంటుంది; ధైర్యంగా ఉన్నంత మాత్రానా, మంచి ఏర్పాట్లు చేయగలిగినంత మాత్రానా సరిపోదు.

ఏమైనప్పటికీ అకీమొవ్ ఒక్కొక్కప్పుడు సముద్రంమీదికి వెళ్లడానికే వాంఛించే వాడు. ముఖ్యంగా నల్లసముద్రానికి. అది మాంచి అందంగా, క్రిక్కిరిసిన జనంతో ఎప్పుడూ హడవుడిగా వుండే ఓడరేవుల్తోనూ, కండ్లు మిరుమిట్లు గొల్పే నీల ఆకాశం తోనూ, పచ్చని తీరాలతోనూ ఉంటుంది. అతడు నౌకకోసం బెంగ పెట్టుకున్నాడు. ఆ అద్భుతంగా ఐకమత్యం కలిగిన అంగక్రమం గల నిర్మాణమూ, ఎక్కడ ఏదీ నిరు పయోగం కాకుండా వుంటుందో, ఎక్కడ ఏదీ అయుక్తం కాకుండా వుంటుందో, దేని నివాసకులు జీవన్మరణాలలో కలసికట్టుగా ఉంటారో, అలాంటి ఒక చిన్న వివేకవంతమైన సొంత ప్రపంచమూ యివిరెండూ కలిసి, తమక్రింద లయతో ఊగుతున్న సోవియట్ మాతృభూమియొక్క ఒక చిన్న గడ్డకింద రూపొందాయి.

అకీమొవ్‌కు సంబంధించిన ప్రతీదీ నావికునికి సంబంధించిందే. అతని కళ్లు కూడా సముద్రం పచ్చదనంలాగే ఆకు పచ్చగా ఉన్నాయి. అతని మొహంమీద మచ్చలు కూడా మశూచివల్ల కాకుండా ఉప్పునీరు ఘాటువల్లనే కలిగాయేమోనని పిస్తుంది.

సముద్రానికి ఎంతో దూరంలో ఉన్న కొవ్‌రోవ్ అనే బస్తీలో పావెల్ అకీమొవ్ జన్మించాడు. ఆ వూరు సముద్రానికి ఎంత దూరంలో వుందంటే పిట్టలన్నీ కూడా సము ద్రంనుండి అక్కడి వరకూ రాలేవు. అతనిని నౌకాదళంలోకి తీసుకోవడానికి కారణం ఆరడుగులకంటే మించిన అతని పొడుగాటి విగ్రహమే, శరీరబలమే. అంతే కాకుండా యువకమ్యూనిస్టు లీగ్‌వారు నౌకాదళాన్ని ప్రోత్సహించి తమ లీగ్‌లో వున్న ఉత్తమ యువ కుల్ని అందులోకి పంపించారు. టర్నర్‌గానూ, పరికరాలు తయారుచేసే వానిగానూ పనిచేసే అకీమొవ్‌కు అతడొక మంచి సంఘసేవకుడనే పేరు ఉంది. అపారమైన మన దేశం అంతటా నాయకత్వం వహిస్తున్న లీగ్ కలలో కూడా ఊహింపలేనంతటి సన్నిహి

తంగా అతడు నౌకాదళం ఆదర్శాలకు దగ్గరగా ఉన్నాడు. అతడు పాఠశాలలో ఏడు సంవత్సరాలు మాత్రమే చదువుకోగలిగినందున టర్నర్‌గా పని నేర్చుకున్నాడు. కాని అతడు తన పనిని నేర్చుకున్న రోజుల్లో ప్రముఖంగా చూపించిన సామర్థ్యం వల్లా, పట్టుదలతో చేసే పని ఫలితంగానూ త్వరలోనే సున్నితమైన పనిముట్లు చేసే పనివాళ్లల్లో శ్రేష్ఠుడుగా తయారయ్యాడు. అతడు తయారుచేసిన వాట్లలో చాలా పనిముట్లను, యువ కమ్యూనిస్టు లీగువారి పట్టణప్రాంతీయ మహాసభలతోపాటే ఏర్పరచిన ఎగ్జిబిషన్లలో ప్రదర్శించారు. అతడు తన వయసులో ఉన్న యితరులవలె కాకుండా యువకమ్యూనిస్టు లీగుయొక్క అనేక నిర్ణయాల నిర్వహణను ఎలాగైతేనేం సాధించేవాడు. వీటన్నిటికీ శిరోభూషణంగా అతడు కరెస్పాండెన్స్ కోర్సు తీసుకొన్నాడు. తన ఉత్పత్తీ, సాంఘిక పనుల్తోపాటు తన చదువులో కూడా ప్రవీణత సంపాదించి అన్ని పాఠ్య విషయాలలోనూ ఫస్టు మార్కులు తెచ్చుకొనేవాడు. ఇది యింకా కష్టం. ఎందువల్లనంటే కరెస్పాండెన్సు కోర్సు ఎక్కువగా మనోబలంపై ఆధారపడి ఉంటుంది. కరెస్పాండెన్స్ విద్యార్థికి ఉండే ఒకేఒక ప్రోత్సాహం ఏమంటే అతడు తన అంతరాత్మతోనే పనిచేయాలి. ఏదో ఒక నిర్బంధమూ, ఆఖరికి ఒక మందలింపైనా లేకుండా అభ్యసించడం అంత సులభమైన విషయం కాదు. అంతే కాకుండా, నిర్మాణపుపనుల్లో పనిచేసే ఏ ఇంజనీరుకన్నా కూడా అకీమొవ్ ఎక్కువగా సంపాదించేవాడు. కాబట్టే అతడు విద్యనభ్యసించింది తన రాబడిని పెంచుకోవడానికని కాదు, ఎక్కువ విజ్ఞానాన్ని గడించడానికే, తోటిమానవులకు ఎక్కువగా ఉపయోగపడడానికే. వీటన్నిటికీతోడు అతడు తన విధిని గుర్తెరిగిన కొడుకు. అతని తండ్రి ఒక వృద్ధ చేనేత పారిశ్రామికుడు. కుటుంబం పెద్దది. అతడు పెరిగి పెద్దైన బస్తీలో సహజంగా అతనంటే అందరికీ యిష్టం.

కావ్‌రోవ్ బస్తీ నిటారుగా ఉన్న క్ల్యాజ్మా నది గట్టుపై ఉంది. ఆ వూరును పన్నెండవ శతాబ్దంలో నిర్మించారు. ఫర్‌కోసమై జంతువుల్ని పట్టుకొనే వృత్తిగాగల 'ట్రాపర్' ఎపిఫాన్ అనే వానిచే ఆ వూరు నిర్మాణమైనట్టు బహుకాలంగా వాడుకలో ఉంది. నాలుగు శతాబ్దాల తర్వాత నెస్టర్ చరిత్ర ప్రకారం ఆ బస్తీ స్తరొదూబ్ రాజ కుటుంబంలో ఒక శాఖ అయిన కావ్‌రోవ్ రాజులకు చెందింది. మధ్య రష్యాలోని సరిగ్గా యితర ఉయేజ్డ్ బస్తీల్లాగానే చర్చీలతోనూ, రాళ్లతో కట్టిన చిల్లర దుకాణాల్తోనూ క్రింది అంతస్తు ఇటుకతోనూ పై అంతస్తు చెక్కతోనూ కట్టిన రెండంతస్తుల మేడలు కలిగిన తిన్నని వీధుల్తోనూ ఉంది. సరిగ్గా విప్లవానికి పూర్వం అక్కడ ముప్పైమూడు

పానశాలలు, ఒక ఉన్నతపాఠశాల, ఒక కాలేజీ, ఒక ఆసుపత్రి, కొన్ని జవిళి మిల్లులూ, ఒక కొవ్వొత్తి ఫ్యాక్టరీ, ఒక పిండి మర, మాస్కో-నీజ్నీ నోవ్‌గొరొద్ రైల్వే వర్క్‌షాపులూ ఉన్నాయి. అక్టోబర్ విప్లవం తర్వాత యీ చిన్న బస్తీ పెద్దదై జనంతో నిండి సందడిగా ఉంది. విమర్శించి తెలుసుకొనే బుద్ధిగల పొడుగాటి యువకుల్తోనిండి ఉంది. ఆ ప్రాంతంలో బొచ్చుజంతువులని వేటాడే బోయిలు, ఆ ప్రాంతాన్ని సేద్యం చేసిన హాలికులూ, ఆ తరంవారి అంగసౌష్ఠవమూ, నెత్తురూ యీ యువకుల్లో గోచరిస్తుంది.

నూలువడికే వారితోనూ, చేనేత పారిశ్రామికులతోనూ నిండిన బస్తీ అల్లా లోహ కార్మికుల బస్తీగా పెరిగింది. రైల్వే వర్క్‌షాపులు, మాస్కోనుండి అమూర్ నది మీదున్న కొమ్‌సామోల్‌స్క్ నగరం వరకు చిన్నవిగానీ పెద్దవిగానీ అన్ని గృహనిర్మాణ స్థలాలలోనూ చూడదగిన శక్తివంతమైన ఎక్స్కవేటర్లను నిర్మించే పెద్ద వర్క్‌షాపులుగా అభివృద్ధి చెందాయి. అకీమొవ్ పనిచేసింది యిక్కడే.

అకీమొవ్ కుటుంబంవారు జరేచ్‌నయా స్లొబోద్‌కలోని ఒక చిన్న యింట్లో నివసిస్తుండేవారు. ఇక్కడ్నుంచి బస్తీకి వెళ్లాలంటే ఒక పాత పడవలో వెళ్లాలి. అప్పటికి క్ల్యాజ్మా నదిమీద యింకా వంతెనను కట్టలేదు. క్ల్యాజ్మా నదిమీదనూ, పచ్చిక మాదిరిగా ఉండే మొక్కల్తోనూ సుడిగుండాల్తోనూ నిండి ఉన్న ఊవొద్, నెరెహ్‌తా అనే చల్లని ఉపనదులమీదనూ అకీమొవ్, అప్పుడతనికి అసలు సంగతి తెలియక పోయినప్పటికీ, నావికుడుగా శిక్షణను పొందాడు. అక్కడ అతను పసివానిగా ఉన్నప్పుడే యీదటం, నీటి అడుగున యీదటం నేర్చుకున్నాడు. అక్కడ అతను శీతాకాలంలో చెమ్మావిరతో పెర్చ్ చేపల్ని పట్టేవాడు. వేసవిలో బ్రీమ్, పైక్, పైక్‌పెర్చ్ చేపల్నీ, ఒక్కొక్కప్పుడు స్టెర్‌లెట్ చేపల్నీ యింటివద్ద తయారుచేసిన పెద్దవలతోనూ, గాలాములుగల సన్నని త్రాడుతోనూ పట్టేవాడు. నీళ్లమీది జీవితం అంటే అతనికి ఎక్కువ మక్కువ కలిగింది అక్కడ్నే. ఆ ఆనందదాయకమైన సీమలోని నాగేటి చాళ్లలా కనిపించే సుందరమైన వాగుల్తోనూ, మింటు దుబ్బులతోనూ, దట్టమైన హేజెల్ పొదల్తోనూ, 'రై' పొలాల్తోనూ, బర్చి చెట్ల తోటల్తోనూ, పలుచని దేవదారు వనాల్తోనూ, పాన్సీలు, బంగారపు బట్టర్ కప్పులు, లంగ్‌వార్ట్‌లు అక్కడక్కడ మొలుస్తూన్న పచ్చని మైదానాల్తోనూ వన మార్గాల్తోనూ — అతడు ప్రకృతిని అర్థం చేసుకోవడం నేర్చుకున్నాడు. ఆ ప్రకృతితో సన్నిహితత్వాన్ని సంపాదించాడు. ఇది రష్యన్ ప్రజల సహజమైన ఉత్తమ లక్షణాల్లో ఒకటి.

కాబట్టి అకీమొవ్, పుట్టుకతోనే ''కచ్చితంగా భూమిమీద(బతికే'' వ్యక్తి అని తాను స్వయంగా అనుకునేవాడు; కాగా — చుట్టూ ఉన్న (ప్రకృతినుండి కనులు రంగును తీసుకోగలుగుతాయి అన్నదే గనక నిజమైనట్లైతే — అతని కళ్లకు ఆ పాలిపోయిన పచ్చని కొండల్నుండీ, వెనక వ్లదీమిర్ పరగణాకి చెందిన మెలికలు తిరిగిన వాగులనుండీ, పచ్చదనం చేకూరింది.

మన దేశంపై సాయుధదాడి అనే శాశ్వత అపాయం గనక లేకుండా ఉన్నట్లైతే అతడు తన బలాన్నీ, పట్టుదలనీ, నిపుణత్వాన్నీ, ఎక్స్కవేటర్లు, రైల్వే పెట్టెలు, రెఫ్రిజిరేటర్లు లేదా మోటారుకార్లు లాంటి భౌతిక వస్తువుల్ని తయారుచేసేందుకు వినియోగించేవాడు. అతడు ఏ ఇన్స్టిట్యూట్‌లోనో చదివి ఉండేవాడు. కొవ్‌రోవ్‌లోనే ఉండి పోయేవాడు, లేదా ఎక్కడికైనా వెళ్లి ఉండేవాడు. బహుశ సైబీరియాలోని పట్టణాల్లో ఒక దానికి వెళ్లుండేవాడు. అతడు తన శీలంతోనూ మనోస్థితితోనూ తన వంతు కర్తవ్యాన్ని సాహసంతోటీ సూక్ష్మబుద్ధితోటీ మన (ప్రజల (శ్రేయస్సుకై తప్పక పాటుపడి ఉండేవాడు. కాని పరిస్థితులు ఆవిధంగా పరిణమించలేదు, యుద్ధానికై సమీకరించబడిన దండుతో నావికాదళంలోకి మనుషులు అవసరం గనక ఆవిధంగా జరగలేదు. 1936 లో అతడు నౌకాదళంలో చేరాడు. మంచి సామర్థ్యంగల నావికునిగా పనిచేసిం తర్వాత ఒక పెట్టీ ఆఫీసరుగా నౌకా శిక్షణ పాఠశాలకు వెళ్లాడు. చివరికి నాల్గవ తరగతి ఓడకు కమాండర్‌గా ఏర్పాటయ్యాడు. ఏదో ఉన్నాడనే తప్ప అతడీ హోదాలో ఎవరికీ (ప్రత్యక్షంగా పనికిరాక పోయాడనిపిస్తుంది. కాని కేవలం అతడు ఉన్న కారణంవల్లనే మనల్ని అనేక సంవత్సరాలుగా భయపెట్టడానికి సాహసించిన శ(త్రువులందర్నీ మన తీరాలనుండి దూరంగా ఉంచాడు. యుద్ధం ఆరంభమైనప్పుడు, పీల్చడానికి గాలీ, హృదయాన్ని పోషించేందుకు నెత్తురూ మనకు ఎలా అవసరమో ఆవిధంగానే అతని అనుభవం, నిపుణత్వం మన అవసరమయ్యాయి.

నౌకాదళంనుండి వచ్చాడన్న వాస్తవాంశంవల్లనే కాప్టెన్ అకీమొవ్ అంటే అందరికీ, ఆఖరికి అతని ఆర్డర్లీ, లేదా తానిప్పుడు అభిమానించుతూన్న నౌకా పరిభాషలో చెప్పాలంటే 'మెసెంజరు,' సార్జెంట్ మాయ్‌బొరొదకి కూడా ఎక్కువ గౌరవం ఏర్పడింది. అయినా మాయ్‌బొరొద బొత్తిగా, ఉన్నది ఉన్నట్టుగా వ్యవహరించే వ్యక్తి. లోభి కూడాను. యుద్ధానికి పూర్వం రి(ఫెష్‌మెంట్ రూమ్ మేనేజరుగా అక్కడా యిక్కడా

కాదు రైల్వేలోనూ, అందులోనూ కొనొతోప్ నగరంలోనే పనిచేశాడు. అతనిలో ఏవిధమైన యోచనాశక్తి వుండేదికాదు.

సర్వసాధారణంగా మాయ్‌బొరొద, లోపాలులేని మనిషి వుండడం అసంభవమనే నమ్ముతాడు. అందుచేత వారి వారి లోటుపాట్లని గోరంతలు కొండంతలుగా భావించడం అతనికి అలవాటు. ఎక్కడైనా ప్రజలు దోషాలు లేకుండా ఉన్నారు అంటే అది కేవలం వాళ్లు తెలివితేటల్తో తమ లోపాల్ని కప్పిపుచ్చుకోగలరుగాబట్టేనని అతడు భావించేవాడు; 'ఏ కొంత కాలం అయినా వారితోపాటు ఊరికే ఉండండి. వాళ్లలోపాలు మీరే గ్రహించ గలుగుతారు' అని అనేవాడు.

కాని అతడు అకీమొవ్‌లో ఏలోపాలూ కనిపెట్ట లేకపోయాడు, మూడ్నెల్లపాటు అతని క్రింద పని చేసినప్పటికీనూ. యుద్ధకాలంలో మూడ్నెల్లు అంటే ఎంతో చెప్పుకో దగ్గవే. అతడు అకీమొవ్‌లో ఏవిధమైన దోషాలూలేవని కనిపెట్టగలిగాడని కాదుగానీ ఏ దోషాలనైతే అతడు చూడగలిగాడో అవి పూర్తిగా నిర్లక్ష్యంపదగినవని అతడు పరిగణించాడు. అకీమొవ్ కోపిష్టి. "నువ్వేదైనా గొడవలో చిక్కుకుంటే ఉద్రేకం చెందవాకు!" అని మాయ్‌బొరొద అంటాడు. ఒకవేళ కాప్టెన్ అన్యాయంగా తన క్రింది ఉద్యోగుల్తో కఠినంగా ఉండడం సంభవిస్తే మాయ్‌బొరొద యితర సైనికుల్తో అనేవాడు: "మనలాంటి వాళ్లతో మెత్తగా ఉన్నట్లైతే, మనం ఒక ఆట ఆడించేస్తాం."

పొంగిన కళ్లూ, వంకర ముక్కూగల మాయ్‌బొరొద పెద్ద తలకాయ ఎప్పుడూ విచారకరమైన ఆలోచనల్తోటే నిండి ఉంటుంది. ఎందువల్లనంటే అతని కుటుంబం జర్మన్లు ఆక్రమించిన కొనొతోప్‌లో ఉంది. అతడు పనులను కచ్చితంగా చేయించడం, వాటిని సాధించడం చూసి యితరుల నేర్చుకోవలసిందే. కాని అతడెప్పుడూ నిరుత్సాహం పొందిన వాడిలాగా, విసుగెత్తి పోయిన వాడిలాగా, దేనికోసమో ఎప్పటికీ అసంతృప్తి చెందుతూన్నట్టూ కనబడతాడు. గొణగడం అంటే అతనికి యిష్టం. అతడు తరచుగా ఎవరైనా మాట్లాడుతున్నప్పుడు దగ్గుతూ "అయితే ఏమిటి?" అంటూ మధ్య అడ్డగిస్తాడు. దీంతో అతని స్నేహితులకు వాళ్లు మండిపోతుంది. మొత్తంమీద అతనితో వేగడం కష్టమైన పనే.

ఒక అమ్మాయి వుండడంవల్ల ఆ అమ్మాయిని ప్రేమించే వ్యక్తిలో ఏవిధంగా మార్పువస్తుందో అదేవిధంగా అకీమొవ్ ఉనికి వల్లనే అతనిలో మార్పువచ్చింది. కాప్టెన్ సహజమైన ఆకృతి ఒక గొప్ప మనస్సునూ, తగినంత జీవిత పరిజ్ఞానాన్నీ మరుగు పరు

స్తోందని అతనికి బాగా తెలుసు. ఎప్పుడూ విషయానికి సంబంధించినంత వరకు మాత్రమే మాట్లాడే అకీమొవ్ విధానమూ, భావయుక్తమైన అతని చిరునవ్వూ, గర్జనతో నిండిన నవ్వూ ఒక మంచి గుర్రానికి రౌతు కాలికున్న ముల్లు ఏవిధంగా చురుకుతనాన్ని కలిగిస్తుందో అదేవిధంగా ఆతని ఆర్డర్లీపై ప్రభావాన్ని కలిగించింది. దాంతో మాయ్ బొరొద తన జీవితం పొడుగునా తనను గురించీ, తన భార్యాపిల్లల్ని గురించీ, తన వర్తమాన భవిష్యత్ కాలాలను గురించీ ఆలోచించడం మానివేశాడు.

అతనికి బాగా నచ్చిందేమంటే, యుద్ధ రంగంలో కాస్త చల్లబడినప్పుడు అకీమొవ్ సర్వసాధారణంగా పండుకునే, అతనికి సముద్ర యుద్ధాల్ని గురించీ, సామాన్యంగా నావికుని జీవితాన్ని గురించీ అనేక రకాల కథలు చెప్పడమే. మాయ్‌బొరొద తానిదివరకెన్నడూ చూడనట్టి సముద్రాన్ని గురించీ, నౌకాదళంలోని జీవితాన్ని గురించీ తరచూ అతనిని ప్రశ్నించేవాడు.

''దానిని వర్ణించడం అంతతేలికైన విషయం కాదు,'' అని భావపూరితమైన చిరునవ్వుతో అకీమొవ్ సమాధానం చెప్పేవాడు. అది మరుక్షణాన్నే మాయ్‌బొరొద మొహంలో ప్రతిబింబించేది. ఆ ప్రతిబింబించడంలో ఆ నవ్వు బహుశ బహు కొద్దిగా వంకర పోయి ఉండొచ్చు. ''నిజంగా అక్కడ ఎటు చూసినా నీరే. కాని నీలాగు నేలమీద బ్రతికేవాళ్ళు అర్థం చేసుకున్నట్టుగా నీళ్లు కాదు. అది దానంతటికదే ఒక ప్రపంచం. పాము ఒక పెద్ద పురుగులాగుంటుంది. కాని లక్షపురుగులను కలిపితే ఒక పాము అవుతుందా చెప్పు? అలాగే అనేక నదులను కలిపితే ఒక సముద్రం అవదు. సముద్రానికి ఒక విధమైన ప్రత్యేకత ఉంది. దాని వాసన దాందే. దాని ఆకాశం దాందే. దాని చీకటి వెలుగులు దానివే. భూమిమీదనుండి చూస్తే అది నల్లగా కనబడుతుంది. దిజ్మండలానికి నువ్వెంతదగ్గరగా వుండి చూస్తే అది అంత నల్లగా కనిపిస్తుంది. గొర్రెల్లాగా తెల్లగా ఉన్న వస్తువులు ఆ నల్లని గడ్డపైన మొగ్గ లేస్తున్నట్టు ఉంటుంది. కాని నువ్వు గనక తీరానికి ఎంతో దూరంలో వున్న ఓడలోనుండి సముద్రం వైపు చూసినట్లైతే అది నీలంగా కనిపిస్తుంది.'' ఇన్ని మాటల్లో కూడా తాను సరిగా విపులీకరించ లేక పోయినందుకు విసుగెత్తిపోయి యిక గత్యంతరం లేక అకీమొవ్ య్రాకింది విధంగా చెప్తూ ముగిస్తాడు: ''దానిని నీ అంతటికి నువ్వే చూడాలి. మనం యిందులోనుండి బ్రతికి బయటపడితే నేను నిన్ను సెవస్తోపొల్‌కుగానీ ఓదేస్సకుగానీ తీసుకువెళ్తాన్లే.''

అకీమొవ్ కందకంబస ఆ విభాగంలోని అన్ని బటాలియన్ కందకాల్లోకీ కంపెనీ కందకాలన్నిటిలోకీ సరసతగా ఉంటుందని వాసి కెక్కింది. సార్జెంట్ మాయ్‌బొరొద పరిశ్రమ ఫలితంగానే ఆ బసకు ఆసౌకర్యాలన్నీ చేకూరాయి. ఇతర ఆఫీసర్లంతా అకీమొవ్‌కు అలాంటి ఆర్డర్లీ దొరికినందుకు ఈర్ష్యజెందారు.

నిప్పవల్ల కాస్త నల్లబడినప్పటికీ క్రింది నేల ఇటుకల్తో చక్కగా చదును చేసి వుంది. వాటిమీద ఎండుగడ్డి పరిచారు. చిన్న యినుపపొయ్యి బాగా వేడిగా ఉంది. దాని పక్కనే ఎప్పుడూ అనేక కట్టెల గుట్టలు ఎండుతూ ఉంటాయి. మాయిబొరొద తాను కోరినట్టుగా మంచి బర్చి లేదా దేవదారు కట్టెల్ని తెచ్చుకో లేకపోయినా కనీసం విల్లోచెట్ల లేతకొమ్మల్ని మాత్రమైన తెచ్చుకోగలిగాడు. కాని ఇతర కందకంబసల్లో అవి కూడా ఉండేవి కావు. ముందలి ప్రాంతం పొడుగునా మెలికెలు మెలికెలుగా ప్రవహిస్తున్న నది గట్టుమీద జర్మన్లు తుపాకీలని పేల్చుతూన్నా, మాయ్‌బొరొద మాత్రం వాటిని అలాగే ప్రోగు చేసేవాడు. వాటిని మోపులు కట్టి, ఒక్కొక్కప్పుడు పొట్టమీద ప్రాకుతూ ఒకే తడవలోనే ఆ మోపుల్ని తన బసకు తెచ్చేవాడు. ఆ కట్టెలనే చెమ్మగా ఉన్న గోడలకి వరసగా తాపించాడు.

ఆ కందకంబసలో ఒక టేబులు, రెండు బెంచీలు ఉన్నాయి. గోడమీది మేకుకు ఒక పింగాణీ పళ్లెం తగిలించి వుంది. వెలుపలవైపు అతినీల వర్ణంతోనూ లోపల వైపు కళ్లు చెదిరిపోయే తెలుపు రంగుతోనూ ఆ పళ్లెం పావురంవలె ప్రశాంతంగా ఉంది. అది ఎక్కడ్నుంచి వచ్చిందో భగవంతునికే ఎరుక. నిద్రపోయే పడక బల్లల్ని యితర కందకాలలో మాదిరిగా మట్టితో చేయలేదు. అవి నిజమైన మంచాలే. వాటిని చెక్కతో చేశారు.

అక్కడ ఒక గ్రామఫోను కూడా ఉంది. దాన్ని నడపాలంటే వాళ్లవద్ద పిన్నులేదు. కాబట్టి మాయ్‌బొరొద మామూలు సూదితోనే ఒక గ్రామఫోను పిన్నును తయారు చేశాడు. అది అసలైన పిన్నుకు ఏ మాత్రం తీసిపోకుండా పనిచేసింది. వారికి నాలుగు రికార్డులు మాత్రమే ఉన్నాయి. అవన్నీ వాద్య సంగీతానికి చెందినవే. పాటలు లేనే లేవు. ఇది ఆ కందకంబస వాసులకు ఆశాభంగాన్ని కలిగించింది. అందుకు కారణం ఆ వాద్య సంగీతం వాళ్లకు మొదట బాగా విసుగు పుట్టించింది. పైగా ఆ సంగీతం వాళ్లకు ఏ మాత్రం నచ్చలేదు. కాని ఆతర్వాత వాళ్లు ఆ రికార్డులకే అలవాటు పడిపోయారు.

భావాన్ని వ్యక్తం చేసే, లలితమైన స్వరమాధుర్యాన్ని వాళ్లు నెమ్మదిగా గ్రహించారు. అది వాళ్ల హృదయాల్లోకి చొచ్చుకు పోయిందనడం నిస్సందేహం. శాంతంగా ఉన్న సమయాల్లో చెమ్మగా ఉన్న ఆ కందకాల్లో పడుకొని అందరికి యిష్టమైన పాటల్ని శాస్త్రీయ సంగీతంతో కలిపి పాడుకుంటారు. ఇది అకీమొవ్‌కు రాజకీయ సహాయకుడుగా ఉంటోన్న, పూర్వం చరిత్ర ఉపాధ్యాయుడుగా పనిచేసిన కాప్టెన్ రేమిజొవ్‌కు అమితానందాన్ని కలిగించేది.

ఆ కందకంబస త్వరలోనే జనంతో నిండి పోయింది. చనిపోగా మిగిలిన బటాలియను ఆఫీసర్లు — బటాలియన్ అడ్జుటెంట్ లెఫ్టినెంట్ ఒరేష్‌కిన్, రైఫిల్ కంపెనీ కమాండర్లైన పొగొస్యాన్, బేల్‌స్కీలు, మోర్‌టార్‌దళం లెఫ్టినెంటూ, లెఫ్టినెంటు ప్లాటూన్ కమాండరూ, ఒకరి తర్వాత ఒకరు వచ్చారు. డ్యూటీ మీదున్న సిగ్నలర్ ఒక మూలగా టెలిఫోన్ ప్రక్కనే కునుకు తీస్తున్నాడు.

అకీమొవ్ నెమ్మదిగా తన దగలా కోటును విప్పుతుండగా కాప్టెన్ రేమిజొవ్ ాడా వచ్చాడు. ఎండకు ఎండి వానకు తడిచి చినిగి పోయిన తానుపైనకప్పుకున్న టార్పాలిన్ గుడ్డను (ground sheet) అవతల పారేసి దుమ్ముకొట్టుకున్న కళ్లద్దాలను తుడుచుకుంటూ అడిగాడు: ''ఏమిటి విశేషాలు?''

''కామ్రేడ్స్, కూర్చోండి,'' అన్నాడు అకీమొవ్ మ్యాపును టేబులుమీద పరుస్తూ. పైకి చూడకుండానే అదే ధోరణిలో యింకా యిలా అన్నాడు: ''మనం యుద్ధం చేయబోతున్నాం.''

ఆఫీసర్లు కొంత బిగుసుకు పోయినట్టు అతడు పసికట్టాడు. వారివారి సంచుల నుండి నెమ్మదిగా మ్యాపుల్ని వెలుపలకు తీస్తున్న గలగలమనే శబ్దాన్ని అతడు విన్నాడు.

ఆ సమయంలో మాయ్‌బొరొాద తిరిగి వచ్చాడు. పొయ్యికి ప్రక్కగా ఉన్న తన స్థలంలోకి నిశ్శబ్దంగా గోడకు నక్కుకుంటూ వెళ్లాడు. మాంసం కూరను వండడానికి పూనుకున్నాడన్నమాటే కాని, అప్పుడప్పుడు తాను విడుస్తూన్న నిట్టూర్పులు తెలియజేస్తూన్నట్టుగా, అతని మనస్సు మాత్రం అకీమొవ్ బోధపర్చుతూన్న పోరాటపు తొలి సన్నాహాల విపులీకరణలపైనే ఉంది. నోరూరేట్టుగానూ, దాదాపు మైకం ఎక్కించేట్టుగానూ వున్న వేపుడు మాంసం వాసన క్రమక్రమేణా ఆ కందకంబస అంతా నిండి పోయింది. అక్కడ ఎంత మందికి వడ్డించాలో అని మాయ్‌బొరొాద మనస్సులోనే లెక్కించాడు, ప్రతి వ్యక్తికీ ఎవరి భాగాన్ని వారికే అందజేయాలనే ఆదుర్దాతో. అదే సమయంలో,

ఆమర్నాటికి కూడా కొంత మిగలాలనే వుద్దేశంతో మరీ ఎక్కువగా వడ్డించకూడదని అనుకున్నాడు. "అంతమందీ రేపు ఉండరు కదా," అని అతడు అనుతాపంతో తల ఊపు కుంటూ తలపోశాడు.

మర్నాటి ఉదయం ఎనిమిది గంటలకల్లా శత్రువుల్ని ఎదుర్కోవాలని నిశ్చయ మైంది. అప్పుడు జర్మన్లు తమ ఉదయం భోజనం చేస్తూంటారు. కందకాల్లో బహు కొద్దిమంది ఉంటారు. శత్రువుని హడలెత్తించేందుకై ఒక ఇరవై నిమిషాలపాటు ఒక్కుమ్మడిగా ఫిరంగుల కాల్పులుంటాయి. తొలి జర్మన్ కందకాన్ని పట్టుకోవాలనీ, వాటిలో తాము స్థావరాలని యేర్పరచుకొని స్థిరపడాలని పథకం. ఈ చర్యకై రెజిమెంటు సాప ర్లను బటాలియన్‌తో జతచెయ్యాల్సి ఉంటుంది. తర్వాతి వివరాలు రెజిమెంటునుంచి ఆజ్ఞలు వచ్చిన తర్వాతగాని నిర్ణయం కావు.

"ఏమైనా ప్రశ్నలున్నాయా?" అని అకీమొవ్ అడిగాడు. కొంత సేపు నిశ్శబ్దంగా ఉంది.

సమాధానం లేదు.

"లక్ష్యం ఏమిటో స్పష్టమయిందా?" అని అతడు మళ్లీ అడిగాడు ముఖం చిట్లించి.

"బాగానే అయింది," ఆఫీసర్లలో ఒకడు బహునెమ్మదిగా అన్నాడు.

"మనకు ఫిరంగిదళాల దన్ను పూర్తిగా ఉంటుంది," అని అకీమొవ్ మళ్లీ మొదలుపెట్టాడు. "మొత్తం రెజిమెంటు ఫిరంగులూ, డివిజన్ ఫిరంగులూ మనకు సహాయం చేస్తుంటాయి."

అతడు మళ్లీ మౌనం వహించాడు. అతని ముఖం ఎర్రబడిపోయింది. పెద్దగా అరుస్తూ తన భావాలను వ్యక్తం చేశాడు: "బటాలియను గర్వించదగిన విషయం యిది, అంతేగాని ముఖం ముడిచిపెట్టుకొని కూర్చొనే విషయం కాదు! మీకు చాలినంత మంది లేరని మీరంటారు. మీరు అలసి పోయారా? నాకదంతా తెలుసు. డివిజన్ కమాండర్‌కు కూడా తెలుసు. బహుశ ప్రధాన కమాండర్‌కు కూడా తెలుసు! అర్ధమయిందా?"

అతడు మరింత చిరాకు చెందుతూ ప్రథమ పర్యాయంగా తల పైకెత్తి వారి వంక చూశాడు. అకీమొవ్ ముఖం కటువుగా కోపంగా మారుతోంది.

"మీలాంటి ఆఫీసర్లను చూస్తుంటే నాకు సిగ్గేస్తోంది!" అని చివరికి గట్టిగా కేకలేశాడు. "కనీసం ఆ గుర్రపు దుస్తులైనా విప్పండి!" అతని కోపానికి ఏదైనా ఒక

వస్తువు అవసరం. అలసిపోయిన తన స్నేహితుల్ని ముందున్న యుద్ధానికి సంసిద్ధ పరచ డానికి అతడు ముల్లుక్రరతో యింకా ఎక్కువగా పొడవక తప్పనందుకు విచారించాడు. పైపెచ్చు అక్కడ ఆ భయంకరమైన శరదృతువులో యిది వారి ఆఖరి చర్యగనకనూ, ఆ సంగతి వారికి తెలియదు గనుకనూ, వారికి చెప్పే హక్కు తనకు లేదనే అతడనుకోవడం చేతనూ అతనిని రెచ్చగొట్టి చికాకు పరచింది. అతడు అన్యాయంగా, నిందాపూర్వకంగా వేసిన కేకలకు జవాబుగా వారు తమ టార్పాలిన్ గుడ్డలను తీసివేశారు. మరుక్షణాన్నే అతడు చల్లబడ్డాడు. కేవలం కరుణవల్లనే నిజాన్ని చెప్పేసేస్థితికి వచ్చాడు. కాని అతడు నిస్పృహాయమైన సౌంజ్ఞచేసి, అలసటతో నిట్టూర్చాడు. ఆతర్వాత మాయ్‌బొరొదతో బిగ్గ రగా అన్నాడు, ''మాంసం, వోడ్కా పట్టుకు రా!''

## 4

రేమిజొవ్ ఒక్కడే భోజనాన్ని నిరాకరించింది. అతడెన్నడూ వోడ్కాను అంటి ఎరుగడు. బహుకొద్దిగా తింటాడు. తన రేషన్‌లో సగం పాగొస్యాన్‌కు యిచ్చేస్తుంటాడు. పాగొస్యాన్ యితరులకంటే ఎక్కువ తిన్నప్పటికీ ఎప్పుడూ ఆకల్తోనే వాసంలాగా సన్నగా ఉంటాడు. రేమిజొవ్‌కు వోడ్కాపై ఉండే అయిష్టతను యుద్ధం కూడా గెలవ లేక పోయింది, స్వయంగా అతనికే తెలియనటువంటి, ఒక్కొక్కప్పుడు అతనికి ఎంతో ఆశ్చర్యం కొలిపే గుణాలను అది అతన్లో తీసుకొచ్చినప్పటికీనూ; ఉదాహరణకి అతని శారీరక సహనం. అలపులేని శక్తి. ఇవి అతనికున్నట్టు అతడెప్పుడూ అనుమానించలేదు. అందుకు కారణం అతడెల్లప్పుడూ సుస్తీగానూ కాయిలాగానూ ఉండేవాడు గనకనే.

రేమిజొవ్ సహనానికి అకీమొవ్ ఆశ్చర్యపోయాడు. అందులో కపటం ఏమీలేదు. యుద్ధం పూర్తయ్యేంతవరకు మాత్రమే రేమిజొవ్ బతికివుండగలడనీ, యుద్ధం అయి పోయిన రోజునే, అదే గంటలో అతడు ఏదో ఒక విషయాన్ని లోతుగా ఆలోచిస్తున్నట్టో, లేదా బహుశ ఊరికే విశ్రాంతి తీసుకుంటునట్టో, అతని కళ్లిప్పుడు అంతరిక్షంలోని ఏ చుక్కపైనో కేంద్రీకరించి ఉన్నట్టు, హ్రస్వదృష్టిగల పెద్దకళ్లు యింకా ఆకాశం వంక రెప్ప వాల్చకుండా చూస్తూ, ధాన్యపు కంకిలాగా అకస్మాత్తుగా నేలకి ఒరిగి పోవచ్చుననీ, అకీమొవ్ ఒక్కొక్కప్పుడు విచారంతో భావించేవాడు.

రేమిజొవ్ అకస్మాత్తుగా లేచి నిలబడి మామూలుగా అతను మాట్లాడే చిన్న కంఠధ్వనితో అన్నాడు: ''మంచిది. మీరంతా భోంచేస్తుండండి. నేను వెళ్తాను. నేను కంపెనీలలో పార్టీ సమావేశాలు ఏర్పాటు చేసితీరాలి. యుద్ధానికి అందర్నీ సంసిద్ధం చేయాలి. రేపు 24 వ సెప్టెంబరు. సరిగ్గా 154 సంవత్సరాల క్రితం అదే రోజున రీమ్నిక్ యుద్ధంలో అలెక్సాండ్ర్ వసీల్యెవిచ్ సువోరొవ్ టర్కీ సైన్యాన్ని ఓడించి తరిమి వేశాడు. కొంత కష్టమైనప్పటికీ, ఒక పాతిక భాగమైనా అదేవిధంగా మనం కూడా జర్మన్లపై దెబ్బ తీద్దాం పట్టండి. సువోరొవ్ తెలివితేటల్లో నీకు పాతికోవంతు మాత్రం ఉన్నాయంటే కోపం రాదుకదా, పావెల్!''

''అది కూడా ఎక్కువే,'' అన్నాడు అకీమొవ్ చిన్నవోతూ పరిహాసంగా, ''నాకున్న మాదిరిగానే అతనికి ఒక రాజకీయ సహాయకుడులేడే.''

''మంచిది, స్నేహితుల్లారా,'' అన్నాడు రేమిజొవ్ అతడొక బడిపంతులుగా ఉండేవాడని అతని గొంతు ప్రతివ్యక్తికీ జ్ఞాపకం చేసింది.

రేమిజొవ్ బయటికి వెళ్ళుతూండగా అకీమొవ్ అతని వెనుక కేకేశాడు: ''మన వాళ్లందరూ పెందరాళే భోజనాలు చేసి, వేగమే పండుకునేటట్లు చూడు.''

ఇంకా మాంసంను సంతృప్తిగా తినడం పూర్తికాక మునుపే రెజిమెంటల్ హెడ్ క్వార్టర్స్నుండి ఒక ఆఫీసరు రికన్నాయిసెన్స్ పోరాటం గురించి విపులంగా వ్రాతమూలకంగా తెలిపిన ఆజ్ఞను తీసుకువచ్చాడు. అతని వెనువెంటనే రెజిమెంట్ యింజనీరు ఫీర్సొవ్, ఫిరంగిదళ కమాండరు గుసారొవ్, రికన్నాయ్సెన్స్ ఆఫీసరైన కాప్టెన్ డ్రోజ్ద్ వచ్చారు. కొద్ది సేపయిన తర్వాత చార్జి తీసుకోనున్న డివిజన్నుండి వయసులో పెద్దవాడైన కర్నల్ తిరిగి వచ్చాడు.

ఆ కర్నల్ ఎవరో ఒక్క అకీమొవ్కు తప్ప మిగతావారికి తెలియదు. అతని రాకను అంతా సామాన్యంగానే పరిగణించారు. అతనిని డివిజన్ హెడ్క్వార్టర్స్నుండో లేదా కోర్ హెడ్క్వార్టర్స్నుండో వచ్చిన ఎవరో సీనియర్ ఆఫీసరుగా భావించారు. కాని అకీమొవ్ మాత్రం కలవరపాటు చెందాడు. తమ ఒప్పందం అతనికి జ్ఞాపకం ఉందో లేదో అని అతని కళ్లలోకి చూస్తున్నట్టుగా అకీమొవ్ కర్నల్వైపు ఏకాగ్రతతో చూశాడు. కర్నల్ తల ఊపాడు. తనకు కలిగిన చిరాకునూ స్థిరత్వాన్నీ వెలుపలికి కనపర్చేందుకు యిష్టపడక, బలవంతంగా నవ్వు తెచ్చుకొని అకీమొవ్ తల పంకించి అడిగాడు: ''కామ్రేడ్ కర్నల్, 'ఓడ వెనకతట్టు' ఎలా వుంది?''

‘‘బటాలియన్ కమాండ్ పోస్టును గురించా మీరు అడిగేది?’’ అని అడిగాడు కర్నల్ అతి గూఢమైన భావంతో.

‘‘అవును దాన్ని గురించే.’’

‘‘ఫరవాలేదు.’’

‘‘అదంతా నా క్రింద పనిచేస్తున్న ఆర్డర్లీ కృషే,’’ అన్నాడు అకీమొవ్, క్రమానికి విరుద్ధమైన పదాన్ని తాను ఉపయోగించినందుకు కర్నల్ అయిష్టపడడం తాను గమనించనట్టు నటిస్తూ. ‘‘ఏ ప్రదేశాన్నయినా సదుపాయంగా ఉండేట్టు చేయడంలో అతడు గొప్ప వ్యక్తి.’’

రికన్నాయ్‌సెన్స్ సైనికులతోపాటు ఒక స్త్రీ అనువాదకురాలు వస్తోందని కాప్టెన్ ద్రోజ్‌ద్ ప్రకటించాడు. ఏ ఖైదీలనైనా లోపలికి తీసుకొచ్చిన తక్షణమే ప్రశ్నలు వేసేందుకుగానూ ఆమె అకీమొవ్‌తో ఉండాలని రెజిమెంటల్ కమాండర్ ఆజ్ఞాపించాడు.

అకీమొవ్ ముఖం ముడుచుకున్నాడు; తాను యుద్ధ సమయంలో పరుషమైన భాష ప్రయోగిస్తాడని తెలిసి కూడా వారు తన కందకంబసకు ఒక స్త్రీని పంపడం అనే అభిప్రాయం అతనికి ససేమిరా నచ్చలేదు.

‘‘ఆమెను ఇక్కడ్నుంచి ఎక్కడికీ వెళ్ల నివ్వకూడదని రెజిమెంటల్ కమాండర్ ఆజ్ఞాపించాడు,’’ అని ద్రోజ్‌ద్ యింకా అన్నాడు. ‘‘లేకపోతే రికన్నాయ్‌సెన్స్ సైనికులతోపాటు ముందుకు వెళ్లాలంటే ఆమెకు యిష్టం.’’

‘‘ఆమెకిష్టమైతే వెళ్లమనండి,’’ అని కటువుగా సమాధానం చెప్పాడు అకీమొవ్. ‘‘ఒక అమ్మాయిని చూసుకోవడం కంటే నాకు యితర పనులు అనేకం ఉన్నాయి.’’

ఈ నూతన అనువాదకురాల్ని గురించి అకీమొవ్ అంతకుముందే ఎంతో విన్నాడు. రెజిమెంట్‌తో ఉన్న పదిరోజుల్లోను ఆమె కొంత పేరు సంపాదించుకో గలిగింది. ఎవరినీ అంత తేలిగ్గా మెచ్చుకోనటువంటి ఆరితేరిన రికన్నాయ్‌సెన్స్ సైనికులు కూడా ఆమె ధైర్యాన్ని కొనియాడారు. శత్రువుల స్థావరాల్లో ఏంజరుగుతోందీ కనిపెట్టడానికిగాను ఆమె ఏవిధంగా రెండవ బటాలియను స్థానాల ప్రక్కనున్న సరిహద్దు ప్రదేశంలోకి చల్లగా జారుకున్నదీ, మూడు రాత్రిళ్లపాటు ఏవిధంగా రెల్లుగడ్డిలో దాక్కొని శత్రువుల సంభాషణలు విన్నదీ యీ గత కొద్ది రోజుల్లోనూ అందరూ ఆమెను గురించి అనుకొనేవారే. జర్మన్ సైనికులు చెప్పినదాన్నిబట్టీ ఆమె విన్న వివిధ చప్పుళ్లనుబట్టీ ఆ రెజి

మెంటు సైన్యం యెడమ పార్శ్వంలోని రక్షణస్థానాలలో తాజా బటాలియనును తీసు కొచ్చినట్టు ఆమె ఒక నిర్ధారణకు రాగలిగిందని అన్నారు.

నిజం చెప్పాలంటే అకీమోవ్‌కు ఆమెపై అయిష్టత ఆమెను చూడక మునుపే ఏర్పడింది. అతడు స్వయంగా ధైర్యవంతుడవడంవల్లా, శత్రువుల్ని బుట్టలో వేసుకొనే బుద్ధికుశలత కలిగిన వాడవడంవల్లా యితరుల ధైర్యసాహసాల గాథలను వినాలంటే అతనికి కొంత యీర్ష్య వుండేది. తానా విధంగా చేయ లేకపోయినందుకుగాను అలాంటి సంభాషణ అతనిని ఎల్లప్పుడూ నిందిస్తున్నట్టుగా అనిపిస్తుంది. అంచేత అతని అహం కారం అతనికి ముక్కోపాన్ని తెప్పించింది. సంభాషణంతా ఆ అమ్మాయిని గురించి జరగ డంవల్లనే అతనికీసారి మరింత బాధకలిగింది.

ఏమైతేనేం, ఆమెకోసం అతనికిప్పుడు వ్యవధిలేదు. ప్రతి నిమిషం ప్రయాసం హెచ్చు అవుతున్నట్లనిపించింది. కందకంబసద్వారం ఒక్క క్షణం కూడా మూసివుండ లేదు. రేపటి నాటకంలోని నూతన నటకుల ప్రవేశ నిష్క్రమణలవల్ల ఆ తలుపు నిరంతరమూ తెరుచుకుంటూ మూసుకుంటూ, ద్వారానికి తెర మాదిరిగా ఉన్న టార్పా లిన్‌గుడ్డ ఎడతెగకుండా కొట్టుకుంటున్నట్లనిపిస్తుంది. రకరకాల ఆజ్ఞలు యివ్వడం, ఫిరంగిదళంవారితో ఎక్కడెక్కడ కాల్చడానికి సిద్ధంగా ఉందవలసిందీ నిశ్చయించడం, తమ సొంత స్థలాలూ శత్రువుల స్థావరాలూ ఇనప ముళ్లతీగలుండే, నేలబాంబు క్షేత్రాలూ ఎక్కడ ఉన్నదీ సాపర్లకు తెలియచేయడం, ఏం జరగబోతుంది అనే ఊహాజనిత విషయాల్ని ఆఫీసర్లతో ఆలోచించడంలో పడిపోయి, తన బటాలియన్ యుద్ధరంగంనుండి తిరిగి వచ్చిన తరువాత వెనుక శ్రేణికి వెళ్లాల్సి వుంటుందనే సంగతి గురించి అతడు ఆలోచించ డమే మర్చిపోయాడు. అది అతనికి జ్ఞాపకం వచ్చినప్పుడు ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఊరు కుంటాడు. అతని నరాల్లో నెత్తురు ఉడికి పోతుంది. అతడక్కడ నిజంగా కూర్చున్నాడా లేదా అనే కొంత మూఢనమ్మకపు సందేహంతో కర్నల్‌ను ఓరగా చూస్తాడు. అతని మీద తనకు ఏం అయిష్టత ఉన్నా ఫరవాలేదు. ఆతడక్కడ ఉన్నాడంటే ఆమర్నాడు తాము తప్పక నిస్సందేహంగా చార్జి ఒప్పగిస్తామనేది ఖాయం. కాని తానటువైపు తిరిగి నప్పుడు కర్నల్ అక్కడ అగుపించకపోతేనో? ఒకవేళ అది జ్వర పీడితమేధకు సంబం ధించిన భ్రమ అయితేనో? ఇంతకీ, పద్ధతులు అంటే పగమాదిరిగా పట్టుదలతో ఉండే కర్నల్, అక్కడ వాస్తవంగానే చెక్కుచెదరకుండా కూర్చున్నాడు.

సంభాషణల ధ్వని తక్కువ స్థాయిలో వినిపిస్తోంది. ఈలలాంటి గాలి శబ్దం హెచ్చుతూ తగ్గుతూ ఉంది. తలుపు తెరచుకుంటూ మూసుకుంటూ ఫెళఫెళమని గట్టిగా శబ్దం చేస్తోంది. ఈధ్వనుల మధ్య పాలు మరుగుతూన్నప్పుడు బుస్సుమనే శబ్దం వలె ఆ కందకంబసలో అకస్మాత్తుగా ఒక ధ్వని వినిపించింది; ఆతర్వాత శ్రావ్యమైన, ఆనందదాయకమైన సంగీతం వినిపించింది; మాయ్‌బొరొద గ్రామఫోన్ పెట్టాడు.

"ఏమిటా గొడవ?" అని అడిగాడు కర్నల్ చకితుడౌతూ. "ఆపండి. అలాంటి వాటికి యిది సమయం కాదు!"

ఫిరంగిదళం ఆఫీసర్లకు యుద్ధంలో వారేం చేయవలసిందీ తెలుపుతూన్న అకీమొవ్, మ్యాపుపై ఏదో గుర్తుగా పెడుతూన్న పెన్సిల్‌ను సమంగా నిలిపి, కర్నల్ కళ్లల్లోకి సూటిగా చూసి నెమ్మదిగా సమాధానం చెప్పాడు:

"నేనే చెప్పాను. వాయిద్యం సాగనివ్వండి. జర్మన్‌లు అందుకు అలవాటు పడ్డారు. సాయంత్రంపూట మనం సంగీతం గనక పెట్టకపోయినట్లయితే వాళ్లకు అనుమానం కలగవచ్చు. కామ్రేడ్ కర్నల్! ఇది మిలిటరీ అవసరం."

"ఈ కొయ్యమనిషిలో తప్పులు ఎంచడం ఎవడితరం బాబూ?" అని భావించాడు కర్నల్, అకీమొవ్‌వైపు గౌరవంగా చూస్తూ. అకీమొవ్ తల వంచుకొని తన పనిలో నిమగ్నుడయ్యాడు. యుద్ధ సన్నాహాలను కర్నల్ పరికిస్తున్నప్పుడు నిర్భయత్వం, అధికారహోదా వీటివల్ల కలిగిన ధీమాతో తన కింద పనిచేసే వారిని సంబాళించుకోగలిగే ఆ యువ కమాండర్‌యొక్క ప్రశాంతతనూ, నిర్బంధనలేని ప్రవర్తననూ అతడు గమనించక తప్పింది కాదు.

"జర్మన్ల మోర్‌టార్ బేటరీ సరిగ్గా యిక్కడుంది," అని మళ్లీ మొదలుపెట్టాడు అకీమొవ్, మ్యాపుమీద పెన్సిల్‌తో ఒక ప్రదేశాన్ని చూపిస్తూ. "దానిని నా పేరుచెప్పి నాశనం చెయ్యండి. అప్పుడు నేను కొండ అందుకుంటానన్నమాటే."

ఫోన్ మ్రోగింది. ఆపరేటర్ రిసీవర్‌ను తీసుకున్నాడు. వెంటనే "రెజిమెంటల్ కమాండర్," అంటూ అకీమొవ్‌కు అందిచ్చాడు.

అకీమొవ్ గొలొవీన్‌తో మాట్లాడాడు. లేదా మేజర్ ఏం చెబుతున్నదీ నిశ్శబ్దంగా విన్నాడు మధ్యమధ్య "అర్థమయింది", "అవును", "చాలా బాగుంది", "భేష్", అని అంటూ. చివరికి అతని మొహం అకస్మాత్తుగా ఎర్రబడింది. ఆశ్చర్యంగా అన్నాడు. "కామ్రేడ్ మేజర్! ఏమిటీ ఛండాలం? మళ్లీ ఆ అనువాదకురాల విషయమేనా! మీకు

పుణ్యం ఉంటుందిగానీ ఆ అమ్మాయిని మాత్రం నా వద్దకు రానివ్వకండి!.. అవును. సరే. చాలా మంచిది.''

అతడు రిసీవర్ పెట్టేస్తూ లోలోపల తిట్టుకున్నాడు. విసుగుదలతో కాప్టెన్ ద్రోజ్‌ద్ వైపు తిరిగాడు.

''మీ అనువాదకురాల విషయంలో వాళ్లందరికీ దిగులుపట్టింది,'' అని అతడ న్నాడు. ఆతర్వాత అతనికి పగతో కూడిన ఆలోచన తట్టింది. ఇంకా అన్నాడు: ''బహుశ పై అధికారుల్లో ఒకరికి ఆమెమీద అభిమానం ఉండొచ్చు. అయితే అతడెందుకు ఆమెను అట్టిపెట్టుకోడు!''

''నాకు తెలియదు,'' అన్నాడు ద్రోజ్‌ద్, ముందు జాగ్రత్తతో సమాధానం చెబుతూ. ''దాంతో నాకేం సంబంధం లేదు.''

ఒక చిన్న లావుపాటి వారెంటు ఆఫీసరు లోపలికి వచ్చాడు. మందుసామగ్రులు వచ్చాయని తెలిపాడు. ఆతని ఓవర్‌కోటునుండి నీళ్ళు కారుతున్నాయి. రకరకాల సమా చారాల తోటీ, విజ్ఞప్తుల తోటీ యితరులు వచ్చారు.

''అంతా సవ్యంగానే ఉంది,'' అని కర్నల్ భావించాడు. లేచి అన్నాడు: ''నేను వెళ్లాలి. ముందరి ప్రదేశాన్ని నేనొక పర్యాయం చూడాలి.''

''నేనూ మీతోరావాల్నా?'' అన్నాడు అకీమొవ్ తాను కూడా పైకిలేస్తూ.

''మీ వ్యవహారం మీరు కానివ్వండి. ఎవర్నయినా నాతో పంపిస్తే చాలు.''

సన్నగా, రోజా రంగు మొహంతో ముచ్చటగా ఉన్న లెఫ్టినెంట్ ఒరేష్‌కిన్ అకీ మొవ్ తల పంకించడాన్ని అర్థం చేసుకొని తన టామీగన్‌ను అందుకొని కర్నల్‌ని అను సరించాడు.

తనకు కొత్తగా యిద్దరు ఎర దొరకారని సంతోషిస్తున్నట్టుగా తక్షణమే గాలి ఆ కొండకనుమలో తీవ్రంగా వీచింది. చల్లని వర్షంతో వాళ్ల మొహాల్ని కొరడాతో కొట్టి నట్టు కొట్టింది.

''కుడివైపు పద,'' అన్నాడు కర్నల్.

వారా కనుమగుండా వెళ్లారు. కన్ను పొడుచుకున్నా కాంతి కానరానంతటి చీక టిగా ఉన్నప్పటికీ వారు ఎక్కడా ఆగకుండానే వెళ్లవచ్చునని తెలుసుకోగలిగారు. చీకటి నీడలు అన్ని వైపులకూ నడుస్తున్నాయి. బాంబులచే నేల గుంటలు పడ్డచోట్ల బండ్లు కిర్రుమని శబ్దంచేస్తూ కదిలాయి. అక్కడక్కడా సిగరెట్లకొనల ఎర్రని వెలుగులు

నక్షత్రాల్లాగా ప్రకాశించాయి. కొండకనుమ ఒక్కొక్కప్పుడు ఎడమ వైపూ మరొక్కప్పుడు కుడివైపూ ఉంటోంది. గాలి కూడా అదేవిధంగా కొంతవరకు తగ్గడం లేదా కోపాన్ని రెండింతలు తెచ్చుకోవడం జరుగుతోంది.

కర్నలు, లెఫ్టినెంటూ కనుమను వొదిలిపెట్టి అంతగా లోతులేని కందకంద్వారా వెళ్లారు. జర్మన్ల మతాబీచువ్వలు నెమ్మదిగా పైకి లేచి పచ్చని వెలుతుర్ని చీకటిలోకి ప్రసరింపచేశాయి. ఆ ప్రదేశమంతటా అడ్డదిడ్డంగా ఉన్న త్రోవల్నీ మార్గాల్నీ కంద కాల్నీ ఎక్కువగా పెరిగిపోయిన గడ్డితో ఆ చలిలో గజగజా వొణికిపోతూన్న ఉక్కుపట్టా లాంటి సెలయేరునీ వెలుతురుతో నింపాయి. బటాలియను కమాండరు కందకంబసనుండి సంగీత నాటకంలోని విషాదగీతం యింకా వినిపిస్తూనే ఉంది.

“మీరు అకీమొవ్‌తో చాలా కాలంనుండి ఉంటున్నారా?” అని కర్నల్ విచారించాడు.

“ఆరునెలల్నుండి,” అని అతనికెదురుగా ఉన్న యువ లెఫ్టినెంటునుండి వెంటనే సమాధానం వచ్చింది. “నేను ప్లాటూన్ కమాండరుగా ఉంటుండేవాణ్ని. ఆతర్వాత అకీమొవ్ నన్ను బటాలియన్ కమాండ్‌కి బదిలీచేశారు.”

“అతడు మంచి కమాండరేనా?”

“ఇంకా అడుగుతారా!” సమాధానం ఉత్సాహవంతంగా ఉంది. “డివిజన్‌లో కల్లా ఉత్తమోత్తముడు. అన్నట్టు, అతడు నావికుడు కూడాను.”

వాళ్ల శిరస్సుల మీదుగా ‘ట్రేసర్’ గుళ్లు రయ్యిమంటూ వెళ్లాయి.

“ఇది చాలా ప్రమాదకరమైన స్థలం,” అన్నాడు లెఫ్టినెంటు. “కందకం తవ్వే పని యింకా పూర్తికాలేదు. ఒక యాభై మీటర్లు మనం యీ ఆరబైట ప్రదేశంలోనే వెళ్లాల్సుంటుంది.”

“చార్జి ఒప్పగించే రిపోర్టులో కందకం పూర్తిగా తవ్వినట్టుందే,” అని కర్నల్ గొణుక్కున్నాడు.

వాళ్లు దాదాపు చేతులమీదా మోకాళ్లమీదా ప్రాకుకుంటూ ఆ అపాయకర మైన ప్రదేశాన్ని దాటి ఆతర్వాత కందకంలోకి దుమికారు. దాంతో నీళ్లు ఫౌంటెన్‌లో మాదిరిగా పైకెగ చిమ్మాయి. ఇక్కడ వాళ్లని యెవరో ఆటంక పరచి ఎవరుమీరని అడిగారు. రహస్యంగా వుంచిన మెషీన్‌గన్ ప్రక్కనే యిద్దరు మెషీన్‌గన్నర్లున్నారు. వారి తర్వాత కొంత దూరంలో ఒక పెద్ద సైనికుల సముదాయం ఉంది. వాళ్లల్లోనుండి స్నేహంతో కూడిన మృదువైన కంఠధ్వని ఒకటి వినిపించింది.

"అదీ సంగతి. అదే, న్యాయాన్యాయ యుద్ధాల్ని గురించి చరిత్ర మనకు చెప్పేది. సర్వ సామాన్యంగానూ, ముఖ్యంగా ప్రస్తుత దేశభక్తియుత మహాసంగ్రామం విషయం లోనూ మన పార్టీ వైఖరి అదే. అవును. మనకు కష్టమే. మన జీవితాల్ని అంకితం చేసిన ఉద్యోగాన్నీ, మన కుటుంబాల్నీ వదలిపెట్టి వచ్చాం. మనం శాంతస్వభావులం. కానీ రణరంగంలో మనం దాక్షిణ్యం ఎరుగని వాళ్లం. ప్రాణాలు ఉన్నంతవరకూ పోరాడుతాం. మనం మన మాతృభూమి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం, మానవ జాతి భవిష్యత్తు కోసం, పోలెండు, చెకొస్లొవేకియా, ఫ్రాన్స్, బెల్జియం, డెన్మార్కు, నార్వేదేశాలలోని బానిస ప్రజల కల్యాణంకొరకు పోరాడుతున్నాం."

ఆ వర్షపు రాత్రి చీకట్లో వెలువడ్డ పైమాటలు సాధారణమైనటువంటివే. సైన్యంలో పనిచేసే ఏ రాజకీయ కార్యకర్త నోటినుండైనా వినవచ్చు. కాని వాటిని పలికిన విధానం, ఆ మెల్లని కంఠధ్వనిని అనుసరించిన ప్రశాంతత, స్పష్టత ప్రతివ్యక్తి హృదయంలోకి చొచ్చుకుపోయింది.

క్రమక్రమేణా ఆ కంఠధ్వని దూరంలో సమసిపోయింది.

"ఎవరది?" కర్నల్ ప్రశ్నించాడు.

"కాప్టెన్ రేమిజొవ్, మా రాజకీయ సహాయకుడు," అని సమాధానం చెప్పాడు లెఫ్టినెంటు. "రెజిమెంట్‌లోకల్లా ఉత్తమోత్తముడు. అన్నట్టు ఆయన ఉపాధ్యాయుడు సుమండీ!"

"మీ వాళ్లంతా ఉత్తమోత్తములే," అన్నాడు కర్నల్, ఆ చీకట్లో పండ్లి కిలిస్తూ. ఆ మర్నాడు ఆతని బటాలియను యింకా యితరులు ఆ వర్షంతో నాని పోయి, కష్టభూయిష్ఠమైన ఆ విభాగాన్ని విడిచి ఎంతో దూరంగా వెళ్తారనే శుభ వార్తను ఆ యువ లెఫ్టినెంటుకు కాస్త ప్రోత్సాహాన్ని కలుగజేసేందుకై అతడు చెప్ప డానికి యిష్టపడేవాడే. కానీ తాను అకీమొవ్‌కు యిచ్చిన వాగ్దానాన్ని జ్ఞాపకం చేసుకొని మారుమాట్లాడలేదు.



అధ్యాయం రెండు

# ఆనిచ్కా బెలొజ్యోరొవ

1

కర్నల్ వెళ్లి పోయిం తర్వాత అకీమొవ్ తన సిగ్నల్ దళం మనుషులతో సంభాషించాడు. ఒకవేళ శత్రువులు టెలిఫోన్‌ను పనిచేయకుండా పాడుచేసిన సందర్భంలో వారు ఉదయం లేచిందే మొట్టమొదట వైర్లెస్ సంబంధాలను తప్పక ఏర్పరచాలని అతడు సూచించాడు. ఆ తర్వాత ఫిరంగిదళం అబ్జర్‌వర్‌లు వచ్చారు. అతడు వాళ్లను కంపెనీలకు పంపించాడు. ఎందువల్లనంటే వారు ముందరి ప్రదేశంలో ఉన్న తను ఫిరంగి బేటరీల కాల్పులను గురి తప్పకుండా యుద్ధం మొదలుపెట్టిన దగ్గరనుంచి సరిదిద్దుకోగలుగుతారని.

ఇనుప పొయ్యిమీద టీ కాగుతోంది. కొంతమంది ఆఫీసర్లు ఎండు గడ్డిలో హాయిగా పడుకునేందుకు వసతిని ఏర్పాటు చేసుకొని కునుకు తీస్తున్నారు. మాయ్‌బొరోద కొత్త

రికార్డును పెట్టాడు. అప్పుడప్పుడు ఫోన్ మ్రోగేది. ఎక్కడ నేలబాంబు క్షేత్రాలలో మార్గాలు ఏర్పాటు చేయవలసి ఉండేదీ అకీమొవ్ రెజిమెంటల్ ఇంజనీరుతో చర్చిస్తున్నాడు.

ఇంతలోకే వెలుపలినుండి అకస్మాత్తుగా ఒక ఆడపిల్ల నవ్వు పెద్దగా పకపకమంటూ వినిపించింది. అంతా పైకిచూశారు. మళ్లీ అదే ధ్వని. ఈసారి చాలా దగ్గరగా వినిపించింది. తలుపు తెరిచి, టార్పాలిన్ గుడ్డను పైకెత్తి, నవ్వుతూ ఒక పిల్ల గడపలో ప్రత్యక్షమైంది.

"అబ్బ! నవ్వ లేకచచ్చాన్రా బాబూ!" అని ఆమె గట్టిగా పలికింది, తన నగు ముఖంమీది వర్షపు నీటి చుక్కల్ని తన ఓవర్‌కోటు చేయితో తుడుచుకుంటూ. ఆ కందకంబసలోని మనుషుల్ని తదేకదృష్టితో చూస్తూ ఆమె ఒక్కక్షణం కదలకుండా నిలబడిపోయింది. ఆ తర్వాత అంది: "అలాంటి సంగీతం యిక్కడ వినిపిస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు!" ఆమె గ్రామఫోన్ వద్దకు వెళ్తూ అకస్మాత్తుగా ఏదో గంభీరంగానూ, ఆలోచిస్తున్నట్టూ అయిపోయింది. రికార్డు అయిపోగానే ఆమె సణిగింది: "గ్రీగ్ రచించిన 'అనీత్ర నృత్యం.' అయితే, యిక్కడ శాస్త్రీయ సంగీతంలో ఉత్సాహం ఉన్నవాళ్లు ఉన్నారన్నమాట."

కేవలం అప్పుడు మాత్రమే ఆమె కుశలప్రశ్నవేసింది.

"ఎలా ఉన్నారు? ఇక్కడి కమాండర్ ఎవరు?"

"నేనే," అని అకీమొవ్ సమాధానం చెప్పాడు, తెచ్చిపెట్టుకున్న ప్రశాంతతతో తన కండపుష్టిగల తలను ఆమెవైపు తిప్పుతూ.

ఆతని సమాధానంలో స్నేహభావం లేనట్టు ఆ పిల్ల స్పష్టంగా పసికట్టేసింది. అంచేతనే ఆమె కళ్లు జిగేలుమన్నాయి. మామూలు ధోరణిలోనే ఆమె తనను గురించి పరిచయం చేసుకుంది: "సైనిక అనువాదకురాలు లెఫ్టినెంటు బెలొజ్యోరొవను."

ఆమెకు సమాధానం చెప్పకుండానే అకీమొవ్ ఇంజనీరువైపు తిరిగాడు. ఆ పిల్ల ద్రోజ్‌ద్ వద్దకు వెళ్లి అంది: "రికన్నాయ్‌సెన్స్ మనుషులు వచ్చారు." ఆ తర్వాత ఆమె నిప్పుకు దగ్గరగా కూర్చుంది.

ఆమె వచ్చినప్పుడు స్వల్పంగా కలిగిన కలవరపాటు మటుమాయమైపోయింది. నేలబాంబులను ఎక్కడనుండి తీసివెయ్యాలో ఆ విషయాన్ని అకీమొవ్ యిదివరకటికంటే కాస్త పెద్దగా యింజనీరుతో పరిష్కరిస్తున్నాడు. ఇంతవరకు సగం నిద్రతీసిన

ఆఫీసర్లు లేవనే లేదు. కాని వారి నిద్ర మాత్రం పటాపంచలం అయినట్లనిపించింది. ఆ పిల్ల తన చేతుల్ని వెచ్చ చేసుకుంటూ మాయ్‌బొరొద చెవిలో నెమ్మదిగా అంది: ''మా నాన్న కాదూ! ఆ రికార్డు మళ్ళీ పెట్టండి ఏం?''

మాయ్‌బొరొద తల ఊపాడు. గ్రామఫోను పెట్టెకు కీ యిచ్చాడు. మళ్ళీ ఆ గదంతా నార్వే వాగ్గేయకారుడు సృష్టించిన సంగీతమాధుర్యంతో మంత్రముగ్ధమైంది.

అక్కడున్న వాళ్లంతా ఎవరికి వారు తమతమ పనుల్లో నిమగ్నమై ఎక్కడా తీరిక లేకుండా ఉన్నట్టు కనిపించినా ప్రతివ్యక్తీ ఆ పిల్లను ఒక కంట చూస్తూనే ఉన్నాడు. యుక్త వయస్సులో ఉన్న ఆమె అందమైన కోలముఖం, అసాధారణమైన పొడుగాటి కనురెప్ప వెంట్రుకల చాటునున్న గోధుమ వర్ణపు విశాల నయనాలు, — అలాంటి కనురెప్ప వెంట్రుకలే లేకపోతే ఆ నయనాలు లోతులెరుగని యౌవనంతోనూ, జీవితేచ్ఛతోనూ దేదీప్యమానంగా వెలిగిపోతూ పెంకెతనంతో కనిపించేవేమో — సగర్వనీయమైన ఆమె స్త్రీత్వానికి సాహసనీయమైన భావాన్ని జతపరుస్తూ ప్రముఖంగా అగుపించే ఆమె చిన్నిగడ్డం, ఆ కందకంబసలో ఉన్న వాటితో పోల్చిచూస్తే చిన్నవైన ఆమె టాప్ బూడ్సులు, ఆమెకు సంబంధించిన ప్రతివిషయమూ ఆమె చుట్టూ ఉన్న మనుషులందర్నీ బానిసలుగా చేసేసింది. అందుకు కారణం వారు చాలా కాలంనుండి స్త్రీని చూడకపోవడమే కావచ్చు.

కాప్టెన్ అకీమొవ్ నిర్లక్ష్యత కేవలం పైడాంబికమే. వాస్తవానికి, ఎక్కడబడితే అక్కడ ప్రతివాని నోటినుండీ ఆ అనువాదకురాల విషయమై తాను వినడం తప్ప వేరే ఏం జరగడంలేదని తాను చేసిన ఫిర్యాదును అతడు తక్షణమే మరచిపోయాడు. ఆమెను గురించి ఎక్కువ ఎందుకు తెలుసుకోలేదా అని కూడా ఆశ్చర్యపోయాడు. అతడా పిల్లను చూసినప్పుడు ఏదో హృదయంలో టప్‌మని కొట్టినట్లయింది. ఆమె ఎవరైనప్పటికీ, ఆమె పేరు ఏమైనప్పటికీ, ఆమె ఆ ఆకురాలు కాలంలోని అనంతమైన అంధకారంలో పకపకా నవ్వుతూ ప్రత్యక్షమైనట్టూ, ఆ పిల్లనే అతడెల్లప్పుడూ స్వప్నంలో కోరినట్టూ అనిపించింది అతనికి. ఆ కందకంబస, అంతులేని ఆ సందులూ, ధ్వంసమైన గ్రామాలూ, సాపర్ల పారల్తో తవ్విన ఆ చెమ్మ నేలలూ, ఒకటేమిటి, యావత్ప్రపంచమూ అతనికిప్పుడు ఒక నూతన వెలుగులో, పలురంగుల్లో, గంధర్వకథల్లో సూదిరిగా ఎవరికీ సంపూర్ణంగా తెలియని దృక్పథంలో కనిపించింది. లేదా అత్యంతున్నతమైన శిఖరాన్ని అధిరోహించిన పిమ్మట, ఎక్కడ హాయిగానూ, అయినా గాలిపీల్చడం

అతికష్టంగానూ ఉంటుందో అలాంటి పలుచని వాతావరణంలోకి చొచ్చిన పర్వతారోహకుని మాదిరిగా ఇంతవరకూ ఎరుగని, వెలుగుతోనిండిన దానికోసం బహుశా స్వయంగానే అతడు తన పూర్వపు మానసిక స్థితినీ, శారీరక స్థితినీ కూడా మార్చుకొని ఉండొచ్చు.

అతడింకా పదహారేళ్ల బాలుడేంకాడు. జీవిత పరిజ్ఞానమూ, ఆడవాళ్లతో అనుభవమూ ఉన్న సుమారు ముప్పై సంవత్సరాల వయసున్నవాడు. అయినా ఒక్క క్షణంలోనే ఆతనిలో మార్పు కలిగింది. అందుకు అతడు ఆ మార్పును అవివేకమైనదిగానూ మరణాపాయంతో నిండినదిగానూ భావించాడు. తన ముఖవర్చస్సునూ హృదయంలోని ఉద్రేకాన్నీ అదుపులో పెట్టుకొనే అలవాటు అతనికి ఉంది. తనకు వెలుపల ఉన్న ఏదో ఒక శక్తి ప్రభావానికి తాను లోనుకావచ్చుననీ, ఆ శక్తికి వ్యతిరేకంగా తన బలం నెగ్గక పోవచ్చుననీ ఆతడిప్పుడు భావించి దానిని ఎదిరించడంలో నిర్దాక్షిణ్యంగా ఉండేందుకై నిశ్చయించుకున్నాడు. ఎంత నష్టం జరిగినాసరే కఠినంగా వుండడమే తాను మొదట చేయవలసిన పని.

ఆవిధంగా తీర్మానించుకొని అతడు తానిదివరలో ఊహించుకొన్న భావనకే తిరిగి వచ్చాడు. అంటే ఆ పిల్లకు ఉన్నత పదవిలో ఉన్న సంరక్షకుడు ఒకడు ఉండి తీరాలని. ఆమెను జాగ్రత్తగా చూడాలని రెజిమెంటల్ కమాండర్‌ను కూడా బలవంతంపెట్టగల ప్రాబల్యమూ హోదా ఉన్న సంరక్షకుడు — అంతకంటే సులభంగా చెప్పాలంటే, ప్రియుడు — ఆమెకు ఉండి తీరాలనే భావనకు వచ్చాడు. తాను ఆ వ్యక్తిని తృణీకరించ లేదనీ, అతడెవరో తెలుసుకోవాలని కూడా వాంఛించలేదనీ తనకు బాగా తెలిసినప్పటికీ, "అతడు ఎవరై ఉంటాడు?" అని అతడు ఆలోచించాడు, తనలో లేని నిరసన భావాన్ని బలవంతంగా కల్పించుకోవడానికి ప్రయత్నిస్తూ.

అంతమంది మగవాళ్లల్లో ఆమె ఒక్కర్తె ఉంది గనక ఆమె అందంగానూ ఆకర్షణీయంగానూ ఉందనే అంతిమ నిర్ధారణకు అతడు వస్తున్నాడు: స్త్రీశరీరంయెడల వుండే సహజమైన కామంవల్లా, స్త్రీమూర్తి కావడంవల్లా సర్వసామాన్యంగా ఆమె ఆకర్షింపబడుతోంది. అతడే గనక ఆమెను ఓదెస్సాలోగానీ సెవస్తోపాల్‌లోగాని ఏ వీధిలోనో కలిసి ఉంటే బహుశా అతడు ఆమెను రెండో పర్యాయం కన్నెత్తి చూసి ఉండేవాడు కాదు. ఎందువల్లనంటే ఆమె ఒక్కర్తే స్త్రీ కాదు గనక. అనేకమందిలో ఆమె ఒక్కర్తే గనక. ఆమె యితరులకంటే ఏమంత బాగా ఉండేది కాదేమో. బహుశ వాళ్లంత అందంగా ఉండేది కూడా కాదేమోనని అతడు తర్కించుకున్నాడు.

పైగా ఆమె మాయ్‌బొరొద మీదికి వంగి అతని చెవిలో గుసగుసలాడింది. కాబట్టి పురుషుల్లో మెలగడం, ఆమె ఎవరితోనైనా సరే సరసంగా ఉండేందుకు సంసిద్ధమవడం ఆమెకు బహుశ అలవాటు అయి ఉంటుంది.

మరో విషయం. ఆమె లోపలికి వచ్చినప్పుడు అంది: "అబ్బ, నవ్వ లేకచచ్చాన్రా బాబూ!" దీనినిబట్టి ఆమె ఏవిధంగానూ సంస్కారం కలిగిన వ్యక్తిలాగా కనిపించకపోవడమే కాకుండా ఓడరేవుల్లోని వగలాళ్లలో ఒకరిని జ్ఞాపకచేసింది. మరీ విచిత్రం ఏమంటే, ఆమె అన్న నాలుగు మాటలూ, ముఖ్యంగా అతని మనస్సును నొప్పించి ఉంటాయి. లేదా, అందుకు భిన్నంగా అతనిని ఒప్పించి ఉంటాయి కూడా. ఎందువల్లనంటే అతడు స్వయంగా ప్రజల మనిషి అయినప్పటికీ అనేక పుస్తకాలను చదవగలిగాడు. ఎంతో అభ్యసించి నేర్చుకోగలిగాడు. విద్య నేర్చుకొనేందుకై ప్రోత్సాహాన్నిస్తూ ఎంతో వ్యయం చేసే సోవియట్ ప్రభుత్వంక్రింది యువకులు సాంస్కృతికంగా వెనకబడడమనేది, క్రమశిక్షణ లేకపోవడానికీ, సోమరితనానికీ, ఎందుకూ పనికి రాకపోవడమనే దానికీ చిహ్నం అని అతనికి వాస్తవంగానే అనిపించింది.

ఆ తర్వాత, ఆమె ఆకారాన్నిబట్టి చూస్తే ఏమంత తెలివైన పిల్లలాగా కనిపించదు. ఆమె ఎందుకునవ్వినట్టు? సంగీతం ఆమెలో అలాంటి వింతైన, నీచమైన ప్రతిచర్యని ఎందుకు కలుగజేసింది?

ఈ భావాలన్నిటినీ, యింకా తదితర పరిరక్షక ప్రాకారాల్నీ అకీమొవ్ తన హృదయం చుట్టూ నిర్మించుకున్నాడు.

ఈలోగా జీవితం మంచి తీవ్రాతి తీవ్రంగానూ గడ్డుగానూ గడుస్తోంది. యుద్ధ ముహూర్తం నిర్దాక్షిణ్యంగా సమీపిస్తోంది. నూతన సమస్యలు తలెత్తుతున్నాయి. అకీమొవ్ తనను తాను గమనించాడు. తాను ఆజ్ఞల నొసగునప్పుడూ, ఎప్పటి మాదిరిగానే ప్రశాంతంగా సలహాలు పొందేప్పుడూ తన గొంతును తానే పరాయి వానిలాగా విన్నాడు. ఏదో ఒక తీవ్రమైన విషయాన్ని గురించి ఒక్కక్షణం ఆలోచించడాన్ని, ఆ తర్వాత తన మామూలు స్పష్టతతోటే ఒక నిర్ణయానికి రావడాన్ని, అదే సంపూర్ణమైన ప్రశాంతతతో దానిని యితరులకు తెలియచేయడాన్నీ అతడు స్వయంగా చూసుకున్నాడు. లేచి టెలిఫోన్‌వద్దకు వెళ్లడం, రెజిమెంట్ కమాండర్‌తోను, తన అడ్జుటెంట్‌తోనూ లేదా డివిజన్ ఫిరంగిదళ కమాండర్‌తోనూ అన్ని రకాల ఆవశ్యకమైన ప్రధాన వివరాలను మాట్లాడ్డం తనను తాను గమనించుకున్నాడు.

అంతా కేవలం ఎప్పటి మాదిరిగానే చేశాడు అకీమొవ్. అయినా ఒక కంట ఆ పిల్ల చుట్టూ ఏం జరుగుతుందో కనిపెడుతూనే ఉన్నాడు. తాను ఎవరితో ఏర్పాట్లన్నీ పూర్తిచేశాడో ఆ ఫిరంగిదళం ఆఫీసర్లు ఆమెతో గప్పాలు కొట్టుకుంటూ యింకా అక్కడే ఉన్నారు. అందమైన ఆడవాళ్ల ఎదుట ఉండే మగవాళ్ల మొహాలు ఎప్పుడూ ఎలా ఉంటాయో అదే విధంగా వాళ్ల మొహాలు అసహజమైన భావాలను కనపరుస్తున్నాయి. ఎప్పుడూ ఏదో గోలచేస్తూ జంకూ గొంకూ ఎరగని కాప్టెన్ ద్రోజ్‌ద్ ఆ అనువాదకురాలి దగ్గర ఉన్నప్పుడు ఎంతో బిడియంగా ఉన్నట్టు కనిపించాడు. వయసు మించుతున్నప్పటికీ ఇంజనీరు ఫీర్సొవ్ కూడా ఆ పిల్లతో చక్కని కబుర్లు చెబుతున్నాడు. పీనాసితనానికి పేరుపొందిన మాయ్‌బొరొద కూడా ఆమెకు వేపుడు మాంసాన్ని విందుగా యిస్తున్నాడు.

అకీమొవ్‌ను అన్నిటికంటే ఎక్కువ బాధ కలిగించింది కంపెనీలనుండి వచ్చిన కాప్టెన్ రేమిజొవ్ ప్రవర్తన. అందరిలోకల్లా అతడు తన ఎడమవైపునున్న జేబులో ఎప్పుడూ పార్టీ సభ్యత్వం కార్డుతోపాటు తన భార్య మరీయా అలెక్సేయెవ్న ఫోటోను ఉంచుకుంటాడు. అంచేతనే ఆఫీసర్లంతా అతనిని ''సన్యాసి'' అని ఎగతాళి పేరుతో పిలిచేవారు. అటువంటి రేమిజొవ్ యింకా ఎక్కువ మితభాషిగా ఉండవలసినవాడు. కాని అతను కూడా యీ నూతన అనువాదకురాలిని చూడగానే ముగ్ధుడైపోయాడు. ఆతడు ఈ వాస్తవాన్ని దాయలేకపోయాడు. రేమిజొవ్ అవివేకంగా నవ్వుతూ (అకీమొవ్ భావించిన ప్రకారం) ఆ పిల్లకు తన భార్య ఫోటో చూపుతూ ఆ తర్వాత ఆమెకు మూడు పంచదార బిళ్లలను యివ్వడాన్నీ, ఆమె చిక్కగా లేని తన వేడి టీని త్రాగుతున్నంత సేపు నవ్వుతూ ఉండడాన్నీ అకీమొవ్ ఓర చూపుతో గమనించాడు. రేమిజొవ్ చర్య ఫలితంగా పంచదార అసలకే అయిపోయింది. దాంతో ఎలాగో ఒకలాగున అకీమొవ్‌కు వెర్రికోపం వచ్చింది.

''ఆమెకైనా బుద్ధి ఉండి నిరాకరించి ఉండాల్సింది,'' అని భావించాడు అకీమొవ్, రేమిజొవ్ వంక చంపేద్దామా అన్నంత కోపంతో చూస్తూ.

చివరికి ఆ ''యువతి'' చుట్టూ జరుగుతూన్న గడబిడ సహించలేక అతడు లేచి గట్టిగా కేకలేశాడు: ''ఇహ చాలు. మీ యూనిట్‌లకు వెళ్లండి.''

ఫిరంగిదళం ఆఫీసర్లు లేచి అయిష్టతతో వెళ్లిపోయారు. సిగ్నల్ మనుషులు మొదట తటపటాయించి, మరో కొన్ని నిమిషాలు అకీమొవ్‌తో వారికీ అతనికీ మధ్య ఉండే సమన్వయ విషయాన్ని గురించి మాట్లాడి వారు కూడా వెళ్లిపోయారు,

"మీరంతా మీమీ యిష్టంవచ్చిన చోట్ల ఉండొచ్చు," అని అకీమొవ్ మిగతా వాళ్లతో అన్నాడు తన దగలాకోటును తొడుక్కుంటూ. తర్వాత మాయ్‌బొరొదతో చెప్పాడు: "నేను కంపెనీలకు వెళ్తున్నాను."

సరిగా అప్పుడే జర్మన్‌లు వాడుక ప్రకారం మోర్‌టార్లను పేల్చడం ప్రారంభించారు. అలా ఎంతో సేపు కాల్చలేదు. ఎంత హఠాత్తుగా ప్రారంభమైందో అదే విధంగా ఆగిపోయింది. ఇది వాళ్లకు పరిపాటి. కాని యెప్పుడూ లేని భయం తనకి యిప్పుడు పుట్టుకు రావడం చూసి అకీమొవ్ విస్తుపోయాడు.

మోర్‌టార్‌లు పేలడం ఆగిపోయిన మరుక్షణాన్నే తలుపు తెరుచుకుని కర్నలు, ఒరేష్కిన్‌లు లోపలికి వచ్చారు. రావడమేమిటి తూలిపడ్డారనే చెప్పాలి.

"మోర్‌టార్ బాంబును వీసంలో తప్పించుకున్నాం," అన్నాడు కర్నల్. అతడిప్పుడు చాలా చిన్నవాడిలాగా ఉద్రేకంతో కనిపించాడు. అతని పూర్వపు నీటు యిప్పుడు అగుపించదు: ఆపాదమస్తకం బురదతో నిండిపోయాడు.

అతడు కన్నెత్తి పైకి చూసినప్పుడు ఆ అమ్మాయి కనిపించింది. ఆశ్చర్యంతో అన్నాడు: "ఆనిచ్కా! ఇక్కడికెలా వచ్చావ్?"

ఆ పిల్ల ఆతనిని పరికించి చూసింది. సంతోషం పట్టలేక తన బాహువులతో ఆతని మెడని పెనవేసుకొని గట్టిగా అరచింది: "సెమ్యోన్ ఫామీచ్, ఇక్కడేం చేస్తున్నారు?"

"తర్వాత చెప్తాలే. ఓపిక పట్టు," అని గొణిగాడు కర్నల్, ప్రక్కనున్న ఆఫీసర్లను ఓరగా చూస్తూ. అతని మొహం సిగ్గుతో ఎర్రబడిపోయింది. "నువ్వు యుద్ధరంగంలో ఉన్నావా? ఇక్కడ? మీ నాన్న ఎక్కడ?"

యుద్ధం జరగబోయే ముందు ఆ "నాన్న" అన్న పదం ఆ కందకంబనలో కఠినంగానూ భయంకరంగానూ వున్న ఆ కర్నల్ నోట వెలువడడం బొత్తిగా అసందర్భంగానూ భావలోలితంగానూ ధ్వనించింది. దేశసేవా భావంతోనూ ఒకే లక్ష్యంతోనూ బంధించివేయబడి అక్కడ పనిచేస్తూన్న వాళ్లందర్నీ, ఎక్కడో దూరంగా, బహుదూరంగా ఉన్న తండ్రులూ, తల్లులూ, నాయనమ్మలూ, తదితర బంధుకోటిగల మానవమాత్రులుగా ఒక నూతన విభిన్నదృక్పథంతో ఒకరినొకరు చూసుకొనేట్టు అది చేసింది.

అకీమొవ్ వెళ్లిపోతుండగా కర్నల్ వైపు ప్రథమ పర్యాయంగా జాలిపడుతున్నట్టు చూశాడు. అంతేకాకుండా ఆ ముసలాయన విషయంలో తనకున్న అభిప్రాయం బహుశ

తప్పేమోనని కూడా అతడు భావించాడు. ఆ వృద్ధుడు సహృదయుడే కావచ్చునని భావించాడు. ఆ అమ్మాయికి ఒక తండ్రి ఉన్నాడనే వాస్తవం, ఎంతైనా సహజమైన విషయం, తాను యిదివరలో ఆమెను గురించి భావించిన చెడు ఆమెనుండి తొలిగిపోయినట్టుగా, అది ఎలాగో ఆతనికి ఆనందదాయకమైందిగానూ, ప్రధానమైందిగానూ తోచింది. కాబట్టి, అకీమొవ్ యీ పరిస్థితికి విసుగుచెందకుండా ఆనందాన్ని పొందక తప్పింది కాదు.

## 2

ఆనిచ్కా బెలౌజ్యోరొవ ఆ కందకంబసను ప్రవేశించినప్పుడు నవ్విన అసలు కారణం యిది. ఆమె రికన్నాయిసెన్స్ మనుషులతో కొండకనుమలో వస్తున్నప్పుడు ఆ సంగీతాన్ని మొదట దూరంలోనూ ఆ తర్వాత సమీపిస్తున్న కొద్దీ విన్నది. అప్పుడు ఆ రాగంతో ఆమెకు పరిచయమున్నట్టు ఆమెకి అనిపించింది. మాస్కో, తన సంగీత పాఠాలూ, యుద్ధం పూర్వానికి సంబంధించిన ప్రతి విషయమూ ఆమె స్ఫురణకు వచ్చింది. సంగీతాన్ని సమీపిస్తున్న కొద్దీ ఆమె ఉత్సాహం కూడా ద్విగుణీకృతంగా వెలుగొందింది. ఆమె ఆగి విన్నది. ''ఎవరా వాయించేది?'' అని ఆమె ఆశ్చర్యపడుతూ బిగ్గరగా అనక తప్పింది కాదు.

ఆ నల్లని చీకట్లో అకస్మాత్తుగా ప్రశాంతమైన, అధికార పూర్వకమైన ఒక సైనికుడు కంఠధ్వని వినిపించింది: ''వాళ్లు అన్యాత నృత్య సంగీతాన్ని వింటున్నారు: మా బటాలియను కమాండర్ కందకంబసలో.''

అప్పుడు ఆనిచ్కా, గ్రీగ్ కూర్చిన 'అనీత్ర నృత్య' సంగీతాన్ని గుర్తించింది. ఆ సైనికుడు అనీత్ర పేరును రష్యన్ పద్ధతిలో ఉచ్చరించడంతో ఆమెకు మళ్లీ నవ్వు పుట్టుకొచ్చింది. ఆమె ఆ కందకంబసకు వస్తూన్నప్పుడు దారిపొడుగునా పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వింది. ఆ నవ్వు యుద్ధభూమియొక్క కఠినదృశ్యంలోనూ, సమరానికి ముందున్న గంభీర నిశ్శబ్దతలోనూ అసందర్భంగా వున్నట్టు అగుపించింది.

తన కుటుంబానికి దూరపు బంధువును పెళ్లాడినట్టి తన తండ్రి పాతస్నేహితుడైన కర్నల్ వెర్స్తోవ్స్కీను కలుసుకోవడంతో ఆమె ఆనందాతిశయాలు శిఖరాన్ని అందుకున్నాయి. కొద్ది రోజులక్రితంవరకూ ఆమెకీ ప్రపంచం పనికిమాలిందిగానూ, సంకుచితమైందిగానూ, కొంచం అసభ్యమైందిగా కూడా అనిపించింది. ఆ

విషయం ఆమెకిప్పుడు గ్రీగ్ సంగీతంతో కలిసి స్పష్టంగా జ్ఞాపకానికి వచ్చింది. కాని ప్రస్తుతం ఆమె యుద్ధరంగంలో ఉంది గనక అది ఏమంత చెడ్డగా అనుపించలేదు.

ఇటీవల జరిగిన సన్నివేశాలనూ, ముఖ్యంగా తన తండ్రితో ఆమెకు కలిగిన అభిప్రాయభేదాన్నీ ఆనిచ్కా చెప్పినప్పుడు సెమ్యోన్ ఫామీచ్ దూషణ దుఃఖాలతో నిండిన నిట్టూర్పులు విడిచాడు.

ఆనిచ్కా తండ్రి అలెక్సాండ్ర్ మొదేస్తొవిచ్ బెలొజ్యోరొవ్ బాగా పేరుపొందిన డాక్టరు. మెడికల్ కోర్‌లో లెఫ్టినెంటు-జనరలు. దక్షిణాన ఉన్న సైన్యాల్లోని ఒక సేనలో అతడు 1941 నుండీ ప్రధాన శస్త్రచికిత్స వైద్యుడుగా ఉంటున్నాడు. చాలా కాలం క్రితం తల్లిచనిపోయిన కారణాన ఆనిచ్కా మాస్కోలో ఒక్కర్తే ఉండి పోయింది.

విదేశభాషల ఇన్‌స్టిట్యూట్‌లోని జర్మన్ శాఖలో ఆమె విద్యార్థినిగా రెండవ సంవత్సరంలో ఉంది. ఆ ఇన్‌స్టిట్యూట్‌లోని ప్రతి వ్యక్తీ, అంటే ఉపాధ్యాయులు ప్రొఫెసర్లతో సహా, మాస్కో చుట్టూరా కందకాల్నీ, టాంకులనుండి రక్షణకై గోతుల్నీ, త్రవ్వారు. ఆతర్వాత అక్టోబర్‌లో వాళ్లను తూర్పుకు తరలించివేశారు. వోల్గా నది గట్టునున్న ఒక పెద్దబస్తీకు ఆనిచ్కాని పంపించేశారు. అక్కడామెకు మనోవ్యాకులత కలిగింది. ఇన్‌స్టిట్యూట్‌లో ఉండడం ఆమెకు నిష్ప్రయోజనమనీ, సిగ్గుచేటనీ అనిపించింది. ఆమెకు తన తోటివిద్యార్థులకంటే జర్మన్‌భాష చాలా బాగా వచ్చు. జ్యూరిచ్ యూనివర్సిటీలో వైద్యం అభ్యసించిన ఆమె తల్లే అందుకు కారణం. ఆమె ఒక ఉత్తమ మాతృమూర్తిగా పట్టుదలతోనూ, నిష్ఠురాచరణంతోనూ తన బిడ్డను పెంచుతూ, చిన్నతనంలోనే ఆ భాషను ఆనిచ్కాకు నేర్పింది. కాబట్టే ఆనిచ్కా జర్మన్‌భాషను ధారాళంగా మాట్లాడుతుంది. ఆ భాషలోని ప్రవీణులు కూడా ఆమె ఉచ్చారణకు అచ్చెరువందారు.

అసలు ఇన్‌స్టిట్యూట్ పేరు చెబితేనే ఆనిచ్కాకు అసహ్యం పుట్టుకొచ్చింది. ఎందువల్లనంటే తానందులో ప్రవేశించడానికి కారణం తనకు జర్మనీ భాష అంతకు ముందే వచ్చుననీ, ఆ భాషపై మనసుంచి అధ్యయనం చేయాలంటే తనకు ఎక్కడిలేని సోమరితనం బలసిపోయిందనీ తనకు క్రమశిక్షణ లేదనీ ఆమె అప్పటికే సంపూర్ణంగా తెలుసుకుంది గనక. ఆ ఇన్‌స్టిట్యూట్‌లో తాను ప్రవేశించకూడదని తండ్రి తెలిపిన ఆక్షేపణలోని సత్యం ఆమెకిప్పుడు అర్థం అయింది. ఇన్‌స్టిట్యూట్‌లో ప్రవేశించడమంటే "లేత మనసులుగల యువతులు భర్తల్ని వెతుక్కోవడాని కనువైన మార్గం," అని

ఆమె తండ్రి నిరసనగా అన్నాడు. ఆయనకున్న ఆ ఒక్క కుమార్తె డాక్టర్ కావాలని అతని వాంఛ. ఏమైతేనేం, ఆమె తన పట్టు విడవలేదు. అందుకిప్పుడామె లోలోపల కుమిలిపోతోంది.

యుద్ధం ప్రారంభమైనప్పుడు ఆమెకు ఆ దాడిసలిపేవారి భాషపై అసహ్యం పుట్టింది. లక్షలాది ప్రజల్ని ఎదుర్కొన్న భీకర విపత్తులు ఆమెకు ప్రథమ పర్యాయంగా తన కర్తవ్యాన్ని స్పష్టంగా ప్రబోధిస్తూ కనువిప్పును కలుగజేశాయి. ఎక్కడ కష్టాలు ఎక్కువగా ఉంటాయో అక్కడే తన స్థానం అని ఆమె నిర్ణయాని కొచ్చింది. ఈ ఆలోచనలు, కూపస్థమండూకంలాంటి ఆ విద్యార్థి జీవితం అతి స్వల్పమైందిగా ఆమెకనిపించేట్టు చేశాయి. పూర్వంకంటే తక్కువే ఉన్నప్పటికీ, యింకా ఆ చదువును ఆ దుస్తుల్లో అభ్యసిస్తున్న తోటిస్నేహితులంటేనూ, రైనెర్ మరీయ రిల్కె, అన్న అఖ్మాతొవల కవిత్వాలను చదివి ఆనంద పరవశత్వం పొందిన యువకులంటేనూ ఆమెకు అసహ్యం వేసింది. ఏకైక ఆశయ సాధనయందు తన చిన్న పాత్రను నిర్వహించాలనే ఆవేశ పూరితమైన వాంఛలో ఆనిచ్క తన దోషాలనూ, ఇతరుల లోటుపాట్లను అతిశయోక్తిగా చెప్పింది. ఇలా సహజంగానే జరిగి తీరుతుందని అనుకోవాలి, ఇది ఫలించింది కూడాను.

జర్మనచే తమ స్వగ్రామాలనుండీ, బస్తీలనుండి వెళ్లగొట్టబడినట్టి మనసు చెదరిన కాందిశీకుల సముదాయాల దృశ్యాన్ని చూసి ఆమె కంపించిపోయింది. ఆస్పత్రి రైళ్లు క్షతగాత్రులైన సైనికుల్ని శాంతిగా ఉన్న బస్తీలకు తీసుకొస్తాయి. వాళ్లబాధల్ని పరికించినప్పుడు వారికి సహాయం చేసే శక్తి తనకు లేకపోయిందే అని ఆనిచ్క ఎంతో మథన పడిపోయింది.

ఆమె డైరెక్టర్ వద్దకు వెళ్లి ఒక సంవత్సరం సెలవు అడిగింది. మాస్కో వెళ్లి అక్కడ్నుంచి యుద్ధరంగానికి వెళ్లే తన అభిప్రాయాన్ని ఆమె దాపరికం లేకుండా అతనితో చెప్పింది. పత్రికల్లో చదివినట్టుగా, కొందరు ఆడపిల్లలు జర్మన్ శ్రేణుల వెనక్కి వెళ్లినట్టుగానే తానూ వెళ్లి విధ్వంసక చర్యలు చేయడాన్ని, శత్రువుల సమాచారాన్ని వైర్లెస్ద్వారా తెలపడాన్ని లేదా తగిన యితర మార్గాలను అనుసరించడాన్ని ఆమె వాంఛించింది.

కేవలం పద్ధతి ప్రకారం వల్లనైతేనేం, లేదా ప్రఖ్యాత సర్జన్‌యొక్క ఒకే ఒక కుమార్తె కావడంవల్లనైతేనేం, అదిన్నీ అనుభవంలేనటువంటి చిన్నపిల్లను యుద్ధరంగానికి పంపడం యిష్టం లేకపోవడంవల్లనైతేనేం డైరెక్టరు కచ్చితంగా అనుజ్ఞనివ్వ

డానికి నిరాకరించాడు. అతడు అమానుషమైన వ్యక్తనీ అవివేకనీ ఆమె తక్షణమే ఒక అంతిమ నిర్ణయానికొచ్చి, అనుమతి లేకుండానే వెళ్లిపోవడానికి నిశ్చయించుకొంది.

ఆమె తన ఉద్దేశాన్ని ఒకే ఒక స్నేహితురాలైన తాన్య నోవికొవకు మాత్రమే చెప్పుకుంది. తాన్య కూడా అమితోద్రేకాన్ని పొంది ఆమెతోపాటు వెళ్లడానికి అంగీకరించింది. పట్టణంలో ఒక రోజంతా తిరిగారు. మంచుతో నిండి బాగా చలిగా ఉన్న వోల్గా నది గట్టుమీద వారు నిలబడి ఎంతో మనోహరమైన విషయాలనీ, హృదయపూర్వకమైన విషయాల్నీ ముచ్చడించుకున్నారు. ఎప్పుడూ ధర్మయుతంగానూ సత్యవంతంగానూ ఉంటామని ప్రమాణాలు చేసుకున్నారు.

అనుమతి లేకుండా మాస్కోకు వెళ్లడం అనేది అంత సులభమైన విషయం కాదని తెలుసుకున్నారు. రాజధానీ నగరం యింకా యుద్ధం జరుగుతున్న ప్రాంతంలోనే ఉంది. అక్కడికి ప్రయాణం చెయ్యాలంటే అందుకు ఏ సంస్థైనా పూచీ వహించాలి. అందులో అనేక లాంఛనాలూ కష్టాలూ ఉంటాయి.

రైల్లో నేరస్థుని పట్టుకున్నట్టే తనను పట్టుకొని తలవంపులు కలిగేట్టుగా తిరిగి తన ఇన్‌స్టిట్యూట్‌కి పంపుతారేమోనని తాన్య భయపడిపోయింది. అంచేత ఒంటరిగానే వెళ్లడానికి ఆనిచ్కా నిశ్చయించుకొంది.

పాస్ (అధికార పత్రం) ఉన్న వాళ్లకు మాత్రమే టిక్కెట్లు అమ్ముతారు. అంచేత ఆమె టిక్కెట్టు లేకుండానే రైలెక్కింది. అప్పటికే సామాన్లతోటీ, ప్రయాణీకుల్తోటీ ఆ పెట్టె క్రిక్కిరిసి ఉంది. ఆమె ఒక పెద్ద ట్రంకుపెట్టెమీద కూర్చుంది. మొదట చాలా వ్యాకులత చెందింది. ఆమె చుట్టూ వున్న మనుషులు ఒకటే గొడవ చేస్తున్నారు. ఏమంత మంచి నడతగలవాళ్లలా కనిపించరు. ఎవడిమట్టుకు వాడు మంచి స్థలం కోసమని దేవుళ్లాడుకోవడం తప్ప మరే విషయాన్నీ ఆలోచించడంలేదు. ఇదంతా చూసి ఆనిచ్కా ఆశ్చర్యపోయింది. కాని ఎప్పుడైతే రైలు కదిలిందో అప్పుడే ఆమె తోటి ప్రయాణీకులు చాలా మంచి వాళ్లని తేలిపోయింది. వాళ్లు ఏదో అడుగుతున్నట్టుగా ఒకరినొకరు చూసుకున్నారు. ఒకరినొకరు పరిచయం చేసుకున్నారు. ప్రేమతోనూ స్నేహంతోనూ వ్యవహరించారు. గోలా గొడవా తగ్గిపోయింది. ప్రతివ్యక్తీ ఎలాగో ఒకలాగున పరవాలేదనట్టుగా ఏదో ఒకమోస్తరుగా స్థలం ఏర్పాటు చేసుకున్నాడు. అందరూ మంచి స్నేహభావంతో వున్నారు.

మొదట ఆనిచ్కా ఆనవాలు పత్రాల తనిఖీ ఉంటుందేమోనని భయపడింది. కానీ, తన తండ్రి మిలిటరీ జనరల్ అనీ, ఆ విషయాన్ని రుజువు పరచేందుకు తనవద్ద అధికారపత్రం ఉందనే భావన ఆమెకు మనస్త్థిమితాన్ని కలుగజేసింది. తాను మాస్కో ఎందుకు వెళ్తుందో ఆ సంగతిని ఆమె చెప్పిన మరుక్షణంలోనే దానిని గురించి వారు ఏ కష్టాన్నీ కలుగజేయరనే భావన ఆమెకు మరింత ఉపశమనాన్ని కలుగజేసింది. ఈ నమ్మ కంతోటే ఆమె తన ప్రయాణాన్ని ప్రశాంతంగా కొనసాగించింది. ఆమె తన విశాల నయనాలతో ఒక్కొక ప్రయాణీకుడ్నే కలయచూసింది. తన యౌవనమే వారిలో ఆనం దాన్నీ, సానుభూతినీ రేకెత్తించినట్టు ఆమె యిప్పుడిప్పుడే అనుమానించడం మొదలు పెట్టింది.

ఆమె తన ప్రయాణం మొదటి రోజును అస్పష్టంగానూ, అయినా తన అనూ యకత్వం మనోహరత్వాల చేతనాశక్తితోనూ గడిపింది. మనసులోని నమ్మకంను మించిన శక్తి మరొకటి ఉండబోదని ఆమె గ్రహించింది.

కాని ఆ తర్వాత ఎప్పుడో ఒకప్పుడు జరిగితీరవలసిన విషయం ఒకటి సంభవిం చింది. కండక్టరు ఆ రైలు పెట్టె తలుపును తెరచుకొని లోపలికి వచ్చి బిగ్గరగా అన్నాడు, "మీ మీ కాగితాలు చూపండి."

తనిఖీ చేస్తున్న సైనికులవంక ఆమె తన ప్రశాంతమైన కండ్లను పైకెత్తి చూసింది. ఆశ్చర్యం ఏమంటే వాళ్లు ఆమెని తప్ప మిగతా వాళ్లందరి కాగితాలూ చూశారు. అలా జరగడానికి కారణం వాళ్లు ఆమెను గమనించలేదని కాదు. వాళ్లు ఆమెను సరిగానే చూశారు. ఆ వయసులో వున్న పిల్ల తల్లిగానీ తండ్రిగానీ లేకుండా యెంత మాత్రం ప్రయాణం చేయదని వాళ్లు బహుశ అభిప్రాయపడి ఉంటారు. వాళ్లల్లో ఒకడు ఆమెను చూసి నవ్వును కూడా నవ్వాడు. అతడలా చేసినప్పుడు ఆతని ఎర్రని ఇటికరంగు మొహంనిండా కరుణతోకూడిన ముడతలు పడ్డాయి. అతని నవ్వుకు ఆమె చిరునవ్వునవ్వి బదులుతీర్చేసింది. కాని ఆ తర్వాత తాను అలా చేసినందుకుగాను విచా రించింది. ఎందువల్లనంటే, ఆమె తనను తాను అదుపులో ఉంచుకొనే మంచి స్థితిలో ఉండి కూడా ఆతనిని తనకు అనుకూలంగా చేసుకొనేందుకుగానూ, అతడు ఆమె కాగి తాలను గురించి అడిగేందుకు నోటిదాకా రాగా దానిని తప్పించుకొనేందుకుగానూ తానా విధంగా చేసినట్లు ఆమెకు తెలుసు.

తాను తప్పు చేసినట్టుగా నిర్ణయించుకొని ఆ పెట్టె వదలి వెళ్లబోతున్న సైనికుల వెనుక ఆమె పరుగెత్తి, మాస్కో వెళ్లేందుకు ఆమె వద్ద అనుమతి పత్రం లేదనీ కానీ తానక్కడికి వెళ్లడం ఎంతో అవసరమనీ ఆమె వాళ్లతో చెప్పింది. ఆమె ఏంచెప్పిందీ ఆ చక్రాల రొదలో వాళ్లకు వినిపించలేదు. ఆమె మళ్లీ చెప్పింది. అప్పుడు ఆ యిటిక రంగు మొహం వ్యక్తి ఆమె వంక ఆశ్చర్యంగా చూశాడు. ఎర్రని అల్లికపు టోపీ, దానికి సరిపోయే రుమాలుగల ఆ పిల్ల ఆతనికి జ్ఞాపకం ఉన్నట్లు అనిపించింది. ''మేం మీ పెట్టెలో యిదివరకే తనఖీ చేసేశాం,'' అని ఆతడన్నాడు, ప్రశ్నార్థకం గానూ, స్పష్టంగా కోపంతో కూడానూ. ఆ తర్వాత వాళ్లు మరో పెట్టెలోకి అదృశ్యుల య్యారు. ఆవిధంగా ఎందుకు పరిణమించిందో అర్థంకాక ఆనిచ్కా తత్తరపాటు తోనూ సంతోషంతోనూ తిరిగి తన స్థలంలోకి వెళ్లి కూర్చుంది. కేవలం తన చూపులు మాత్రమే నమ్మకాన్ని కలిగించి ఉంటాయని ఆమె సహేతుకంగా తుది నిర్ణయానికి వచ్చింది. అందుకు వారి మేలు మరచిపోరానిదిగా భావించింది. ఆమె ఉత్త అమాయకు రాలేమో తనవద్ద అనుమతి పత్రం లేని కారణాన తనను ఒకవేళ గూఢచారిణిగా పరిగ ణిస్తారేమోనని భయం పడిపోయింది. ఆమె గనక యితరుల మాదిరిగా తనను తాను చూసుకోగలిగినట్లైతే తన భయాలకు తానే నవ్వుకొని ఉండేది.

ఏదైనా ఒక తీవ్రమైన నిర్ణయం తీసుకున్న తరువాత ప్రజలు ఎప్పుడూ ధారా ళంగా మనసు విప్పి మాట్లాడనట్టే తాను కూడా మాట్లాడక, ఆలోచనల్లో మునిగిపోయి పరధ్యానంగా చుట్టూరా పరికించింది. ఆమె చూసిన ప్రతిదీ ఎంతో దూరంలో ఉన్న ట్టుగా ఆమెకు అనిపించింది. కాని ఏదేమైనప్పటికీ, అది ఆమెలో మనోహరమైన భావా లను రేకెత్తించింది: ఒకే స్వరం కలిగిన అకార్డియన్ వాయిద్యంయొక్క సరసతలేని ధ్వనులూ, ఘాటైన 'మహోర్కా' పొగాకు కంపూ, ఆ పెట్టెలో ఉన్నవారి అత్యంత నిస్సారమైన పదాలు, వీటన్నిటిలోనూ ఏవో గంభీరమైన భావాలు నిండి ఉన్నట్టు ఆమెకు అనిపించింది. ప్రయాణం చేస్తున్న ఆమె తోటిస్నేహితులు — బహుశ ఆమె లోపల రగులుతున్న అంతరాగ్నిని పసికట్టారా ఏమో అన్నట్టు — ఆమెతో స్నేహంగా ఉన్నారు. ఆమెతో మాట్లాడాలంటే వారికి ఎంతో సంతోషం. వారు తమ జీవితాలనూ, తమ పనులనూ, ఆ యుద్ధం వారిలో ప్రతి ఒక్కరికీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో తెచ్చి పెట్టిన ప్రమాదాలనూ ఆమెకు చెప్పుకున్నారు.

సన్నగా ఉన్న ఒక లెఫ్టినెంట్ ఆమె యెడల అందరికంటే ఎక్కువగా శ్రద్ధ చూపాడు. ఆ కంపార్టుమెంటులో ఉన్న వాళ్ళంతా ఆతనిని వీత్య అనిపిలుస్తారు. అతడు అంతకుముందే యుద్ధరంగంలోకి వెళ్లి గాయపడ్డాడు. ఇప్పుడాతడు ఆస్పత్రి నుండి మళ్లీ యుద్ధరంగానికి వెళ్తున్నాడు. అతడు 'పరాక్రమ పతకాన్ని' ధరించాడు. యుద్ధం ప్రారంభ దివసాల్లో బహుమానాలివ్వడం బహు తక్కువ గనక గోలచేస్తూ, హుషారుగా ఉన్న యువకుడంటే ఆనిచ్కకు మంచి గౌరవం ఏర్పడింది. ఆమె అతని వైపు తదేకదీక్షతో చూడటం ఆతడు గమనించక తప్పింది కాదు. అతడు అన్యథా భావించి ఆమెను ఆశ్రయించడం, ఆమెకు తన భోజనంలో కొంత పెట్టడం, వేడి నీళ్లను ఆమెకు తెచ్చిపెట్టడం, సాధారణంగా ప్రతి విషయంలోనూ ఆమెకు సహాయకారిగా ఉండడం ప్రారంభించాడు.

మీది పడకబల్లమీద తనకు ప్రక్కగా ఆమెకు స్థలం ఏర్పాటు చేశాడు. అక్కడ ఆమెకు వెచ్చగానూ, ఏ అల్లరీ లేకుండా ఉంది. చీకటి పడగానే ఆ లెఫ్టినెంట్ ఆమెకు దగ్గరగా జరిగి తన చేతుల్తో ఆమెను చుట్టేయడమే కాకుండా, ఆమె శరీరాన్ని కూడా తాకాడు. ఆమె మరణించిన వ్యక్తిలాగా చలింపక అలాగే పడుకొని ఉంది. లెఫ్టినెంట్‌కు ధైర్యం చిక్కింది. ఆనిచ్కకు ఏమీ తోచకుండా అయిపోయింది. యుద్ధం జరుగుతున్న సమయంలో, ప్రతిచోటా ఎన్నో బాధలు ఉంటూండగా, ఆలోచించవలసిన యితర విషయాలు అనేకం ఉండగా, అతడా విధంగా ఎలా ప్రవర్తించగలుగుతున్నాడో ఆమె ఏ మాత్రం అర్థం చేసుకోలేకపోయింది. ఆమె పైనుండి క్రిందికి దిగివచ్చి తానంతకు పూర్వం కూర్చున్నట్టి నడవలోని ఎవరి ట్రంకు పెట్టెమీదనో కూర్చుంది. లెఫ్టినెంటుకు చిన్నతనం అయింది. చాలా సేపటివరకు ఒంటరిగా మౌనంగా కూర్చున్నాడు. ఇక ఓపిక పట్టలేక తాను కూడా క్రిందికి దిగాడు. ఆనిచ్క ప్రక్కనే స్థలాన్ని చేసుకొని ఆమె ఎందుకని క్రిందికి దిగిందో కోపంగా ప్రశ్నించాడు. ఆ తర్వాత అక్కడ యుద్ధం జరుగుతున్నట్టుగానూ, ప్రతిచోటా ఏంతో వేదన ఉన్నట్టుగానూ, తాను కొద్ది రోజుల్లోనే చనిపోవచ్చుననీ, నిజంగా ఆమె అంత కఠినహృదయురాలా అనీ మాట్లాడ్డం ప్రారంభించాడు. ఆమె సమాధానం చెప్పలేదు. ఆమె ఆలోచనలు ఎక్కడో చాలా దూరంలో ఉన్నాయి. ఆమె ఆ రైల్లో ఉన్నట్టుగా కాకుండా ఏదో ఎడారిలో ఒంటరిగా ఉన్నట్టు తలపోసింది. ఈలోగా, కొద్దిపాటి ఎర్రని మేఘాలవలె పొగ దట్టంగా పైకిలేస్తోంది.

ఆమెకు కనికరం కలిగించేందుకుగాను ఆతడు చేస్తున్న అస్పష్టమైన ఫిర్యాదులు మాదిరిగా ఆ పొగ ఉన్నట్టు ఆమె భావించింది.

ఆమె చివరికి అతనిని ప్రేమించడంలేదని చెప్పేంతవరకూ కూడా అతడు అదే ధోరణిలో మాట్లాడుతూ వచ్చాడు. తానా విధంగా అనడం పరిహాసాస్పదమైనటు వంటిదని ఆమె భావించింది; అతనంతట అతనే తెలుసుకొని ఉండాల్సింది.

అతడు ఆమెను శాంతంగా వదలి తన పడకబల్లమీదికి ఎక్కాడు. ఆనిచ్క మాత్రం ఆ నడవలో కూర్చున్న చోటనే ఉండిపోయింది. తర్వాత అనేక గొంతులు ఆమెకు అంతకంటే మంచిస్థలం యిస్తాం అనడం ఆమె విన్నది. ఎవరో ఒక వ్యక్తి రెండో వరసలో ఉన్న పడకబల్లమీద పడుకొనేందుకు కూడా స్థలం యిస్తానన్నాడు. కాని ఆమె వాటన్నిటినీ నిరాకరించింది. లెఫ్టినెంటు క్రిందికి దిగాడు. ఆమె వచ్చి ఆమె స్థలాన్ని తిరిగి తీసుకోవలసిందిగానూ అక్కడ ఆమెకు వెచ్చగా, సదుపాయంగా ఉంటుందనీ అన్నాడు. ఆనిచ్క తిరస్కరించింది. ఆమె భయపడనక్కర్లేదనీ, తానెక్కడున్నాడో అక్కడ ఉండిపోతాననీ ఆతడామెతో అన్నాడు. అతని కంఠస్వరంలో సత్యం ధ్వనించింది: తన తప్పును తాను సరిదిద్దుకోవాలని అతడు వాంఛిస్తున్నాడనడంలో ఏ మాత్రం సందేహం లేనట్టుగా కనిపించింది. ఆమె పడకబల్లమీదికి ఎక్కింది. అతడు క్రిందనే ఉండిపోయాడు. రైలు ఒకస్టేషన్‌లో ఆగింది. అతడు పచార్లు తిరగడానికిగాను వెళ్లాడు. తిరిగి వచ్చినప్పుడు ఆమె ప్రక్కను కూర్చో నివ్వవలసిందిగా అమెను అడిగాడు. "సరే మంచిది," అని ఆనిచ్క సమాధానం చెప్పింది, అతని నమ్రతకు మెత్తబడతూ. వాస్తవానికి అతడు చాలా నిజాయితీ మనిషే. తన కొంటె ప్రవర్తనకి పశ్చాత్తాపం పడ్డాడు. కాని అతడు ఆమె ప్రక్కకు చేరగానే వాళ్లు మరచిపోయి మళ్లీ ఆమెను తన చేతుల్తో చుట్టేయడం మొదలుపెట్టాడు: ఈదఫా కాస్త ఎక్కువ జాగ్రత్త వహిస్తూ బుద్ధిపూర్వకంగా చేతులు వెయ్యనట్టే నటించాడు. "మీకా మాత్రం మనోబలం లేదా?" అని ఆమె చిరాకుగా అన్నది. ఈ మాటలు స్వయంగా నిందాపూరితమైనవి కానప్పటికీ అవి సూటిగా తీవ్రంగా అతని హృదయంలోకి చొచ్చుకుపోయి, అనుకున్న ఫలితాన్నిచ్చాయి. అవి, ఏవిధమైన సుదీర్ఘ సంభాషణగానీ, గొడవగానీ లేకుండా ఆ యువక లెఫ్టినెంటు ఉగ్రతను చల్లబరచాయి. గేలి చేయబడ్డట్టుగా అతడు ముఖం చిన్నబుచ్చుకొని ఆమెనిక ముట్టుకోలేదు. తన కృతజ్ఞత తెలిపేందుకుగాను ఆమె అతని భుజంమీద కరుణతో తట్టింది. దాంతో అతడు ఆమె తనను ప్రోత్సహిస్తున్నట్టుగా భావించి మళ్లీ

మొదటి కొచ్చాడు. దాంతో ఆనిచ్కా క్రిందికి దిగిపోయింది, యిక ఆతని ప్రక్క నసే మిరా కూర్చోనని నిరాకరిస్తూ.

ఆమె కిటికీవద్దకెళ్లి వెలుపలికి చూసిందా చీకటిగా ఉన్న మంచు రేయిని. ఆమెకు ఆ కిటికీలోనుండి చలివేస్తోంది. ఆ పెట్టెలో ఎక్కడో ఒక బిడ్డ ఏడుస్తోంది. జీవితం సాధారణంగా కష్టభూయిష్ఠమనీ, తన జీవితం కష్టంగా ఉంటుందనీ ఆనిచ్కాకు అక స్మాత్తుగా అనిపించింది. జీవితం ఆడవాళ్లకంటే మగవాళ్లకు ఎంతో సులభంగా ఉం టుంది. ఆ కారణం చేతనే పూర్వపు నాటకాల్లోనూ, నవలల్లోనూ ఆడవాళ్లు తరచుగా మగవేషాలు వేసుకున్నట్టు రచయితలు చిత్రించేవారు. ఆమెకు యీ ప్రయాణంలో యింతకు ముందే అనుభవమైన సన్నివేశం చాలా స్వల్పమైనదైనప్పటికీ భవిష్యత్తులో తాను కూడా ఒక పర్యాయంకంటే ఎక్కువగా అలాంటి స్థితిని దాటవలసి ఉంటుందనే భావన ఆనిచ్కాను భయకంపిత మొనర్చింది.

ఆమె ఓపిక పట్టలేక ఎప్పుడు తెల్లవారుతుందా అని నిరీక్షించింది. చివరికి సూర్యుడు ఉదయించాడు. మంచుతో నిండిన పల్లపు భూములు రోజారంగుతో కొద్దిగా మెరిసి పోతున్నాయి. ప్రాతఃకాలపు భానుని తొలి కిరణాల్లో చెట్లు గడ్డకట్టిన మంచు చుక్కల్తో నిండాయి. ఆ తెల్లని మంచు ధగధగా మెరిసిపోతోంది, కన్నులు భరింపలేనంతటి తేజ స్సుతో. ఆ పగటి లేతవెలుగు రైలుమార్గపు కార్మికుల ఒంటరి కుటీరాల్ని దేవలోకంలోని గుడెసెల మాదిరిగా అగుపించేట్టు చేస్తోంది. లెవెల్ క్రాసింగ్ వద్దనున్న చారల బద్దీలూ, రైలు కదలిపోతుంటే దాని వంక అరచే నల్ల కుక్కా, చేతులు ఆప్యాయంగా పైకెత్తి ప్రయాణీకులవైపు ఊపే పసిపిల్లలూ, మృదువుగా ఉన్న పసుపురంగు రోడ్డుమీద బాగా క్రిందికున్న వెడల్పాటి బండిని లాగుతూన్న గుర్రం — ఒకటేమిటి, ప్రతిచిన్ని వివరమూ అందంతోటీ, ఆనందంతోటీ నిండి ఉంది. ఈ శోభనంతటినీ శ్లాఘిస్తూ ఆనిచ్కా మనసు చల్లబడింది. ఆమెలో ఉత్సాహం పెల్లుబికింది. అక్కడ ఆ పెట్టెలో ఆమె వెనుక కూర్చున్న వ్యక్తులు వారివారి కుటుంబాలనుండి చీలిపోయి విచారంతో ఉన్నారనీ ఎవరి బల హీనత వారికున్నప్పటికీ వాళ్లంతా మంచి వారేననీ, ఆమెకిప్పుడు బలీయమైన నూతన శక్తితో అనుభూతి కలిగింది. ఆ యుద్ధంలో తలకొక విధిగల వేలాది వివిధ జీవన తం త్రులు ఒకదానితో వొకటి విపరీతమైన చిక్కులో చిక్కుకొని బ్రహ్మాండమైన బంతిగా అల్లుకుపోయాయి. ఆనిచ్కా కేవలం ఒక మానవమాత్రురాలే కాదు కాని — ఆమె జీవితం యుద్ధంలో ఒక భాగస్వామి. ఆమె భవిష్యత్తు ఒక కఠినమైన ప్రశ్న.

ఆమెకు తన చుట్టూ వున్న వాళ్లందరి యెడలా బాధాపూరితమైన ప్రేమ కలిగింది. ఆ ప్రేమ అలలుగా లేచి ఉప్పొంగి పోయింది. ఆ ప్రేమను ఎక్కడైతే కార్య రూపంలో వ్యక్తం చేయగలుగుతుందో అలాంటి యుద్ధరంగంలోకి ఎప్పుడు వెళ్తానా అని ఆమె ఆరాటపడింది.

3

సాయంత్రంకల్లా మాస్కో చేరుకుంది రైలు. ఆమె కొంసొమోల్ చౌకులోకి అడుగు పెట్టగానే తాను పుట్టిన నగరంయొక్క గడ్డకట్టుక పోయిన నేలను ముద్దు పెట్టుకోవాలనిపించింది ఆనిచ్కకు. తాను మాస్కోను అంత గాఢంగా ప్రేమిస్తుందని ఆమె ఎన్నడూ అనుకోలేదు. పైగా ఆమె అందుకుభిన్నంగా ఆమెకు వెనుకటి రోజుల్లో మాస్కో అంటే పూర్తిగా నిర్లక్ష్యించినట్టూ, ఆ రాజధానీ నగరాన్ని పాటలూ పద్యాలతో ఆడంబర వాచాలత్వంతో తెగ పొగిడేసి ఆకాశానికి ఎత్తేస్తున్నట్టూ కొంత చికాకు కూడా అనిపించేది. తన చుట్టూ మైళ్లకొద్దీ పెరిగిపోయిన పట్టణాన్ని వర్ణించడానికి మాటలు చాలవనీ, ఒకవేళ చాలినా పేలవంగా ఉంటాయని ఆమె యిప్పుడు అర్థం చేసుకుంది. పరిచయం ఉన్న ప్రతి కట్టడమూ, వీధుల్లో గోడలకి అంటించిన వార్తాపత్రికలూ, నాటకశాలల ప్రకటనలూ, సందడీ, చుట్టుపట్ల గ్రామంనుండి వచ్చిన పాలమ్మి రాగం తీస్తూన్న భాషా, ఒకటేమిటి ప్రతీదీ ఆమె హృదయాన్ని చొచ్చుకు పోతున్నట్టు అనిపించింది. రాజధానీనగరాన్ని ప్రతి బస్తీతోనూ, గ్రామంతోనూ అన్ని యుద్ధరంగాలలోని ప్రతి సైన్యంతోనూ కలిపిన సూత్రాలను ఆమె ముఖ్యంగా గమనించింది. అటు వైపు మళ్లిన లక్షలాది ప్రజల కన్నులు ఆశా విశ్వాసాలతో నిండినట్టు ఆమె కని పెట్టింది.

ఆమె తన యింట్లో అడుగు పెట్టగానే గుండె ఆగిపోయినట్లనుపించింది; ఆ యిల్లు నిర్మానుష్యంగా, చల్లగా, పాడుబెట్టబడినట్టుగా ఉంది. ఇదివరలో ఎలా ఉన్నాయో అదేవిధంగా ఎక్కడి వస్తువులు అక్కడే ఉన్నాయి. కాని వాటిలో జీవకళ మాత్రం అంత రించిపోయింది. నిరుత్సాహంతో, నిర్జీవంగా అనేక అంతస్తులుగల ఆ మొత్తం గృహం,

ప్రయాణీకులు వదిలివేసి, ఒంటరిగా వీధి మధ్య నిలబడునట్టి చెడిపోయిన ట్రాంబండిని జ్ఞాపకం చేసింది. ఉరుగుపొరుగు వాళ్లల్లో సగం మంది ఇల్లు ఖాళీ చేయడమో లేక యుద్ధరంగంలోకి వెళ్లడమో జరిగింది. అలా వెళ్లగా మిగిలిన వాళ్లు ఆనిచ్కాకు సంతోషంతో స్వాగతం చెప్పారు. ఆమెను తమతమ యిండ్లకు ఆహ్వానించడానికి ఆతురత పడ్డారు. వాళ్లు ఆమెను ఆమె చిన్నతనంనుంచీ ఎరుగుదురు. ఆమె తండ్రి వారికి బాగా తెలుసు. వాళ్లు ఆమె తల్లిని జ్ఞాపకం చేసుకున్నారు; ప్రథమ పర్యాయంగా ఆమెను వాహ్యాళికి తోపుడుబండిలో వెలుపలికి తీసుకురావడం వాళ్లల్లో చాలా మంది ఎరుగుదురు. ఆమెవద్ద రొట్టె చీటీలు లేవని తెలిసి వాళ్లు భయపడి పోయారు. మితంగా వ్యయం చేసుకుంటే సరిపోయేట్టు ఒక్క రోజైనా తప్పిపోకుండా, ఆమె అక్కడ ఉన్నన్నాళ్లూ, తలా కాస్త రేషన్‌ను యిచ్చారు.

ఆతర్వాత సైన్యంలో చేరాలంటే ఎంతో కష్టమైన ఘట్టం ప్రారంభమైంది. పట్టణ మిలిటరీ కమీసరియట్‌కూ యువకమ్యూనిస్టు లీగ్‌కూ దరఖాస్తులు పెట్టుకోవాలి. ఫారాలు భర్తీ చేయడం, ఇంటర్వ్యూలకు వెళ్లడం, ఆకలి కడుపుమంటతో బాధ — వీటితో ఆమె తల తిరిగి పోయింది. అయినా అచలిత మనస్సుతో, కాళ్లల్లో శక్తి ఉడుగక మాస్కో పట్టణంలో తిరిగింది. కానీ ఆ పట్టణం వీధులు, చౌకులు, ఉక్కు శిరస్త్రాణాలతో అప్పుడప్పుడు త్వరత్వరగా శ్రేణులుగా వెళ్లే సైనికులు, చెట్లతో నిండిన వీధుల మధ్య లంగరు వేయబడి, పెద్దగాలి వీచినప్పుడల్లా నెమ్మదిగా అటూ యిటూ ఊగే వైమానిక రక్షణ బెలూన్లు — యీ దృశ్యాలను ఆమె కన్నులు నింపుకోలేక పోయాయి.

తన బంధువుల్ని చూడ్డానికిగాను ఆనిచ్కా వెళ్లలేదు. కడుపునిండా భోజనం దొరుకుతుందనే ఆశతో అమె తన మేనత్త నాద్య వద్దకు తప్పక వెళ్లాలనుకుంది. తాను మాస్కోకు ఎందుకు వచ్చిందో తన మేనత్తకు చెప్పడం యిష్టం లేక, అంతేగాక అమెకు అబద్ధం చెప్పడం మనస్కరించక ఆమె తన మేనత్తవద్దకు వెళ్లలేదు. కాని త్వరలోనే, ఎవరో ఆనిచ్కాను వీధిలోచూసినవాళ్లు ఆ వార్తను అనుక్షణంలో ఆ మేనత్తకు అందజేయడంవల్ల ఆమే స్వయంగా అనిచ్కావద్దకు వచ్చింది.

పొడుగ్గా, నిండు విగ్రహంతో అచ్చు ఆనిచ్కా తండ్రిమాదిరే ఉన్న నదేజ్దా మొదేస్తొవ్న, లిఫ్టు పనిచేయని కారణాన, కాలినడకనే మూడో అంతస్తుకు ఎక్కిందేమో శ్వాస పీల్చుకోను చాలా కష్టం అయింది. చివరికి తేరుకొని తన మేనకోడలిపై ప్రశ్నలూ,

ఆశ్చర్యార్థకాల వర్షాన్నీ ఉప్పెనలాగా కురిపించింది. మాస్కో ఎందుకు వచ్చిందో ఆనిచ్కా ఆమెకు చెప్పినప్పుడు దిగ్భ్రమతో తేరిపార చూసింది. కుర్చీలో కూలబడిపోయింది. అప్పుడామె మాస్కోలోని పశువుల వ్యాపారం చేసేవారి కుటుంబంనుండి వచ్చిన తన అమ్మమ్మ, లేదా అమ్మమ్మ అమ్మమ్మ మాదిరిగా అగుపించింది. నాగరికతను, సభ్యతను మరచిపోయి కేకలేసింది: ''నీ బుర్రలో ఏం మట్టి వుంది? నీకేమైనా మతిపోయిందా? అలెక్సాండ్రకి ఒక్కగాను ఒక్క కుమార్తెవు. చివరికి అతని చావుకు నువ్వే కారణమ య్యేట్టున్నావు — నువ్వే!''

ఆనిచ్కా తన మేనత్తను ఎంత ప్రేమించినప్పటికీ యీ క్షణంలో మాత్రం ఆమెను నిజంగా ద్వేషించింది. కాని ఆమె కొడుకు వలేరిక్, వాలంటీర్ హోంగార్డులో చేరి యిప్పుడు కనిపించడం లేదన్న సంగతి విని ఆనిచ్కా తన మేనత్తను కౌగలించుకొంది. ఇద్దరూ చాలా సేపటివరకు దుఃఖించారు. గత కొద్ది వారాలుగా ఆమె అనుభవిస్తున్న అతిశ్రమాభారాలు ఆ కన్నీటిచుక్కల్లో ఉపశమించాయాయి. తన మేనత్తను తొందర పడి ద్వేషించినందుకు క్షమించమని ప్రార్థిస్తున్నట్టు ఆ కన్నీటిచుక్కలు గోచరించాయి.

ఆనిచ్కా ప్రయత్నాన్ని మాన్పించేందుకు దాదాపుగా ఒప్పించినట్టే భావిస్తూ నదేజ్ద మొదేస్తొవ్న త్వరగానే చల్లబడిపోయింది. తన మేనకోడలు వచ్చి తనతో నివసిం చాలని గట్టిగా కోరింది. ఆమె భర్త ఇల్యా ఇవానొవిచ్ మాస్కో ప్రాంతం వైమానిక రక్షణ హెడ్క్వార్టర్స్‌లో పనిచేస్తున్నాడు. వాళ్లకు మంచి రేషన్లు దొరుకుతాయి. ఆమె యిప్పుడు వెళ్లి తమ రేషన్లను తెచ్చుకోవలసి వుంది. తనతోపాటు ఆనిచ్కా కూడా రావా లని ఆమె పట్టుపట్టింది. ఆ పిల్ల అలాగే చేసింది. కొన్ని నెలల తర్వాత, సాసేజ్, పొగ బారిన చేప, వెన్న మొదలైన వాటిని చూడడం అదే ప్రథమ పర్యాయం. వాటిని చూడ గానే ఆమెకు నోరూరింది. మంచి భోజనంకోసం ఎలా తహతహ లాడిపోతున్నదీ తన మేనత్తకు చెప్పడానికి ఆనిచ్కా సిగ్గు పడిపోయింది. ఆమె భర్త, వైమానిక రక్షణ హెడ్ క్వార్టర్స్‌లో సివిల్ ఉద్యోగం యిప్పించగలడనే అద్భుతమైన భావన ఆమె మేనత్తకు తట్టింది. ఆమెకు మంచి రేషన్లు దొరకుతాయి. యుద్ధరంగంలోని ఉద్యోగానికీ దీనికీ ఏమీ తేడా ఉండదు. ఎందువల్లనంటే ఆ రాబందులనుండి మాస్కోను సంరక్షించు కోవడం కూడా అంత తీవ్రమైన, ప్రధానమైన విషయమే!

ఉద్రేకం కొద్దీ మాట్లాడిన తన మేనత్త సంభాషణను పరధ్యానంగా వింటూ ఆనిచ్కా నవ్వింది. ''మేనత్త నాద్యవద్ద ఉంటూ, పెద్ద పెద్ద చేపముక్క కాజాలు తింటూ

మాస్కోను సంరక్షించడం మంచిది కాదూ?'' అని ఆమె తనకు తాను హృదయం లోలోతులలో ప్రశ్నించుకుంది.

మేనత్త నాద్య యిల్లు చాలా పెద్దది. అయినా, ఆమె భర్త పట్టణం వెలుపల పనిచేస్తూ రాత్రిపూట యింటికి అరుదుగా వస్తాడు గనక ఆనిచ్కా తనతోపాటు పడుకోవాలని ఆమె పట్టుబట్టింది.

మేనత్త నాద్య స్నానానికి ఏర్పాట్లు చేసింది. ఆ నలభై అయిదేండ్ల అందకత్తె, వయసులో ఉన్న ఆమె మేనకోడలూ యిద్దరూ కలసి ప్రపంచాన్ని మరచిపోయి సుఖంగా స్నానం చేశారు. మేనత్త నాద్య ఆ పిల్లను ఆపాదమస్తకం సూక్ష్మంగా పరికించింది. ఆమె భుజాల్ని, వక్షోజాన్నీ తన లావుపాటి చేత్తో తట్టుతూ అంది: ''ఆనిచ్కా! భలే అందమైన పిల్లలా తయారయ్యావు. ఒక రోజున నీకు మంచి మగడు దొరుకుతాడులే.''

అప్పుడామె కొడుకు జ్ఞాపకం వచ్చి దుఃఖించింది. కాని మామూలుగా ప్రతి విషయాన్నీ తేలికగా తీసుకొనే స్వభావం గనక ఆమె తక్షణమే దుఃఖంనుండి ఆశకు మళ్లి ఆతడు బహుశ గెరిల్లాలతో ఉండి ఉంటాడని చెప్పింది. స్కేయింగులోనూ, క్రీడల్లోనూ మంచి ప్రవేశం ఉన్నటువంటి అలాంటి చక్కని తెలివితేటలుగల కుర్రాడు ఆవిధంగా ఎందుకూ కాకుండా ఊరికే చనిపోడు. ఈ భావనలు ఆమెకు సంపూర్ణమైన మనశ్శాంతిని మళ్లీ సమకూర్చాయి. నిర్దిష్టమైన సాక్ష్యం ఉన్నట్టుగా ఆమె ఎంతో విశ్వసిస్తూ తన కొడుకు బ్రతికే ఉన్నాడని చెప్పడం కూడా ప్రారంభించింది.

ఆనిచ్కా సగం చీకట్లో, పట్టు పట్టీలతో అలంకరింపబడి, వదులైన రోజా రంగు గలిగినట్టి రాత్రిపూట తొడుక్కునే తన మేనత్త దుస్తుల్ని తొడుక్కుంది. తన మేనకోడలు అందమైన చేతుల వంకా, కాళ్ల వంకా చూసింది మేనత్త నాద్య. దాంతో ఆమె మళ్లీ ఉద్రేకతరంగాల్లో పడిపోయింది. కండ్లల్లో నీళ్లు నిండాయి. ''చందనపు బొమ్మలా ఉన్నావు. ఇంత ముచ్చటగా ఉంటావని నేను ఎన్నడూ అనుకోలేదు.''

వాళ్లిద్దరూ పడుకున్నప్పుడు విమానదాడిని తెలిపే సైరన్ రోదనధ్వనితో పట్టణమంతా నిండిపోయింది. వైర్లెస్ కూడా రానున్న ఆపదను తెలియపరుస్తూ చెవులు చిల్లులు పడేలా ధ్వనిచేసింది. ఆనిచ్కా దీపం ఆర్పేసి బ్లాకౌట్ పరదాను తెరిచింది. అప్పుడప్పుడు చీకటిని ఛేదించి దూరంలో ఛాయగా అవుపిస్తూ రక్షణకై ఉన్న బెలూన్‌ను కనపరుస్తూ సెర్చిలైటు కిరణాలు ఆకాశంలో తళుక్కుమన్నాయి.

"నేనా రక్షణ స్థలంలోకి వెళ్లను. దాంతో విసుగెత్తి పోయాను," అన్నది మేనత్త నాద్య ఆనిచ్కాను గట్టిగా కౌగలించుకొని.

స్వయంగా నిద్రపోయేంతవరకూ మేనత్త నాద్య మాట్లాడుతూనే ఉంది. మెత్తని పడక ఉన్నప్పటికీ, ఆకలి తీరిందనే ఆనందం కలిగినప్పటికీ, ఆనిచ్కా మాత్రం చాలా సేపటివరకూ తన మేనత్త నాద్యయొక్క దుబ్బుగా ముడుతలు పడిన చుబుకాన్నీ, తెల్లని కంఠాన్నీ చూస్తూ మెలకువతోనే ఉంది. ఆమె కొడుకు అగపడని సమయంలో, యాంటీ-ఎయిర్‌క్రాఫ్ట్ ఫిరంగులు ప్రేలుతున్నప్పుడు, ఆమె అలా నిద్రపోవడం చూసి ఆనిచ్కాలో అకస్మాత్తుగా ఆమె అంటే అయిష్టత మళ్లీ ఏర్పడింది. తన అభిప్రాయం తప్పని భావించింది. ఎందువల్లనంటే, ఏదేం జరిగినా యెవ్వరూ నిద్రను మానుకోలేరు. అయినప్పటికి ఆమె తనలో కలిగన భావనను దూరం చేసుకోలేకపోయింది. స్నానం చేసిన మేనత్త శరీరంనుండి వచ్చే మనోహరమైన అత్తరు, సబ్బు, పరిమళద్రవ్యం మొదలైన వాటి సువాసనను పీల్చకుండా ఉండేందుకై ఆమె కొంత దూరంగా జరిగింది కూడాను.

"భగవంతుడు నిన్ను రక్షించుగాక," అని ఆమె మేనత్త నిద్రలో కలవరించింది. ఆమె కలలో తన కొడుకుతో మాట్లాడుతున్నట్టు ఆనిచ్కా గుర్తించింది. కాని ఆ పాత పద్ధతి భావన కూడా ఆనిచ్కాను నిరుత్సాహ పరచింది. ఇన్‌స్టిట్యూట్‌లో అలవాటైన ప్రకారంగా ఆమె ఆ మాటల్ని జర్మన్‌లోకి అనువదించింది. మాస్కో చుట్టుపట్ల ఇప్పుడు బాంబులు వేస్తున్న జర్మన్ల తల్లులు కూడా తమ బిడ్డలకొరకై ప్రార్థించేప్పుడు అవే మాటల్ని ఉపయోగించేవారని ఆమెకు తక్షణమే స్ఫురణకు వచ్చింది.

## 4

మూడు రోజుల తర్వాత, ఉదయంపూట ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ యుద్ధ రంగంనుండి విమానంలో వచ్చాడు.

అతడు పొడుగ్గా, లావుగా, కొంత ఠీవి తగ్గిపోయి, గోధుమ వర్ణం మీసాలతో, అప్పటికే తెల్లబడిపోయిన జుట్టుతో, అలవాటులేని పెట్రోలు, చర్మపు సామాన్ల, విచిత్రమైన వాసనను వెంట బెట్టుకొని లోపలికి వచ్చాడు. అతడు ఎండకు ఎండీ వానకు తడిచీ రాటుతేలిపోయాడు. అతని నీలం కన్నులు సరిగ్గా మేనత్త నాద్య కళ్ల

మాదిరిగానే ఉన్నాయి. కాని అవి యింకా యిదివరకటికంటే నీలంగానూ కరుణాపూరితంగానూ అగుపించాయి.

"రణరంగంలో పోరే యుద్ధ వీరుడు ఆతిథ్యాన్ని కోరుతున్నాడు," అని ఆతడు బిగ్గరగా అరచాడు సగర్వంగా, చమత్కారంగా.

యథాప్రకారంగా ఆతని ఉనికి, ప్రశాంతతను, కరుణను, ఒకరినొకరు అర్థం చేసుకోవడాన్ని ప్రేరేపించింది. అతడు చిరునవ్వుల్నీ లేదా ప్రేమతో కూడిన పదాల్నీ వ్యర్థం చేశాడని కాదు — అతడు బహుస్వల్పంగా మాట్లాడుతాడు. బహు అరుదుగా నవ్వుతాడు. వీటన్నిటికంటే కూడా అదంతా బహుశ అతని కన్నులలోని భావప్రకాశత కావచ్చు, ఆ కళ్లు విశ్వాసంతోనూ, ప్రేమతోనూ నిండి ఉంటాయి. అవి ఎవరినైనా ఆతని యెడల ప్రేమనీ విశ్వాసాన్ని చూరగొనేట్టు చేస్తాయి. ఎవరూ కూడా అలాంటి అసాధారణమైన కరుణను తమ స్వార్థంకోసం వినియోగించుకోవడానికి సాహసించలేనంతటి కరుణామయుడాతడు.

ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ చాలా ప్రసిద్ధికెక్కిన శస్త్రచికిత్స వైద్యుడు. అతడు తన వృత్తిని ప్రపంచంలో ఉన్నవాటన్నిటికంటే పవిత్రంగా చూసుకుంటాడు. అతడు వయసులో ఉన్నప్పుడు ఎంత శ్రద్ధాసక్తులతో తన పనిని నిర్వహించేవాడో అదే విధంగా యిప్పుడు కూడా తనకు యాభైయ్యేడు సంవత్సరాల వయసు వచ్చినప్పటికీ నిర్వహిస్తున్నాడు; వైద్యరంగంలో అభివృద్ధి అంత మందకొడిగా కొనసాగడం అతడు సహించ లేక పోయాడు. ఇతర విజ్ఞాన శాస్త్రాలూ తత్సంబంధమైనవీ కానివీ, వీట్లలోని సాధనల ఫలితంగా రానున్న ఇరవై సంవత్సరాలలో ఆ రంగం అపూర్వమైన స్థాయిని అందుకుంటుందనీ పై సాధనలలో కొన్ని వైద్యరంగంపై ఎన్నడూ అనుకోనటువంటి నిశ్చితమైన ప్రభావాన్ని తప్పక కలిగి ఉంటాయనీ ఆతడు ధీమాతో జోస్యం చెప్తాడు.

మేనత్త నాద్య యింటికి రావడంతోటే ప్రొఫెసరు మొట్టమొదట స్నానం చేశాడు. ఏదో ఆపరేషన్ చేయబోతున్న మాదిరిగా అతడు తన చేతుల్ని జాగ్రత్తగా తుడుచుకుంటూన్నప్పుడు ఆనిచ్కవైపు నేర్పుగా చూశాడు. పదేపదే అడిగాడు: "ఏమమ్మా, ఎలా ఉంటున్నావ్?"

ఆనిచ్క మాస్కోలో ఉన్న సంగతీ, ఆమె ఏంచేయదలచుకున్నదీ మేనత్త నాద్య భర్త ఆతనికి కబురు పంపి ఉండొచ్చు యుద్ధరంగంలోకి. ఏమైనప్పటికి ప్రొఫెసరు మొదట ఆ విషయాన్ని తన కుమార్తెకు చెప్పలేదు. అతడు ఆమె ప్రక్కనే కూర్చుని,

ప్రశ్నలు అడిగేందుకు బదులుగా, రణరంగంలోని అతని పని గురించీ, క్లిష్టమైన ఆప రేషన్లు, సీరములు, నెత్తురు ఎక్కించడాలు మొదలైనవాటి గురించీ మాట్లాడాడు. వైద్య కుటుంబంలో పెరిగిన కారణంగా ఆనిచ్కకు వైద్య పదజాలంతో బాగా పరిచయం ఉంది. లాటిన్ పదాలనుపయోగిస్తూ, యుద్ధానికి పూర్వం అతడు ప్రాక్టీసు చేస్తున్న ప్పుడు వచ్చిన కేసులను జ్ఞాపకం చేసుకుంటూ, తనతోపాటు పనిచేసే వైద్యునితో మాట్లాడగలిగినట్లే తన కుమార్తెతో మాట్లాడ్డం ప్రొఫెసర్‌కి ఆనందాన్ని కలిగిం చింది.

యుద్ధరంగంలో జీవితం బహు మాంద్యంగానూ, నిరుత్సాహంతోనూ, ఆఖ రికి విసుగు పుట్టించేట్టుగా కూడా ఉంటుందని, ఆతడు తన అభిప్రాయాల్ని ఆమెతో కొంచం అతిగానే చెప్పాడు.

ఆతనికి తన కుమార్తె అంటే ఎంతో హృదయపూర్వకమైన ప్రేమ ఉన్నప్ప టికీ, మేధావులైన చాలామంది తండ్రులు మాదిరిగానే ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ తన కుమార్తె యెడల విపరీతమైన విమర్శనా దృష్టితో ప్రవర్తించాడు. ఆమె చపలచిత్తం గలదనీ, బద్ధకస్తురాలనీ అభిరుచుల్లోనూ అలవాట్లలోనూ సుకుమారమైనదనీ, ఆతడు తలపోశాడు. తెలివితేటలు, పుట్టుకతోనే వచ్చిన కరుణ, బాగా అభివృద్ధి చెం దిన సమయోచిత చమత్కారంచే పదునుచేయబడిన ఉత్సాహం, చెక్కుచెదరని శీలం మొదలైన ఆమె సద్గుణాలను ఆయన మెచ్చుకున్నాడు. కాని ఆమె చెక్కుచెదరని శీలాన్ని యువ మహిళకుండే అతివేలం కిందనే ఆయన లెక్కకట్టాడు. ఆతని పెదవులపై ఆడిన ''మహిళ'' అనే పదం తీవ్రమైన నిందను తెలుపుతుంది: దాని అర్థం సోమరితనం, నాజూకుతనం, అసహ్యం అని. దీనినే ఆతడు ''పెట్టుబడిదారీ విధానం పుట్టుమచ్చ,'' అని ఎత్తిపొడుస్తూ అంటాడు.

పిల్లల్ని పెంచే విషయంలో కఠినంగా ఉండాలనీ, వారిని కష్టాలకు శారీరక శ్రమకు అలవాటు చేయాలనీ ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ విశ్వసిస్తాడు. అదే అతని సిద్ధాంతం కూడాను. కాని ఆచరణలో తన కుమార్తె యెడల కొంత బలహీనతను కనపర చాడు. అది ఆయనను బాధ పెట్టి చిరాకు పరచింది. ఆనిచ్క పదమూడవ ఏటనే ఆమె తల్లి మరణించడంవల్లనూ, తన సమయమంతా సంపూర్ణంగా తన పనిలోనే నిమగ్నమైపోవడంవల్లనూ ఆతడు తనను తాను కొంత అయిష్టతతోనే క్షమించుకున్నాడు.

ఇంటివద్దగానీ, పాఠశాలలోగానీ, సామాన్యంగా ఆమె చుట్టూ ఉన్న వాతావర

ణంలోగానీ ఆనిచ్చ పొందిన విద్యవిషయంలో ఆయనకు చాలా చెడు అభిప్రాయం ఉండనడం స్పష్టమైన విషయం. విద్య అనేది ముఖ్యంగా అన్ని రకాల నీతిసూత్రాలనూ, బోధనలనూ, సలహాలనూ కలిగి ఉండాలనే పూర్వకాలపు అభిప్రాయాన్ని ఆతడు పట్టుకొని వ్రేలాడుతున్నట్లనిపిస్తుంది. ఆ పిల్లచుట్టూ ఉన్న వాతావరణం, ఆమెకు పరిచయం ఉన్న వాళ్లలో చాలామంది, ముఖ్యంగా ఆమె తండ్రి కనపరచినట్టి కర్తవ్యం యెడల భక్తీ, నిస్వార్థమైన శ్రమా వీటి రోజువారీ ఉదాహరణలు ఆమె మనసులో నాటుకొనిపోయాయనే సంగతి ఆతడు మరచిపోయాడు. ఆమె వయసుకు తగినట్లుగా జీవితాన్ని విమర్శనా దృష్టితో చూస్తుందనే విషయాన్నీ, తన కుటుంబమూ, దగ్గరి పరిచయస్థులూ ఆమెలో పెంపొందించిన ఆదర్శానికి భిన్నంగా ఉండే దేన్నయినా సరే ఆమె సగం ఎరుకతో నిరాకరించేదనే వాస్తవాన్నీ ఆతడు ఉపేక్షించాడు. ఒక్క మాటలో చెప్పాలంటే, అతడెంత మేధావి అయినప్పటికీ, ఎంత సూక్ష్మ బుద్ధిగల వాడైనప్పటికీ, ఆ ప్రొఫెసరుకు తన కుమార్తె విషయమూ, ఆమె హృదయంలో ఏంజరుగుతున్నదీ ఏమీ తెలియదనే చెప్పాలి.

అందుచేతనే ఆయన, ఇన్‌స్టిట్యూట్‌నుండి పారిపోయి యుద్ధంలో చేరాలనే ఆమె భావనకు ఆశ్చర్యపోయాడు. దిగులు చెందాడు. అది ఎంతో హఠాత్ విషయంగానూ, ఆమె స్వభావానికి వ్యతిరేకమైన విషయంగానూ భావించాడు.

ఆయన యుద్ధరంగంలోని తన జీవితాన్ని గురించి ఆమెకు చెప్పినప్పుడు, ఆమె అందుకు బదులుగా తన జీవితాన్ని గురించి ఆయనకు చెప్తుందికదా అని ఎదురు చూస్తూ, కుమార్తె వైపే రెప్ప వాల్చకుండా చూశాడు. కాని ఆమె చెప్పలేదు; ఆమె తన ఉద్రేకాన్ని బలవంతంగా ఆపుకుంది. తన వాలిపోయిన కనురెప్పలక్రిందినుంచి తండ్రిని చూసింది. ఎంతో కాలం విడిగా ఉన్న పిదప, అలాంటి తీవ్రమైన సంభాషణను ప్రారంభించడానికి ఆయనకుగానీ ఆమెకుగానీ ధైర్యం చాల్లేదు. ఎందువల్లనంటే అది అనంగీకారంతోనూ, పరస్పరం అసంతోషంతోనూ అంతం కావచ్చునని ఉభయులూ భావించారు.

చిట్టచివరికి తండ్రి ఆ విషయాన్ని ప్రస్తావించేందుకు నిశ్చయం చేసుకొని, తనను మొదట సంప్రదించకుండా అలాంటి అనాలోచితమైన పనిని ఆమె ఎందుకు చేసిందని ప్రశ్నించాడు. ఆమె తన భావపరంపరలనూ తన ఉద్దేశాలనూ విపులీకరించాలని ప్రయత్నం చేసింది. ఆమె మాటలు వింటున్నప్పుడు ఆయన అనుకున్నాడు, ఆమె

గనక తన కుమార్తె కానట్లైతే, ఆ పరిస్థితుల్లో తాను ఆమె న్యాయసమ్మతమైన ఉద్దేశాలనీ, శక్తినీ గమనించే వాడినేనని. కానీ ఆమె అతని కుమార్తె. ఆమె ఎర్ర బారిన చిన్న మొహాన్ని ఆతడు చూస్తున్నప్పుడు తన బిడ్డ యుద్ధంలో చనిపోతుందేమో నన్న భావన ఆతని హృదయాన్ని భయంతో గడ్డకట్టుకుపోయేట్టు చేసింది. అవును. అది బహు పురాతనమైన సహజ ప్రకృతి. బాహ్యంగా ఆతడెంత ప్రయత్నం చేసినప్పటికీ అతడు ఆ తలపుని నెట్టివేయ లేకపోయాడు. ఆతర్వాత ఆయన స్వల్ప విషయాలతో సత్యాన్ని మరుగు పరచేందుకు ప్రయత్నించాడు. ఆమె తన ఇన్‌స్టిట్యూట్‌ని ఎంత అసహ్యించుకొన్నప్పటికీ, దానిని విడిచి పారిపోయిరావడం క్రమశిక్షణకు విరుద్ధమనీ, అది ఆ యుద్ధకాలంలో సహింపరానిదనీ ఆయన అన్నాడు. చివరికి, ఏదైనా వైద్య ఇన్‌స్టిట్యూట్‌లో ఆమె ప్రవేశించాలనీ, లేదా, ఒకవేళగనక ఆమెకు యుద్ధరంగంలోకి వెళ్లాలనే కుతూహలత ఎక్కువగా ఉంటే, ఆమె తనతోపాటు రావచ్చుననీ ఆయన సూచించాడు.

తన వాదన ఎంత బలహీనంగా ఉందో ఆయన గుర్తించి, తన కుమార్తెను ఆమె ప్రయత్నాలనుండి మళ్లించేందుకై అతడు ధారాళమైన పదజాలం కొరకూ నమ్మకం కలిగించే మాటలకోసమూ వెతికాడు. కాని అతని ప్రయత్నాలన్నీ నిష్ఫలమైపోయాయి. ఆమె తన తండ్రితో వెళ్లేందుకు నిరాకరించింది. అందుకు కారణం, "తన జీవితం పొడుగునా ప్రొఫెసర్ కుమార్తెగానే ఉండిపోవడం" ఆమెకు యిష్టం లేదనిన్నీ, ఆమె యుద్ధం ముగిసిం తర్వాత ఇన్‌స్టిట్యూట్‌లో ప్రవేశిస్తాననీ అంది.

అప్పుడు ఆయనకు అనుమానం వేసింది, ఆమె ఏదో కేవలం వ్యక్తిగతమైన కారణంవల్ల యుద్ధరంగానికి వెళ్లేందుకు వాంఛిస్తోందని. ఆమె బహుశ యుద్ధ రంగంనుండి వచ్చిన ఎవరో ఆఫీసర్‌ను కలిసి ఉంటుంది. ఆతడు ఆ అభిప్రాయాన్ని ఆమె మెదడుకెక్కించి ఉంటాడు. అలాంటి ఉదంతాలని ప్రొఫెసర్ యిదివరలో విన్నాడు.

ఆయన యీ విషయాన్ని స్పష్టంగా చెప్పేప్పటికి ఆనిచ్కాకు ఎక్కడలేని కోపం వచ్చింది, అది ఆమెకు ఎంతో అవమానకరంగా తోచి, కాని, ఆయన అనుమానాలు ఎంత నిరాధారమైనవో ఆమెకు తెలుసు. సగర్వంగా తల పంకించింది. మొత్తం సంభాషణంతా నిష్ప్రయోజనమైనదనీ, హేయమైనదనీ, సహృదయులు కూడా అలాంటి పాపిష్ఠి భావాలకి తావిచ్చారంటే ఆమెకు ఎంతో విచారంగా ఉందనీ ఆమె చెప్పింది.

మర్నాడు ఉదయం తన కుమార్తెతో ఆ విషయాన్నిక ప్రస్తావించక రణరంగంలోకి వెళ్లిపోయాడు జనరల్ బెలొజ్యోరొవ్.

ఆనిచ్కా ఇన్‌స్టిట్యూట్‌నుండి పారిపోవడం అందరినీ అప్రమత్తతతో ఉండేట్టు చేయడంవల్ల ఆమె యువకమ్యూనిస్టు లీగు కమిటీకీ, మిలిటరీ కమీసరియట్‌కు సైన్యంలో చేర్చుకోమని పెట్టిన దరఖాస్తులు, యింకా ఫలించలేదు. అప్పుడు ఆమె తమ కుటుంబానికి పాత స్నేహితుడైన లెఫ్టినెంట్-జనరల్ సిలాయెవ్‌కు దరఖాస్తు పెట్టుకొనేందుకై తీర్మానించుకుంది. ఆయన జనరల్ స్టాఫ్‌లో పనిచేస్తున్నాడు.

అదృష్టవశాత్తూ ఆతడు ఆఫీసులోనే నివసిస్తున్నాడు; అతని కుటుంబం పట్టణం ఖాళీ చేసి వెళ్లవలసి వచ్చింది. హృదయాన్ని కలచివేసే స్ఫురణలతో నిండిన తన విచార పూరితమైన యింటికి వెళ్లాలంటే అతనికి మనస్కరించింది కాదు. పైగా, అతనికి తలకుమించి పని ఉండడంవల్ల ప్రతి రోజూ ఆఫీసుకు వెళ్లడం రావడం అనే పాత అలవాటుకు కూడా వేళలేకపోయింది.

జనరల్ సిలాయెవ్ పొట్టిగా వుంటాడు, లావుగా, బలమైన మెడ, పలచగా కత్తిరించుకున్న జుట్టు. అతడు చాలా కాలం క్రితం పొలంలో కూలివానిగా పనిచేశాడు. అతడా పనికి స్వస్తిచెప్పి ఎర్ర సైన్యంలో చేరాడు. అప్పటినుంచీ అందులోనే ఉండిపోయాడు. అతడు మరో పనిని చేస్తున్నట్టు గానీ, సైనిక యూనిఫారం తప్ప మరో విధమైన బట్టలు తొడిగినట్టుగానీ అతడు ఎన్నడూ ఊహించుకోలేకపోయాడు. సైనికుడు అనే పదానికి అతనే ఉత్తమమైన ఉదాహరణ. మారు ప్రశ్న వేయకుండా ఇతరులు తన ఆజ్ఞలను పరిపాలించేట్టు చేసుకొనే శక్తిని ఆతడు స్వయంగా పై అధికారులకు మారుమాటాడకుండా లొంగిపోవడం అనే దానితో మిళితం చేశాడు. సైనికుని మనోభావాలకు సహజమైన గంభీర విజ్ఞానంతోనూ, సైనిక చరిత్రలోని పాండిత్యంతోనూ ఆతడు వెలుపలికి యించుమించు కరకుతనంలాంటి మొద్దుతనంతో అవుపించేవాడు. స్వభావసిద్ధంగానూ, అచంచలమైన ప్రజాస్వామిక ఉత్సాహంతోనూ, జనరల్‌యొక్క హోదాను భేషరతుగా అర్థం చేసుకుంటూ ఆ హోదాను అపారంగా గౌరవిస్తూ ఇతర వ్యక్తులతో వ్యవహరిస్తాడు. అంచేతనే అతనిక్రింద పనిచేసే వారందరి హృదయాల్లోనూ అతనికి స్థానం ఏర్పడింది.

అతడు ఆనిచ్కా ప్రవర్తనను సందేహించే ఆవశ్యకతను కలిగించుకొనే ప్రయత్నం కూడా చేయనందుకు ఆమె ఆనందానికి మేర లేకపోయింది. అతడు ప్రతి విషయాన్నీ వెంటనే అర్థం చేసుకొని మెచ్చుకున్నాడు. ఆనిచ్కా భయపడిన దానికి భిన్నంగా అతడు

ఆమె ఎదుర్కోనున్న కష్టాల విషయాన్నిగానీ ఆమె "సుకుమారంగా పెరిగిన" విషయాన్ని గానీ పల్లెత్తు మాట్లాడలేదు.

అతని సమాధానమంతా యిదే: "మంచిది. అలాగా? అవును, నిజంగానే, నీకు ఎక్కడికి వెళ్ళాలని ఉంది?"

తనకు జర్మన్ భాష తెలుసుననీ, తగిన తర్ఫీదుపొందిన తర్వాత తాను శత్రువుల శ్రేణులు వెనుకకు వెళ్లి పని చేయాలని భావిస్తున్నట్లూ ఆమె సమాధానం చెప్పింది. "అవునవును," అని అన్నదే అంటూ ఆతడు మేజాబల్లమీద వ్రేళ్లతో దరువు వాయించాడు.

"అచ్చం జర్మనీ మనిషిలాగానే నేను జర్మన్ మాట్లాడతాను."

"అలాగా?"

"శత్రువుల శ్రేణుల వెనుక నాకు ఏ పని వొప్పజెప్పినా నిర్వహించ గలుగుతాను."

"అవునవును." అతడు ఆ దరువును ఆపకుండా వాయిస్తూనే ఉన్నాడు వ్రేళ్లతో.

చివరికి ఆపాడు. తీవ్రంగా ఆలోచిస్తున్నట్టు తల పంకిస్తూ దీర్ఘకాలం మౌనంగా ఉన్నాడు. ఆమె కోరికను అతిత్వరితగతిని ఫలవంతం చేయడానికిగాను ఉత్తమమైన మార్గాన్ని వెతకడానికి ప్రయత్నం చేస్తున్నట్టు అగపడుతుంది. కాని వాస్తవానికి అలా చేయకుండా ఎలా తప్పించుకోవడమా అని ఆతడు ఆశ్చర్యపడుతున్నాడు. ఆమె ఆశయాన్ని ఆతడు సంపూర్ణంగా గ్రహించాడు. అంతే కాకుండా ఆమె చిత్తవృత్తిని పూర్తిగా పంచుకున్నాడు. ఇరవయ్యో పడిలో శత్రువుల భాషను కుణ్ణంగా తెలుసుకొని అతడే గనక ఆమె స్థితిలో ఉన్నట్లైతే, బహుశ అతనికి కూడా ఆమెకు కలిగిన కోర్కె కలిగి ఉండొచ్చు. కాని అతనికి ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ అంటే అమితమైన ప్రేమా, గౌరవమూనూ. ఆమెను, ఆయనయొక్క ఒకే ఒక కుమార్తెను, అలాంటి క్లిష్టమైనటువంటి అపాయకరమైన పనిపై ఆమె తండ్రి కోరికకు భిన్నంగా — అది కూడా అతడు ఊహించుకోగలిగాడు — పంపడం సమంజసం కాదనిపించింది.

"మనం యీ విధంగా చేద్దాం," అని ఆఖరికి అన్నాడు. "మనం ఈ విధంగా పరిష్కరించుదాం: నీవు మిలిటరీ కమీసరియట్‌వద్దకు వెళ్లు. నిన్ను సైన్యంలోకి చేర్చుకోనేట్లు చూడు. ఆ తర్వాత నాదగ్గరికి రా. నిన్ను చేర్చుకునేందుకై మిలిటరీ కమీసరియట్‌కు ఆజ్ఞ జారీచేయబడుతుంది."

అతడు ఆమె వెంట మెట్లదాకా వెళ్లాడు. తల పంకిస్తూ, వేడుకతో గురగుర మంటూ, పైనుండి ఆమెను చాలా సేపు చూస్తూ నిలబడ్డాడు.

జనరల్ సిలాయెవ్ ప్రయత్నాల ఫలితంగా ఆనిచ్కాను పశ్చిమ యుద్ధరంగం హెడ్ క్వార్టర్స్‌కు అనువాదకురాలిగా పంపారు. ఆమె ప్రశాంతంగా వున్న ఒక పెద్ద గ్రామంలో టెలిప్రింటర్ ఆపరేటర్లయిన క్లావ, మాష అనే యిద్దరమ్మాయిల గదిలో ఉంటోంది. శీతాకాలం మరీ ఎక్కువ చలిగా లేదు కాని గాలి మాత్రం బాగా వీస్తోంది. మొత్తంమీద అక్కడ చాలా ప్రశాంతంగానే ఉంది, యుద్ధశ్రేణులకు ఎంతో వెనుకగానూ, ఆనిచ్కా పారిపోయి వచ్చిన వోల్గా పట్టణంకంటే ఎంతో శాంతంగానూ. ఆ వెడల్పాటి వీధికీ, బాహ్యప్రపంచానికీ సంబంధం లేకుండా కొన్ని ఆటంకాలను ఏర్పాటు చేశారు. అలా అడ్డుగా ఏర్పరచిన ప్రదేశాలలో గొర్రెబొచ్చు తోలుకోట్లు తొడుక్కొని వున్న పహరా వాళ్లను నియమించారు. హెడ్‌క్వార్టర్స్‌లో పనిచేస్తున్న ఆఫీసర్లకు విపరీతమైన పని ఉంది. కాని అది మామూలుగా ఎప్పుడూ ఉండే ఆఫీసు పనే అన్నట్లుగా ఆనిచ్కాకు అని పించింది. వాళ్లు ఎన్నడూ ఒక్క గుండును కూడా కాల్చి ఎరుగరు; వాళ్లు చేసిందల్లా వ్రాయడం, ఫోను చేయడమే. అక్కడ అనేకంగా టెలిఫోన్లు ఉన్నాయామో వాటి తీగలు కొన్ని టెలిగ్రాఫ్ స్తంభాలకు కట్టబడీ, కొన్ని ఊరికే నేలమీద పడి ఉండీ, మొత్తం పరిసర ప్రాంతం అంతా చిక్కుచిక్కుగా నిండి వుంది.

క్లావ, మాషలు, పూర్వనుంచీ అక్కడ ఉంటూండడంవల్ల, గది ఊడవడం, నీళ్లు తేవడం, ఆఖరికి ఆనిచ్కా చేరుమాళ్లను తమ వాటితో కలిపి ఉతకడం మొదలైన పనులన్నీ చేయడం తమ ప్రథమ కర్తవ్యంగా భావించారు. మొదట యీ విషయాన్ని ఆనిచ్కా గమనించలేదనే చెప్పాలి. లేదా ఆమె దానిని సర్వసామాన్యమైన విషయంగా తలపోసి ఉండనన్నా ఉండాలి. కాని ఒక రోజున ఆమె దానిని గ్రహించి నివ్వెరపోయింది. తక్షణమే ఆమె వాళ్లబదులు ఇంటి పనంతటినీ తననెత్తిమీదే వేసుకుంది, భూగర్భం లోని టెలిగ్రాఫ్ గదిలో నిత్యం రాత్రిళ్లు కూర్చోవలసిన ఆ యిద్దరు ఆడపిల్లలకంటే తనకు పని కొంత తక్కువు గనక.

ఆమె అంటే ఆ పిల్లలకు యిష్టం. ఆమెలో కలుపుకోలుతనం కొంత తక్కువైన ప్పటికీ ఆమె చాలా మంచిదని ఆ పిల్లలు అంటారు.

వాస్తవానికి, ఆమె కలుపుకోలు మనిషి కాదనే అక్కడున్న వారికి అనిపించింది. ఆమె మగవాళ్లతో అహంకారంతోనూ నిరుత్సాహంతోనూ ప్రవర్తించేది. వాళ్లని ములు

కుల్లాంటి విమర్శలతో గద్దించేది. వాళ్లల్లో ఎవరైనా ఆమెతో ఎక్కువ చనువుగా ఉంటే ఆమె వాళ్ల పురోగమనాన్ని, స్పష్టంగా ఎంతో అమాయకత్వంతో, అంతా వినగలిగే పెద్ద కంఠధ్వనితో, సీనియర్ ఆఫీసర్ల ఎదురుగా కూడా చెప్పి వాళ్లు మళ్లీ తల ఎత్తుకోలే నట్టుగా గాడిదలని చేసేది. ఆత్మ రక్షణ అనే యీ పద్ధతి మాంచి ఉపయుక్తమైనదిగా రుజువయింది. వారు ఆమెకు "గొప్పగా ఎదిరించే కేంద్రం" అని మారు పేరు పెట్టారు. విచిత్రంగా కనుపించినా ప్రతి వ్యక్తీ ఆఖరికి ఆమెచేత పరాభవం పొందిన వాళ్లు కూడా, ఆమె నడతను మెచ్చుకున్నారు. ఆమె అంటే వారికి గౌరవం. ఆమె వాళ్ల మధ్య ఉన్నం దుకుగాను వాళ్లు ఒక విధంగా గర్విస్తారు. రైల్లో ఆ సన్నని లెఫ్టినెంటుతో కలిగిన అను భవం ఆమెకిప్పుడు స్పష్టంగా ఉపయోగపడింది.

హెడ్‌క్వార్టర్స్‌లో ఆనిచ్కను మెచ్చుకొనే వాళ్లతో ఆమె ఎలా ప్రవర్తించిందీ క్లావ విన్నప్పుడు "ఓ, భలే నవ్వుపుట్టిస్తుందిలే," అని బిగ్గరగా అంది. "వాళ్లు అలాంటి వాళ్లే, ఆనిచ్కా, వాళ్లు సరిగ్గా అందుకు అర్హులు. నువ్వే తగినదానవి."

కాని ఆనిచ్కకు మాత్రం తాను తగిన వ్యక్తి అని అనిపించలేదు. కాగా అందుకు భిన్నంగా ఆమె తాను దుర్మార్గురాలననీ, చపలచిత్తయనీ, మనస్థిమితం లేనిదనీ, మరీ ఎక్కువగా నిందించేందుకు పూనుకొనేదనీ భావించింది. ఒక్క ముక్కలో చెప్పాలంటే ఆమె అతిగా ఆలోచిస్తుంది కానీ, ప్రతి పనినీ ముందు వెనుక లాలోచించకుండా చెయ్యదు. ముందు వెనుకలు ఆలోచించి తర్జనభర్జనల ఫలితంగా మంచిగా ఉండడమనేది అయోగ్యమైందిగా ఆమె భావించింది. ఏ వ్యక్తి అయినా సరే తనకు తాను తెలియకుండానే మంచిగా ఉండాలి. అప్పుడు మాత్రమే ఆ వ్యక్తికి శాంతి సౌఖ్యాలుంటాయి అని అనుకునేది.

సైనిక హెడ్‌క్వార్టర్స్‌కు వచ్చీ రావడంతోటే ఆనిచ్క తనను శత్రువుల వెనుకకుగానీ లేదా యింకా మరింత ముందరి ప్రాంతానికిగానీ పంపించేందుకై ప్రయత్నాలు చేసింది. కాని అది చాలా కష్టమైన విషయంగా పరిణమించింది. అందుకు కారణం ఎక్కువగా జనరల్ సిలాయెవ్‌యొక్క రహస్య "తంత్రాలే", అంతే కాకుండా ఆమె ఎవరి కుమార్తో వాస్తవానికి సైనిక హెడ్‌క్వార్టర్స్‌కు సహజంగా తెలుసు. పైగా, రణరంగానికి దగ్గరగా ఎక్కడికో ఒక చోటికి, రెజిమెంటుకుగానీ, డివిజన్‌కుగానీ పంపబడాలనే ఆమె వాంఛను వారు ఆకతాయతనంగా ఎంచారు. అంచేతనే వారామెకు ప్రోత్సాహాన్నివ్వలేదు.

ఏమైనప్పటికి, అనిచ్కా సైనిక హెడ్‌క్వార్టర్స్‌లో గడిపిన కాలమంతా నిష్ప్రయో జనం కాలేదు. సైనిక ఉత్సాహం, సైనిక జీవితం ఆమెకు అబ్బాయి. సైన్యంలో ఉం టేనేగాని ఎవరికీ సాధ్యపడనటువంటి అనేక భావాలను అలవాట్లను ఆమె సాధించి ప్రావీ ణ్యతను పొందింది. దానికితోడు అరుదుగా పట్టుపడ్డ యుద్ధఖైదీలను ప్రశ్నించడంలో ఆమె కూడా పాల్గొంది (అప్పటికే మనం మాస్కో ప్రాంతంలో శత్రువులపై ఎదురు దాడి సలపడం అయిపోయింది. కొద్దిమంది ఖైదీలు మాత్రమే దొరికేవారు). జర్మన్ ఉత్తరాలనూ, డాక్యుమెంట్లను అనువదించడంలో ఆమె నిమగ్నమైంది. ఆవిధంగా ఆమె, సర్వసాధారణంగా జర్మన్ మిలిటరీ డాక్యుమెంట్లు, ఉత్తరప్రత్యుత్తరాల శైలిని నేర్చుకుంది. జర్మన్ సైన్యం నిర్మాణం, నియమాలు, దుస్తులు, చిహ్నాలు, బిరుదులు వీటన్నిటినీ కూడా ఆమె క్షుణ్ణంగా తెలుసుకుంది. జర్మన్ డివిజన్‌ల సంఖ్యలు అంటే యిదివరకు అర్థం లేని పదాలుగా అయిపోయాయి — శత్రువులు యిక భయంకరమైన ఊహాజనితులుగా గాక రక్త మాంసాలుగల మానవమాత్రులుగానూ వాస్తవాంశాలుగానూ రూపొందారు.

చివరికి, ఆమె తన స్వయం ప్రవర్తనా పద్ధతిని కష్టపడి విస్తృతం చేసుకుంది. అందువల్ల యితరులు ఆమెను "అసాంఘికపు మనిషి" అని పిలిచారు. అయినా ఆమె తన చుట్టూ ఉన్న వాతావరణాన్ని సందిగ్ధమైన అాశయింపులతో కలుషితం కాకుండా సృష్టించుకుంది.

ఏదేమైనప్పటికీ, ఆమె ఓపికతో తన ఆశయసిద్ధికోసం పట్టుదల పట్టింది. క్రమక్రమేణా యుద్ధరంగానికి చేరువుగా వెళ్లడంలో విజయాన్ని సాధించింది: యుద్ధ రంగం హెడ్‌క్వార్టర్స్‌నుండి సైన్యంలోకీ, సైన్యంనుండి డివిజన్‌కూ, చివరికి డివిజన్ నుండి రెజిమెంటుకూ వెళ్లగలిగింది.

ఈ అభివృద్ధుల నన్నింటినీ ఆమె కర్నల్ వెర్‌స్తొవ్‌స్కీతో, యుద్ధానికి ముం దరినాటి రాత్రి అకీమోవ్ కందకంబసలో చెప్పుకుంది. వాస్తవానికి ఆమె అన్ని వివరా లనూ క్లుప్తంగా చెప్పింది. అత్యంత క్లిష్టమైన భాగాన్ని ఆమె వెలుపలికి చెప్పకుండా లోలోనే దాచుకుంది — అది ఆమె మానసిక బాధ.

కర్నల్ మాత్రం తల పంకించి నిట్టూర్పు విడిచాడు.

"పాపం మీనాన్న!"అన్నాడాతడు.

అతడు తన గడియారం వంక చూశాడు. తాను వెళ్లాలన్న సంగతి జ్ఞాపకం చేసుకున్నాడు. అయినప్పటికి అనిచ్కను విడిచి వెళ్లడం అతనికి కష్టం అనిపించింది. ఆమెను జాగ్రత్తగా చూసుకొనే వారెవరూలేకుండా, తన స్నేహితుడైన జనరల్ బెలొ జ్యోరొవ్ కుమార్తెను ఒంటరిగా అక్కడ వదలివేయడం నేరంచేయడమేనని అతడు భావించాడు.

''నేను వెళ్లితీరాలి,'' అని ఆతడన్నాడు చివరికి. ''నేను యుద్ధసమయంలో మీా రెజిమెంటల్ కమాండర్‌తో ఉండవలసి ఉంది. నువ్వు కూడారా. నీవిక్కడ చేయ వల్సిందేమీా లేదు.''

అతడు ఆమెవైపు వంగి, ఆత్రతతో అటూ యిటూ చూసి ఆమెతో ఆమర్నాడు రెజిమెంట్‌కు విడుదల కలుగబోతోందని చెప్పాడు.

ఆతర్వాత అతడు ఎవరికీ కనబడకుండా కాలవలో దాచిన తన కారు వద్దకు వెళ్లి లోపల కూర్చుని రెజిమెంటల్ హెడ్‌క్వార్టర్సుకి వెళ్లిపోయాడు. కాని ఆ కార్లో కూడా అతనికి మనస్తిమితం లేకపోయింది. అతడు కార్లో కూర్చుని ''మంచిది, మంచిదమ్మాయ్! అనిచ్క! మంచిది,'' అని పదేపదే అనడంవల్ల డ్రైవర్‌కి ఆశ్చర్యం కలిగింది.



అధ్యాయం మూడు

# రికన్నాయిసెన్స్ పోరాటం

1

వెర్స్తోవ్‌స్కీ వచ్చిన సమయంలోనే డివిజనల్ కమాండరైన మేజర్-జనరల్ మూహిన్, మేజర్ గొలొవీన్ అధికార స్థావరానికి వచ్చాడు. వచ్చే యుద్ధం ఏర్పాట్లను గురించిన రెజిమెంటల్ కమాండరుయొక్క నివేదికను ఆతడు విన్నప్పుడు జనరల్ యిలా అన్నాడు: ''అకీమొవ్‌ను ఏంచేయాలో నాకేం పాలుపోవడం లేదు. అతనిని తిరిగి నౌకాదళంలోకి బదిలీ చేసేందుకై మాస్కోకు పంపవలసిందిగా యీ వేళే ఆజ్ఞవచ్చింది.''

''అబ్బ ఎన్నాళ్లకి!'' అని తనమిత్రుని విషయమై సంతోషిస్తూ గొలొవీన్ అన్నాడు. కాని ఆ మరుక్షణానే యిలా జోడించాడు: ''అయినా శోచనీయమైన విషయం. అతడు చాలా మంచి ఆఫీసరు.''

జనరల్ అతని వంక సూక్ష్మదృష్టితో చూశాడు. "మీ అభిప్రాయం ఏమిటి? అతడ్నే యుద్ధంలో పాల్గొనేట్టు చేద్దామా లేదా తక్షణమే పంపించేద్దామా?"

గొలొవీన్ సమాధానం చెప్పడానికి చాలా సేపు తటపటాయించాడు. ఈ పోరులో విజయం చేకూరాలంటే నిజానికి అకీమొవ్‌ను వెనక్కి పంపించేయడం యోగ్యమైంది కాదు. పైపెచ్చు, ఫలానా వ్యక్తి వుంటేనేగాని ఫలానా పని అసంభవం అని అనుకోవడం అసందర్భం. అయినా ఇది చాలా చిక్కు అయిన పోరులాగానే కనబడుతూంది.

జనరల్‌వైపు చూశాడు మేజరు. వాళ్లిద్దరూ ఒకేవిధంగా ఆలోచిస్తున్నారు.

"ఏమైనప్పటికీ, అతడు యీ పోరాటాన్ని నడిపించడమే సమంజసం," అని జనరల్ నెమ్మదిగా అన్నాడు.

అదే సమయంలో అకీమొవ్ ప్రతి కందకంబసలోకీ, రక్షణస్థలంలోకీ చూస్తూ, నెమ్మదిగా కాపలాకాస్తున్న ప్రతి మెషీన్‌గన్నర్‌ని, రైఫిల్ మనిషినీ పిలుస్తూ ముందరి ప్రాంతంలోకి వెళ్తున్నాడు. అతడు ప్రతి మషీన్‌గన్‌వద్ద తనఖీ చేయడానికని ఆగి, చీకట్లోకి వాటిని ప్రేల్చి చూశాడు.

అకీమొవ్ ఆజ్ఞాపించిన ప్రకారంగా కాపలా పనిలో లేని సైనికుల్లో చాలామంది నిద్రపోతున్నారు. అక్కడ గాలికి ఆడ్డం లేదు. అక్కడి గాలంతా ఆరవేసిన కాళ్లకు చుట్టుకొనే గుడ్డల కంపుతోనూ పొగాకు పొగతో నిండిపోయింది. గురకలు తీయడం, బరువుగా గాలి పీల్చడం, దగ్గులు, నిద్రలోని కలవరింతలు మొదలైనవి వినిపిస్తున్నాయి.

"నిద్రపోండి మిత్రులారా, నిద్రపోండి," అని అతడు పూర్వపు పాటలోని పదాలను గొణిగాడు. "రేపు తుఫాను విరుచుకొని పడుతుంది." అతడు తన బూట్ ముందరి భాగంతో లోతుగా ఉన్న మురికిగుంటలోకి చొనుపుతూ అన్నాడు: "తెల్లవారగానే మీరు నా గొంతు వింటారు. మరణమో లేక కీర్తి కొరకైన పిలుపో."

"ఎవరక్కడ?" అని అతనిని ఒక గొంతు సవాలు చేసింది. కాని ఆ సైనికుడు తక్షణమే అతనిని గుర్తించి సెల్యూట్ చేశాడు.

"హల్లో," అకీమొవ్ అన్నాడు. "ఎవరు నువ్వు?"

"విత్యగోవ్."

"గుడ్ ఈవినింగ్ సార్జెంట్. నిద్రపోలా?"

"లేదు కాప్టెన్."

"ఎంచేత?"

''నిద్ర పట్టడంలేదు.''

''నీ తుపాకి శుభ్రం చేశావా?''

''చేశానండి. ప్రతీదీ సిద్ధంచేసి ఉంచాను.''

''మందుగుండు సామగ్రిని వాళ్ళు మీకిచ్చారా?''

''ఇచ్చారండి.''

''కవచాన్ని చొచ్చుకు పోయేవాటిని కూడా ఇచ్చారా?''

''ఇచ్చారండి.''

''జర్మన్లు ఏంచేస్తున్నారు?''

''కునుకు తీస్తున్నారు. అప్పుడప్పుడు మతాబీచువ్వలని వదలుతున్నారు. సిగరెట్టు కాల్చుకుందామా, కామ్రేడ్ కాప్టెన్?''

''తప్పకుండానూ.''

వాళ్ళు సిగరెట్లు వెలిగించారు. ఆ అగ్గిపుల్ల వెలుగులో విత్యగోవ్ మొహం శాంతంతోనూ, కరుణతోనూ ఉన్నట్లు తెలుసుకోవచ్చు.

''ఈ చెమ్మనేలలో మనం ఎక్కువ కాలం ఉండబోతున్నామా?'' అని అతడు అడిగాడు.

''ఆ ప్రశ్న భగవంతుణ్ణి, ప్రధాన కమాండర్‌నీ అడగాలి.''

''అవునండి. అంతే ననుకుంటాను.''

''ఏం? కష్టంగా ఉందా యిక్కడ?''

''లేదు కానీ, విసుగుదలగా ఉందండి.''

''యుద్ధం అంటే సంతకాదు. పడుకొని నిద్రపో సార్జెంట్. నీకు మంచి విశ్రాంతి అవసరం.''

''సముద్రంమీద పోరాటం భూమిమీదకంటే బాగుంటుందా, కామ్రేడ్ కాప్టెన్?''

''అది భూమిని బట్టి ఉంటుంది. ఇక్కడ ఇంత నీరుందికదా దీనిని భూమి అని పిలవవచ్చునా?''

''అహాహా. మీరన్నది నిజం.''

''ఎవరా నవ్వేది?''

''నేనే. కొర్‌జీన్‌కిన్ను.''

''ఓ, వైద్య సహాయకుడివా? నీవు కూడా యింకా నిద్రపోలేదన్నమాట?''

''లేదండి. నేనూ ఫైజూల్లిన్ కొద్దిగా మాట్లాడుకుంటున్నాం.''

''నీవు కూడా యిక్కడే ఉన్నావన్నమాట, ఫైజూల్లిన్? ఇదేం సబబుగా లేదు. యువకమ్యూనిస్టు లీగ్ ఆర్గనైజర్‌గా ఉండి యిలా ప్రవర్తించడం ఏమీ ఆదర్శ ప్రాయంగా లేదు.''

''కామ్రేడ్ కాప్టెన్! యువకమ్యూనిస్టు లీగు ఆర్గనైజరు నిద్రపోకూడదు.''

''చాల్లే నీ రాజకీయాలు. దేనిని గురించి మీ బాతాఖానీ?''

''ఏదో మామూలు జీవితాన్ని గురించే. అంటే యుద్ధం అయిపోయిం తర్వాత అని మా ఉద్దేశం.''

''అబ్బో! నీకు గొప్ప దూరదృష్టే వుందే.''

''మన ఫైజూల్లిన్ విషయం చూడండి. ఇతను చేపల ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్లా లనుకుంటున్నాడు.''

''కేవలం చేపల పాఠశాలకేనండోయ్,'' అని ఫైజూల్లిన్ దిద్దాడు.

''సరేలే. ఇతడు నివసించే కజన్‌లో...'' అని అనబోయాడు.

''అతడు ఎక్కడ నివసిస్తాడో మొదలైన పుక్కిటి కథలు కట్టిపెట్టండి. పడు కొని నిద్రపొండి. నేను మీ మంచికే చెబుతున్నాను. ఇవేం పనికి రావు.''

అకీమొవ్ తలపంకించి ఆ చీకట్లో నవ్వాడు. ఆతర్వాత బటాలియన్ వంటయిం టికి వెళ్లాడు. అది ఒక పెద్ద లోవ ప్రక్కన ఒక గొందిలో ఉంది. అక్కడి మంట ఆ యింటికి వెలుతుర్నీ వెచ్చదనాన్నీ యిస్తోంది. ప్రశాంతమైన సంతృప్తి మొహంలో ప్రకాశిస్తుండగా వంట మనిషైన మకారిచెవ్ అంతా సవ్యంగా ఉందని రిపోర్టు యిచ్చాడు.

''ఉదయం భోజనానికి మాకేం పెడతావ్?'' అకీమొవ్ అడిగాడు.

''జొన్నన్నం.''

''మాంసం లేదా?''

''అందులో వెయ్యలేదండి. వెయ్యమంటారా?''

''తప్పకుండాను.''

''కామ్రేడ్ కాప్టెన్! ఇప్పటికే మనం ఎక్కువ రేషన్ వాడుకున్నాం.''

''ఏం ఫరవాలేదులే. కొంత మాంసం కూడా వెయ్యి — మేతని మిగిల్చేందుకు గుర్రాన్ని మాడుస్తానూ?''

''అయితే కొంత మాంసం వెయ్యమంటారన్నమాట, కామ్రేడ్ కాప్టెన్.''

''అవును. రెండింతలు. తెలిసిందా?''

''సరేనండి.''

''ఉదయం భోజనం తెల్లవారు ఝామున ఐదున్నరకే వడ్డించు. గడియారం ఉందా నీకు?''

''ఓ. ఉన్నదండీ.''

అకీమొవ్ ఆ వంటమనిషి దగ్గరగా వెళ్లి తన గడియారంతో అతని పాతరకం వెండిగడియారం టయిమును సరిచూశాడు.

''నీ గడియారం చాలా వెనక్కి నడుస్తోంది. పన్నెండు నిముషాలు ముందుకు పెట్టు,'' అని అన్నాడు.

వంటియింటి వెచ్చదనానికి ఆనందిస్తూ కొంత సేపు మౌనంగా నిలబడ్డాడు అకీమొవ్. ఆతర్వాత తన పర్యవేక్షక స్థావరానికి వెళ్లాడు. అక్కడికి చేరాలంటే పొడుగ్గా, యిరుకుగా ఉన్న బీట కందకం గుండా వెళ్లాలి. అది అంతమైన చోట దానిపైన రెండు వరసల్లో కట్టెల్తో చూరు మాదిరిగా ఏర్పాటు చేయబడి ఉంది. ఆ చూరుపైన మట్టి ఉంది. దానిక్రింది బీట కందకాన్ని కొద్దిగా వెడల్పు చేశారు. ఫిరంగిని కాల్చేందుకు రంధ్రం చేశారు. మామూలుగా యిక్కడ మషీన్‌గన్‌కై స్థానం ఉండేది. కాని యిప్పుడు దానిని పర్యవేక్షక స్థావరంగా అమర్చారు. వైర్‌లెస్ ఆపరేటరు తన సెట్‌ను ఇక్కడ అమర్చుకున్నాడు. అప్పుడప్పుడు ''ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు...'' అని కునుకుతీస్తున్న కంఠధ్వనితో పలికిందే పలుకుతూ రిసెప్షనును తనఖీ చేస్తుంటాడు.

అనేక టెలిఫోన్లు వరసగా నేలమీద ఉన్నాయి. సరిగ్గా కందకంబసమీద కప్పి నట్టే నేలమీద కూడా చెట్లకొమ్మలను కప్పారు. మాయ్‌బోరొద యిక్కడి వస్తువుల విషయంలో కూడా శ్రమ తీసుకొనేందుకు సమయం చిక్కించుకున్నాడనడం స్పష్టంగా కానిపిస్తోంది. అక్కడ ఒక బెంచీ ఉండడమే అందుకు తార్కాణం.

అకీమొవ్ ఆ బెంచీమీద కూర్చుని ఫిరంగి కాల్చే రంధ్రంగుండా వెలుపలికి చూశాడు. ఇదివరకటి మాదిరిగానే చీదర పుట్టించే వర్షం ఎక్కడా ఆగకుండా జోరుగా కురుస్తోంది. చీకటిగా ఉంది. అందుకు తోడు పొగమంచు పల్లంలోని ప్రదేశాలపై కంబళి కప్పినట్టుగా ఉండడంచే ఆఖరికి నది కూడా అగుపించడంలేదు.

అప్పుడప్పుడు కనిపించే మతాబీచువ్వ మాత్రమే, ఆ చీకట్లోనూ పొగమంచుపైన పేలవమైన ప్రకాశాన్ని ప్రసరింపచేసి నెమ్మదిగా పైకి లేస్తున్న పొగను అలలు మాదిరిగా కనిపించేట్టు చేస్తోంది. ఏదో భీకరమైన అల్లకల్లోలానికి ఎర అయి నులిపివేయబడుతున్నట్టుగా అప్పుడా గట్లమీద రెల్లు కనిపిస్తోంది.

నదికి అడ్డంగా మంచి రక్షణ స్థావరంగా ఉన్న ఎత్తైన గట్టుమీద అడవులూ గ్రామాలూ ఉన్నాయి. అవి యింకా రైతుల కలపకుటీరాల్తో హానిచెందకుండా అలాగే ఉన్నాయి. వాటి వెనకనే ఓర్ష పట్టణం ఉంది. ఏదో స్కూలు పుస్తకాల్లో చదువడమే తప్ప ఆ బస్తీ అకీమొవ్‌కు తెలియదు. కాని ఒక నెలనుండీ ఆ పట్టణం అతని ప్రతి స్వప్నానికీ ఆదర్శంగా ఉంది. తామంతా చార్జి యిచ్చి విడుదల కాబోతున్నామనే సంతోషం సహజంగా అతనికి కలిగినప్పటికీ అతడు ఒక విధంగా విచారపడుతున్నాడు. అందుకు కారణం అతడు ఓర్షను పట్టుకొనేందుకై వారు అవకాశాన్ని యివ్వకపోవడమే. ముందరి విభాగంనుండి తాను చూడగలిగే దట్టమైన అడవుల్తో నిండిన ప్రాంతాన్ని, నిరంతరం కనిపెడుతున్నందువల్ల ప్రతి అంగుళంమేరా ఎరిగిన ప్రాంతాన్ని అతడు పట్టుకొనే అవకాశం కలగదేమోనన్న సందేహం అతనికి మరింత నిరాశగొలిపింది. అక్కడ వాళ్లకి ఎంత వంటచెరుకు లభించేదో! వాళ్ళు తమ స్థావరాల్ని ఎలా గుప్తంగా దాయగలిగారో! చెక్కగోడల్తో నిర్మించి సౌఖ్యవంతమైన కందకంబసలనీ, స్నానాల గదుల్నీ ఎన్నింటిని వారు అక్కడ కట్టగలిగారో! ''కన్నాన్ భూమి'' అని, బైబిలు ననుసరించిన భావాలలో మంచి ప్రవేశం ఉన్న మాయిబొరొద అన్నట్టు, ఆ అపేక్షిత ప్రాంతాన్ని సైనికులెప్పుడూ ఆకాంక్షిత నయనాల్తో వీక్షిస్తూనే వున్నారు. చండాలం వర్షం బదులు మంచు వస్తుంది. అప్పుడు వారు అసలైన పోరాటాన్ని సలపగలుగుతారు.

వాస్తవానికి అది కేవలం ఏదో ఒక చిన్న భూఖండిక మాత్రమే కాదు. ఏదేమైనా బటాలియన్ స్థాయిలో యుద్ధరంగంలోని ప్రథమశ్రేణి జీవితం, మనిషి వాంఛల్నీ అభిరుచిల్నీ సంకుచిత పరుస్తుంది. మొత్తం సైన్యానికి ఉండే ఓర్ష పట్టణంయొక్క ప్రాముఖ్యత విషయం అకీమొవ్ దృక్పథంనుండి ఎన్నడూ తొలగలేదు. ఆ పట్టణం వ్యూహామార్గాలకూ, సరఫరా బాటలకీ కూడలి. మా సైన్యాలను తిన్నగా పోలెండులోకి తీసుకు వెళ్లగలిగే పట్టణం అది.

ఫిరంగిని కాల్చేందుకు వున్న రంధ్రంనుండి వర్షం చుక్కల్ని లోనికి తరుముతూ వాయువు గట్టిగా వీచింది. అకీమొవ్ మొహం తుడుచుకున్నాడు. ఆజ్ఞలో చెప్పినట్టుగా

వందా రెండు వందల గజాలు మాత్రమే కాకుండా ముందుకు, మరీ ముందరికి ఆ బైలో రష్యన్ గడ్డమీద శరవేగంతో తన సైన్యాన్ని నడిపించి విముక్తిని కలిగించే వీరుల్లా పోలెండులోకి ప్రవేశించినట్లయితే ఎంత బాగుంటుంది అన్న భావన అకీమొవ్ మనస్సులో మెరపులా మెరిసింది. పోలెండు వెనుకనే జర్మనీ, ఫ్రాన్సు, అట్లాంటిక్ తీరాలు ఉన్నాయి.

ఒకే ఒక యూనిట్‌యొక్క మనుషులకి అందుబాటులో లేనటువంటి తన విపరీత వ్యూహ పన్నాగాలకు తానే నవ్వుకున్నాడు. ప్రస్తుతానికి నిప్పుల వర్షంగుండా ఆ రెండు వందల గజాలూ ముందుకు వెళ్లవలసి ఉంది. ''మేం వస్తాం. తప్పకుండా వస్తాం. కాని మాకు వ్యవధి కావాలి,'' అని పోలెండుతోటీ ఫ్రాన్స్‌తోటీ మాట్లాడుతూన్నట్టుగా అతడు అన్నాడు. అతడు తరచూ ఆ దేశాలను గురించి గాఢమైన వాంఛతో తలపోశాడు.

ఇంకా వర్షం కురుస్తూనే ఉంది. యుద్ధ సమయంలో ఒకరికొకరు సరిగ్గా అగుపడరు. కాబట్టి వివిధ దళాల మధ్య ఉండే సమన్వయాలు దోషరహితంగా ఉండాలి. పైగా, కొద్దిపాటి పురోగమనానికై వ్యక్తుల్ని తీసుకు రావడమనే విషయంలో పొగమంచు కొంత సౌలభ్యాన్ని చేకూర్చుతుంది. పరిస్థితిని జాగ్రత్తగా గమనించిన తర్వాత అకీమొవ్ మేజర్ గొలొవీన్‌కు ఫోన్ చేశాడు. కాని అప్పటికే మేజరు వెలుపలికి వచ్చేశాడు.

''మీ దగ్గరకే వస్తున్నారు 'నంబరు పది'తో. దారిలో ఉండి ఉంటారు,'' అన్నాడు రెజిమెంటల్ హెడ్‌క్వార్టర్స్‌లో డ్యూటీమీద ఉన్న ఆఫీసరు.

తన వెనుకు సిగ్నల్ మనుషులు నెమ్మదిగా మాట్లాడుకుంటూ ఉండడాన్ని అకీమొవ్ విన్నాడు.

''మాయ్‌బొరొద, నువ్వేనా అక్కడున్నది?'' అని అతను కూడా నెమ్మదిగా అడిగాడు. ఎంత చీకటిగా ఉన్నా సరే అతడు తన సహాయకుని ఇట్టే కనిపెట్టేస్తాడు.

''అవును. నేనే.''

అకీమొవ్ మాయ్‌బొరొదను కంపెనీ కమాండర్ల కోసం పంపించాడు. 'నంబరు పది' అయిన డివిజనల్ జనరల్‌తో వస్తూన్న రెజిమెంటల్ కమాండర్ రాకకై ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

అయిదు నిమిషాలు గడవక ముందే ఆ చీటకందకం టార్చిలైట్ల వెలుగుతో నిండి పోయింది. అకీమొవ్ వెలుపలికి వెళ్లి రిపోర్టు చేశాడు: ''ఒప్పగించిన పనిని నిర్వహించేందుకై మొదటి బటాలియన్ సన్నాహాలను చేసుకుంటోంది. బటాలియన్ కమాండర్ కాప్టెన్ అకీమొవ్.''

''శాంతంగా నిలబడు,'' అని అన్నాడు జనరల్. తన చేయిని ఆ చీకట్లో ముందుకు చాపి కాప్టెన్‌తో కరస్పర్శ చేశాడు. ''సరే గానీ, బటాలియన్ కమాండర్! వ్యవహారాలు ఎలా నడుస్తున్నాయి?''

పొగమంచు ఉపయోగించుకుంటూ దానిక్రింద ఏవిధంగా శత్రువుల్ని ఎదుర్కో దలచిందీ మొదలైన తన వ్యూహాలను ఆయనకు తెలిపాడు అకీమొవ్.

''బాగుంది,'' అన్నాడు డివిజనల్ కమాండరు. ''కానీ, ఒక వేళ శత్రువులకు తెలిస్తేనో?''

''ఏమైనా, పొగమంచులో వాళ్లు సరిగ్గా కాల్చలేరు,'' అన్నాడు మేజర్ గొలొవీన్ కాప్టెన్ పక్షం మాట్లాడుతూ.

''మనవాళ్ల మనస్థితి ఎలా ఉంది?'' అని అడిగాడు డివిజనల్ కమాండరు.

''బాగానే ఉంది.''

''మంచిది. ఉత్సాహం అంటే అలా ఉండాలి. మీరంతా ఈ నీళ్లల్లో మీమీ స్థానాల్లో బాగానే ఉన్నారనుకుంటాను.''

''మాకేమైనా టాంకుల్ని యిస్తున్నారా?'' అని అకీమొవ్ అడిగాడు.

''లేదు.''

''మంచిది.''

''మీకవసరం అని నేననుకోను.''

''మంచిది.''

''మీకు టాంకుల్తో ఏం అవసరముంది? మొదటి మాట, మీరేం చూడలేరు. రెండో సంగతి, నేలంతా ఎంత చెడుగా ఉందంటే టాంకులవల్ల మీకేమీ ప్రయోజనం ఉండదు. ఇక మూడో సంగతి, టాంకులు చప్పుడువల్ల శత్రువులకి మన ఆచూకీ తెలిసిపోతుంది.''

''మంచిది.''

''మంచిది! మంచిది! మాట మాట్లాడితే 'మంచిది' అని పదేపదే అంటావు. కాని హృదయంలో మాత్రం మండిపోతూంటావు. నీకు కావలసినంత ఫిరంగిదళాన్ని యిస్తాను. ఆ ఫిరంగుల తడాఖాకి వాళ్లకి యేం చెయ్యడమో తెలియక హడలెత్తిపోతారు శత్రువులు.''

''మంచిది.''

''అంతే. ఇక కానివ్వండి. నీకోసమని స్టీరియోస్కోపిక్ టెలిస్కోప్‌ను తెచ్చాను. నీక్రింద ఏకంగా ఒక సైన్యం ఉన్నట్టుగానే భావించుకొని ప్రవర్తించు. ప్రస్తుతం ఒక మోర్‌టార్ రెజిమెంటు ప్రతినిధులు, రెండు ఫిరంగిదళ రెజిమెంట్ల ప్రతినిధులు వస్తారు. మొత్తం డివిజన్ కున్నటువంటి 'కత్యూష' మోర్‌టార్ల ఒక్కుమ్మడి కాల్పులతో దాడి ప్రారంభమౌతుంది.''

''చాలా వందనాలు, కామ్రేడ్ జనరల్.''

''ఎందుకని అభినందిస్తున్నావ్? జూనియర్ ఆఫీసర్లు సీనియర్ ఆఫీసర్లకు అభినందనలు చెప్పాల్సి ఉంటుందా? నువ్వు దీనిని నిర్వహించిన తర్వాత నేనే నిన్ను అభినందిస్తాను.''

''పొరపాటయింది, కామ్రేడ్ జనరల్.''

''ఆ. అలా అను. బాగుంది.''

ఒక నిమిషం సేపు జనరల్ మౌనంగా ఉన్నాడు. తర్వాత తన టార్చిలైటును అకస్మాత్తుగా కమాండర్ ముఖంమీదికి వేశాడు. నల్లని గడ్డంతో వున్న ఆ ముఖంలో గంభీర స్వభావం కనబడింది.

''నీకు సముద్రంమీదికి తిరిగి వెళ్ళాలని ఉందా?'' అని జనరల్ తలవనితలంపుగా ప్రశ్నించాడు.

అలాంటి అసందర్భమైన ప్రశ్నకు అకీమొవ్ ఆశ్చర్యపోయాడు. కానీ అతను సమాధానం చెప్పేందుకు అవకాశం యివ్వకుండానే జనరల్ మాట్లాడ్డం మొదలుపెట్టాడు. ''ఎక్కడో నీలసముద్రంపైన ఇక్కడికి సాధ్యమైనంత దూరంలో నువ్వు ఉన్నావని ఊరికే నీకు అనిపించేందుకు, సరేనా?''

అస్ఫుటమైన సంజ్ఞచేశాడు అకీమొవ్. ''నేను చేరుకోవాలని కుతూహల పడుతున్న ప్రదేశం ఆ ఎదురుగా అవుపించే జర్మన్ కందకమే,'' అని అన్నాడు.

జనరల్ తన టార్చిలైటును ఆర్పేశాడు. గొంతును కొద్దిగా మార్చి ఆత్రంతో అన్నాడు: ''సరే మంచిది. వెళ్ళొస్తా బటాలియన్ కమాండర్!''

అతడు నెమ్మదిగా ఆ బీటకందకంగుండా వెనకకి తిరిగి వెళ్ళాడు. మేజర్ గొలోవీన్ హృదయపూర్వకంగా అకీమొవ్‌తో కరస్పర్శ చేసి అతని వెనువెంట వెళ్ళిపోయాడు. త్వరలోనే కారు నడిచివెళ్ళిపోతున్న శబ్దం వినిపించింది.

''త్వరగా తెల్లవారితే బాగుండును!'' ఎవరో అన్నారు.

''నేలబాంబుల క్షేత్రాలలో మార్గాలు ఏర్పాటు చేయబడ్డాయా?'' అకీమొవ్ అడిగాడు.

''అవునండి,'' అని చీకట్లోంచి ఫీర్సొవ్ గొంతు సమాధానం చెప్పింది.

ఆ కనుమకు చాలా దగ్గర్లో బొచ్చెల చప్పుడు గలగలా వినిపిస్తోంది. అంతా ఉదయపు భోజనం చేస్తున్నారు.

తనకిష్టం లేదా అన్నట్టుగా లోభిగా అరుణోదయమయింది. అయినా, ఆ సన్నగా ఉన్న కందకంలో దాదాపు ఒకరి వెనకాల ఒకరు నిలబడి ఉన్న వ్యక్తుల ప్రతి మొహాన్నీ అకీమొవ్ గుర్తించాడు. తన గడియారంవంక చూసి తలపై కెత్తేప్పటికి అక్కడ అనువాదకురాలు వాళ్ల మధ్య నిలబడి అగుపించింది. అటువైపు ఎంతో నిర్లక్ష్యంతో చూశాడు, తన నిర్లక్ష్యానికి అనిశ్చయమైన సంతృప్తిని పొందుతూ.

''మీ గడియారాలను సరి చూసుకోండి,'' అని అతడన్నాడు. అతని గొంతులో ఒక విధమైన కరుణామయ గంభీరత గోచరించింది. ఆఫీసర్ల చేతుల్లో గడియారాలు తళతళా మెరిశాయి. కొన్ని జేబు గడియారాలు, కొన్ని చేతి గడియారాలు. ''అయిదూ నలభై.''

తర్వాత ఆతడు కంపెనీ కమాండర్ల వైపు తిరిగాడు.

''పొగొస్యాన్, ముందుకు వెళ్లేందుకు నువ్వు ప్రారంభించవచ్చు. బేల్స్కీ, నువ్వు ఇరవై నిమిషాల్లో బయల్దేరు. ఎక్కడా శబ్దం ఉండకూడదు. మన మధ్య సంబంధ సమాచారాలని ఎడతెగ కుండా ఉంచు — అవసరమైతే రన్నర్‌ని నియమించైనా సరే.''

ఆ యిద్దరు కంపెనీ కమాండర్లు ఒక నిమిషం సేపు నిలబడి వెలుపలికి వెళ్లిపోయారు.

అకీమొవ్ వెనక్కి తిరిగి తన పర్యవేక్షక స్థావరం వద్దకు వెళ్లాడు. అప్పటికే అతని టెలిస్కోపు యథాస్థానంలో ఉంది. దాని రెండు గాజు కళ్లూ దూరంలోకి చూస్తున్నాయి. మోకాళ్ల చుట్టూ చేతులుంచుకొని మాయ్‌బొరొద ఒక మూల కూర్చున్నాడు. వైర్‌లెస్ ఆపరేటరు తన సెట్‌మీదికి వంగాడు. దగ్గర్లో ఉన్న ఫిరంగిదళం అబ్జర్వర్ల కందకంనుండి కంఠధ్వనులు బహు తక్కువ స్థాయిలో వినవస్తున్నాయి.

పొగమంచు దట్టమౌతోంది. అది ఒక్కొక్కప్పుడు సముద్రంమీది వేకువజాము పొగమబ్బులాగా ఉంది. ఆ గోధుమవన్నె పొగమంచు నిజంగానే సముద్రాన్ని దాచేసి

నట్లూ, అది తొలగగానే కన్నులు మిరుమిట్లుగొలిపే కడలి నీలపునీరు, ఓడల నల్లని ఛాయలు అతనికి అగుపిస్తాయని అకీమొవ్ అకస్మాత్తుగా ఊహించాడు.

సన్నగా ఉన్న అఖాతంలోకి కొంతదూరంవరకూ నిర్మించినట్టి వారధీ, పెద్ద చిన్న అన్నిరకాల ఓడల హడావుడీ, యీ ప్రఖ్యాత దృశ్యం అతని కన్నులకు కట్టినట్లైంది. ఆఖరికి ఉప్పగా ఉన్న గాలిని కూడా అతడు పసికట్టినట్టు భావించాడు.

సముద్ర తీరంలో ఉన్న పట్టణానికీ ఏ యితర పట్టణానికీ ఏమంత తేడా ఉండదని అతడు భావించాడు. వీధులూ, పేవ్‌మెంట్లూ, ఇళ్లూ, అన్నీ ఒకే మాదిరిగా ఉంటాయి. వసంత ఋతువులో గోడల పక్కనున్న రాళ్ల సందులగుండా మొలిచే పచ్చని పసరిక మొలకలూ అక్కడగానీ యిక్కడగానీ ఎక్కడైనా ఒకటే. ఎవరైనా ఆ సర్వసామాన్యమైన వీధుల్లో ఒక దానిగుండా నడిచి వెళ్లినట్లైతే అతనికి అకస్మాత్తుగా కూచిగా ఉన్న ఓడస్తంభాల శ్రేణులూ, తెరచాపలకు కట్టే అడ్డదూలాలూ ఎదురుగా ప్రత్యక్షమౌతాయి. దాంతో మొత్తం వాతావరణం అంతా మరుక్షణంలో మాయమైపోతుంది. అంతవరకూ ఏదైతే సర్వసామాన్యంగా గోచరించిందో అది అసామాన్యంగా తయారై పూరుకుంటుంది. అప్పుడు ఆ వ్యక్తికి కదలిక విషయంలోనూ, ప్రయాణం విషయంలోనూ అసంతుష్టమైన కోర్కె, ఏదో ఒక కొత్తదనానికై తీరని దాహం కలుగుతుంది.

ఊహిస్తున్నంత సేపూ కూడా అకీమొవ్ తన భావనను పగ్గాలతో బంధించే ఉంచాడు. అది కేవలం పైపైనే ఉన్నదన్న సంగతిని అతడు మరవలేదు. కాని అతనిలో బాగా లోతుగా బాధాకరంగా, సర్వత్రా వ్యాపించిన భావన యిది: గోధుమ వర్ణంనుండి పాలవలె తెల్లగా మారిపోయిన ఆ పొగమంచులో నిజంగా ఏంజరుగుతోంది? తన మనుషులు ఎక్కడ? తనకు తెలిసిన పొగొస్యాన్, బేల్‌స్కీ, విత్యగోవ్ యింకా అనేక మంది విషయమై అతని మనసులో ఆత్రత పొంచి ఉందే — వీరందరు ఎక్కడున్నారు? నిర్మొహమాటంగా చెప్పాలంటే, అతడాక్షణంలో వారిని గురించి ఆలోచించేది మామూలు మనుషులుగా కాదు, కాని డివిజనల్ కమాండర్‌ను, కర్నల్ వెర్‌స్తొవ్‌స్కీని, మేజర్ గొలావీన్‌ను, తనను కాప్టెన్ అకీమొవ్‌ను, ఫిరంగిదళాలు, సిగ్నల్ దళాలు, సాపర్లు, మొత్తం రెజిమెంట్‌నూ, మొత్తం సైన్యాన్నీ, ఆ పోరాటంలో తమ ప్రాణాలను ఒడ్డేందుకు ఒత్తిడి చేస్తున్న పరమోత్కృష్టమైన సంకల్పాన్ని నెరవేర్చేవారిగా మాత్రమే. వారు

చేస్తున్న పనికి ఎవరి నిర్బంధమూ లేదు. నరనరాల్లో జీర్ణించుకుపోయిన అమరవిధి నిర్వహణయే అందుకు కారణం.

"కామ్రేడ్ కాప్టెన్! మీరు కూడా కాస్త భోంచేయండి," అన్నాడు మాయ్ బొరొద ప్రధానంగా తన ఆత్మసంతృప్తి కోసం. ఎందువల్లనంటే అలాంటి సమయంలో అకీమొవ్ ఏమీ తినడని అతనికి తెలుసు. అకీమొవ్ ఆఖరికి సమాధానం కూడా చెప్పలేదు. అతడు ఎదురు చూస్తున్నాడు. హఠాత్తుగా మెల్లగా ఫోన్ మ్రోగింది. 'లిలాక్' (పొగొ స్యాన్ రహస్యనామం) ఆ తర్వాత 'వైలెట్' (బేల్‌స్కి)లు తమ యూనిట్లు వ్యూహంగా ఏర్పడి పోరాటానికి సంసిద్ధంగా ఉన్నాయని తెలిపారు.

## 2

అకీమొవ్ గడియారం ముళ్లు ఎనిమిది వైపు కదిలాయి. పరిస్థితి భరింపరాని తీవ్రతతో ఉంది. హఠాత్తుగా ప్రథమ పర్యాయంగా ఫిరంగుల బారు ఏక సమయంలో గర్జించి ఆకాశాన్ని మార్మోగించాయి.

కందకం ఊగిపోయింది. ఉన్నచోటే పాతుకుపోయి గజగజా వణికిపోతున్న దూలం వైపు దృష్టిని కేంద్రీకరించాడు అకీమొవ్. ఆ దూలంనుండి అప్పుడప్పుడు మట్టిబెడ్డలు పడుతున్నాయి. ఫిరంగులు ఘోషిస్తున్నాయి. వాటి గర్జన ఒకప్పుడు ఒకే ఒక శక్తివంతమైన భయంకర మేఘధ్వనిగా విలీనమౌతోంది. మరొకప్పుడు విడిగా చిన్న చిన్నవిగా విభజింపబడుతున్నాయి.

అకీమొవ్ ఫిరంగిని కాల్చేందుకున్న రంధ్రందగ్గరికి వెళ్లాడు. మున్ముందు, విచ్ఛిన్నం కానటువంటి పొగమంచు దుప్పటి కప్పినట్లు ఉంది. కాల్పులవల్ల కలిగే పొగచే అది నెమ్మదిగా నల్లనౌతోంది. దగ్గరలో, యింకా కురుస్తూన్న సన్నని చినుకు అతని ముందు ఏటవాలుగా పరచిన వలవలె ఉంది.

ఫిరంగుల కాల్పులు అవగానే 'కత్యూష'లు ఒక్కుమ్మడిగా వినీలాకాశంలో రివ్వుమని వీచే పెనుతుఫాను వాయువులా పెడబొబ్బలు పెట్టాయి. అప్పుడు అకీమొవ్‌కు పొగమంచుచే మొద్దుబారిన ధ్వని ఒకటి తక్కువ స్థాయిలో వినిపించింది. అది దాడి సలుపుతోన్న మనుషుల ఆనందాతిశయాలతో నిండిన 'హుర్రా!' అనే ధ్వని. ఎలాగైతేనేం ఆ ధ్వనిని స్పష్టంగా గుర్తించవచ్చు.

ఇప్పుడా పొగమంచు నిస్సందేహంగా ఒక అడ్డే. ఆ పొగమంచు, కాల్పులాల కదలి కను ఫిరంగిదళాలు అనుసరించాలంటే కష్టమైయ్యేట్టు చేస్తోంది. అకీమొవ్‌ను ఆజ్ఞలు యివ్వనీయక అరికడుతోంది. పొగమంచులో ఏంజరుగుతోందో అది బహుదూరంలో ఉన్నట్టుగానూ, అసహజమైందిగానూ అగుపిస్తోంది, వెలుపలినుండి యే ప్రభావాన్నీ దానిమీద కలిగించడానికి వీల్లేకుండా.

అకీమొవ్ ఫోన్‌ద్వారా మొదటి కంపెనీతో మాట్లాడగలిగాడు. మెషీన్‌గన్ కాల్పులు వారిని ఆటంక పరుస్తున్నట్లూ ఆ పొగమంచులో పోరు జరుగుతున్నట్లూ వాళ్లు నివేదించారు.

"మెషీన్‌గన్ కాల్పులు ఎటునుండి జరుగుతున్నాయి?" అకీమొవ్ అడిగాడు.

"పార్శ్వపు కాల్పులు కుడివైపునుండి జరుగుతున్నాయి."

"శత్రువుల స్థావరాలకు మీరు చాలా దూరంలో ఉన్నారా?"

"మేం ఎలా చెప్పగలం? అలా ఉన్నట్టే అగుపించడంలేదు."

"ఏమైనా లఘుఆయుధాల కాల్పులు జరుగుతున్నాయా?"

"ఏమంత ఎక్కువగాలేదు."

"మీరు కూడా మెషీన్‌గన్ కాల్పులతో ఎదుర్కోండి. ముందుకు నడవండి. ఎక్కడా ఆగక పురోగమించండి."

బేల్‌స్కీ కమాండ్‌క్రింద ఉన్న రెండవ కంపెనీ స్థితి ఏమీ బాగాలేదు. వాళ్లు నదిని దాటిన క్షణంలోనే తీవ్రమైన కాల్పులకు లోనుకావలసి వచ్చింది. గట్టుమీది గడ్డిలో నేలకి ఆనుకొని పడుకోవలసి వచ్చింది.

"మెరుపులాగా ముందుకు పరుగెత్తండి, కందకం చేరుకోండి," అని అకీమొవ్ అన్నాడు. " 'లిలాక్' బాగా పురోగమించాడు. మీరు వెనుకబడుతున్నారు."

బహుశ ఎవరో వాతావరణం ఎంత చెడ్డగా ఉన్నా దానిని కప్పి పుచ్చేందుకై ఏదో ఊహతో కూడిన లేదా హాస్యధోరణిలోని మానసికావస్థలో వివిధ యూనిట్లకు రహస్యపు పేర్లుగా పువ్వుల పేర్లిచ్చి ఉంటాడు. మంచు, వర్షం, బురద నీటితో నిండిన వాతావరణంలో 'లిలాక్', 'వైలెట్', 'జస్మీన్', 'ఈరిస్' అని పిలవడం విచిత్రమనిపిస్తుంది. ఉదాహరణకి ఫిరంగి రెజిమెంట్ 'డెయ్‌సీ' అనీ, నాశనం చేసే గార్డ్ రెజిమెంట్ల 'కత్యూష' మోర్‌టార్‌లను 'బ్లూబెల్' అనీ పిలవడం. భయంకర పరిస్థితిల్లో

ఒకరినొకరు రకరకాల పూలు, అడవి పూలు, పొలాల్లోని పూలు, తోటల్లోని పూల పేర్లతో పిలుచుకోవడం అనేకమైన అనవసరపు జ్ఞాపకాలను మెదడులో తెచ్చిపెడుతున్నాయి.

ఈలోగా, మన కాల్పులవల్ల కాసేపు నిశ్శబ్దంగా ఉన్న జర్మన్ ఫిరంగిదళం పేర్కోదగినంతగా మరింత ఎక్కువ తీవ్రతను వహించింది. మన ఫిరంగిదళం అందుకు సమాధానం చెప్పింది. ఈవిధంగా యీ రెండు ఫిరంగిదళాల మధ్యా ద్వంద్వ యుద్ధం ప్రారంభమైంది. అవతలి కందకంబసనుండి ఎక్కువ తరచుగా, ఒత్తిడి చేస్తూ ఫిరంగి దళాలకు ఆజ్ఞలు వస్తున్నాయి. ష్రాప్నెల్ గుళ్ళు, పెద్ద ఎత్తున బద్దలయ్యే గుళ్ళు, తుత్తునియలు అయిన తర్వాత కూడా పేలే గుళ్ళు, వివిధ కోణాల ఎత్తులలో, వివిధ పరిమాణాల్లో, ఒంటి ఫిరంగులతోగానీ, మొత్తం బేటరీలతోగానీ, ఒక్కొక్కప్పుడు మొత్తం ఫిరంగిదళంతోగానీ, పాలమాదిరిగా తెల్లగా ఉన్న ఆ పొగమంచు చీలికను ఎర్రని నిప్పు మాదిరిగా మార్చుతూ ప్రేల్చబడ్డాయి.

చివరికా మంచు తొలగిపోయింది. ఎంతో సేపటినుంచి ముందలి ప్రాంతాన్ని చూసేందుకై నిరీక్షిస్తున్న అకీమొవ్ కళ్లముందు యిప్పుడా ప్రాంతం స్పష్టంగా నిలిచింది. కాని అక్కడ ప్రత్యేకమైన అభిరుచిని కలిగించేదేదీ లేదనిపించింది, ఏదో అప్పుడప్పుడు చిన్న ఆకారాలు, గోధుమ వర్ణం ఓవర్‌కోట్లలో అటూ ఇటూ పరుగెత్తడం, దాదాపు మట్టిలో కలిసిపోయారా అన్నంతటి క్రిందికి వంగి నేలకు నక్కుకుపోవడం తప్ప. చాలా కొద్దిమంది మాత్రమే అక్కడున్నట్లనిపిస్తుంది. వాస్తవానికి కొద్దిమందే అక్కడున్నారు.

''ఎందుకని ఆగిపోయారు?'' అని ఫోన్‌లో అకీమొవ్ పెద్దగా కేకలేస్తున్నాడు. ''అర్ధమౌతోందా 'వైలెట్'? ఎందుకని ఆగిపోయారు?''

కాని బేల్‌స్కీ అందుకు సమాధానం చెప్పకముందే టెలిఫోను తీగె తెగిపోయింది. సిగ్నల్ మనుషులు దానిని బాగు చేసేందుకు పూనుకోగానే పొగొస్యాన్‌తో ఉన్న టెలిఫోను తీగె కూడా చచ్చుబడిపోయింది. సరిగ్గా అప్పుడే గొలొవీన్ ఫోన్ చేశాడు:

''అకీమొవ్! పరిస్థితిని నివేదించు.''

అతని టెలిఫోను తీగె కూడా తెగిపోయింది.

''నేను బేల్‌స్కీ వద్దకు వెళ్తాను.'' అన్నాడు రేమిజొవ్. ''పాపం ఆ దురదృష్టవంతుడు పూర్తిగా చిక్కుకు పోయాడు.''

అకీమొవ్ తలపంకించి మళ్లీ టెలిస్కోపు దగ్గర కూర్చున్నాడు.

పొగొస్యాన్ లైను పని చేస్తున్నప్పుడు, తాను జర్మన్ కందకాల్లోకి చొరబడినట్టూ, అక్కడ పోరుసలుపుతున్నట్టూ అతడు విజయవంతంగా నివేదించాడు.

''తెలిసిందా?'' అని ఉత్సాహోద్రేకం శిఖరాన్నందుకొనగా పొగొస్యాన్ పెద్దగా అరచాడు. ''అర్ధమైందా లేదా? అక్కడ కత్తుల కంచెలు, బాంబులు ప్రేలే రహస్యపు స్విచ్చిలూ ఉన్నాయి. నేను యిప్పుడు ధ్వంసమైన వాటిని తీసివేసి దోవ శుభ్రం చేస్తున్నా. వాళ్లంతా కూడా పోరులో ఉన్నారు. అర్ధమయిందా లేదా? పరిస్థితి ఏమీ బాగా లేదు.''

''పరిస్థితి దృఢపర్చుకో,'' అకీమొవ్ అతనితో అన్నాడు. ''బేల్‌స్కీకి సహాయం చెయ్యి. నీ ఎడమవైపు శత్రు కందకాన్ని తుడిచిపెట్టేయి. నీ మోర్‌టారులను సిద్ధంగా ఉంచు. టాంకువిధ్వంసక ఫిరంగిని కదలించు. శత్రువులంతా గ్రామంలో ఒక చోటుకు చేరడం నేను చూడగలుగుతున్నాను. మీ మెషీన్‌గన్‌లు నాకు వినిపించడంలేదే?''

''వాళ్లు వస్తున్నారు. తెలిసిందా? అదిగో వచ్చేశారిక్కడికి. ఈ ప్రదేశమంతటా రహస్యపు ఫిరంగి స్థావరాలు, నేల బాంబులు ఉన్నాయి.''

''బేల్‌స్కీకి సహాయం చెయ్యి. అతడు చిక్కుకుపోయాడు. అతనిని ఏం ఆటంక పరుస్తోందో నీవు చూడగలుగుతున్నావా?''

''బేల్‌స్కీయా? ఏం ఆటంకపరుస్తోందనా? ఏమీ ఆటంకపరచడంలేదే! అతడు ఎందుకు ముందంజ వేయడంలేదో నాకర్థం కావడంలేదు. ఇక్కడ నిజంగా యమయాతనగా ఉంది. అర్ధమౌతోందా? కాని బేల్‌స్కీ విభాగం మాత్రం శ్మశానంలాగా మౌనంగా ఉంది.'' అతడు కాసేపు ఆగాడు. ఆ తర్వాత నెమ్మదిగా అన్నాడు: ''ఇక్కడ మేం రెండు మెషీన్ గన్లను వశపరచుకున్నాం.'' మరీ నెమ్మదిగా అన్నాడు: ''రెండు సారా చెక్కపెట్టెలు కూడా.''

''దానిని **ఎవరూ** ముట్టకుండా చూడు,'' అని అకీమొవ్ హెచ్చరించాడు. ''లేకపోతే నేనక్కడికి వచ్చింతర్వాత నానా గొడవ చేయవలసి ఉంటుంది.''

త్వరలోనే బేల్‌స్కీతో సంపర్కం ఏర్పడింది.

''నేల బాంబులవల్ల ఆటంకం కలిగింది. ఈ ప్రదేశమంతా వాటితో నిండి ఉంది, కామ్రేడ్ కాప్టెన్,'' అని అతడన్నాడు.

''సాపర్లు ఎక్కడ?''

''ఇక్కడే పని చేస్తూ ఉన్నారు. కాని ఇక్కడ లెక్కలేనన్ని నేల బాంబులు.''

''పాగొస్యాన్ ఎంత ముందుకు వెళ్లాడో చూడు. అతడు అప్పుడే వాళ్ల కందకాల్లోకి వచ్చేశాడు.''

''అతడు అదృష్టవంతుడు. శత్రువులు ఏవిధమైన ప్రతిఘటనా చేయడంలేదు...''

''ఇక చాలు,'' అని అకీమొవ్ మాటనడ్డాడు. ''అతనికిదేం పూలమీద నడక కాదులే. రేమిజొవ్ ఎక్కడ?''

రేమిజొవ్ రిసీవర్ అందుకున్నాడు.

''రేమిజొవ్,'' అకీమొవ్ అన్నాడు, ''బేల్‌స్కీ ఏదో ఆషామాషీగా ఎంచుతున్నాడు. విశేషం ఏమిటో కాస్త చూడు. అతడు గనక తన పనిని సరిగా నిర్వహించకపోతే కోర్టు మార్షల్‌కు గురికావలసి వస్తుందని హెచ్చరించు.''

ఒక నిమిషం తర్వాత ఫోన్‌మీద గొలొవీన్‌నుండి అకీమొవ్ అదే విన్నాడు: ''ఈ పనిలో నువ్వు విజయాన్ని సాధించక పోయినట్లయితే నిన్ను కోర్టుమార్షల్ చెయ్యవలసి ఉంటుందని డివిజనల్ కమాండర్ నీతో చెప్పమన్నాడు.''

''ఓ. అలాగా,'' అని అకీమొవ్ గొణిగాడు.

''నీతో నన్ను కూడా,'' గొలొవీన్ ముగించాడు.

''ఇద్దరినీ అవుతే మరీ గమ్మత్తుగా వుంటుంది.''

త్వరలోనే జర్మన్లు పాగొస్యాన్ విభాగంపై తిరుగుదాడి సలిపారు. జర్మన్‌ల ఆకారాలు అకస్మాత్తుగా పెట్టెలోనుంచి పైకివచ్చే బొమ్మలా పైకీ క్రిందికీ వస్తున్నాయి. ఏదో పన్నాగంతో ఎవరో వారినెప్పుడూ క్రిందికి లాగుతూన్నట్టూ, క్రింద పడకుండా ఉండేందుకు ప్రయత్నం చేస్తున్నట్టూ వారు కొండమీదినుండి క్రిందికి దొర్లుతున్నారు. శత్రువుల రెండో శ్రేణి కందకాల్లో కాల్బలాలు కేంద్రీకృత మౌతున్నాయి.

'కత్యూష'లు మరొకసారి ఒక్కుమ్మడిగా కాల్పులు సాగించాయి. శత్రువుల ముందలి ప్రాంతంపై అగ్నిజ్వాలలు పైకి లేచాయి. అవి తొలగిపోగానే జర్మన్లు వెనక్కి పారిపోతుండడాన్ని అకీమొవ్ చూశాడు.

''కాళ్లకు బుద్ధి చెప్పతున్నారు,'' మాయ్‌బొరొద అన్నాడు. ఆ తర్వాత అతడు ''భలే, సేర్ గూట్,'' అని జోడించాడు. —

ఆ చీటకందకంలో సిగరెట్లు వెలిగాయి. గొంతులు రహస్యంగా మాట్లాడడం ప్రారంభించాయి. ప్రతి వ్యక్తీ ఉద్రిక్తుడైనట్టు కనిపిస్తుంది.

క్షతగాత్రులను త్వరత్వరగా తీసుకువెళ్లారు. వాళ్లల్లో కొంతమంది పైకి విని పించీ వినిపించనట్టు మూలుగుతున్నారు. మరో ముగ్గురు గాయపడిన వ్యక్తులు, దాక్కో డానికి కూడా ప్రయత్నంచేయకుండా, వారికి తగిలిన గాయాలకంటే మించిన గాయాలు యిక తగలబోవనే నమ్మకంతో, బహిరంగ ప్రదేశంలోకి నెమ్మదిగా మౌనంగా తిరిగి వచ్చారు. అకీమొవ్ ఒళ్లు మండి పోయింది. అతడు తన కందకంబసనుండి తలపైకెత్తి అరచాడు: "మీకు మతిపోయిందా? దాక్కోండి!"

ఆ వ్యక్తులు విధేయతతో బీటకందకంలోకి వెళ్లి పర్యవేక్షక స్థావరానికి చేరు వలో నక్కుకొని దాగున్నారు.

జర్మన్ల తొలి తిరుగుదాడి తర్వాత మరో మూడు టాంకుల అదనపు సహాయంతో రెండో దాడి ప్రారంభమైంది. అవి కూడా అయిష్టతతో వున్న సైనికులలాగానే కంద కాలలో ఉన్న మనవాళ్లవద్దకు వంకరటొంకర నడకతో వస్తున్నట్లనుపిస్తోంది. సరిగ్గా అప్పుడే, ఎంతో అవసరమైన సమయంలో, టెలిఫోన్ లైను మళ్లీ చెడిపోయింది.

"ఒరేష్కిన్, పొగొస్యాన్ వద్దకు వెళ్లు," అని అకీమొవ్ పిలిచాడు.

"లెఫ్టినెంట్ పొగొస్యాన్ మరణించాడు," అని అకీమొవ్ ఆజ్ఞ ప్రకారం బీటకందకంలో తలదాచుకొని 'మఖోర్కా' పొగాకు త్రాగుతున్న ఆ ముగ్గురు క్షత గాత్రులలో ఒకడు సమాధానం చెప్పాడు.

"మరణించాడా?" అని మళ్లీ అన్నాడు అకీమొవ్. కొంతసేపు మౌనం వహించిన తర్వాత అన్నాడు: "ఒరేష్కిన్, ఒకటో నంబరు కంపెనీని నీ క్రిందికి తీసుకో."

అతడు టెలిస్కోప్‌లో చూస్తూనే టెలిఫోన్ పైకెత్తి అన్నాడు: "హల్లో, 'లిల్లీ'! ఆ టాంకులమీదికి కవచాన్ని చొచ్చుకుపోయే గుళ్లని పేల్చు. విన్నావా?"

అప్పుడు డివిజనల్ కమాండర్ అతనిని వైర్‌లెస్ టెలిఫోన్‌పై పిలిచాడు. "మేం మొదటి కందకాన్ని పట్టుకున్నాం. కాని శత్రువులు మాపై బాగా ఒత్తిడి తీసుకొస్తు న్నారు," అని అతడు నివేదించాడు.

వామపార్శ్వ సైన్యాన్ని గురించి కమాండరు అడిగాడు. "'వైలెట్' వెనక బడ్డాడు," అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. "రేమిజొవ్ అక్కడికి వెళ్లాడు. మేం దాన్ని సరి చేస్తాం. తిరుగుదాడికై శత్రువులు ఆ గ్రామంలో కేంద్రీకరిస్తున్నారు — దానిపై గుళ్లు కురిపిస్తే బాగుంటుందని నేను అనుకుంటున్నాను."

చివరికి రేమిజొావ్ ఫోన్ చేశాడు. ''మేం సంబాళించుకోగలిగాం,'' అని అతడ న్నాడు. ''మేం రెండు సందులు చేసుకున్నాం. ఫిరంగిదళాన్ని నలుచదరపు తోటలో ఉంచు. అక్కడ రెండు మెషీన్‌గన్‌లు ఉన్నాయి.''

మరుక్షణాన్నే ఫిరంగిదళంవారు కోరిన ప్రకారం చేశారు. రేమిజొావ్ ఫోన్‌నుండి కదలకుండానే అధిక ఉత్సాహంతో యిలా రిపోర్టు చేశాడు: ''చాలా బాగుంది. సరిగ్గా తగల వలసిన చోటే తగిలింది. జర్మన్ స్థావరంమీదే సూటిగా తగిలింది. గురి అంటే అదీ! వాళ్లను మా తరఫున అభినందించండి. ఇప్పుడు మేం రొచ్చులోనుండి బైటపడ్డట్టే.''

ఫిరంగిదళంవారి అద్భుతమైన పనికి రెండో కంపెనీ సైనికులు ప్రోత్సాహాన్ని పొంది, క్రిందికి వంగి నక్కకుండానే ముందుకు చొచ్చుకుపోతున్నట్టు అకీమొవ్ స్వయంగానే చూడగల్గాడు. త్వరలోనే వార్తాహరుడు పరుగునవచ్చి శత్రువుల కందకంలోకి రెండవ కంపెనీ చొచ్చుకు పోయిందనీ, అక్కడ ముఖాముఖి యుద్ధం జరుగుతోందనీ చెప్పాడు.

ఈ విషయాన్ని అకీమొవ్ రెజిమెంటల్ కమాండరుకు నివేదించగానే మేజర్ గొలొవీన్ అన్నాడు: ''నా రిజర్వు దళాలనుండి నేను నీకు ఒక ప్లాటూన్ పంపుతున్నాను. నీ ఇచ్ఛ ప్రకారంగా ఆ పటాలాన్ని ఉపయోగించు.'' అతడు కొంతసేపు మౌనంగా ఉండి అడిగాడు: ''శత్రువుల కందకాన్ని ఆక్రమించుకొనే ఉండగలవా?''

''ఉండగలను,'' అని అకీమొవ్ సమాధానంచెప్పాడు.

అతడు రిసీవర్‌ను క్రిందపెట్టేశాడు. అతని మనసులో కలిగిన ప్రథమ భావన పొగొస్యాన్ గురించి. అతనికెప్పుడూ మంచి భోజనమంటేనూ, మంచి మధువు అంటేనూ ఎక్కువ యిష్టం. అతనికి ఆడవాళ్లంటే కూడా ఎంతో యిష్టం. ఎవరైనా అమ్మాయి కనిపిస్తే, అందంగా ఉండనీ, మామూలుగా ఉండనీ, వయసులో ఉన్నా సరే వయసు మీరుతున్నా సరే, అతని కళ్లు మిరుమిట్లు గొలిపేవి. అతడు వాళ్లను నిస్వార్థంగా, కళాఖండాలను చూసి ప్రేమించేవాళ్ల మాదిరిగా ప్రేమించేవాడు. ''వాళ్లను కనిపెట్టింది ఎవరైతేనేం అతడు మాత్రం మహా గొప్పవాడండీ.'' అని అతడు ద్వేషంతో కాకుండా బిడియంతో అంటుండేవాడు. పాపం అబ్బ! ఏమి తిండి తినేవాడు పొగొస్యాను! అతడు సరిగ్గా రేమిజొావ్‌కు వ్యతిరేకమైన మనిషి.

అకీమొవ్ నెమ్మదిగా ఫోన్‌ను పైకెత్తి 'వైలెట్'ను పిలిచాడు. వాళ్లు సమాధానం చెప్పగానే అతడు అన్నాడు: ''పర్యవేక్షక స్థావరం వద్దకు వచ్చి నాకు రిపోర్టు చేయమని రేమిజొావ్‌తో చెప్పు. అర్థమయిందా? మళ్లీ చెప్పు.''

అకీమొవ్ మాటల్నే 'వైలెట్' మళ్లీ చెప్పాడు.

అకీమొవ్ సిగరెట్టు వెలిగించి, తక్కువ ధ్వనిలో వినబడుతున్న వ్యక్తుల సంభాషణను విన్నాడు.

''యుద్ధ సమయంలో క్రిందుగా ఉన్న మేఘాలంటే నాకు యిష్టం,'' అన్నాడు మాయ్‌బొరొద.

''అవును. ఇది విమాన యుద్ధానికి సరియైన వాతావరణం కాదు,'' అని టెలిఫోన్ ఆపరేటరు అంగీకరించాడు.

''మేం యేల్న నగరంవద్ద యుద్ధం చేస్తున్నప్పుడు...'' అని మరో సైనికుడు మొదలుపెట్టాడు జ్ఞాపకం చేసుకుంటూ.

''ర్జేవ్ వద్ద...'' అంటూ మరొకడు అడ్డుగా మాట్లాడాడు.

మళ్లీ జనరల్ అకీమొవ్‌ను వైర్‌లెస్‌పై పిలిచాడు.

ఈసారి డివిజనల్ కమాండరు బాగా సంతృప్తి చెందాడు.

''ధన్యవాదాలు అకీమొవ్! తట్టుకొని నిలబడగలవా?''

''తప్పకుండానూ, జనరల్,'' అకీమొవ్ సమాధానం చెప్పాడు.

ఈ సంభాషణ ముగిసిన వెంటనే ఒరేష్కిన్ తన మనుషులు శత్రువుల కందకంనుండి వెళ్లగొట్టబడ్డారని రిపోర్టు చేశాడు. ''నేను వస్తున్నాను,'' అన్నాడు అకీమొవ్.

అతడు లేచి తన ఓవర్‌కోటు గుండీలు పెట్టుకున్నాడు. అదే సమయంలో మాయ్‌బొరొద పైకిలేస్తూ పేలవమైపోయాడు. కాని అకీమొవ్ మళ్లీ కూర్చున్నాడు. మాయ్‌బొరొద నిట్టూర్చి తాను కూడా అలాగే కూర్చున్నాడు.

అప్పుడు ఒక చిన్న జూనియర్ లెఫ్టినెంట్ కొనదేరిన ముక్కుతో తన పెద్ద కళ్లతో రెప్ప వేయకుండా చూస్తూ ప్రవేశించాడు.

''ప్లాటూన్ కమాండర్, జూనియర్ లెఫ్టినెంట్ ఫిల్‌కోవ్‌ను. మీ క్రింద పని చేసేందుకై నన్ను పంపించారు,'' అని అతడన్నాడు.

''నీ వద్ద ఎంత మంది జనం ఉన్నారు?'' అకీమొవ్ అడిగాడు.

''పద్దెనిమిది మంది.''

''ఏమంత పెద్ద సంఖ్య కాదు.''

అకీమొవ్ చుట్టూ పరికించాడు. పర్యవేక్షక స్థావరంనుండి వెనుక వైపు బీట కందకం చాలా దూరంవరకు ఉండడాన్నీ, ఎక్కడా ఆగకుండా కాల్పులు జరుగుతుండ

డంవల్ల మనోనిశ్చయం లేకుండా అక్కడ వార్తాహరులతోనూ సిగ్నల్ మనుషులతోనూ క్షతగాత్రులు కూర్చొని, నిలబడి ఉండడాన్నీ అతడు గమనించాడు.

"వంటింట్లో ఉన్న మకారిచెవ్ వద్దకు పరుగెత్తు. అతనితోనూ, వంట యింట్లోని మనుషుల్తోనూ, డ్రైవర్లతోనూ చెప్పు ఎంత త్వరలో రాగలిగితే అంత త్వరలో యిక్కడికి రమ్మనమని. అక్కడ ఎవరూ మిగిలిపోకుండా చూడు, వాళ్ళందర్నీ యిక్కడికే తీసుకురా," అని అకీమొవ్ మాయ్‌బొరొదతో చెప్పాడు.

మాయ్‌బొరొద వెళ్లాడు. కందకంబస దర్వాజా వద్దకు వెళ్లాడు అకీమొవ్.

"ముగ్గురు సిగ్నల్ మనుషులు, వైర్లెస్ ఆపరేటరూ యిక్కడ ఉంటారు. మిగతా వాళ్లంతా జూనియర్ లెఫ్టినెంట్ ఫిల్‌కోవ్ వద్ద పనికై హాజరుకండి. కొద్దిగా గాయాలు తగిలినవాళ్లు కూడా," అని ఆజ్ఞాపించాడు అకీమొవ్.

అతడు మళ్లీ ఆ ఫిరంగి కాల్చేందుకున్న రంధ్రం వద్దకు వెళ్లిపోయాడు. ఒక నిమిషం వరకు పెరిస్కోప్‌లో చూశాడు. తర్వాత అతడు లెఫ్టినెంట్‌వైపు తిరిగి అడిగాడు: "యుద్ధరంగంలో చాలాకాలంనుండి పనిచేస్తున్నారా?"

"ఇది నా రెండో రోజు, అయినా నా చేతనైనంత వరకూ చేస్తాను," అని సమాధానం చెప్పాడు ఫిల్‌కోవ్.

"తెలిసింది," అని అకీమొవ్ స్నేహంగా అన్నాడు అతనిలో నమ్మకాన్ని కలుగజేస్తూ.

త్వరలోనే 'వెనుక భాగంలోని కుర్రాళ్లు', మకారిచెవ్, మరో ఎనమండుగురు వచ్చారు. ఏంచేయవలసి ఉందో ఫిల్‌కోవ్‌కు అకీమొవ్ విపులీకరించి చెప్పాడు. ఆ తర్వాత అన్నాడు: "మీరు ఒరేష్కిన్ వద్దకు చేరీచేరగానే ఫోన్‌ద్వారాగానీ, వార్తాహరుని ద్వారాగానీ రిపోర్టు చెయ్యండి. మరో కాస్సేపు ఫిరంగికాల్పులను సాగించమని డివిజన్ కమాండర్‌ను అడుగుతాను."

అకీమొవ్ ఫిల్‌కోవ్‌తోపాటు బీటకందకంలోకి వెళ్లాడు. రెండు వందల గజాలు నడవగానే అతడు దగ్గర్లో జూనియర్ లెఫ్టినెంటు ప్లాటూన్‌ను ఆ కొండ కనుమలో చూశాడు. అతడు సమీపిస్తుండగా వాళ్లు లేచి నిలబడ్డారు. వాళ్లు చాలా అలసిపోయినట్టు అగుపించారు. అయినా వాళ్లు ప్రశాంతంగానూ, ధైర్యంతోనూ ఉన్నారు.

ఫిల్‌కోవ్ తన ప్లాటూన్‌కు ఆధిపత్యం వహిస్తూ మామూలు ధోరణిలో నమస్కారం చెప్పి తన దళాన్ని నడుపుకుంటూ వెళ్లిపోయాడు. మకారిచెవ్ వెనకకు వచ్చాడు. అతని మొహం

ఎర్రబారిపోయింది. చెమటలు కారుతున్నాయి. కొద్దిగా కుంటుతున్నాడు. అతడు ఆ దళానికి కొద్దిగా వెనకబడి భయపడిపోయిన తన దౌర్భాగ్యపు కళ్లను అకీమొవ్‌పై నిలిపి అడిగాడు:

"కామ్రేడ్ కాప్టెన్, మరి భోజనంమాట. ఎవరు వండిపెడతారు?"

"నేను," అని అకీమొవ్ నిర్దాక్షిణ్యంగా సమాధానం చెప్పాడు. ఆ తర్వాత అతడు పర్యవేక్షక స్థావరానికి వెళ్లాడు. అక్కడ రేమిజొవ్ పొగతోనూ బురదతోనూ పైనుండి క్రిందివరకూ నల్లబడిపోయి అకీమొవ్ కొరకు ఎదురు చూస్తున్నాడు. అతని కళ్లు కళ్లజోడువెనుక ఉద్రేకంతో నిగనిగలాడుతూ మెరుస్తున్నాయి.

"చేతి బాంబులతో మేం తిరుగుదాడిని తిరిగి దెబ్బకొట్టాం," అని అతడన్నాడు.

"నాస్థానే నువ్విక్కడుండు. గొలొవీన్‌కు తెలుపుతూ ఉండు పరిస్థితిని. నేను ఒరేష్‌కిన్ వద్దకు వెళ్తున్నాను."

"కాని, అతడెక్కడున్నాడు?"

"పొగొస్యాన్ స్థానంలో. పొగొస్యాన్ మరణించాడు."

"నిజంగానా? నేను అతనిని చూసి గంటైనా దాటలేదే," అన్నాడు రేమిజొవ్.

"వెళ్దాంపద," అని అకీమొవ్ మాయ్‌బొరొదతో అన్నాడు.

## 3

వాళ్లు బీటకందకంగుండా వెళ్లి ఆ తర్వాత మరో కందకంలోకి మళ్లారు. శత్రువులు మోర్‌టార్ బాంబుల్ని ప్రయోగిస్తున్నారు. అవి నాలుగు వైపులా బ్రద్దలౌతున్నాయి. "ఏం అవసరముందని యీయన ముందుకు వెళ్తున్నాడు?" అని మాయ్‌బొరొద అలసిపోతూ, రవాణా కందకపు గోడను కౌగలించుకొని ఆశ్చర్యపోయాడు. "అతని పని బటాలియన్‌కు ఆజ్ఞలు యివ్వడమేగాని, ముందలి ప్రాంతంలోకి జొక్యం కలుగచేసుకొనేందుకై వెళ్లడం కాదు." అతడు కొంచం కోపంగా అకీమొవ్ ప్రశాంతమైన మెడ వెనుక భాగాన్ని రెప్ప వేయకుండా చూశాడు. "అతనిని వెళ్లమని ఎవరు చెప్పారు? అలా అని అతనికి ఆజ్ఞలుగనక వచ్చినట్లయితే అది వేరే విషయం. కాని అక్కడికతను స్వయంగానే వెళ్తున్నాడే. ఎందుకో భగవంతునికే తెలియాలి..."

జర్మన్ గుళ్లు బ్రద్దలైనప్పుడల్లా అకీమొవ్ కొంచం పెద్దగా, ఆమోదిస్తున్న ధ్వనితో అన్నాడు: "చాలా బాగుంది. బాగా చేశారు. బాగుంది."

శత్రువులు తరచూ తీవ్రంగా కాల్పులు సాగిస్తున్నందుకు అతనికి నిజంగా సంతోషనఃనిపించింది. ఎందువల్లనంటే వాళ్ళు అలా చేయడంవల్ల మన ఫిరంగిదళ స్పాటర్లకు, శత్రువుల ఫిరంగుల స్థలాలను సరిగా నిర్ధారణ చేసుకొనేందుకు అవకాశం కలుగుతుంది. అదే యుద్ధనీతి.

"అదీ వరస," అని అతడు జరుగుతున్న కాల్పుల వైపు కోపంగా, ఆశతో కనుకొనలనుండి కుడివైపూ ఎడమవైపూ చూస్తున్నాడు.

నడుస్తున్న కొద్దీ కందకం సన్నమై క్రమక్రమేణా అంతమైపోయింది. ఒక సెలయేరు అక్కడికి ఎంతో దూరంలో లేదు. దాని గట్లు అగుపించడంలేదు. చుట్టుపట్ల ప్రదేశమంతా వరదతో నిండివుంది. కాని నీళ్లనుండి వెలుపలికి అగుపిస్తున్న గడ్డివలనా, గాలిలో గజగజా వణికి పోతున్న మృదువైన విల్లోమొక్కలవలనా ఆ గట్లను గుర్తించవచ్చు. ఆ గడ్డి పైభాగంమీది కాయలగెలలు తెగి ముక్కలైపోయాయి. నీటిపై వర్షం తొణికిసలాడింది. అక్కడికి దగ్గర్లో ఒక దిబ్బమీద ఆ చెమ్మనేలలో తల దాదాపుగా పూడుకుపోయేట్టు, కాళ్లు నీళ్లల్లో ఉండిపోయేట్టు ఒక టెలిఫోన్ ఆపరేటర్ నక్కుకొనివున్నాడు. అతడు స్పీకర్‌లో గొణుగుతున్నాడు: " 'మంచు బిందువు', 'మంచు బిందువు', 'మంచు బిందువు'! కామ్రేడ్ అకీమొవ్! కామ్రేడ్ అకీమొవ్!"

"ఇటు చూడు. నీ 'మంచు బిందువు' యిక్కడే, నీ ప్రక్కనే వుంది చూడు!" అన్నాడు అకీమొవ్.

ధారగా నీరు కారుతూన్న మొహాన్ని, అకస్మాత్తుగా తేజోవంతమైన మొహాన్ని ఆపరేటరు చూపించాడు.

"కామ్రేడ్ కాప్టెన్, ఫిల్‌కోవ్ వచ్చినట్టుగా 'లిలాక్' తెలుపుతున్నాడు. ఫిరంగి కాల్పులు ఎప్పుడు సాగించాలి అని అడుగుతున్నాడు."

"నేనిప్పుడే వస్తున్నానని చెప్పు. ఒరేష్‌కిన్ ఎక్కడ?"

"అదిగో అక్కడ!" అని ఆపరేటరు అవతలి గట్టుమీది పొదలవైపు చూపించాడు.

నిటారుగానిలబడి నడిచాడు అకీమొవ్. నూయ్‌బొరొద కూడా తప్పనిసరిగా అలాగే చేయవలసి వచ్చింది. అతని భయానికి మేరలేదు. ప్రతిజర్మనూ, బెర్లిన్ వరకూ తనను చూడగలడని అతడు భావించాడు.

ధ్వంసమైపోయిన వంతెన కంబాలనూ, రాళ్లనూ, అక్కడక్కడా పైకి లేచిన దిబ్బలను పట్టుకొని వేలాడుతూ వారు ఆ నదినీ, దాని గట్లమీది వరద ప్రాంతాన్నీ దాటారు. పసుపురంగుగల మేపిల్ చెట్టు ఆకుల్ని ఊడ్చుకుపోతూ నీళ్లు వారి కాళ్లక్రింద జలజలమన్నాయి. అవతలి వైపు గట్టు నిటారుగా లేకపోవడంచే త్వరలోనే నీళ్లు లోతు లేకుండా అయిపోయాయి. కొత్తగా ఎక్కువ లోతులేకుండా తవ్విన కందకాలు ఆ మరు క్షణానే వారి దృక్పథంలోకి వచ్చాయి. ఏదో కొద్ది కాలంకోసం వాటిని మా సైనికులు తవ్వారనడం స్పష్టంగా కనిపిస్తోంది. అక్కడికి యింకా కొంత దూరంలో ఫిల్‌కోవ్ మనుషులు కొన్ని పొదలక్రింద పడుకొని ఉన్నారు. అకీమొవ్ వారి వైపు చూశాడు. వంట మనిషి మకారిచెవ్ అప్పటికే కాస్త ధైర్యాన్ని కోల్పోని అక్కడి మను షులకు కథ చెప్పడం అకీమొవ్ పరికించాడు. వారు లోలోన నవ్వు ఆపుకుంటూ అతని కథ వింటూనే యుద్ధరంగంవైపు చూస్తున్నారు.

ఒరేష్‌కిన్, ఫిల్‌కోవ్, కాప్టెన్ ద్రోజ్‌ద్‌లు ఒక బీటకందకంలో కూర్చున్నారు. "ఎలా నడుస్తోంది?" అని అకీమొవ్ వాళ్లపైకి ఒరగి అడిగాడు.

ఒరేష్‌కిన్ పెదవులపై ఆనందంతో నిండిన చిరునవ్వు తారాడింది. అకీమొవ్ రాకతో పరిస్థితి అంతా మారిపోయిందన్నట్టుగా అతని అందమైన మోములో సంతోషం వెలుగొందింది. "నువ్విక్కడ ఎందుకు కూర్చున్నట్టు?" అకీమొవ్ గొంతులో నిరసన గోచరించింది. "పొగొస్యాన్ యీ కందకాన్ని పట్టుకోగలిగాడు. నువ్వు వాళ్లచే యిందు లోనుండి తరిమివేయబడ్డావు. ఇప్పుడేమో పండ్లికిలిస్తున్నావ్. నిన్ను కోర్టు మార్షల్ చేస్తాలే. ఎక్కడ నీ మనుషులు?"

ఒరేష్‌కిన్ తెల్లబోయాడు. కందకంనుండి వెలుపలికి వచ్చాడు.

"నీ రికన్నాయ్‌సెన్స్ మనుషులెక్కడ?" అని అకీమొవ్ ద్రోజ్‌ద్ వైపు తిరిగి అడిగాడు.

"ఇక్కడే నాతోనే ఉన్నారు."

"ఇతరులతో పాటు వాళ్లను కూడా ముందుకు వెళ్లేట్టు చూడు. ప్రతివ్యక్తీ ఏంతో విలువైన మనిషిప్పుడు."

"నాకు ఆ హక్కు లేదు — ఇది వాళ్ల పని కాదు. వాళ్లకు వేరే పనులున్నాయి," అన్నాడు సమాధానంగా చిరచిరలాడుతూ ద్రోజ్‌ద్.

"కాని వాళ్లు వాటినేవీ చేయడంలేదు," అన్నాడు అకీమొవ్ కఠినంగా మారిన ముఖవర్చస్సుతో. "వాళ్లు గనక యిక్కడే తారాడుతున్నట్లయితే, వాళ్ల జన్మలో ఏవీ చేయలేరు."

" 'జస్మీన్', 'డైసీలు' ప్రారంభించబోతున్నారిప్పుడు," అని అరిచాడు బీట కందకంనుండి టెలిఫోన్ ఆపరేటరు.

ఫిరంగులు గర్జన మళ్లీ ప్రారంభమైంది. "నీ మనుషుల్ని మా వెనుకే తీసుకురా. మేం ఆ కాల్పులవరుస వెంట వెళ్తాం," అని ముందుకు నడుస్తూనే అకీమొవ్ ఫిల్‌కోవ్‌తో అన్నాడు.

ఒకటో నంబరు కంపెనీ సుమారు వంద గజాల ముందుకు ఉంది. వాళ్లు లేచి సగం ప్రాకుతూ ఆఫీసర్ల వెంట వెళ్తున్నారు. దురదృష్టవశాత్తూ కాల్పులు కొద్ది సేపటి వరకే, అంటే ఏడు నిముషాలవరకే జరిగాయి. బహుశ మందుగుండు సామగ్రి అయిపోయినందువల్ల కావచ్చు, లేదా వాళ్లకు ఆజ్ఞలు అంతవరకే యివ్వబడవచ్చు. అకీమొవ్ తీవ్రంగా తిట్టాడు. పొడుగాటి దృఢమైన శరీరంతో, అప్పటికే తుపాకీగుండ్లు రివ్వుమని అతని చుట్టూ దూసుకుపోతున్నప్పటికీ ఆతడు వాటిని లెక్కచేయకుండా ఠీవిగా నిలబడి ముందంజ వేశాడు. ఆతడు అకస్మాత్తుగా చెప్పరానంతటి పేలవమైపోయి, పిడికిలి బిగించి చేయిని పైకి విసరి, తుఫాను సమయంలో బహుశ నావికులు అరచే విధంగా ఊపిరితిత్తుల్లో శక్తి ఉన్నంత బలంకొద్దీ అరచాడు: "కామ్రేడ్స్, మన మాతృభూమికొరకై ముందంజ వేయండి," "శత్రువు ఎదుట రష్యన్ ఆయుధాల్ని అవమాన పరచకండి," అనే ఒక పుస్తకంలో సంపాదించిన సూక్తిని పైమాటలతో జోడించడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. తనకు కూడాను.

"హుర్రా!" అనే పదంతో యుద్ధభూమి మార్మోగింది. అంతా తుపాకులు కాల్చుకుంటూ శరవేగంతో ముందుకు పరుగెత్తారు; ఆయాసపడ్డారు, జారిపడ్డారు, క్రిందపడ్డారు. శక్తివంతమైన ఆ పిలుపు వాళ్ల చెవులలో యింకా మార్మోగుతూ ఉందేమో దాని ప్రభావంచే వారు మళ్లీ పైకి లేచారు. వెనుకనుండీ, సేనాపార్శ్వంనుండీ, మెషీన్‌గన్‌లు టపటపమన్నాయి. చేతిబాంబులు వాయువును చీల్చి వేశాయి. తర్వాత అంతా నిశ్శబ్దం. మాయ్‌బొరొద కందకంలో వున్న ఒక జర్మన్ మీదికి దుమికాడు. అతని తల పట్టుకున్నాడు. కోపోద్రేకంతో అతని తలవెనుక భాగాన్ని బురదలో రుద్దాడు. అప్పటికిగాని అతడీ ప్రపంచంలోకి రాలేదు. చుట్టూ పరికించాడు. కందకంనిండా మన

సైనికులు నిండి ఉన్నారు. మెషీన్‌గన్నులు, టాంకువిధ్వంసక గన్నులూ వాటివాటి స్థానాల్లో కాల్పులకై సిద్ధం చేయబడుతున్నాయి. అకీమొవ్ గొంతుకూర్చొని పిచ్చిగా తిడుతూ సమాధానం కొరకు కూడా ఎదురు చూడకుండా ఫోన్‌లో కేకలేస్తున్నాడు.

''కాల్చండి!'' అని అతడు అరచాడు. ''వెంటనే మందుగుండు సామగ్రి తెండి. విస్తారంగా చేతిబాంబులు, తోటాలతో నింపిన పీపాలూ తెండి. అక్కడ నిద్రపోతున్నారా వెధవల్లారా? నేను వచ్చి మీ పనిపడతాను. ఫిరంగిదళం ఆఫీసర్లను యిక్కడికి పంపండి. ఇక్కడ్నుంచి మీరు బాగా చూడొచ్చు!''

అతడు లేచినిలబడి ఒరేష్‌కిన్‌తో అన్నాడు: ''జాగ్రత్తగా నిలబెట్టుకో. అర్థమయిందా?'' అతని టోపీ తుపాకీగుండు దెబ్బకి ఎగిరిపోయింది. ''నీ పర్యవేక్షక స్థావరం యీ కందకంలోనే,'' అని అతడన్నాడు. ''నీవు పండ్లికిలిస్తూ కూర్చున్నావే ఆ పోద లోనే నా స్థావరం.'' అతడు చుట్టూ చూశాడు. బడలికతో నవ్వాడు: ''ఈ కందకం చాలా బాగా అమరింది — క్రమం అంటే జర్మన్లకు యిష్టం.''

ఆ కందకం నిజానికి చాలా బాగా నిర్మాణమైంది. ఆకర్షణీయంగా కూడా ఉంది. లోపలంతా చెక్కల్తో నిర్మింపబడింది. సమానమైన అనేక వంకర్లగా కూడా ఉంది. పడుకొనే వసతి కూడా చెక్కలతోనే కూర్చబడింది. నేలంతా తుంగచాపల్తో కప్పబడింది, నారింజ వర్ణం ప్లాస్టిక్ వెన్నపళ్లాలు కిందపడి ఉన్నాయి, సగంతిన్న భోజనంతో. చంపబడ్డ జర్మన్లూ, మన వాళ్లూ కూడా ఒకరి ప్రక్క ఒకరు అక్కడే పడి ఉన్నారు. శత్రువుల కందకాలను వశపరచుకున్న వాతావరణం అక్కడ స్పష్టంగా గోచరిస్తుంది. అవును, అక్కడి వాతావరణమే వేరు. ఆ వాసనే వేరు. వైరంతో నిండి వుంటుంది.

సైనికులతో సగం హాస్యధోరణిలోనూ, సగం తీవ్రధోరణిలోనూ ప్రసంగిస్తూ అకీమొవ్ పరిఖలగుండా వెళ్లాడు.

''కాబట్టి పరిశుభ్రమైన స్థలాన్ని మనం ఎలాగో సాధించగలిగాం. పొడిగా ఉంది — నీరు లేదు. దీనిని కాపాడుకొనేట్టు చూడు. మనల్ని తిరిగి వాళ్ల బురదా పేడ ల్లోకి తిరగ్గొట్ట నిచ్చేట్టయితే మీరు నిష్ప్రయోజకులన్నమాటే.''

అతడు అకస్మాత్తుగా మౌనం వహించాడు. అక్కడికి చేరువలో ఎక్కడో జర్మన్ మాట్లాడుతున్న స్త్రీ గొంతు వినబడింది. ఆమె అనిచ్కా. ఆమె చేతిలో ఒక నోటు

పుస్తకంతో కాళీగా ఉన్న మందుగుండు సామగ్రి పెట్టెపై ఒక ఖైదీని అడ్డప్రశ్నలు వేస్తూ కూర్చుంది.

"ఇక్కడెందుకున్నారు?" అకీమొవ్ అడిగాడు.

ఆమె పైకి చూసి అహంకారంతో తన గడ్డాన్ని ముందుకు చొనిపి సమాధానం చెప్పింది: "జర్మన్లు నన్ను యింతకంటే ముందుకు పోనివ్వరుగనుక."

సైనికులు లోలోన నవ్వుకున్నారు.

"హాస్యానికి కాదు చెప్పేది," అకీమొవ్ అన్నాడు మొహం ఎర్రనై. "ఇక్కడ మీరుండ తగిన స్థలం కాదు."

"సరే," అంటూ ఆమె అయిష్టంగా లేచి పైన వేసుకున్న ఓవర్‌కోటును మృదువుగా దులుపుకుంటూ "అతనిని మీరే ప్రశ్నించండి," అని ఎదురు దెబ్బ తీసింది.

"సరేలే, కాని యిది మాత్రం మీకు తగిన ప్రదేశం కాదు."

"నిజమే, కాని అతడు గాయపడ్డాడు. ఇక్కడినుండి కదల్లేడు."

ఖైదీవంక ఓరగా చూశాడు కాప్టెన్. నిర్లక్ష్యంగా సంజ్ఞ చేశాడు. "ఇంత ఘోరంగా వుంటుందని నువ్వు అనుకోలేదు కదూ," అని గొణిగాడు, కోపగించుకోవాలో నవ్వాలో తెలియక. ఆ అనువాదకురాలు ఖైదీతోపాటు వెనకకు వెళ్లి పాత పర్యవేక్షక స్థావరం వద్ద రేమిజొవ్‌తో ఉండాలని ద్రోజ్‌ద్, అతనూ కలిసి పట్టుపట్టారు.

అతడు మకారిచెవ్ కోసం అక్కడున్న సిపాయిల్లో వెతికి తీవ్రంగా ఉన్నట్టు నటిస్తూ అన్నాడు. "మీకు యుద్ధకార్యం వప్పగిస్తున్నా. వెనకకు వెళ్లు. రాత్రి భోజనం సిద్ధం చెయ్యి. అర్థమయిందా? ఊఁ వెళ్లు!"

బటాలియన్ వంటమనిషి, ఇద్దరు రికన్నాయ్‌సెన్స్ మనుషులు, ఖైదీ — వీళ్లతో కలసి ఆనిచ్క వెనుకభాగానికి వెళ్లిపోయింది. ఆ యుద్ధఖైదీ నడవలేడన్న సంగతి నిజమే; వాళ్లు అతనిని సగం మోసుకుంటూ సగం యీడ్చుకుంటూ వెళ్లవలసి వచ్చింది. వాళ్లు ఆ నది ఆవలిగట్టుకు వెళ్లే సరికి జర్మన్లు మళ్లీ మోర్‌టార్‌లను ప్రయోగించారు. అంచేత వాళ్లు బురదలో నేలకు నక్కుకొని పడుకోవలసి వచ్చింది. నలువైపులా మోర్‌టార్ బాంబులు పేలుతున్నాయి. ఆ జర్మన్ ఖైదీ ఎక్కడ చచ్చిపోతాడో అని ఆనిచ్క విపరీతంగా భయపడి పోయింది. కాని అంతా సవ్యంగానే జరిగిపోయింది. త్వరలోనే వాళ్లు రేమిజొవ్‌ను కలుసుకున్నారు.

అతడు ఆనిచ్కాను నిందిస్తున్నట్టుగా తల పంకించాడు, ఆమె కోటుకంటుకున్న బురదను తుడుస్తూ, ఆమెకు సాయం చేస్తూ: ''మీరు వెళ్లిన దగ్గర్నుంచీ మీకేమౌతుందో అన్న భయమే. కోపం తెచ్చుకోబోకండి, నిజం చెప్పాలంటే ఇది ఆడపిల్లకు అనువైన స్థలం కాదు. మీరు ఇన్‌స్టిట్యూట్‌లో షిల్లర్‌మీద వ్యాసం వ్రాశారని జర్మన్లకు తెలియదు. తెలిసిందా? అందువల్ల వాళ్లు మిమ్మల్ని చంపకుండా వదిలేస్తారనుకోకండి. వాళ్లు నాజీలన్న సంగతి మరచిపోకండి.'' అని అతడన్నాడు.

నది అవతలి గట్టునున్న నూతన పర్యవేక్షక స్థావరం వద్దకు మారేందుకై సిద్ధమౌతున్నాడతడు. కాని రెజిమెంటల్ కమాండరు పర్యవేక్షక స్థావరాన్ని ముందుకు పంపే విషయంలో యింకా అనుమతిని యివ్వలేదు. కొండకనుమలో గ్రామఫోన్ వున్న కందకంలోకి ఆనిచ్కా తిరిగి వెళ్లేందుకై రేమిజొవ్ ఒప్పించాడు. ''అక్కడ మీరు ఖైదీని సరిగా ప్రశ్నించవచ్చు. సంగీతం వినవచ్చు,'' అని అతడన్నాడు మళ్లీ టెలిఫోన్‌ను పైకెత్తుతూ.

ఆమె గత రాత్రి వచ్చిన బటాలియన్ కొండకనుమ వద్దకు త్వరలోనే ఆమెను, రికన్నాయ్‌సెన్స్ మనుషులు ఖైదీని వెంటబెట్టుకొని తిరిగి వెళ్లారు. శత్రువుల కాల్పులు చప్పబడిపోవడంచే వాళ్లు క్రిందికి వంగవలసిన అవసరం లేకపోయింది. అంచేతనే వాళ్లు అంచుగుండా వెళ్లారు. ఖైదీ చాలా బరువుగా ఉన్నాడేమో విశ్రాంతి తీసుకొనేందుకై ధ్వంసమై, దగ్ధమైపోయిన గ్రామం పొలిమేరలో కూర్చున్నారు. ముందున్న టెలిఫోన్ ఎక్స్ఛేంజికి చేరువలో ~లిపోయిన ఒక కుటీరపు నల్లని చిమ్నీ కుప్పవద్ద వాళ్లు తమ ఉనికిని సౌఖ్యవంతంగా చేసుకున్నారు. ఖైదీని అక్కడే ప్రశ్నించి ఆ సమాచారాన్ని ఫోన్ ద్వారా తక్షణమే పంపేందుకు నిశ్చయించుకుంది ఆనిచ్కా.

సైనికుడ్ని జీతాలపుస్తకంనుండి అతడు 78 వ అస్సాల్ట్ డివిజన్‌లోని లాన్స్‌కార్పొరల్ అని గుర్తించగలిగింది. అతని పేరు హన్స్ క్యూలె. హనోవర్‌నుండి వచ్చాడు. అంతకముందు ఆ డివిజన్ అక్కడికి రాలేదని నంబరు 78 బట్టే కొత్తభోగట్టా తెలుసుకోవచ్చు. ఆనిచ్కా ఆశ్చర్యపోయి సంతృప్తితో యీల వేసింది. ప్రశ్నలు అడగడం మొదలు పెట్టింది.

ఒక 'ఫ్రాయ్‌లైన్' (అమ్మాయి), తియ్యని కంఠధ్వనిగల ఒక ముచ్చటైన అమ్మాయి ప్రశ్నలు వేయడంవల్ల ఆ ఖైదీకు కొంత నమ్మకం కలిగింది. ఏమైనా, వాళ్లు తనను చంపరని అతడు భావించాడు. అతనికి ఆనందం కూడా కలిగింది. ఇంతవరకూ

అతనికి తెలిసిందంతా చెప్పేందుకు సిద్ధపడ్డాడు. కాని యిప్పుడు అలా చెప్పడం ఒక జర్మన్ సైనికునికి ఉండవలసిన లక్షణం కాదనీ, అది చాలా తప్పనీ అతడు భావించి మనో నిశ్చయం చేసుకున్నాడు. కాబట్టి అతని సమాధానాలు చాలావరకు తప్పించుకొనేవిగానే ఉన్నాయి. చివరికి అతడు నోరు తెరవడడానికే నిరాకరించాడు. అతడు మానసికంగా, ఆ పిల్లతో సహా రష్యన్లంతా చిత్రహింస పెట్టేవారనీ, క్రూరత్వప్రియులనీ, గాయ పడినవారిమీద తమ క్రోధం తీర్చుకుంటారనీ యింకా ఏమేమో నమ్మేందుకు సిద్ధ మయ్యాడు.

చివరికి ఆనిచ్కా ఇక ఓపిక పట్టలేనంతటి స్థితికి వచ్చింది. సూటిగా అతని మొహంలోకి చూసి అతడు ఆమె ప్రశ్నలకు సమాధానం చెప్తాడా లేదా అని అడిగింది. మళ్లీ సమాధానం లేదు.

''మంచిది,'' అని ఆమె ఆలోచనపూర్వకంగా అంది. ''అలాగయితే నేను మిమ్మల్ని హెడ్‌క్వార్టర్సుకు తీసుకు వెళ్లేందుకై సైనికునికి ఒప్పజెప్పతాను.'' ఆ తర్వాత ఆమె ప్రక్కకు తిరిగి రికన్నాయ్‌సెన్స్ మనుషులలో ఒకరైన బిర్యుకోవ్‌ను పిలిచింది.

బిర్యుకోవ్ ఖైదీ వద్దకెళ్లి అతని మీదికి వంగాడు. అతడు ఉరల్స్‌నుండి వచ్చిన వాడు. మితభాషి. ఎవరూ ఊహింపలేనంతటి కరుణార్ద్ర హృదయుడు. అతనిని ఎరు గనివారు, అతని వెడల్పాటి మొహం, ఏటవాలుగా ఉన్న కళ్లు, గాలిదెబ్బకు ఎర్రబడ్డ చెక్కిళ్లను చూసి భయపడిపోతారు. క్యూలె భయంతో చుట్టుకొనిపోయి, తక్షణమే అతడెరిగినదంతా గట్టిగా చెప్పేశాడు.

తన మిలిటరీ పన్నాగం విజయానికి ఆనిచ్కా గర్వపడి, ఆ ఖైదీ చెప్పిందంతా వ్రాసి తక్షణమే రెజిమెంట్ సిబ్బంది అధికారికి ఎంతో ముఖ్యమైన వివరాలను ఫోన్‌ద్వారా తెలియజేసి, రికన్నాయ్‌సెన్స్ మనుషులతో అతడిని వెనుక శ్రేణికి పంపించేసింది.

ఆ తర్వాత రేమిజొవ్ ఉన్న స్థావరానికి బయల్దేరింది. ఆమె కొండకనుమ క్రింది భాగాన్ని చేరుకుందో లేదో జర్మన్ల మోర్‌టార్‌లు, ఫిరంగుల ఒక్కుమ్మడి కాల్పులు ప్రారంభమయ్యాయి. ఇతర సెక్టర్లనుండి శత్రువులు ఫిరంగిదళాలను బహుశ తీసు కొని వచ్చి ఉండొచ్చు. ఆనిచ్కా అకీమొవ్ కందకంబసకు పరుగెత్తడం ఎలాగో ఒకలాగున సాధించింది. ఆ కాల్పులకు కొండకనుమ దద్దరిల్లింది.

కందకంబస ఖాళీగా ఉండడం చూసి ఆనిచ్కా ఆనందించింది. ఆమె తన కళ్లను మూసుకుంది. చెవులలో వ్రేళ్లు పెట్టుకుంది. కట్టెపుల్లలు వరసగా పెట్టి వున్న గోడకు

39—1

కరచుకుపోయింది. భయపడిపోయింది. భయపడిన వ్యక్తులు ఏమేంచేస్తారో ఆమె ఆ చేష్టలనన్నీ చేసింది.

తర్వాత తలుపు కిర్రుమన్న శబ్దంతో తెరచుకుంది. మకారిచెవ్, మరికొందరు మనుషులు వెంటరాగా రెజిమెంటు సిగ్నల్ మనుషులు తీగె చుట్టల్ని మోసుకుంటూ లోపలికి వచ్చారు. వెంటనే ఆనిచ్కా బల్లవద్ద కూర్చొని తన కురుచటి జుట్టును దువ్వు కోవడం మొదలుపెట్టి తనకేవీ పట్టనట్టునటిస్తూ, బాగా తెలిసినట్టుగా అన్నది:

"కాల్పులు చాలా తీవ్రంగా ఉన్నాయి. మన సెక్టరుకు జర్మన్లు పెద్ద ఫిరంగి దళాన్ని తీసుకొచ్చినట్టు స్పష్టమౌతోంది. మన దాడితో వాళ్ళు బాగా బెదరి పోయినట్టు కనిపిస్తుంది. మనవాళ్ళు నిలబడ గలుగుతారా?"

"బటాలియన్ కమాండర్ బ్రతికున్నంత వరకు భయంలేదు," అన్నాడు మకారిచెవ్. అతడు విపరీతంగా పాలిపోయాడు.

ఆనిచ్కా యింకా దువ్వుకుంటూనే ఉంది. ఆమె అన్నది: "అక్కడేం జరుగుతుందో నాకు చూడాలని ఉంది."

ఆమె అన్న మాటలు ఎంత అనృతంగా ఉన్నాయో స్వయంగా ఆమే గమనించ గలిగింది. అప్పుడామె తన భయాన్ని దూరం చేసి, వాస్తవంగానే వెలుపలికి ఆ కొండ కనుమలోకి వెళ్ళి నెమ్మదిగా పడమర దిశ పల్లంలోకి దేకుకుంటూ ముందుకు వెళ్ళింది. త్వరలోనే కాల్పులు ఆగిపోయాయి. వినిపించేదల్లా దూరంలో అతి తరచుగా మెషీన్‌గన్‌ల టపటపమన్న శబ్దం మాత్రమే. వర్షం కురవడం ఆరంభమైంది. బండితోలేవాడు లేకుండానే ఒక బండి వేగంగా దౌడు తీస్తోంది. మున్ముందు ఏంజరుగుతుందో అనే భయంకరమైన అనుమానం ఆనిచ్కా హృదయాన్ని పెనవేసుకుంది. ఆమె అన్నిటికంటే ఎక్కువగా ఆలోచించేది అకీమొవ్ విషయమే. మొత్తం యుద్ధం జరుగుతున్నంతసేపూ ఆమె అతనితో అతని పర్యవేక్షక స్థావరంలోనే ఉంది. అతడు ఉపయోగించే భాషతో సహా ప్రతి విషయాన్నీ ఆమె చూసింది, విన్నది. అతని భాష ఎందుచేతనో ఆమెకు కోపాన్ని కలిగించలేదు. అతడు గనక చచ్చిపోయినట్లయితే అది చాలా ఘోరమైన విషయమని ఆమె భావించింది. మొత్తం బటాలియన్‌కే కాదుకదా రెజిమెంటుకు కూడానూ. తనకు కూడానూ.

రణరంగంలోని సద్దు క్రమక్రమేణా అణగిపోయింది. ప్రస్తుతం అంతా నిశ్శబ్దంగా ఉంది. ఆనిచ్కా బీటకందకం సమీపంలో ఉంది. ఆ కందకం చివర పర్యవేక్షక స్థావరం ఉంది. దగ్గరికి వస్తున్నకొద్దీ ఆమె ఆ ప్రదేశాన్ని గుర్తు పట్టలేనంతటిదిగా

అది మారిపోయింది. కాల్పులవల్ల ప్రతీదీ ధ్వంసమైపోయింది. ఎక్కడైతే పర్యవేక్షక స్థావరం ఉండేదో అక్కడిప్పుడు నోరు తెరచుకున్నట్టు ఒక బిలం ఉంది. అందులో మనుషులు తవ్వుతున్నారు. వంగిపోయిన దూలం కొనకు ఒక వ్యక్తి కూర్చు న్నాడు, తలమీద ఏమీ లేకుండా. అతడు అకీమొవ్.

ఆ తవ్వే వాళ్లల్లో ఒక వ్యక్తి ఆ బిలంనుండి వెలుపలికి ప్రాకుకుంటూ వచ్చాడు. ఒక నిమిషం నిలబడి పారను క్రిందికి విసిరేశాడు. ఆనిచ్కా అతని వద్దకు వెళ్లింది. అతడు మాయ్‌బొరొద అని గుర్తించింది.

"ఏంజరిగింది?" అని ఆమె అడిగింది.

"సూటిగా దెబ్బ తగిలింది. కాప్టెన్ రేమిజొవ్ మరణించాడు."

ఆనిచ్కా మొహంలో నెత్తురు చుక్కలేదు. చెవులు నొప్పి పుట్టేవరకు ఆమె అవుడు గరచింది. తర్వాత అకీమొవ్‌వంక చూసింది. అతడు నిశ్చేష్టుడై కూర్చున్నాడు. అతని కన్నులవెంట అశ్రుధారలు కాలువలు కడుతున్నాయి. ఆనిచ్కా కంపించిపోయింది. తాను ఒక రోజంతా కనిపెట్టిన ఆ ఉక్కులాంటి మనిషి ఏడవగలడని ఆమె ఎన్నడూ భావించలేదు. అతడు అలా చేయగలగడమే కాకుండా ఆ సమయంలో వాస్తవంగా దుఃఖిస్తుండడం చూసి ఆమె హృదయం వ్రక్కలైపోయింది. ఆమె అతనివద్ద కెళ్లి కౌగలించుకుందామనుకుంది. అకీమొవ్ ఆమెవైపు చూసి నెమ్మదిగా లేచాడు.

"మీరిక్కడున్నారా?" అని అతడు అడిగాడు. తర్వాత అతడు క్రిందికి చూసి ఆ బిలం వైపు చూయించాడు. "ఏమీ మిగలకుండా ముక్కముక్కలకింద ఎగిరిపోయాడు."

ఆ బీటకందకంలో చేరువనే టెలిఫోన్ ఆపరేటరు అన్నిటికీ తెగించి కటువుగా, ఒక్కొక్కప్పుడు నెమ్మదిగానూ మరొక్కప్పుడు గట్టిగానూ, ఒకప్పుడు పట్టుదల తోనూ, మరొకప్పుడు వేడుకుంటున్నట్టూ పిలుస్తున్నాడు:

" 'లిల్లీ', 'లిల్లీ', 'లిల్లీ'..."

కొంతమంది క్షతగాత్రులు అక్కడికి వచ్చారు. వారు అకీమొవ్ ఉన్న చోటును చేరగానే వారిలో ఒకడు అన్నాడు: "సెలవు, కామ్రేడ్ కాప్టెన్. బహుశ మనం ఒకరి నొకరం మళ్లీ కలుసుకోం అనుకుంటాను."

"విత్యగోవ్!" అకీమొవ్ ఆశ్చర్యంతో అన్నాడు. "గాయపడ్డావా?"

"అవును." ఆ సార్జెంటు చిరునవ్వునవ్వాడు. "కాని అంత ప్రమాదమైంది కాదులెండి." అతడు ముందుకు నడిచాడు. తర్వాత అకీమొవ్ వైపు వెనుకకు తిరిగాడు.

''పాపం. మీరంతా విశ్రాంతికోసం వెళ్తున్నారు. కాని నేను ఆస్పత్రిలో ఉంటాను.''

విత్యగోవ్ ఏభావంతో అన్నాడో దానిని అకీమొవ్ వెంటనే గ్రహించలేదు. అతడు ఆ గాయపడినవారివైపు కొన్ని అడుగులు ముందుకు వెళ్లాడు.

''ఏమన్నావ్?'' అతడు అడిగాడు. ''ఎవరు విశ్రాంతి తీసుకోబోతున్నారు?''

విత్యగోవ్ ఆగాడు. బటాలియన్ కమాండర్ వైపు తిరిగి, అతనిని యుక్తితో కూడిన చూపుతో పరీక్షిస్తూ అన్నాడు.

''మీకేమీ తెలియనట్టు! ప్రతి వ్యక్తికీ తెలుసు. గతరాత్రి ప్యాప్త్సేవ్, అల్యోషిన్‌లు బటాలియన్ ఫీల్డ్-యాంబ్యులెన్స్‌నుండి తిరిగి వచ్చారు. అదిగో ఆ క్రింది భాగంలో పటాలాలకు అంతులేదు. మనం రిలీవ్ కాబోతున్నాం.'' అతడు కొద్ది సేపు నిశ్శబ్దంగా ఉండి మళ్లీ అన్నాడు: ''సెలవు, కామ్రేడ్ కాప్టెన్. మేం మిమ్మల్ని మరచిపోలేం.''

గాయపడిన వాళ్లు ముందుకు వెళ్లిపోతుంటే అకీమొవ్ వాళ్ల వైపే చాలా సేపటివరకు చూశాడు. తర్వాత అతని తల వాలిపోయింది. అస్పష్టమైన భావనతో అతని చేతులు చాచాడు. నిట్టూర్చి ముందుకు వెళ్లాడు.

శరత్తులో వలెనే త్వరగా చీకటి పడుతోంది. జర్మన్ మతాబీచువ్వలు తరచుగా ఆకాశం వైపు కాల్చబడుతున్నాయి — శత్రువులు మళ్లీ దాడి చేస్తారేమోనన్న భయం. ఆ కొండకనుమల్లోనూ, కందకాల్లోనూ అంతా మౌనంగా ఉన్నారు. ఎక్కడ నిలబడ్డ వాళ్లు అక్కడే పడుకొని ఉన్నారు. వర్షం ఆగింది. కాని రాత్రి పొంటిగంటకు అంతా చటుక్కున లేచి నిలబడ్డారు. వాళ్లు చూసింది యిది:

తుపాకుల శబ్దంతోటీ, భోజనపు బొచ్చెల గలగలలతోటీ, బురదలో బూడ్సుల కిర్రు శబ్దంతోటీ నూతన పటాలాలు వస్తున్నాయి. మంచి దుస్తులతోనూ, పరికరాలతోనూ మరీ అంత ఆనందంగా కనుపించకపోయినా విచారం ఏ మాత్రం కూడా లేకుండా వాళ్లు విడుదల చేయబడేవారి నిరుత్సాహవదనాలను చూసి చిరునవ్వునవ్వారు. కాల్పుల వల్లా తుపాకీ మందువల్లా కలిగిన ఘాటైన వాసన ఎప్పుడైతే వారి ముక్కుల్లోకి జొరబడిందో అప్పుడే వాళ్లు వారి నిరుత్సాహానికిగల కారణాన్ని నిస్సందేహంగా పసిగట్టగలిగారు. తమ ముందు కష్టకాలం ఉందని వారు సంపూర్ణంగా అర్థం చేసుకోగలిగారు. కాని, వాళ్ల హృదయాల్లో ఏవిధమైన భయమూ లేదు. ఇతరులు కట్టిపెట్టిన కందకం

బసల్లోనూ, కొండ పగుళ్లలోనూ, కందకాల్లోనూ, శత్రువులనుండి ఆనాడు వశ పరచుకున్న వాటితో సహా అన్నిట్లోనూ జనంనిండి పోయారు. అంతటా సందడితో తమతమ వస్తువుల్ని అక్కడక్కడా అమర్చుకున్నారు. సౌఖ్యవంతంగా స్థిరపడి తమ గుర్రుగుర్రు శబ్దాలకు, నిట్టూర్పులకు మేళనగా తమ బూడ్సులను మార్చుకున్నారు.

"మంచి విశ్రాంతి తీసుకోండి," ఇవీ వారి వీడ్కోలు పదాలు. హృదయంలో చెడ్డ అభిప్రాయంతోగానీ, యీర్ష్యతోగానీ అన్నమాటలు కావవి. బటాలియన్ ఒక క్రమంలో ఏర్పడి కదం తొక్కుతూ కదలిపోయింది ఆ రాత్రి సమయంలో.



అధ్యాయం నాలుగు

# ప్రేమ

1

పెటాలం రైలొకటి తూర్పుదిశగా నడుస్తోంది. యుద్ధరంగానికి వెళ్లే రైలుమాదిరిగా కాకుండా అక్కడినుంచి వచ్చే దానిలాగా దానివేగం తగుమాత్రంగా ఉంది. అందులో ఉన్న వాళ్లు పగలంతా తెరిచివుంచిన తలుపులవద్ద, అపారమైన గోధుమవర్ణపు పొలాల అనంతమైన ప్రశాంతతను ఆనందించేందుకై కిక్కిరిసి కూర్చోవడమో లేదా నిలబడడమో జరుగుతోంది. పక్షిగణం దక్షిణం వైపు పోతోంది. బంగారువన్నె బర్చిచెట్ల మధ్యమధ్య ఒక దాని తర్వాత మరొకటిగా ఆకుపచ్చని దేవదారు వృక్షాలు కనిపిస్తున్నాయి. అప్పుడప్పుడు చెమ్మగా ఉన్న ఎరుపు కొండ-ఎష్‌చెట్టు ఒక బావిదగ్గరగా అగుపిస్తోంది. కాని ఆ సైనికులకు అలాంటి నెమ్మదైన, ప్రశాంతమైన ఫలాన్నిచ్చేది ఆ చెట్లు కాదు — రైల్వే స్టేషన్లు, సిగ్నల్

దీపాలు, సిగ్నల్ పెట్టెలు, గిడ్డంగులు, మృదువుగా నడిచిపోయే రైల్వే విధానమే. బహుదూరపు ప్రయాణాలకు లారీలలో వెళ్లడం అలవాటైందేమో, యుద్ధ సమయంలో రైలుపట్టాలను గమనించకుండానే తరచూ దాటివెళ్లినప్పటికీ, రైలులో ప్రయాణం చేయవచ్చుననే విషయాన్ని వాళ్లు దాదాపు మరచిపోయారనే చెప్పాలి.

విశ్రాంతిగావున్న గ్రామాలు, గోధుమవన్నె పొలాలు, ఇంజన్‌కూత, చక్రాల ధ్వని, యీ దృశ్యమంతా వారికి ప్రశాంతతను కలిగించింది. దాంతో వాళ్లు నిశ్చలమైన గాఢనిద్ర తీశారు. ఏదో కారణంచే ఆ పొడుగ్గా జలమయంగా ఉన్న కొండకనుమలలో తొందరతొందరగా పారిపోతున్న పిల్లికూనల్నీ, కోడిపెట్టల్నీ, పిల్లల్నీ కలగన్నారు.

రాత్రిపూట పడుకోని వాళ్లల్లా ఎవరంటే, ఇనుప పొయ్యిల్లోని నిప్పు ఆరి పోకుండా చూసే వాళ్లు మాత్రమే. ఇతరులు గాఢంగా నిద్ర తీస్తున్నారు. వాళ్లు బదులు తీర్చుకోవలసినటువంటి నిద్రపోని రాత్రులు అనేకం ఉన్నాయి. ఉదయంపూట మంచుగా ఉండడంచే వాళ్లు చలికి నిద్రనుండి లేచిపోయారు. తమ పడకబల్లలమీాది నుంచి క్రిందికి దూకి ఉత్తకాళ్లతోనే, ఘాటైన 'మఖోర్క' సిగరెట్టు త్రాగి ఆనందించేందుకని పొయ్యివద్దకు పరుగెత్తారు. ఆవలింతలు తీసి, కాళ్లు చాచారు, బూడ్సులు తొడుక్కొనేప్పుడు. వచ్చే మొదటి స్టేషన్‌లో భోజనం డబ్బాలు పట్టుకొని వంటచేసే పెట్టెకు పరుగెడుతారు. అంత ఎక్కువ ఆకలి లేకపోయినా ఉదయం భోజనం చేసి నిద్రపోవడంతోనో, గబగబా నడిచిపోతున్న పల్లపు భూముల్ని చూస్తూనో ఆ చల్లని చలికాలపు గాలిని ఆకలితో గుటుక్కున మ్రింగడంతోనో ఆ రోజంతా గడుపుతారు.

వాళ్లు బయల్దేరినప్పుడు ఎక్కడికి వెళ్తున్నదీ ఎవరికి తెలియదు. అంతగా లెక్కించలేదు కూడా. వాళ్లు ఎక్కడకు చేరబోయేదీ ఆఖరికి డివిజనల్ కమాండరుకు కూడ తెలియదు. పెద్దపెద్ద స్టేషన్లవద్ద మిలిటరీ కమాండర్లకు, వాళ్లు ఎంతవరకు తెలుసుకోవడం అవసరమో అంతవరకే, అంటే సైనిక రైలు ఫలానాఫలానా నంబరు గలది తర్వాత ఏ పెద్ద స్టేషన్‌కు వెళ్లాలో తెలపడంవరకే.

మొన్నమొన్ననే జరిగిన యుద్ధంచే అలసిపోయిన మొదటి బటాలియన్‌ను రైలులోని అన్ని డ్యూటీలనుండి మినహాయించారు. వాళ్లు రోజుకు పదిహేను గంటలు పడుకొనేవారు. కాప్టెన్ అకీమొవ్ తన పడక బల్లమీాదనుండి అసలే లేవకుండా ఇరవైనాలుగు గంటలూ పడుకొని ఉండేవాడనే చెప్పాలి. మితభాషి అయిన మాయ్‌బొరొద అతనికి భోజనం తెచ్చాడు. అంతా శుభ్రం చేశాడు. బహు అరుదుగా, విపరీతమైన మనోవ్యాకులతతో

ఉన్న తన బటాలియన్ కమాండరుతో సంభాషించడానికి అతనికి ధైర్యం చాల్లేదు. మాట్లాడకుండా ఉండడమే మంచిదనిపించిందాతనికి.

అకీమొవ్ పక్క కిటికీ ప్రక్కనే ఉంది. అతడు గంటలు కొద్దీ వెలుపలికి చూసే వాడు, తాను మెలుకువతో ఉన్నట్టు ఏవిధమైన శబ్దమూ చేయకుండా. ఆ పెట్టెలో ఉన్న యితరులలో ఏ ఒక్కరూ అతనితో మాట్లాడేందుకు సాహసించ లేక పోయారు. అతనితోపాటు ప్రయాణం చేస్తున్న బటాలియన్ ఆఫీసర్లపైనా హెడ్ క్వార్టర్సు సిబ్బందిపైనా నిశ్శబ్దత తాండవించడంచే వారు నెమ్మదిగా తమ ప్రక్క పెట్టెలో ఉన్న వాళ్లదగ్గరికి జారుకున్నారు. కాబట్టి మాయ్‌బొరొద ఒక్కడే పట్టు దలతో, ఇంకొకరికి ఫిర్యాదు చేయకుండా ఉండిపోయాడు. చివరికి అసలైన వంటకట్టె లపై చెయ్యిచేసుకొని పొయ్యిని రాజేస్తూ తన ఒంటరితనాన్ని ఆనందిస్తున్నాడు. మధ్య మధ్య కమాండరు ఏమన్నా అన్నాడేమోనని, లేదా ఏమైనా కదిలాడేమోనని పైకి చూసే వాడు.

ఆఖరికి మూడో నాడు అకీమొవ్ క్రిందికి దిగి నీళ్లు అడిగాడు ముఖం కడుక్కోను. ఆ తర్వాత, ''కొర్‌జీన్‌కిన్ బ్రతికే ఉన్నాడా?'' అని విచారించాడు.

''అవును.''

''ఫై జూర్లిన్?''

''అతడు గాయపడ్డాడు.''

''మనం ఎవరితో ప్రయాణం చేస్తున్నాం?''

''మొదటి, రెండు బటాలియన్లతోనూ, రెజిమెంటల్ హెడ్‌క్వార్టర్స్‌తోనూ,'' అని ఉత్సాహపడుతూ సమాధానం చెప్పాడు మాయ్‌బొరొద. అటుపైన వార్తలు చెప్పడం ప్రారంభించాడు. ''రెజిమెంటు రెండు రైళ్లలో ప్రయాణం చేస్తోంది. మనం రెండో దాన్లో ఉన్నాం. రెజిమెంటల్ కమాండరు మొదటి దాన్లో మూడో బటాలియన్‌తోనూ ఫిరంగిదళంతోనూ ఉన్నాడు. రెండో జట్టుతో కూడాను. మనం యుద్ధరంగానికి వెళ్లి నప్పుడు వాళ్లు వెనకాల ఉన్నారు. మనం యుద్ధరంగాన్ని వీడినప్పుడు వాళ్లు ముందు న్నారు. మొత్తం డివిజను పది రైళ్లకు సరిపోయేట్టు విభజింపబడింది. రోజుకొకటి బయల్దేరుతుంది. మీకోసమని ఒక స్టేషన్‌లో బీరు తీసుకున్నాను. కామ్రేడ్ కాప్టెన్, దానిని త్రాగేయండి లేకపోతే దాని ఘాటుపోతుంది. డబ్బిచ్చి కొన్నాను... మనం డబ్బిచ్చి కొని చాలా కాలం అయింది.''

అకీమొవ్ నిశ్శబ్దంగా బీరును త్రాగాడు. యుద్ధం ప్రారంభమైన తర్వాత అతడు బీరు త్రాగడం యిదే మొదటి పర్యాయం కావొచ్చు.

''డబ్బు లేకుండా జీవించడం చాలా బాగుంటుంది,'' అని మాయ్‌బొరొద మళ్లీ మొదలుపెట్టాడు. ''యుద్ధరంగంలో మాదిరిగా దుస్తులు, మంచి సరఫరా, మనకు వలసినవన్నీ యిస్తే చాలు. అదీ యుద్ధంకోసం మాత్రమే కాకుంటేనే...''

''కావలిసిన సామాన్లన్నీ యిస్తే మాత్రం నీకు అభ్యంతరం ఉండదు. కాని యుద్ధం మాత్రం వద్దేం?'' అని అకీమొవ్ ఎగతాళిగా నవ్వాడు. ''అయితే పనిమాటో?''

''పనా?'' అని మాయ్‌బొరొద కినుకతో సమాధానం చెప్పాడు. ''ఎందుకు? పని లేకుండా బ్రతకలేమా?''

''బాగుంది. అది దరిదాపుగా కమ్యూనిజమే,'' అకీమొవ్ అన్నాడు. ''యుద్ధం ఉండదు, శాంతమైన పని, యుద్ధభూమిలోవలెనే అన్ని వస్తువుల సరఫరా. అవునోయ్, సార్జెంట్ మాయ్‌బొరొద, నువ్వు చూడబోతే కమ్యూనిస్టు సిద్ధాంతాల్లో బాగా నమ్మకం ఉన్న వాడిలా కనిపిస్తున్నావే.''

''అలాగే అని చెప్పాలి,'' అన్నాడు మాయ్‌బొరొద బేపరాకుగా గొణుక్కుంటూ. కాసేపు మౌనంగా ఉండి స్థానిక సమాచారం చెప్పడం ప్రారంభించాడు మాయ్‌బొరొద. ''మీకోసం కొంతమంది వచ్చారు: రెజిమెంటల్ యింజనీరు, మనోహరంగా పాడే పక్షి మాదిరి పేరుగల ఎవరో, అవును ద్రోజ్‌ద్ వచ్చారు. అనువాదకురాలు కూడా వారి వెంట వచ్చింది. మీరెలా ఉన్నారని అడిగారు. మరోరికార్డు పెట్టమని అడిగారు కూడా. కాని నేను వాళ్లని గెంటేశాను. మనం ఎక్కడికి వెళ్తున్నదీ ఎవరికీ తెలియదు. మాస్కో అని కొందరంటున్నారు. రెజిమెంటు మళ్లీ ఏర్పడేందుకనే అనుకోండి.''

''వాళ్లు మనతోపాటు యీ రైల్లో ఉన్నారా?''

''ఎవరు?''

''అదే... ద్రోజ్‌దూ, వాళ్లూనూ.''

''ఓ, ఉన్నారు.''

కాస్త పచారు చేద్దామని ప్రక్క స్టేషన్‌లో దిగాడు అకీమొవ్. రైలు పొడుగునా వెళ్లాడు. బాగా దెబ్బ తిన్న ఆ స్టేషన్ ప్లాట్‌ఫారంనిండా సైనికులు అటూ యిటూ తిరుగుతున్నారు. ఒక అంగడి వద్ద ఆఫీసర్ల సముదాయం నిలబడి ఉంది. తక్షణమే

గుర్తించాడు వాళ్లల్లో ఉన్న ఆనిచ్కాను. అంతలోకే ఎవరో పిలిచారు: ''కాప్టెన్ అకీమొవ్! ఎలాగైతేనేం ఆఖరికి మంచి నిద్రే తీశావనుకుంటాను?''

''అవును,'' అని సమాధానం చెప్పాడు సంక్షిప్తంగా.

ఆనిచ్కా అతనివైపు తిరిగి పెద్దగా పిలిచింది: ''అకీమొవ్! ఇక్కడికి రండి!'' తర్వాత వెంటనే అతని వైపు వెళ్లి హృదయపూర్వకంగా కరస్పర్శ చేసింది. అతడు కలవరపడ్డాడు కాని జ్వలిస్తున్న ఆత్రతతో ఆమెను సూక్ష్మంగా పరీక్షించాడు. ఏమైతేనేం, నిజంగా ఆమె ఎలాంటి మనిషి? నిజంగా ఆమె అతనికి మొదటి రోజున అనిపించినలాంటి అమ్మాయేనా?

అవును. జరిగిన దానినిబట్టి చూస్తే ఆమె అలాంటిదే. మబ్బుగా ఉన్న పగటి వెలుతురులో మాత్రమే ఆమె అంత అహంకారం లేకుండా, అంత దూరంలో ఉండకుండా భూమికి దగ్గరగా ఉన్నట్టు కనిపించింది. ఆమె అతనిని పలకరించిన పద్ధతిలోనూ, అతనిని సమీపించిన విధానంలోనూ అతనికి కేవలం సద్భావం తప్ప వేరే ఏం కనిపించలేదు. లేకపోతే మరేమైనా వుందా? ఏమైతేనేం, ఆమె కొంత ఆధిక్యత కలిగిన వ్యక్తినీ, ఆ సంగతి ఆమెకు తెలుసునని కూడా అతడు ఆమె ప్రవర్తననుబట్టి గ్రహించాడు. తెల్లగా, ఎంతో మృదువుగా, విల్లు మాదిరిగా వంగిన ఎత్తైన నుదిటి పైకి టోపీ క్రిందినుండి తొంగి చూస్తున్న గోధుమవన్నె ముంగురులతో, ఆమె యుక్తవయసులో ఉన్నప్పటికీ, అక్కడ ఉన్న వాళ్లందరికంటే ఆమె పెద్ద అయినట్టుగా వ్యవహరిస్తుంది. ఆమె అకీమొవ్ యెడల తలవనితలంపుగా చూపిన ఆప్యాయతలో స్వయంగా ఎరిగి యిష్టానుసారంగా ప్రవర్తించడమనేది కొంత గోచరిస్తుంది.

''ఇంకా గడ్డాన్ని తీసేయలేదే?'' అని యింజనీరు ఫీర్సొవ్ ఆశ్చర్యంగా అడిగాడు. ''ఇపాటికే నువ్వు నీ రూపుగురించి కాస్త శ్రద్ధ తీసుకొని ఉండాల్సింది.''

''అవును నిజమే,'' అని అకీమొవ్ పరధ్యానంగా జవాబు చెప్పాడు. ''మరచిపోయాను. క్షౌరం చేయించుకొని ఉండాల్సింది.''

''అవును. తప్పకుండా చేయించుకోవాలి,'' అని ఆనిచ్కా బలవంతం చేసింది. ''ఇక్కడే యీ స్టేషన్‌లో క్షౌరశాల ఉంది. మేం మీకోసం వేచి ఉంటాం.''

అతడు వాస్తవానికి ఆ మరుక్షణానే ఆమెకోర్కెను తీర్చాలని సంకల్పించాడు, కాని ఏదో పట్టుదలతో కూడిన చెడు భావన అతనిలో కలిగి, అది ఆమెకు నిరుత్సాహాన్ని

కలుగజేసేట్టు, దాదాపు విరుద్ధమైన సమాధానం యిచ్చేట్టు చేసింది: "నాగడ్డం మీ దారికేం అడ్డులేదు కదా, అవునా?"

ఆ మాటలు ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించి కోపాన్ని పుట్టించాయి. కాని ఆమె తమాయించుకొని చురుక్కుమనేట్టు అంది: "గడ్డంకంటే కూడా మీకు మోటుతనం ఏ మాత్రం సరిపడదు." తర్వాత ఆమె సూటిగా అతని మొహంలోకి చూసి అన్నది: "అంత మోటుగా ప్రవర్తించవలసిన అవసరం లేదు."

అకీమొవ్ సమాధానం చెప్పలేదు. రైలు వద్దకు తిరిగి వెళ్లిపోయాడు, వ్యసన పడుతూ. ఆమెయెడల అతను అంత మోటుగా ఎందుకు ప్రవర్తించాడో స్వయంగా ఊహించ లేకపోయాడు. కాని ఆ తర్వాత గ్రహించాడు, ఆమె తనయెడల ఎక్కువ చిత్తవృత్తిని కనపరచడమే అందుకు కారణమని. అవును అదే కారణం. ఆమె యితరులను ఏవిధంగా చూస్తుందో అదేవిధంగా తననూ చూడడం అతనికి యిష్ట ంలేదు. బహుశ మరొక కార ణం కూడా ఉండొచ్చు. ఆమె కంఠధ్వనిలో వలపు దాగిన లక్షణాలను అతడు గమనించి నట్టుగా భావించాడు. తానెవరో సరిగ్గా తెలుసుకోకుండానే ఆమె తనయెడల వలపుతో ప్రవర్తించినట్లైతే, ఇతరులతో కూడా ఆమె అదే విధంగా ప్రవర్తించవచ్చు. ఇది అతనిని అసహ్యమైన ఈర్ష్యా భావనతో నింపింది.

"నేను ఒప్పుకొని తీరాలి. ఆ పిల్లను నేను ప్రేమిస్తున్నాను. ఎంతగా ప్రేమిస్తున్నా నంటే, ఆమె నాతో సహితమూ సరసమాడడం నేను సహింపలేను," అని అతడు భావించాడు.

తన ఆలోచనలలో భాగస్వామి కాగల ఒకే ఒక వ్యక్తి రేమిజొవ్ మరణించాడు. అతడు గనక బతికున్నట్లైతే ఎంచెప్పేవాడు? దానిని గురించే అకీమొవ్ ఉహించడానికి ప్రయత్నించాడు, పడుకొని.

"మిత్రమా!" అని రేమిజొవ్ అని ఉండేవాడు, "నువ్వు ఏమీ చెయ్యలేని విష యాలు కూడా కొన్ని ఉంటాయి. కాని దాని అర్థం అవి అవశ్యకంగా చెడ్డవని కాదు. అంతే కాకుండా నువ్వు ఆమెపై నీ ప్రభావాన్ని కలిగించినట్టు ఎందుకు ఒప్పుకోవు? ఆమె మంచి మర్యాదగల పిల్ల. ముచ్చటగా కూడా ఉంది. నువ్వు నీ నమ్రతను అతిగా చేయబోకు. ఆమె ప్రేమకు నువ్వు తగవని నీ ~~అంతటికి~~ నీవు అనుకొనేంతటి నమ్రత నీకు లేదు. పైపెచ్చు అందుకు భిన్నంగా. నీలో ఉన్న దోషం ఏమిటి అంటే నీవు చాలా గర్విష్ఠివి. అంచేతనే అనేక సందేహాలు నీలో ఉత్పన్నమౌతాయి. ఆమె, నువ్వంటే ఎక్కువ

శ్రద్ధ చూపుతుందో లేదో తెలుసుకోవాలనుకుంటున్నావు నువ్వు. అలా తెలుసుకున్న తర్వాత నువ్వామెదగ్గరికి పరుగున వెళ్లి ఆమెను నీ చెప్పుచేతల్లోకి తీసుకురావాలని ప్రయత్నిస్తావు. బహుశ నువ్వామెపై అధికారం చెలాయిస్తావు. ఆమె నిన్ను మరింతగా ప్రేమించాలని నువ్వామెను లెక్కచేయనట్టుగా నటిస్తావు. ఒక వ్యక్తి తాను ప్రేమిస్తున్న స్త్రీని తన అదుపులోకి తెచ్చుకోవాలనీ, ఆమె అంటే అతని హృదయం కరుణతో బాధపడుతున్నప్పటికీ, అతడామెను బానిసగా చేసుకోవాలనీ ప్రయత్నించే ఆట నాకు బాగా తెలుసు.'' రేమిజొవ్ గొంతు కంచులాగా మ్రోగేది. చివరికతడు పొడి గొంతుతో యిలా ముగించేవాడు: ''జ్ఞాపకం ఉంచుకో, పెట్టుబడిదారీ విధానం యింకా నీ మెదడులో గతావశేషంగా ఉంది. దానిని వ్రేళ్లతోసహా పెకలించవలసి ఉంటుంది.''

అకీమొవ్ దుఃఖంతో నిండిన నవ్వు నవ్వాడు, కాప్టెన్ రేమిజొవ్ గనక బ్రతికి ఉన్నట్లైతే అతడు సరిగ్గా పైనతెలిపినట్టే అనేవాడు.

సాయంత్రం రైలు రొస్‌లావ్ల్ వద్ద ఆగింది. రెండో బటాలియన్ కమాండరు కాప్టెన్ లబ్‌జీన్ అకీమొవ్‌ను చూడ్డానికి వచ్చాడు. అతడు అకీమొవ్ పడుకున్న బల్ల మీదికి ఎక్కి చెవిలో గుసగుసలాడాడు: ''నాతో రా సరిగ్గా స్టేషన్‌కు దగ్గర్లో నాకు తెలిసిన ఒకమ్మాయి నివసిస్తోంది. ఒక ఏడాదినుండి ఆమెకు నేను ఉత్తరాలు వ్రాస్తున్నాను. చటిక్కున వెళ్లొద్దాం పద. రైలు యిక్కడ మూడు గంటలు ఆగుతుంది, నేను అడిగాను...''

''నేను తోడుగా రావడం అవసరమా?'' అని అకీమొవ్ అడగాలనుకొన్నాడు కాని ''సరే''నని అకస్మాత్తుగా పలికి, లేచి దుస్తులు తొడుక్కున్నాడు.

వారు రైల్వేషెడ్డులు వరసగా ఉన్న వీథిలో నడిచారు. మరో వీథిలోకి మలుపు తిరిగారు. ఒక తోట వద్ద ఆగారు. అక్కడ ఒంటరిగా ఎరుపు కొండ-ఏష్‌చెట్టు ఉంది. మొదట లబ్‌జీన్ ఒక చిన్న సాధారణ గృహంలోకి వెళ్లాడు. అతడు కాస్త తడబడ్డాడు, అంతకు ముందు ఆ పిల్లను ఎన్నడూ చూడలేదు గనుక. ''తుపాకీ కాల్చడంలో యూనిట్‌లోకల్లా ఉత్తమమైన గురిగలవాడు,'' అని ఆమెనుండి ఉత్తరం వచ్చినప్పటి నుండీ అతడు ఆమెతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాడు. వేలకొద్దీ ఇతర ఉత్తరాలు మాదిరిగానే అది కూడా ఆదరణకై వ్రాయబడింది, అందుకున్న వారికంటే వ్రాసిన వారికి ప్రోత్సాహాన్నివ్వడానికి.

ఒక చిన్న గది. ఆ గదిలో కొవ్వొత్తి వెలుతురు. ఎంతో అవసరమైన వస్తువులతో మాత్రమే ఆ గది అమర్చి వుంది. పొడుగ్గా, సన్నగా, ముప్పై సంవత్సరాల వయసుతో, బాగా అలసిపోయిన లక్షణాలతో, శిరస్సు ఉపరిభాగన ముచ్చటైన చక్కని జడల్ని మెలి త్రిప్పి పెట్టుకొన్న ఒక స్త్రీ ఆ యిద్దరు ఆఫీసర్లను లోనికి ఆహ్వానించింది. ఆమె వయసు ఉన్న దానికంటే తక్కువైనట్లూ, కన్యాదశ గడిచి ఎంతో కాలం కానట్లూ ఆమె జుట్టును చూస్తే అనిపిస్తుంది.

ఆ యిద్దరి కాప్టెన్ల రాకతో ఆ స్త్రీ ఎంతగానో ఉద్రేకపడింది. అందులో ఒక రిని తన స్నేహితునిగా పరిగణింపగలిగింది. ప్రథమ సంభాషణ ముగియగానే లబ్‌జీన్ ఉత్సాహం అతిత్వరగా ఉప్పొంగి అతడు కట్లు తెంచుకున్నాడు. వెంటనే అతడు 'వోద్కా' సారాసీసానూ, కొద్ది పాటి భోజనాన్ని వెలికి తీసి, ఏ కారణం చేతనో పెదవి కరచాడు. ఇది అకీమొవ్‌కు కష్టం కలిగించింది.

"మీ స్నేహితురాండ్రలో ఎవరైనా ఒకరిని పిలువండి నతాష," అన్నాడు లబ్ జీన్. "మనం యిక్కడ కూర్చొని కబుర్లు చెప్పుకోవచ్చు."

ఒక నల్లని శాలువాను భుజాలపై కప్పుకొని ఆమె వెలుపలికి వెళ్లిపోయింది. లబ్‌జీన్ ఆత్రతతో అకీమొవ్‌వైపు చూసి ఆమెను గురించి అడిగాడు: "ఏమంటావ్, ఫరవాలేదు కదూ?"

అతడు అకీమొవ్ ఎదుట ఎప్పుడూ పిల్లికూనే. ఫోటోలో ఎంతో చిన్నదిగా ఆమె అగుపించింది. కాని ఇప్పుడు అందుకు భిన్నంగా ఉండడంచే అతడు నతాష ఆకారంతో ఏ విధంగానూ ముగ్ధత చెందలేదు. అయినా అకీమొవ్ ఆమెను మెచ్చుకోవాలని మాత్రం ఆకాంక్షిస్తాడు. ఉదాసీనతతో అకీమొవ్ అక్కడ కూర్చున్నాడు, తన బలీయమైన తలను చేతిపై ఆనించుకొని. దాంతో లబ్‌జీన్‌కు కంపం పుట్టింది.

పది నిమిషాలైన తర్వాత నతాష ఒక స్నేహితురాలితో తిరిగి వచ్చింది. ఆమె పేరు ఆన్య అని వినేప్పటికి అకీమొవ్ జంకుతూ చూశాడు. ఆమె పొడుగ్గా ఉంది. పాలి పోయిన మొహంలో విశాలమైన గోధుమవర్ణం కన్నులు.

వారు బల్లవద్ద కూర్చొని వోద్కా త్రాగారు. ఆటంకం, బిడియం అంతర్ధానమై పోయాయి. నవ్వుపుట్టించే విషయాలను లబ్‌జీన్ ముచ్చడించాడు. తనను కొంచపరచు కుంటూ అకీమొవ్‌ను నిరంతరం పొగిడాడు.

అకీమొవ్ ఎక్కువగా మాట్లాడలేదు. కాని త్వరలోనే గ్రహించాడు, నతాష లబ్‌జీన్‌కంటే తననే ఎంచుకుంటోంది. ఇది అతనికి కలవరపాటు కలిగించింది. ఆమె అతనితో మాత్రమే మాట్లాడింది. కాని ఎక్కువ సేపు అతడెలా మౌనంగా ఉన్నాడో అలాగే ఆమె కూడా ఉంది. ఆమె అకీమొవ్‌ను ఎంచుకున్న సంగతిని లబ్‌జీన్ త్వరగానే తెలుసుకున్నాడు. కాని అందుకతనికి కోపం కలగలేదు. అతని ధ్యానమంతా ఆన్యపైనే వుంది. వాళ్లిద్దరూ కలిసి త్వరలోనే వెళ్లిపోయారు.

నతాషతో ఒంటరిగా ఉండడం అకీమొవ్‌కు అసహ్య మనిపించింది. దాంతో అతడంటే అతనికే స్వయంగా విసుగుదల గలిగింది. సాధారణంగా నావికులకు ఆపాదించబడే చొరవు అతనికి ఉన్నట్టు అగుపించదు. "బహుశ నేను వెళ్లిపోవాలేమో," అని అతడు భావించాడు. కాని అతను ఏదీ నిశ్చయించుకోలేక పోయాడు. ఆమె కొవ్వొత్తికొనని కత్తిరించి అన్నది: "ఇప్పుడిక్కడ చీకటిగా ఉంటోంది. జర్మన్లు పవర్ స్టేషన్‌ను ప్రేల్చేశారు."

తర్వాత ఆమె మళ్లీ అతనివద్ద కూర్చుంది. ఆ యిద్దరు కూడా తత్తరపాటు చెంది ఆందోళనపడ్డారు. ఒక విధమైన జంకుతో కూడిన ఆనందంతో ఆనిచ్కాను గురించి ఆలోచించాడు: "అయిపోయింది. అంతా ముగిసింది, అవును, అది అంతే. చాలా బాగుంది. నేను నిన్ను మరచిపోయాను. ఇహ నేను ఏమాత్రం బాధపడను. అదే ఆఖరు." అతడు నతాష చేయిని తీసుకున్నాడు. అది చాలా వేడిగా ఉంది. ఆమె శరీరమంతా నిప్పులా వేడిగా ఉంది.

అప్పుడామె ఏమో అన్నది. నిట్టూర్చింది...

అతడు ఆమె ప్రక్క పడుకున్నాడు. అతని మెదడు ఖాళీ అయిపోయింది. "ఇప్పుడు అంతా సవ్యంగా ఉంటుంది," అని అతడు భావించాడు, సడలిపోయిన ఆమె జడను పరధ్యానంగా నిమురుతూ. ఆమె బహు నెమ్మదిగా అంది. "నీవు చాలా మంచి వాడవు. నీకు నా అభివందనాలు."

ఆమె అభినందించింది అతని కరుణతో కూడిన పరధ్యానంలోని ఆప్యాయతనే గాని అంతకుముందు గతించిన దానిని గురించి కాదు.

"నిన్ను విడిచి నేనొక్క క్షణం ఉండలేను," అని ఆమె అంది.

తలవనితలంపుగా వారికి క్షణభంగురమైన స్నేహం కలసినప్పటికీ అతడు ఆమెను నమ్మాడు. అతడు దేనినైతే కేవలం ఏకకాలమందు సంభవించే సంఘటన అని భావిం

చాడో, దానిని ఆమె విధిగా పరిగణించింది. అతడు ఆమెను యిదివరలో ఎన్నడూ చూడ నప్పటికీ ఆమె మోము అందమైనదిగానూ పరిచయం ఉన్నదిగానూ అతనికి అనిపిం చింది. తన కామ్రేడ్‌కాన్ని చల్లార్చే ఏదో ఒక అచేతన నిర్జీవ జడపదార్థంగా అతడా మెను పరిగణించినందుకుగాను తనకు తాను నిందించుకున్నాడు. అతడక్కడే శాశ్వతంగా ఉండి పోయి ఆనందంగా గడపగలడని అతనికి అకస్మాత్తుగా అనిపించింది. అతడామె కౌగిలిలో, ఆమె విశాల నయనాల్లో ఒంటరి జీవన గాథను అనుభవించగలడు, పఠించగలడు. ఇదీ ఆ యుద్ధమే, కాని యుద్ధంయొక్క మరొక స్వరూపం.

తానెక్కడున్నడో తెలుసుకొని త్వర పడేందుకు దగ్గర్లోనే ఉన్న యింజన్ కూత కూసింది. ఆమె తన శాలువాను పైనకప్పుకొని అతనితోపాటు వెలుపలికి వచ్చింది.

చీకట్లో, నిశ్శబ్దంగా రైలు అక్కడ నిలబడింది. దాని ముందరి భాగంలో ఇంజన్ సిద్ధంగా ఉంది, నిప్పురవ్వల్ని ఎగజిమ్ముతూ.

స్టేషన్ భవనం నీడలో వారు కాసేపు నిలబడ్డారు. అతనిని ఒక నిమిషం ఆపేం దుకు ఆమెకు హక్కుగానీ, శక్తిగానీ లేదు. ఆమె ఆ చీకటిలో అతని హృదయంపై తల ఆన్చి అవ్యాజమైన అతి దుఃఖంతో శాశ్వతంగా వీడ్కోలు నిచ్చింది. అతడు ఆమె వైపు చూశాడు. కరుణా సంభ్రమాలు తప్ప ఏ విధమైన దురాలోచనా అతనిలో కలగలేదు.

## 2

తన పెట్టె వద్ద ఒంటరిగా ఉన్న వ్యక్తిని అకీమొవ్ చూశాడు.

"మీరే కామ్రేడ్ కాప్టెన్?" అని అడుగుతున్న మాయ్‌బొరొద గొంతును విన్నాడు.

"అవును. ఇంకా నిద్రపోలేదేం? వెళ్లిపడుకో."

"మీకోసమే ఎదురుచూస్తున్నా."

"అలాగా. వచ్చానుగా."

మాయ్‌బొరొద లోపలికి ఎక్కాడు. కాని అకీమొవ్ వెలుపలే ఆగిపోయాడు. ఆ రైలుకు ఎదురుగా ఎక్కడో 'గితార్' సంగీతానికి అనుగుణ్యంగా శ్రావ్యమైన గొంతు పాడుతూండడం వినిపించింది. అది ద్రోజ్‌ద్ గొంతు అని అకీమొవ్ గుర్తించాడు. అనిచ్చా మాయ్‌బొరొదను రికార్డులు అడిగిన సంగతి అతనికి జ్ఞాపకం వచ్చి నవ్వాడు.

"కోకిల గనక లేనప్పుడు కాకితోనే సంతృప్తిపడాలి", అని అతడు భావించాడు. ఎంతైనా ద్రోజ్‌ద్ గొంతు అంత చెడ్డదేంకాదు.

ద్రోజ్‌ద్ పాడుతూండడం విన్నప్పుడు అతడు తప్పక ఆనిచ్కాను ప్రేమిస్తున్నట్టు అకీమొవ్‌కు అకస్మాత్తుగా అనిపించింది. ఎలాగైతేనేం దూరంలో నెమ్మదిగా మ్రోగుతోన్న 'గితార్' నాదం అతనిని వ్యాకుల పరచింది. అతనికి ఆనిచ్కావద్దకు వెళ్లాలనిపించింది. నతాష విధికృతమైన ఒంటరి జీవితాన్ని స్ఫురణకు తెచ్చుకొని అతడా భావాన్ని తొలగించాలనుకున్నాడు. కాని నతాషను కలుసుకున్నంత మాత్రాన తన కలత తగ్గదనీ, ఆనిచ్కాను మరచిపోవడం జరగదనీ, అతడు యిప్పుడు గట్టిగా నిర్ధారణ చేసుకున్నాడు.

రైల్వేమనుషుల దీపాలు ఆ చీకట్లో అటూ యిటూ ఊగడం గమనించవచ్చు. ఎవరో అడిగాడు, "రైలు త్వరగా కదుల్తుందా?" మరో గొంతు సమాధానం చెప్పింది. "మరో అరగంట పడుతుంది — లైను బ్లాకై పోయింది."

అకీమొవ్ ట్రెయిను పొడుగునా నడిచాడు. చివరికి హెడ్‌క్వార్టర్స్ సిబ్బంది ఉన్న పెట్టె వద్దకు వచ్చాడు. దాని తలుపు సగం తెరవబడి ఉంది. గితార్ వాయిద్యం ఆగిపోయింది. లోపలినుంచి నెమ్మదిగా కంఠధ్వనులు వినవస్తున్నాయి. కాసేపు అకీమొవ్ తలుపు వద్దే నిలబడిపోయాడు. చివరికి లోపలికి వెళ్లాడు. ఆ పెట్టెలో ఉన్న వాళ్లంతా కణకణమని వెలుగుతున్న పొయ్యి చుట్టూ ఉన్నారు.

"ఆ! కామ్రేడ్ అకీమొవ్, లోపలికి వచ్చి పొయ్యి దగ్గర కూర్చో," అన్నాడు ఫీర్సొవ్.

అకీమొవ్ చెవులు నిక్కపొడుచుకున్నాయి. కాని స్త్రీ గొంతు మాత్రం వినబడలేదు. అయినా ఆమె అక్కడే ఉందని మాత్రం అతనికి తెలుసు. ఆమె అతనికి దగ్గరలోనే మౌనంగా కూర్చుంది. అందుకు కారణం అక్కడున్న వారి ప్రవర్తన, మాట్లాడే విధానంలోని తగు జాగ్రత్తేనని స్పష్టంగా తెలుస్తుంది. ఎవరైనా ఆమెను పలకరించి ఏదైనా ప్రశ్నిస్తారేమో దాంతో ఆమె గొంతు వినవచ్చునని అతడు నిరీక్షించాడు. కాని ఆ పని ఎవరూ చేయలేదు.

చివుక్కున రైలు ఒక్క ఊపు ఊగి, ఇంజన్‌కూత కూసినప్పుడు అకీమొవ్ తన పెట్టెకు వెళ్లిపోదామనుకున్నాడు. కాని రైలు కదిలిపోయింది. వాస్తవానికి అతడు క్రిందికి దూకి, రైలు వేగాన్ని అందుకొనేలోగా అతడు తన పెట్టెలోకి వెళ్లగలిగి ఉండే

వాడు. కాని అతడు అక్కడినుంచి వెళ్లడానికి యిష్టంలేదు. ఆ మిషపైనే అతడు అక్కడ ఆగిపోయాడు.

కేవలం అకీమొవ్ అక్కడున్నాడనే కారణంచేతనే అనిచ్కా తన పడకబల్లమీద ఒక మూలను ఇంకా మౌనం వహిస్తూ కూర్చుంది. ఆమెకు అతని యెడల ఉన్న భావాలను నిర్వచించడం చాలా కష్టం. కాని అతనికీ ఆమెకీ మధ్య ఎవరికీ తెలియనటువంటి, కేవలం వారిద్దరికి మాత్రమే తెలిసిన ఏదో ఒక రహస్యం ఉందని ఆమె నిరంతరం భావిస్తుం టుంది. అది బహుశ అతడు ఒంటరిగా దుఃఖిస్తున్నప్పుడు ఆమె చూడడమే కావచ్చు.

అతడు వాస్తవంగా వీరుడే. కానీ అక్కడ కూర్చున్న వాళ్లంతా కూడా అతనివంటి వారే. శత్రుశ్రేణుల వెనుక ద్రోజ్‌ద్ అనేక పర్యాయాలు యుద్ధం చేసినవాడే. అనేక వేల సార్లు తన ప్రాణాన్ని కోల్పోయేందుకు సిద్ధమైన సాహసి, అనుభవజ్ఞుడైన 'సాపర్' ఫీర్సొవ్. మిగతా వాళ్లు కూడా ఆ మాదిరిగానే. గత యుద్ధాల్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ, వారు తిరిగి ఏర్పడవలసిన ప్రదేశంలో వాళ్లకేంజరుగుతుందో అని పెద్దగా ఊహించు కుంటూ ఒకరికొకరు మాట్లాడు కొంటున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే వారి సంభాషణ చాలా సాధారణమైనటువంటిదే. కాని వాళ్ల సంభాషణ అలా చప్పగా ఉండ డానికి కారణం వారికి భావశూన్యత ఏర్పడటం కాదనీ, వారు అలవడిన నిర్బంధాలూ అయిష్టతేననీ, ఏ విషయాన్నైనా చక్కగా చెప్పే అలవాటు వారికి లేకపోవడమే అనీ ఆమెకు బాగా తెలుసు. చీకటిగా ఉన్నప్పటికీ ఆమె అక్కడ కూర్చున్న ప్రతివ్యక్తినీ గమ నించగలదు, ఒక్క అకీమొవ్ తప్ప అందరినీనూ. ఇతరులు మాదిరిగా కాకుండా అతడు చాలా గూఢమైన, లోతైన, చొరరాని వ్యక్తిలా అగుపించాడు. ఆమెకు చివరికి ఒక ఆలో చన తట్టి తనకు తాను ఆ చీకట్లో నవ్వుకొనేంతవరకు ఆమె దోషం ఏమిటో ఆమే గ్రహించ లేకపోయింది: ''అవును, అతడంటే నాకిష్టం.''

ఏమైతేనేం, అతనంటే ఆమెకు ఎందుకు ఇష్టమో తెలుసుకోవాలని ఆమె ప్రయ త్నించింది. చివరికి ఒక నిర్ణయాని కొచ్చింది. అందుకు కారణం, అతనిలో ఉన్న శారీ రక, నైతికశక్తుల సంలీనమే. అలా ఆ రెండూ ఒకరిలోనే ఉండడం బహు అరుదైన విషయం. జీవితంలోని ఆపదలయందుగానీ, దుఃఖాలలోగానీ అతనితో ఎవరైనా సరే క్షేమంగా ఉండొచ్చు. పూర్తిగా భరోసా ఉంచదగ్గ మనిషాతడు. కాని ఆమె స్వయంగా శక్తివంతమైన, బలీయమైన వ్యక్తిగా భావించలేదూ? అవును. భావించింది. ఆమెలో అంతర్వాహినిగా ప్రవహించే శక్తులు అతని వాటితో సమానమైనవనే ఆమె భావించింది.

వర్షం భూమిమీద పడేప్పుడు, ఆలోచించే శక్తిగనక వర్షానికి ఉన్నట్లయితే ఏవిధంగా భావిస్తుందో అదేవిధంగా ఆమె ఉదాత్తమూ, అగణనీయమూ అయిన ఆత్మ పరిత్యాగంతో అతనిపై మనసు నిలిపింది.

సరిగ్గా అకీమొవ్ వచ్చేముందే వారంతా అతనిని గురించి మాట్లాడుకొనడం జరిగింది. ఒక్క ద్రోజ్‌ద్ తప్ప మిగతా వాళ్లంతా అతనిని గురించి సంపూర్ణంగా ప్రశం సించినవారే. ద్రోజ్‌ద్ మాత్రం కోపంగా మాట్లాడాడు. అతడు అకీమొవ్ గర్విష్ఠి అనీ, సరసతలేని వాడనీ, నౌకాదళంలోని అతని ఉద్యోగం గురించి మరీ గొడవగా అనా వశ్యకమైన హడావుడి చేస్తాడనీ అన్నాడు.

ద్రోజ్‌ద్ అలా ప్రవర్తించడానికి కారణం అతడు ఆనిచ్కను గాఢంగా ప్రేమించ డమే. తనతోపాటు యితరులంతా అకీమొవ్‌ను ప్రేమిస్తున్నట్టే ఆనిచ్క కూడా అతనిని ప్రేమిస్తుందేమోనని ద్రోజ్‌ద్ భయం.

కాప్టెన్ ద్రోజ్‌ద్ చాలా మంచివాడు. ఆఫీసరుగా అతడు సామర్థ్యం కలవాడు. ధైర్యస్థుడు. రికన్నాయ్‌సెన్స్ మనిషికి ఆత్మ విశ్వాసం, వాచాలత యివి రెండూ అవసర మని అతడు భావించడంచే, తాను స్వతహాగా ఉన్న దానికంటే అధమంగా కనిపించేందుకు అతడు ప్రయత్నం చేస్తాడనిపిస్తుంది. జిప్సీ మాదిరిగా అతని శరీరం నల్లగా ఉంటుంది. అతని కళ్లు నల్లగా తళతళలాడుతూంటాయి. ప్రతి స్వల్ప విషయంలో కూడా అతడు కోపంతో చెర్రున పైకి లేస్తాడు. కేవలం యుద్ధం చేస్తున్న సమయంలో మాత్రం అతడు నిర్దాక్షిణ్యంగా కరకుగా ఉంటాడు. అలాంటి సమయాల్లో అతడు ఆనిచ్కకు నిజంగా నచ్చాడు. మొట్టమొదట అతడు, ఎప్పుడూ నటించే విధంగానే పరిహాసంగా అనాలోచితంగా ప్రవర్తించాడు ఆనిచ్కతో. కాని ఆ మరుక్షణాన్నే అతడు తన తప్పును తానే గ్రహించుకున్నాడు. యుద్ధానుభవంచే కఠినంగా ఉండే రికన్నాయ్‌సెన్స్ మనుషులు కొత్త అనువాదకురాలి సమక్షంలో ఏవిధమైన మాట జారుదుగానీ, లేదా మోటు సం గతులుగానీ ముచ్చడించరనే వాస్తవాంశం మొట్టమొదట అతని మనసుకు తట్టింది. అతడు ఆనిచ్కను అతి శ్రద్ధతో గమనించడం ప్రారంభించాడు. ఆమె ధైర్యం, ఆత్మ విశ్వాసం, ఏవిధమైన సరసాన్నయినా ఏవగించుకోవడం అతనికి అపరిమితంగా నచ్చాయి. ఇది ఆమెమనసును మనోహరమైన స్త్రీత్వంనుండి వేరే వైపు మళ్లించలేదు. అంచేత ద్రోజ్‌ద్‌కు మరింత ఆశ్చర్యాన్ని కలిగించింది. సమీపంలో ఒక ఫిరంగి గుండు బద్దలైన ప్పుడుగానీ లేదా శత్రువుల విమానాలు దగ్గరకు వచ్చినప్పుడుగానీ ఆమె కొద్దిగా పాలి

పోయి విషాదపూరితంగా: ''ఓ, ఎంత ఘోరం!'' అని అంటుంది, కాని ఆమె తన పనిని అదే యోచనతో యిదివరకు ఎంత కచ్చితంగా కొనసాగించేదో అంతటి కచ్చితంగానే కొనసాగిస్తుంది.

''ఓ, ఎంత ఘోరం!'' అని ఆమె ఆశ్చర్యంతో అనడం విన్నప్పుడు అతని హృదయం జలదరించేది. నిజానికి అతడా మాటలు ఆమెనుండి వినేందుకై నిజంగానే కాల్పులు కఠినంగా జరగాలని వాంఛించేవాడు. ఆమె ఆ మాటలు అన్నప్పుడు అతనికామె బలహీను రాలుగా కనిపించింది. కాబట్టి ఆమె తనకు సన్నిహితురాలుగానూ ఎక్కువ అందుబాటులో ఉండేదిగానూ భావించాడు.

అనిచ్కా అంటే ద్రోజ్‌ద్‌కు కలిగిన భావన, అతనిని అకీమొవ్ అంటే భయ పడేట్లు చేసింది. అకీమొవ్ శక్తి అంతా అతడు నిష్కపటంగా మాట్లాడటంలోనే ఉంది. అతడెన్నడూ నటించేవాడు కాడు. ఎవరినీ వంచించలేదు. తనంతటికి తాను ప్రజల హృదయాలలో అతడెన్నడూ స్థానమేర్పరచుకోలేదు. కాని ప్రజలు వారంతటికి వారు స్వయంగా అతనికి తమ హృదయాల్లో స్థానమిచ్చారు.

అకీమొవ్ ఎప్పుడూ ఒకే రీతిగా ఉంటాడు. అయినా అతనిని గురించి ఏదో నిగూఢమైన, క్లిష్టమైన వ్యవహారం ఉంది. ప్రథమ వీక్షణంలో అనుపించేట్టుగా అతడు సానబట్టని వజ్రం కాదు. ముక్కు సూటిగా పోయే అతని మనస్తత్వం ఏవిధం గానూ ప్రాచీనత్వానికి చిహ్నం కాదు. ఏ రకమైన సందిగ్ధతలోనూ చిక్కుకోవడం యిష్ట పడని వారి లక్షణమే అది.

ద్రోజ్‌ద్ కూడా, ప్రథమ వీక్షణంలో సానబట్టని వజ్రంలాగానే కనిపించాడు: ఎవరిని గురించైనా చెప్పవలసి వస్తే అతడు అతనిని గురించి ఏమనుకున్నాడో ఆ విష యాన్ని కుండబద్దలు కొట్టినట్టు మొహంమీదే చెప్పేవాడు. కాని అతడు పైకి మాత్రమే అలా అగుపించేవాడు. ఆ సంగతి అతనికి యితరులకంటే బాగా తెలుసు. వాస్తవానికి అతడెప్పుడూ అందరితోనూ తలవూపడానికే సంసిద్ధంగా ఉంటాడు. అతడు నిష్కపటంగా మాట్లాడటం అనేది స్వభావసిద్ధమైనటువంటిది కాదు. బలవంతంగా తెచ్చిపెట్టుకున్నది. అందుకు అతనికి ప్రయత్నం అవసరం. అతడు ప్రజలకు యింపుగా ఉండాలని వాంఛిస్తాడు. ప్రజలు అతనిని హర్షించాలని అభిలషిస్తాడు. అందుచేతనే అతడు తన హృదయాంతరాళంలో తాను కేవలం 'రాజకీయ వేత్తలా'గా నటిస్తున్నట్టు పరిగణిస్తాడు. ఆ భావన అతనిని నిరంతరం చిత్రహింస పెడుతుంది.

అకీమొవ్ పుట్టుకతోనే నాయకుడు. ప్రజలను నడిపించగలిగే మనిషి. ద్రోజ్‌ద్ నాయకుడు కావాలని కోరాడు. అలా కలలుకన్నాడు; కాని అతడు చాలా బలహీనుడు. అతనిలో ఒక్కొక్కప్పుడు తటాలున కపటమూ, మోటుతనమూ పెల్లుబికి వచ్చేసేవి; ఒక్క ముక్కలో చెప్పాలంటే అతనికి ఒక నిర్ధారణమైన కార్యక్రమం లేదు.

అకీమొవ్ యెడల ఆనిచ్కా ప్రవర్తనలోగానీ, ఆనిచ్కా యెడల అకీమొవ్ ప్రవర్తనలోగానీ ఏవిధమైన ప్రత్యేకతనూ ద్రోజద్ గమనించలేదు. కాని అకీమొవ్ అతనికంటే గొప్పవాడనీ, ఆనిచ్కా కేవలం ఉత్తమమైన వ్యక్తికే అర్హురాలనీ అతడు పరిగణిస్తూ వారు ఒకొకరికొకరు సరిపోయారు గనక ఎక్కడ ఖండితంగా ఒకటైపోతారో అని అతడు భయపడ్డాడు.

అతడు చీకట్లో, వెచ్చగా ఉన్న పెట్టెలో కూర్చొని ఉత్సాహవంతంగా ఉన్న సంభాషణలో పాల్గొంటూ ఆనిచ్కా గానీ, అకీమొవ్ గానీ చెప్పిందానిని శ్రద్ధగా వినేందుకు సంకల్పించాడు ద్రోజ్‌ద్. కాని నోటివెంట ఒక్క పలుకైనా లేకుండా వారు మౌనంగా అక్కడ కూర్చున్నారు. ఆ మౌనంలోనే వాళ్ళిద్దరి మధ్యా ఏదో అగుపించని సంబంధం ఉన్నట్టు అతడు పసికట్టాడు. కాని, వాళ్ళిద్దరి మధ్యా ఉన్న సంబంధాలు కేవలం అతని ఊహాప్రపంచంలో మాత్రమే మసలుతున్నట్టుగా అతడు ఒక్కొక్కప్పుడు ఆలోచించేట్టు అదంతా అతనికి పట్టు చిక్కకుండా ఉంది.

కాని ఆ విషయంలో అతడు పొరబడ్డాడు — ఆ బంధాలు వాస్తవంగానే ఉన్నాయి.

చివరికి అకీమొవ్ మాట్లాడాడు.

"నేను కుర్రవాడిగా ఉన్నప్పుడు సైనికులతోపాటు రైలులో ప్రయాణం చేయాలని వాంఛించాను," అన్నాడు అకీమొవ్. "నేను ఊహించగల ఉత్సాహం ఏమిటంటే, సైనికులతోపాటు నేను కూడా రైల్లో ప్రయాణం చేయడమే."

"కాదు. చెడ్డవాడెన్నడూ అలా మాట్లాడడు," అని ఆనిచ్కా భావించింది, అకీమొవ్ మాటలుకంటే అతని కంఠధ్వనినే ఎక్కువగా వింటూ.

"కాని యిప్పుడు," మళ్ళీ అతడు సంభాషణ సాగించాడు, "నాకు ఏ మాత్రం ఉత్సాహం కలగడంలేదు. ఎవరో ఒకరు వెనకబడి పోతారనీ, లేదా కొందరు ఒక చుక్క

హెచ్చు పుచ్చుకుంటారేమోననీ నేనెప్పుడూ భయపడుతుంటాను. సర్వసాధారణంగా చెప్పాలంటే సైన్యంలో సైనికునిగా ఉండడం మేలు. అతని జీవితం ఎంత కఠినంగా ఉన్నా అతనిని బాగా చూసుకుంటారు. బహుశ, ఒక కాప్టెన్ అతడు మొదట ఉన్న ఉద్యోగంలోకి తిరిగి వెళ్లాలని వాంఛించడం సమంజసం కాదేమో కానీ నాకు మాత్రం యథార్థంగా ఒక్కొక్కప్పుడు ఏ విషయాన్నైనా ఆలోచించాలంటే యిష్టం ఉండదు, ఏ వ్యక్తికోసమైనా బాధ్యత వహించాలంటే మనస్కరించదు.''

మామూలుగా ఉండేప్పుడు ఏవిధంగా మాట్లాడుతాడో అదేవిధంగా స్నేహపూర్వకంగా దయార్ద్రహృదయంతో అకీమొవ్ మాట్లాడాడు. ఒక గంటక్రితం సామాన్యంగా వున్న ఆ చిన్న యింట్లో జరిగిన సంఘటన తర్వాత అతడు అలాంటి చప్పటి విషయాల్ని ఎలా మాట్లాడగలిగాడా అని స్వయంగా ఆశ్చర్యపోయాడు. ''ఒక వ్యక్తి తన అసహ్యకరమైన రహస్యాలను దాచుకోగలగడం ఎంత చండాలం,'' అని అతడు భావించాడు. అతనిలో అకస్మాత్తుగా రగిలిపోతున్న అవమానం రేకెత్తి, ఏ అసహ్యకరమైన రహస్యాలనైనా సరే ఉంచుకోకపోవడం మంచిదని తలపోశాడు, కాని అది అంత తేలికైన విషయం కాదు.

''మొన్న మన మనుషుల్ని శత్రువులపైకి పంపడంలో మీా అభిప్రాయం ఏమిటి?''

''నాకు జ్ఞాపకం లేదు.''

''అలా పంపడం చాలా ఘోరమైన విషయం,'' గుసారొవ్ అన్నాడు. ''వారు వెళ్లరని నువ్వు భయపడ్డావ్.''

''లేదు. నేను భయపడలేదు,'' అకీమొవ్ సమాధానం చెప్పాడు. ''అది కేవలం ఆలోచింకూడని విషయం. అలా ఆలోచించినట్లయితే వాళ్లు వెళ్లరు; వాళ్లు వేదన పడతారు. దాంతో ఆ దాడివల్ల లాభం వుండదు. వాళ్లంతా కూడా ఒక వ్యక్తిలాగా వెళ్తారని నమ్మకం ఉండాలి. సరియైన సమయం చూసి వారిని పంపాలి. లేకపోతే అది కేవలం గాలిగుర్రాలమీద స్వారిచేయడంలా వుంటుంది. రాజకీయాల్లో కూడా అంతే: నువ్వు సరియైన నినాదం సకాలంలో యివ్వాలి.''

ఈలోగా ద్రోజ్‌డ్ ఆలోచిస్తున్నాడు: ''అతడు ఎలా మాట్లాడగలుగుతున్నాడు? రాజకీయ శాఖలోని లెక్చరర్ మాదిరిగా ఉపన్యాసం యివ్వగలుగుతున్నాడు. ఆకర్షణీయంగా ఉంది. అతడు దేనిని గురించి మాట్లాడుతున్నాడో అతనికి తెలుసు.''

''అలా అని రేమిజొవ్ నాతో చెబుతుండేవాడు,'' అన్నాడు అకీమొవ్ చాలా సేపు మౌనంగా ఉన్న తర్వాత.

''రేమిజొవ్ గొప్పతనాన్ని తెలిపేందుకు సరియైన సమయాన్ని తీసుకున్నాడు,'' అని డ్రోజ్‌డ్ తనలోతాను చిన్నవోతూ వ్యాఖ్యానించుకున్నాడు. ''కాస్త నిరాడంబరంగా ఉండడంవల్ల హాని జరగదని అర్థం చేసుకున్నాడు. భలే జిత్తులమారివాడు.''

రీబిన్స్క్‌లో జరిగిందని భావించే ఒక సంఘటన గురించి గుసారొవ్ చెప్పడం ప్రారంభించాడు: యుద్ధరంగంలోని ఒక సైనికుడు ఆస్పత్రినుండి వెలికి వచ్చినప్పుడు అతని భార్య ఎవరో అపరచితునితో ఉండడం చూసి, తన భార్యను కాల్చిచంపేశాడు. అతని చర్య న్యాయసమ్మతమైందని కోర్టు వారు పరిగణించి అతనిని విడుదల చేశారట.

అక్కడున్న వాళ్లల్లో దాదాపు ప్రతివ్యక్తీ ఆ తీర్పుతో అంగీకరించాడు. చురకు దనంలేని కంఠధ్వనితో అకీమొవ్ ఒక్కడే యిలా అన్నాడు: ''అతడు ఆస్పత్రిలోగానీ, యుద్ధరంగంలోగానీ బహుశ ఎన్నడూ ఏ స్త్రీనైనాసరే ప్రశాంతంగా వదలిపెట్టి ఉండ డేమో?''

దాంతో యిండ్లవద్ద ఉన్న భార్యల శీలం విషయంలో వాదన ప్రారంభమైంది. ఒక్క మాటైనా పలక్కుండా యింకా అక్కడే కూర్చొని ఉన్న ఆనిచ్క ఆకీమొవ్‌ను తప్పక సమర్థిస్తుందని అతనికి బాగా తెలిసినప్పటికీ డ్రోజ్‌డ్ అకీమొవ్‌తో తీవ్రంగా వాదించాడు. అతని కోపం పెరిగింది. ''అతడు ఆమెను సంతృప్తి పరచేందుకు స్త్రీ పక్షాన్ని తీసుకుంటున్నాడు,'' అని అతడు భావించాడు, ''తానెలాంటి సత్పురుషుడో అం దరికి తెలియాలని అతడు ఆడవాళ్ల పక్షం వహిస్తున్నాడు.''

''మీ అభిప్రాయం ఏమిటి క్రామేడ్ బెలొజ్యోరొవ?'' అని ఎవరో ఆనిచ్కను అడిగారు.

ఆమె నిద్రపోతున్నట్టు నటించి సమాధానం చెప్పలేదు. అకీమొవ్ అన్నది ఆమె విన్నాక అకస్మాత్తుగా ఆమెకు, అతడు అతనికి తగని స్త్రీని తన జీవితభాగస్వా మిగా ఎన్నుకుంటాడేమోనని, భయం వేసింది. ఆ భావన ఆమెను, పైకి ఎంతో అక్రమంగా అగుపించినా, అతని యెడల ఒక విచిత్రమైన అసమర్థనీయమైన కరుణతో నింపివేసింది.

మర్నాడు ఉదయం పెందలకాడనే రైలు ఒక చిన్న స్టేషన్‌వద్ద ఆగింది. నిద్ర పట్టని కారణంచే అకీమొవ్ లేచి ప్లాట్‌ఫారంమీదికి వెళ్లాడు. మొత్తం రైల్లో ఉన్న వాళ్లంతా యింకా నిద్రపోతూనే ఉన్నారు. ఏదో కొద్దిమంది వయసుమీరిన సైనికులు మాత్రం వెలుపలికి వెళ్లి గడ్డితో నిండిన గట్టుపై పొగత్రాగుతూ కూర్చున్నారు.

కాప్టెన్ లబ్‌జీన్ అకీమొవ్‌వద్దకు వచ్చాడు. అక్రిందటి రోజున తన సాహస కృత్యం ఎలా ముగిసిందీ చెప్పడం ప్రారంభించాడు. ఆ స్త్రీ శీలం విషయంలో ఎంతో కఠినంగా ఉండడంచే అతని ప్రయత్నం విఫలమైపోయింది. కాని అతడు అవివేకంతో నిండిన అహంకారంతో దానిని దిగ్విజయంగా ముగిసినట్టు తెలిపాడు. ఆ విషయాన్ని వినడం అకీమొవ్‌కు బాధ కలిగించింది. అవమాన మనిపించింది. అతడు మాట మధ్యలోనే అడ్డగించి: "సర్లే. ఇహచాలు. జరిగిందేదో జరిగిపోయింది. అదేమంత వదరుబోతుతనంగా మాట్లాడవలసిన విషయంకాదు. పాపం వొంటరి స్త్రీలు. వాళ్లంటే నాకెంతో విచారంగా ఉంది. అంతే."

ఇంజన్ కూతకూసింది. లబ్‌జీన్ తన స్థలానికి వెళ్లిపోయాడు. సైనికులు తమతమ పెట్టెలకు పరుగున వెళ్లారు. రైలు కదిలింది. అప్పటికే అకీమొవ్ తలుపు పిడిమీద చేయి ఉంచి లోపలికి దుమకడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆనిచ్కా స్టేషన్‌నుండి రైలువద్దకు పరుగున వస్తూండడం అతడు గమనించాడు. ఆమె చేతిలో మెస్‌టిన్ ఉంది. అందులోనుండి పాలు ఒలికి పోతున్నాయి. ఆమె ఓవరుకోటును తొడుక్కోలేదు భుజాలపై ఆమె ఉద్యోగాన్ని తెలియపరచే చిహ్నాలుగల పచ్చని ఆలివ్ యూనిఫారం కోటును మాత్రమే ఆమె వేసుకుంది. టాప్-బూడ్సులుకాకుండా లేసులున్న బూడ్సులను ఆమె తొడుక్కుంది. పరుగెడుతున్నప్పుడు ఆమె సన్నిని కాళ్లు ఎంత తేలికగా వేగంగా కదులుతున్నవీ అతడు గమనించాడు.

ఆనిచ్కా రైలును అందుకోగలదో లేదో అని చూస్తూ అకీమొవ్ అక్కడే నిలబడిపోయాడు. ఆమె అందుకోలేకపోవడం గమనించినప్పుడు అతడు ఆమెవైపు మళ్లాడు. అతని వెనుక రైలు అతి వేగంగా వెళ్తూన్న శబ్దమూ, ప్రతి పెట్టెనుండీ: "కామ్రేడ్ అకీమొవ్, లోనికి దూకు," అని కేకలు వేయడమూ అతనికి వినబడ్డాయి.

కాని అతడు వెనుకకు తిరిగైనా తిరగలేదు. తానిక రైలును అందుకోవడం

అసాధ్యమైన విషయం అని ఆమె గ్రహించి, పరుగు వేగాన్ని తగ్గించి నిలబడిపోవడం అకీమొవ్ కనిపెట్టాడు. ఆమె తనంతటికి తాను అరవకుండా ఉండేందుకా అన్నట్టు తన చేతిని నోటికి అడ్డంగా పెట్టుకుంది. ఆమె మోముపై నిస్పృహతో నిండిన హాస్య కరమైన వర్చస్సును చూసి అకీమొవ్ నవ్వాడు. రైలు వేగంగా వెళ్లిపోయేంతవరకు ఆమె అతనిని గమనించలేదు. వెనుక పసుపుపచ్చని 'రై' పొలం ఖండిక కనుపస్తుండగా ముందు అతడు నిలబడ్డాడు.

పిడుగువంటి రైలుశబ్దం క్రమక్రమేణా తగ్గిపోయి ఎక్కడో దూరాన గర్జిస్తున్నట్టుంది: వారిద్దరూ నెమ్మదిగా ఒకరివద్దకు ఒకరు నడిచారు.

"మీరు కూడా మిగిలిపోయారన్నమాట?" ఆనిచ్క అడిగింది.

"అవును."

"చాలా సంతోషం. ఇద్దరం కలిసి ఉండడం చాలా మంచిది. తర్వాత రైలెప్పుడో మీకు తెలుసా?"

"నాకు సరిగ్గా తెలియదు. రోజూ ఒక రైలు నడుస్తుందని వాళ్లన్నారు."

"కాబట్టి మనం రేపటిదాకా యిక్కడ ఉండాలన్నమాట. ఎక్కడ బస?"

"స్టేషన్‌లోనే."

"నా దగ్గర ఒక్క కోపెక్కైనా లేదు. మీ దగ్గరుందా?"

"లేదు."

ఆమె ఉత్సాహంగా నవ్వింది. తర్వాత హఠాత్తుగా చాలా గంభీరంగా ముఖం పెట్టుకుంది. "మీరు నాకోసమే నిలిచిపోయారా?" అని ఆమె అడిగింది.

"అవును."

ఇద్దరూ మౌనం వహించారు. అతడెందుకు అలా చేశాడో చెప్పడానికి అతడు ప్రయత్నించాడు. "మీ అంతటికి మీరు ఎలా గడుపుకోగలరో నాకు తెలియదు..."

"మీరు నా మీద దయతలచినట్టుంది?"

"దయ అన్న పదం కాదు ఉపయోగించవలసింది. మిమ్మలిని ఒంటరిగా విడవడం బాగుండదేమోనని చటిక్కున అనిపించింది నాకు."

"మీరంత దయచూపుతారని అనుకోలేదు," అని ఆమె అన్నది. ఆమె కంఠ ధ్వనిలో వ్యంగ్యం కానరాదు. "మీకు నా కృతజ్ఞతలు. అవును మనిద్దరం కలసి ఉండడం మంచిది. తప్పకుండానూ."

"మనం ప్రయత్నించి యీ వేళే వెళ్లిపోదాం," అని అతడన్నాడు. "బహుశ, రైలు ఉండొచ్చు. మనం మన రైలును దాటిపోవచ్చు."

ఆమె భయపడింది.

"అన్నట్టు నేను మరచిపోతున్నాను. మీరు చిక్కులో పడొచ్చు. మీరు బటాలియన్‌ను వొదిలిపెట్టారు. ఇదంతా కూడా యీ పాలు కారణంగానే. నాకు అకస్మాత్తుగా పాలు కావాలనిపించింది." ఆమె మెస్‌టిన్‌వైపు చూసింది. "మీరు కొద్దిగా తీసుకోండి." అని ఆమె నిజంగానే అడిగింది.

అతడు నవ్వాడు. ఆమె కూడా నవ్వింది. తర్వాత వాళ్లిద్దరూ మరుక్షణానే కలవరపడ్డారు. ఆ కలవరపాటును దాచుకొనేందుకు చుట్టూ పరికించారు. నాలుగు వైపులా 'రై' పొలాలు వ్యాపించి ఉన్నాయి. కొన్నిటిలో ఇంకా కోతలు జరగలేదు. ముందు ఒక మార్గం తిన్నగా ఆ పొలాలగుండ గాలిలో మర్మరధ్వని చేస్తూ నిట్టూర్చుతున్న బర్చితోటలోకి, దారితీసింది. ఆ చిన్న స్టేషన్‌కు ఒక చిన్న యిటికల యిల్లు ఉంది. దానికో చిన్న బాల్కనీ, ఆ బాల్కనీమీద "బ్లోక్‌హౌస్" అనే అక్షరాలు ఉన్నాయి. నాలుగు వైపులా పురాతన వృక్షాలు ఉన్నాయి. దగ్గరలో ఉన్న ఒక బెంచీమీద ఒక ముసలామె కూర్చొని ఉంది. ఆమెవద్ద రెండు పెద్దసీసాల పాలు ఉన్నాయి. ఇప్పుడు వాళ్లు పడు తున్న గొడవకి కారణం ఆమే.

వాళ్లు మొదట చేసిన పని ఏమంటే స్టేషన్‌కు వెళ్లడం, తర్వాత రైలు ఎప్పుడు వెళ్తుంది అని స్టేషన్-మాస్టర్‌ను అడగడం. రైలు వచ్చేందుకు ఎంతో ఆలస్యం ఉంది గనక వారు వాహ్యాళికి వెళ్లారు.

వారు బర్చితోట మధ్యలోకి వెళ్లారు. పసుపురంగు ఆకులతో తివాచీ పరచి నట్లుగా ఉందక్కడ. వాడిపోయిన కొన్ని ఆకులు యింకా చెట్లను వ్రేలాడుతున్నాయి. చుట్టూ ఎంతో అందంగా ఉంది. వారి ఊపిరితిత్తులు శరత్కాలపు సుగంధ పరిమళంతో నిండిపోయాయి. నిజానికి అది బంగారంలాంటి శరత్కాలం. ప్రపంచంలో ఉన్న ప్రతీదీ దేని స్థానంలో అది ఉన్నట్టు అనిపిస్తుంది: స్టేషన్‌లో శరత్కాలపు ఈగలు చెడ్డగా కుడుతున్నాయి. కాకులమంద పొలాలపై వాలి ఆ తర్వాత పెద్దగా కావుమంటూ అరుస్తూ పైకి ఎగిరి స్టేషన్ చుట్టూ ఉన్న ఆ పురాతన వృక్షాలపై క్రిక్కిరిసి కూర్చుంటు న్నాయి; శరత్కాలపు చివరి మధువుకోసం తేనెటీగలు ఝుంకారం చేస్తూ ఎగురుతున్నాయి.

సామాన్య జీవితంలోని యీ దృశ్యాలన్నీ ఆనిచ్కా అకీమొవ్‌లకు ఏదో కొత్తగా కనిపించాయి. వారు స్వయంగా కొత్తదనాన్ని అనుభవించేట్టు చేశాయి.

వారాతోటలో నెమ్మదిగా నిశ్శబ్దంగా నడిచారు, క్రింద దట్టంగా మెత్తని పాన్పు వలె ఏర్పడ్డ ఆకులను కాళ్లతో మట్టడంలో ఒక విధమైన ఆనందాన్ని అనుభవిస్తూ. మౌనంగా ఉండడం అసహ్య మనిపించింది అకీమొవ్‌కి: నిలువైనకాలాన్ని వ్యర్థం చేస్తున్నట్టుగా అతడు భావించాడు. అతడు ఆనిచ్కాను ప్రేమిస్తున్నట్టు చెప్పకపోయినట్లైతే, అతడు ఆమెను సంతృప్తి పరిచేందుకు, వినోద పరిచేందుకు, లేదా కనీసం ఎలాగో ఒక లాగున ఆమెకు అభిరుచి కలిగించేందుకు అతడు తప్పక ప్రయత్నం చేయాలి. ఏం చెప్ప గలనా అని అతడు విస్తుపోయాడేగాని తగిన దానిని గురించి అతడు ఆలోచించలేక పోయాడు. తనమీద తనకే కోపం వచ్చింది. వ్యంగ్యంగా ఆలోచించాడు: "ప్రేమించడం చాలా కష్టమైన విషయం. అవునా పావెల్ అకీమొవ్? చాకచక్యం అవసరం. యుద్ధం మాదిరి కాదు."

ఏమీ మాట్లాడక పోవడమే వివేకవంతమైన పని. ఆ సంగతి అతనికి తెలియదు. అతని మౌనానికి ఆనిచ్కా హర్షించింది. అతని నోటినుండి ఉత్తమాటలు విని ఉంటే ఆమె భరించ లేకపోయేదేమో?

అతడు ఆమె సన్నని చేతులు వంకా పసిపాపలకుమల్లె చర్మానికి సమంగా ఉన్న గోళ్ళుగల సన్నని వ్రేళ్లవైపూ అతడు ఓరగా చూశాడు. ఒక చేయి పరధ్యానంగా తెల్లని బర్చి తరుకాండములను పొడుగాటి బెత్తంతో కొడుతోంది. మరో చేయి మెస్‌టిన్నును ఊపుతోంది. సహజంగా ఆతడు మర్యాదకోసం అయినా ఆ మెస్‌టిన్ తీసుకోవలసి ఉంది; కాని అతడు అలాంటి సాహసం చేయలేకపోయాడు. ఆమె ఒక స్త్రీ కాబట్టి తాను పురుషుడుగా ఆ పని చేయవలసి ఉందన్న భావన అతనికి వినోదాన్ని కలిగించింది. కాని ఒక కాప్టెన్‌గా అతడు తన లెఫ్టినెంట్‌తో అలా ఆటకాయతనంతో ప్రవర్తించడం సబబు కాదు.

అతడు ఆమెను గురించే ఆలోచిస్తున్నాడు. విచిత్రమైన భావనలు: నా ప్రక్కన నడుస్తున్న పిల్ల నిజంగా నేను ఊహిస్తున్న యువతేనా కాదా? కొది రోజుల క్రితంనుండీ అతడు అనవరతం ఆలోచిస్తున్న అమ్మాయి ఆతనికి దూరంలో ఉంది. ఎంతో దూరంలో **ఉంది** — ఆమె అతని చేరువలో ఉండలేకపోయింది. కాని ఇప్పుడు అతనితో నడుస్తున్న పిల్ల అతనికి చాలా దగ్గరగా, సరిగ్గా అతని ప్రక్కనే ఉంది. తనతో ఉన్న ఆ పిల్ల చేయిని

తీసుకొని మాట్లాడవచ్చు, కాని అతని హృదయసామ్రాజ్యాన్ని ఏలుతున్న రెండో అమ్మాయి, మేఘాలలో నివసిస్తోంది. బహుశ నీవు ప్రేమిస్తున్న అమ్మాయినీ ప్రక్కనే ఉంటే అద్భుతంగా ఉంటుందేమో. ఎందుకంటే, నీకు ఎంతో దూరంలో ఎక్కడో ఆకాశంలో నివసిస్తూ తనంతటకు తాను నీ చేతిమీదికి వచ్చి వాలిన పక్షిమాదిరిగానే ఉంది ఆమె.

అకీమొవ్ ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. అది ఆమె గ్రహించగలిగింది. కేవలం తనకోసం అతడు రైలును తప్పిపోవడంచేతనే తాను అలా భావించలేదు. అతని ప్రవర్తన బాగుంది. ఆమెను ఎరిగిన ఏ ఆఫీసరైనా, ఏ సైనికుడు అయినా అదే విధంగానే చేసి ఉండేవాడు. కాని ముఖ్యమైన విషయం ఏమంటే ఆ పని చేసింది అకీమొవ్ గనక. కేవలం మర్యాదకోసం అలా చేసే వ్యక్తి కాదు అకీమొవ్. అందుకు ఏదో బలవత్తరమైన కారణం ఉండి తీరుతుందని ఆనిచ్కకు తెలుసు.

అప్పుడప్పుడు ఆమె అకీమొవ్‌వైపు ఓరగా చూసింది. అతడు పరధ్యానంగా ఎండకు ఎర్రబడిన బలీయమైన ఒక చేత్తో తన కోటు జేబుబొత్తాముని లాగుతున్నాడు.

బెత్తం పట్టుకున్న ఆ అమ్మాయి చేయీ, బొత్తాం మీదున్న అతని చేయీ చాలా దగ్గరగా ఉన్నాయి. అతడు ఆనిచ్క హస్తాన్ని ఆ తర్వాత తన హస్తాన్ని చూసినప్పుడు సరిగా జ్ఞాపకం చేసుకోలేనటువంటి ఏదో విషయం అతనికి స్ఫురించింది. తర్వాత అతనికి జ్ఞాపకం వచ్చింది: పొడుగాటి మనోహరమైన విల్లో ఆకు, దాని ప్రక్కనే ఒక పెద్ద మేపిల్ ఆకు. వారి నయనాలు కలిశాయి. చిరునవ్వునవ్వుకున్నారు. ఏదో చెప్పాలనుకున్నారు ఒకరికొకరికి. కాని యింతలోకే స్టేషన్ వైపునుండి ఒక కంఠధ్వని ఆత్రతతో వెతుకుతున్నట్టు వినవచ్చింది.

''కామ్రేడ్ కాప్టెన్! కామ్రేడ్ కాప్టెన్!''

''మాయ్‌బొరొద,'' అన్నాడు అకీమొవ్ నిట్టూర్చుతూ.

నిజంగానే అతడు మాయ్‌బొరొద. బటాలియన్ కమాండర్ వెనుక ఉండిపోయాడని యితరులు చెప్పగానే అతడు రైల్లోంచి దూకి వెనక్కి పరుగెత్తాడు. ఇప్పుడు చెట్లల్లోంచి ప్రత్యక్షమైయ్యాడు. అతని ముఖం మామూలుగానే నిచారం తెలుపుతూ ఉంది. అతని తలపై టోపీ హాస్యధోరణిలో ఉంది. ఏమీ జరగనట్టే, అనువాదకురాలు అతని ప్రక్క ఉన్నందుకు కూడా ఆశ్చర్యపడనట్టే అతడు తన ఆఫీసరువద్దకు వెళ్ళాడు. అతని చేయిపై అకీమొవ్ ఓవర్‌కోటు ఉంది.

వాళ్ళు ముగ్గురూ స్టేషన్‌కు తిరిగి వెళ్లారు. అకీమొవ్ కొంత కలవర పడ్డాడేమో అతని ముఖంలో కాఠిన్యత గోచరించింది. స్టేషన్ వద్ద మరో ఆశ్చర్యకరమైన విషయం వేచి ఉంది: రెజిమెంటల్ రికన్నాయ్‌సెన్స్ యూనిట్‌లో పనిచేసే బిర్యుకోవ్, మొల్‌చానొవ్‌లు యిద్దరూ ఆనిచ్కాకు ఓవర్‌కోటును అందించేందుకు రైలునుండి దిగిపోయారు. ఆమె విషయమై కాప్టెన్ ద్రోజ్‌ద్ ఆతురత పడి వాళ్లిద్దరికీ అనుమతి యిచ్చాడని వాళ్ళు తెలియజేశారు.

కాబట్టి వాళ్ల సంఖ్య అయిదుకు పెరిగింది. స్టేషన్ దగ్గర వున్న బెంచిపై వారందరూ కూచున్నారు. త్వరలోనే స్టేషన్-మాస్టరూ, మరి కొంతమంది రైల్వే ఉద్యోగులూ వచ్చి వాళ్లను కలుసుకున్నారు. సహజంగా ప్రస్తావన యుద్ధంవైపు మళ్లింది: అది యుద్ధం ముగిసేందుకు ఎంతకాలం పడుతుంది? జర్మన్లు యింకా బాగానే పోట్లాడుతున్నారా? ఇదివరకంతటి బాగా పోట్లాడ్డంలేదా? మిత్రమండలి పశ్చిమాన రెండో యుద్ధశ్రేణి ప్రారంభించేందుకు యింకా ఎంత కాలం పడుతుంది?

కొంతమంది కుర్రాళ్లు వాళ్ల చుట్టూ చేరి వాళ్ల సంభాషణ శ్రద్ధగా వింటూ వింతగా కళకళలాడుతున్న ఆనిచ్కావైపూ, అకీమొవ్ పతకాల వైపూ, అలవాటు చొప్పున వేసుకొన్న రికన్నాయ్‌సెన్స్ మనుషుల వింతైన రంగురంగుల కామొఫ్లేజి చొక్కాల వైపూ చూస్తున్నారు.

4

తర్వాత మూడు గంటల కాలం గడచిపోయాక రైలు వచ్చింది. అది తమ రైలును అనుసరిస్తున్న డివిజన్ రవాణా రైలు; అందులో జనరల్ మూహిన్, డివిజనల్ హెడ్ క్వార్టర్స్ సిబ్బంది ఉన్నారు. నిర్ణీతసమయంకంటే అది ఎంతో త్వరగా నడుస్తూ అకీమొవ్ ఆనిచ్కాలు తప్పిపోయిన రైలును దాదాపుగా కలుసుకుంది. వీరు దురదృష్టానికి బలి అయినట్లు పరిగణింపబడి రైల్లోకి ఆహ్వానింపబడ్డారు. స్థలమూ భోజనమూ ఏర్పాటు చేశారు.

రైలు పెట్టెలోని సైనికులు పాడుకుంటున్నారు. బృందగానం గాయకుల నాయకుడు, నల్లగా నేర్పరిగా అవుపించే ఉక్రేనియన్ సార్జెంట్-మేజరు, బాగా ఉద్రిక్తుడై తన కంఠధ్వనికి తానే గర్వపడ్డాడు. పాటకీ పాటకీ మధ్య అతడు ఆనిచ్కా వైపు ఓరగా చూసి స్త్రీ గొంతు వినిపించడం లేదని ఛలోక్తులు విసిరేవాడు.

''ఆడ గొంతు లేనిదే పాట ఏమిటి?'' అని అతడు ఆశలు ఒదులుకొని అడిగాడు.

అనిచ్కా అకీమొవ్‌వైపు విచారిస్తున్నట్టుగా చూసింది. అతడు తల పంకించాడు. ఆమె ఊరికే తన యిష్టప్రకారంగా పాడకుండా అతని అనుమతిని కోరడంను చూస్తే వారు మరింత సన్నిహితంగా వచ్చినట్టు కనిపిస్తుంది, ఆదినుండి ఆమె అతని సొత్తై పోయినట్టు. దాంతో అకీమొవ్ గొంతు ఎండిపోయింది. ఆమె పాడడం ప్రారంభించింది. సార్జెంట్-మేజర్ స్వయంగా యింకా పాడుతూ ఉత్సాహవంతంగా, సంతృప్తికరంగా తల ఊపాడు.

ఇంజను కూత వినిపించింది. తన ప్రేమ మున్ముందికి వేగంగా పరుగెడుతు న్నట్టూ, ప్రశాంతంగా ఉన్న మైదానాన్ని విజయవంతమైన వడిగాలితో ప్రతిధ్వనించేట్టు చేస్తున్నట్లూ అకీమొవ్ భావించాడు.

తర్వాత స్టేషన్‌లో త్వరగా తిరిగివస్తానని అనిచ్కాతో చెప్పి అకీమొవ్ వెలుపలికి వెళ్లాడు. ఉల్లాసంతో నిండిన పిల్లవానిలాగా అతడు స్వయంగా నవ్వుకొని, తిన్నగా క్షౌరశాలవద్దకు వెళ్లాడు. ఇటీవల యుద్ధం జరిగిన ప్రాంతాలలో మాదిరిగానే ఆ స్టేషన్ శిథిలావస్థలో ఉంది. తాత్కాలికంగా ఒక పెద్ద చెక్కకూర్పు ఇల్లు కట్టివుంది. దాని ప్రక్కనే ఒక చెక్క కాబిన్ ఉంది. అందులోనే ఒక పోస్టాఫీసు, ఒక మంగలి షాపు ఉన్నాయి.

ప్లాట్‌ఫారంమీద తన వంతుకోసం నిరీక్షిస్తున్న సమయంలో, ఎవరో కొందరు సిబ్బంది ఆఫీసర్లతో డివిజనల్ కమాండరు నెమ్మదిగా అటూ యిటూ నడుస్తూండడం అకీమొవ్ చూశాడు. ఆ జనరల్ అతనిని పిలిచి కరచాలనంచేసి అతడు బటాలియన్‌ను ఎప్పుడు వొప్పగిస్తున్న సంగతీ అడిగాడు. అకీమొవ్ బదిలీని గురించి అతనికి చెప్పేందుకు గొలొవిన్‌కి సమయం చిక్కలేదని ఆయన గ్రహించి, ఆ ఆనందదాయకమైన వార్తను స్వయంగా తెలియజేసే అవకాశం తనకు చిక్కినందుకు జనరల్ సంతోషించాడు. కాని అతని మౌనానికి కొంత ఆశ్చర్యపోయాడు.

''మీరు మా రైల్లో ఎలా ఉన్నారు?'' అని అతడు అడిగాడు.

''వెనకబడిపోయాను.''

''బాగా లేదు. ఎలాగైతేనేం మీరు దగ్గర లేకుండా ఉండడాన్ని వాళ్ల అలవాటు పడాలి.''

అకీమొవ్ సమాధానం చెప్పలేదు. అతడు బిగ తీసుకొని మౌనంగా ఉండడం చూసి జనరల్ తబ్బిబ్బుపడ్డాడు.

జనరల్ తలపంకించి నడకసాగించాడు. అకీమొవ్ మంగలి షాపుకి తిరిగివెళ్లాడు. తన వంతు వచ్చేదాకా ఒక లెఫ్టినెంటుకేసి పరధ్యానంగా చూస్తూ అక్కడ నిలబడ్డాడు. కాని తన వంతు వచ్చింది వెళ్లమని ఆ లెఫ్టినెంటు చెబితే అప్పుడు లోపలికి వెళ్లాడు. తెల్ల కోటు తొడుక్కున్న ఆ మంగలి వైపు చూసి గడ్డంను చేత్తో తడుముకున్నాడు. ''అక్కర్లేదు అవసరంలేదు,'' అని పలికి అక్కడున్న వాళ్లందరికీ ఆశ్చర్యం కలిగేట్టుగా వెళ్లిపోయాడు.

కొద్ది నిముషాల పాటు ఆనిచ్క ఉన్న రైలుపెట్టె వెలుపల నిలబడి రైలు కదిలేంతవరకు లోపలికి ఎక్కలేదు. ఆనిచ్కవైపు చూడకుండానే కూర్చొని మౌనంగా సిగరెట్టు త్రాగాడు.

ఇదంతా ఆనిచ్క గమనించింది. ఆమె కూడా మనోవ్యాకులతతో కూర్చుంది. ఆమె విచారం ఎంతో సేపు నిలవలేదు. త్వరలోనే ఆమె అతనిని గమనించనట్టే కనుపించింది. ఆమె సైనికులను కలసి జర్మన్ ఖైదీలను గురించిన కథలనూ వినోదకరమైన ముచ్చట్లనూ, ముఖ్యంగా హిట్లర్, గొబ్బెల్సుకు సంబంధించినవి, రికన్నాయిసెన్స్ సైనికుల జీవితాలలోని సంఘటనలనూ చెప్పడం ప్రారంభించింది. అకీమొవ్‌ను ఆమె సంపూర్ణంగా మరచినట్లే అగుపించింది. అందుకుగాను సాధ్యమైనన్ని విధాలా నిర్దాక్షిణ్యాన్ని ఆమె ప్రదర్శించింది. సైనికులు ఆమెవైపు ఆరాధిస్తున్న నయనాల్తో చూశారు. ఆఖరికి మాయ్‌బొరొద కూడా మనసిచ్చి మాట్లాడని తన ఆఫీసర్‌ను వదలి ఆనిచ్క వద్దకెళ్లి ఆమె పక్కనే కూర్చున్నాడు.

సాయంత్రమౌతోంది. చీకటిగా ఉన్న మైదానంపై ఏడుస్తూ అరచిన యింజన్ కూత ప్రతిధ్వనించింది. ఆ పెట్టెలో అప్పుడప్పుడు ఖంగ్ మంటూ మ్రోగిన నవ్వులు అకీమొవ్ కోపాన్ని రెచ్చకొట్టాయి. వీలైనంత త్వరలో అతడక్కడ్నుంచి వెళ్లిపోవాలనుకున్నాడు. తర్వాత స్టేషన్ ఎప్పుడొస్తుందా, తనకు తెలిసిన ప్రక్క పెట్టెలోని ఆ ఆఫీసర్లను ఎప్పుడు కలుసుకుందామా అని అతడు నిరీక్షిస్తున్నాడు.

కాని మరుసటి స్టేషన్‌వద్ద ఆ రైలు ముందు నడుస్తూన్న రైలును కలుసుకోగలిగింది. ఆ రెండూ ఒక దాని ప్రక్కనే మరొకటి నిలబడ్డాయి. తన బటాలియన్ లోని, తాను తేలికగా గుర్తించగల ఒరెష్కిన్, బేల్‌స్కీ తదితరుల గొంతులను అతడు విన్నాడు. అతడు మాయ్‌బొరొదను పిలచి ఆనిచ్క కూడా వినగలిగేంతటి పెద్దగా అన్నాడు: ''మన రైలును కలుసుకోగలిగాం. సెలవు!''

ప్రయాణం యింకా ఒక రోజంతా ఉంది. ఆ దినమంతా అకీమొవ్ తన మనుష్యుల్తో మాట్లాడుతూ, వారి కుటుంబ విషయాలు అడుగుతూ, తన రాజకీయ సహాయకుడు లేకపోయినప్పటికీ తానే స్వయంగా పత్రికలను వారికి చదివి వినిపిస్తూ, ప్రతి పెట్టెలోనూ రాజకీయాలపై ప్రసంగాలు నడుపుతూ గడిపాడు. ఆ సమయంలో వారంతకు మునుపే పోరిన యుద్ధంలోని ప్రతి యూనిట్‌యొక్క మంచి చెడులను ఫిరంగి దళంతోటి సమన్వయ పరచడంలోని లోపాలను అతడు తన ఆఫీసర్లతో పరిశీలించాడు. తన వీడ్కోలు వచనాన్ని కూడా చెప్పాడు. ఒంటరిగా ఉన్నప్పుడు అతడు సముద్రం గురించీ, నొవొరొస్సీయిస్క్, బతూమి నగరాల గురించీ, ఆలోచించడం ప్రారంభించాడు. నావికాదళంలోని కమాండ్ పదాలను ఉపయోగించే సిగ్నల్స్‌ను, ఓడ లైట్లను, అపాయాన్ని తెలియజేసే బీకన్ దీపాల స్థానాలను, మోర్స్ వర్ణక్రమాన్ని, సర్వీసు కోడ్డును జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నించాడు.

అప్పుడు అతనికున్నంత ఉత్సాహం స్నేహభావం అదివరలో అతనికెన్నడూ లేదేమోననిపించింది. కానీ అతడు హృదయంలో అంతటి వ్యాకులతతో ఎన్నడూ ఉండలేదు.

తన కాప్టెన్ వీడ్కోలు సంగతి విన్నప్పుడు మాయ్‌బొరొద మామూలుగా ఉండే తన పనులన్నింటినీ వదలేశాడు. తన పడకబల్లమీద మొహం పెట్టుకొని గంటలకొద్దీ పడుకున్నాడు. అతడు అకీమొవ్‌తో సహా అందరినీ కొట్టబోయేవాడే. అకీమొవ్ తల పంకించి, తనను ఒంటరిగా ఒదిలిపెట్టమనీ, తనను బాధపెట్టవద్దనీ యితరులకు ఆజ్ఞాపించాడు.

ఇంతలోకే ఆ రైళ్లు మాస్కోను దాటి అక్టోబర్ రైల్వే మార్గంమీదికి వెళ్లాయి. ఆఖరికి, రైలు దిగవలసిన బొలొగొయె అనే చోటును వారా రాత్రి చేరుకున్నారు. అక్కడ అప్పటికే డివిజను, రెజిమెంటుయొక్క రెండవ రిజర్వ్యుజట్టు ఆఫీసర్లు అనావశ్యకమైన సద్దు చేస్తున్నారు. తన యూనిట్లకోసం మేజర్ గొలొవీన్ నిరీక్షిస్తున్నాడు. రైలులోనుండి దిగడం ప్రారంభమైంది. తాను వచ్చినట్లుగా రిపోర్టు యిచ్చేందుకై అకీమొవ్ గొలొవీన్ వద్దకు వెళ్లాడు. మరుక్షణానే అడిగాడు: ''కామ్రేడ్ మేజర్! నేను బటాలియన్‌ను ఎవరికి ఒప్పగించాలి?''

''కాస్త ఆగు. కొంచం స్థిరపడగానే మేం నిర్ణయిస్తాం,'' అని గొలొవీన్ సంక్షిప్తంగా సమాధానం చెప్పాడు.

"నిర్ణయించాల్సిందేముంది గనక? నేను తప్పక వెళ్లాలి."

"ఏంతొందర లేదు. ఒకటి రెండు రోజులు ఆగవచ్చు," అని కోపంగా సమాధానం చెప్పాడు మేజరు.

తెల్లవారేప్పటికల్లా రవాణాబళ్లు వచ్చాయి. వారిని స్టేషన్‌నుండి కంకర రోడ్డు మీద కుదుపుకుంటూ తీసుకువెళ్లాయి. ఏ యూనిట్ ఎటు వైపు వెళ్లాలో తెలియ పరుస్తూ వున్న సైన్ బోర్డులు అక్కడ ఉన్నాయి.

మొదటి బటాలియన్‌వారు ఆ గ్రామాన్ని ప్రవేశిస్తుండగానే, నివాస వసతిని ఏర్పాటు చేసే ఆఫీసర్లు వారిని కలుసుకున్నారు. అకిమోవ్ తన మనుషులతో ఎక్కడ బసలుచెయ్యాలో వారు చూపించారు. అక్కడ టెలిఫోన్ లైన్లు వేస్తూ అంతటా సిగ్నల్ మనుషులున్నారు. సార్జెంటు-మేజర్లు ఆ వచ్చిన మనుషుల్ని కుటీరాలలో సర్దుబాటు చేశారు. మొత్తం జనాభా అంతా వారిని చూడడానికి వచ్చింది. అలాంటి సమయాల్లో ఎప్పుడూ మనసులలో తట్టే: "బహుశ వీళ్లల్లో నావాడు ఉన్నాడేమో," అనే పైకి పలకలేని భావనతో ప్రతి ముఖాన్నీ జాగ్రత్తగా పరికిస్తూ కంచెలవద్ద నిలబడ్డారు స్త్రీలు.

అదేరోజున తన ఆఫీసర్లనందరినీ గొలొవీన్ సమావేశపరచాడు. దేవదారుచెట్టు కొమ్మల్తోనూ, జెండాలతోనూ అలంకరింపబడ్డ స్థానిక సమిష్టి వ్యవసాయక్షేత్రం క్లబ్బులో సమావేశం జరిగింది.

స్నానాలు క్షౌరాలు చేసుకున్న తర్వాత తమ పరిశుభ్రమైన యూనిఫారంలలో నిగనిగలాడుతూన్న బూట్లలో ఆఫీసర్లంతా తాజాగా, మంచి ఉత్సాహంగా ఉన్నారు. వాళ్లల్లో కొంతమంది, శాంతి సమయంలోని చెర్రీపండు రంగు పట్టీలున్న టోపీలను వెలుపలికి తీశారు. యుద్ధరంగంలో ఉపయోగించి నలిగిపోయిన వాటికి బదులుగా, కొత్తగా అగుపించే తళతళమెరుస్తూ భుజాలవద్ద తగిలించుకొనే పసుపురంగు హోదా చిహ్నాలను వారు ధరించారు.

గొలొవీన్ తన ఆఫీసర్లనందరినీ సంతృప్తితో కూడిన చిరునవ్వుతో పరికించాడు. కొద్ది రోజుల్లోనే మరికొన్ని సేనలు వస్తున్నాయనీ, అన్ని సామాన్లూ, ఫిరంగులతో సహా అన్ని పరికరాలూ జాబితా ప్రకారం సిద్ధంకావలసి ఉంటుందనీ అతడు తెలియ పరచాడు. ఆ మర్నాడే యుద్ధం తర్ఫీదు, రాజకీయ శిక్షణ ప్రారంభమౌతుంది. శాంతి కాలంలో మాదిరిగానే కార్యక్రమం, దినచర్య కఠినంగా అనుసరించవలసి ఉంటుంది. శత్రువులపై దాడిచేసే శిక్షణ కోర్సును సిద్ధంచేసుకొనే పని మొదటి బటాలియన్‌కు వొప్ప

గించబడింది. షూటింగ్ రేంజి ఏర్పరచుకొనే పని రెండవ బటాలియన్‌కు మూడవ బటాలియన్‌కు వొప్పగించబడింది. ఎర్రని కొత్త అట్టలతో ఉన్న నిబంధనల పుస్తకాలు, శిక్షణ కార్యక్రమాలు, దినచర్య ప్రతులు అందరికీ తక్షణమే పంచబడ్డాయి.

సమావేశం ముగిసిన తర్వాత అకీమొవ్ అక్కడే నిలిచి రెజిమెంటల్ కమాండరును మళ్లీ అడిగాడు: ''నేను బటాలియన్‌ను ఎవరికి ఒప్పగించాలి?''

గొలొవీన్‌కు అకస్మాత్తుగా కోపం వచ్చింది. ''అకీమొవ్! నీకు హృదయం లేదనే చెప్పాలి. నువ్వు త్వరగా తిరిగి నౌకాదళంలోకి వెళ్లాలనుకుంటున్నావని నాకు తెలుసు. మమ్మల్ని విడిచి వెళ్లాలని నీవు ఎంత ఆతురత పడుతున్నావో అందరికీ తెలుపవలసిన అవసరం లేదనుకుంటాను. అదేమంత ఔచిత్యం కాదు. నిజంగా కాదు.''

''మీరనుకున్నది ఏ మాత్రం కాదు,'' అని అకీమొవ్ కలవరపడుతూ ఆక్షేపణ తెలిపాడు. ''నేను బటాలియన్‌ను వొదిలించుకోవాలనుకున్నాను. ఈ బాధ నాకెంత వేగంగా తీరిపోతుందా అని ఆవేదన పడుతున్నాను. వేదనను పొడిగించి ప్రయోజనం లేదు. బటాలియన్‌ను ఎవరికి ఒప్పగించాలో చెప్పండి. దాంతో ఆ పని ముగిసిపోతుంది.'' ఒక్క క్షణం ఆగి మళ్లీ అన్నాడు. ''మీరంతా కూడా నాకు సోదురుల్లాంటి వారు. అవును. నిజంగా అన్నదమ్ముల్లాంటి వాళ్లు. అది సత్యం. కాని ఈ బాధ వాయిదావేసి ఏం ప్రయోజనం. నేను వెళ్లాల్సి ఉంది. అంతే.''

''నేనీ వేళ జనరల్‌ను చూశాను,'' అని అన్నాడు గొలొవీన్, అతని మాటలకు మెత్తబడుతూ. ''ప్రస్తుతం మావద్ద తగినంత మంది ఆఫీసర్లు లేరు. కొత్త వాళ్ళు వచ్చేదాకా నువ్వు బటాలియన్‌కు కమాండరుగా ఉండాల్సి ఉంది. పది రోజులుకంటే ఎక్కువ పట్టదు. ఆ తర్వాత, నీకు యిక్కడ ఆలస్యమవడానికి కారణాన్ని విపులీకరిస్తూ ఒక ఉత్తరం యిస్తాం. చూద్దాం. ఇంకా ఏమైనా ఉందా? నీవు విజయవంతంగా రికన్నాయ్‌సెన్స్ పోరాటంకై, రెడ్ బానర్ ఆర్డర్‌ను యిచ్చేందుకు జనరల్ నీ పేరును ప్రతిపాదించాడు.

''అది ఆయన దయే. కాని మీరు నాకు ఒక సహాయం చేయాలి: నన్ను రేపే వెళ్లనివ్వండి.''

అతను యిక వెళ్లవచ్చునన్నట్లుగా గొలొవీన్ చేత్తో సౌంజ్ఞ చేశాడు.

సాయంత్రం అయ్యేవరకు అంతా సవ్యంగానే నడిచింది. కాని ఆ తర్వాత అకీమొవ్‌కు ఊరికే ఏంచేయాలో తోచక ఆనిచ్కాను చూడాలని అనిపించింది. పెండలకాడే

పడుకోవాలని నిశ్చయించుకున్నాడు. అనేక వారాల తర్వాత మాసిన అండర్‌వేర్లు విడిచి, శుభ్రమైనవి తొడుక్కోవడం, శుభ్రమైన పక్కమీద పడుకోవడం, అదే అతనికి మొదటి సారి. తనకు నివాసస్థలాన్నిచ్చిన వృద్ధ దంపతులు అతనిని వెంటనే వారి కుమారునిగా పిలిచి అతనికి అన్ని వసతులు కల్పించేందుకై వారి చేతనైనంతవరకూ చేశారు. రోడ్డుకు ప్రక్కగా ఉన్న కుటీరంలోకి వెళ్లమని అతడు నూయ్‌బొరొదను ఆజ్ఞాపించాడు. "నేను లేకుండా ఉండడాన్ని అలవాటు చేసుకో," అని అన్నాడు.

అలా అతడు పక్కమీద పడుకున్నాడే కాని నిద్రపట్టలేదు. మనసులో అతి బాధ అనిపించింది. లేచి బట్టలు తొడుక్కున్నాడు. నిబంధనలను కొంత చదివాడు. దీపం ఆర్పేశాడు. కిటికీ ప్రక్కనే కూర్చున్నాడు. తళతళా మెరిసిపోతున్న నక్షత్రాలవైపూ, వినీల ఆకాశంవైపూ చూశాడు. తర్వాత వీథిలోకి వెళ్లాడు.

బ్లాకౌట్ ఉన్న ఆ గ్రామమంతటా దీపాలు ఆర్పి వేయబడి చీకటిగా ఉంది. కాని అంతటా సందడిగా ఉన్న సంగతి మాత్రం తెలుసుకోవచ్చు. కుక్కలు మొరుగుతున్నాయి. సైనికులు పాడుకుంటున్నారు. ఆడవాళ్ల గొంతులు వినబడుతున్నాయి.

అతడు తన గదికి తిరిగి వెళ్లిపోయాడు. క్షౌరం చేసుకోను నిశ్చయించుకున్నాడు. అతడొక వేడి నీళ్లతో ఉన్న యినుప పాత్రను పొయ్యిమీదనుండి తీసి, గడ్డానికి సబ్బు రాసుకుని, నురుగు చేశాడు. తన సూట్‌కేసునుండి రేజర్ తీశాడు. పొయ్యి వెనకవైపునున్న చిన్న గదిలోనుండి వృద్ధుడు వెలుపలకు వచ్చి అతనిని గమనించాడు. అతని గడ్డం విషయమై మాట్లాడేందుకు ప్రయత్నించాడు.

"ఏం బాబూ! ఆ గడ్డాన్ని తీసేయాలంటే నీకు కష్టం కలగడంలేదూ? జనరల్‌కు ఉండవలసినవంటి చక్కని గడ్డం. జనరల్స్ అంతా గడ్డాల్ని ఉంచుకోవడం పరిపాటి. గడ్డం లేనటువంటి జనరల్‌ను నువ్వు వూహించలేవనుకో."

ఇంతలోకే అతని భార్య కూడా వచ్చి ఆతని ప్రక్కన చేరింది. బాధతో ముఖం ముడుచుకుంటూ విస్తారంగా పెరిగిన గడ్డాన్ని క్షౌరం చేసుకుంటున్న అకీమొవ్‌ను ఆమె జాలిగా చూసింది.

"అరే. నువ్వు చాలా కుర్రవాడివే. గడ్డం ఉన్నప్పుడు నువ్వు పెద్దవాడివిలా అగుపించావ్," అని అంది ముసలమ్మ.

జంటలు జంటలుగా ఉన్న కుటుంబాల ఫోటోల వరుసల ప్రక్క వ్రేలాడుతున్న అద్దంలో అకీమొవ్ చూసుకున్నాడు. ఇప్పుడు తన ముఖం పరిహాస్యాస్పదంగా చిన్న వయ



39—1

సులో ఉన్నట్టూ ఏమాత్రం అందంగా లేనట్టూ అతనికి అనుపించి చకితుడయ్యాడు. గడ్డం అతని మొహానికి నిండుతనాన్నిచ్చి ఉదాత్తతను తెలిపే ఆకారానిచ్చింది. కాని యిప్పుడు ఖాళీ అయినట్టుగా ఉంది. అతని చుబుకం చాలా చిన్నదై పోయినట్లుంది. మీసం తీసే యడంవల్ల ముక్కుకీ నోటికీ మధ్య ఉన్న దూరం చాలా పెద్దదై పోయినట్టూ తల్లి గానీ తండ్రిగానీ లేకుండ ఒంటరిగా ఉన్న బిడ్డ మాదిరిగానే అతని ముక్కు ముఖం నుండి విడిపోయినట్టూ అతనికి అనిపించింది.

''అదీ మంచిదే,'' అని అతడు బిగ్గరగా నవ్వాడు. ''సముద్రసుందరి నన్ను ప్రేమించదు. సముద్రం అట్టడుగున ఉన్న తన యింటికి నన్ను లాక్కొని వెళ్లదు.''

అతడు మళ్లీ పక్కమీద పడుకున్నాడు. నిద్రపట్టక అటూ యిటూ దొర్లాడు. ఎవరో ఆ రాత్రి పది గంటల సమయంలో తన తలుపు తట్టినందుకు అతనికి నిజంగా ఆనంద మనిపించింది. ఒక సీనియర్ లెఫ్టినెంట్ లోపలికి వచ్చాడు. అతడు మరణించిన రేమిజొావ్ స్థానే రాజకీయ సహాయకుడుగానూ, రాజకీయ శాఖనుండి వచ్చినట్టూ తేలింది. అతడు బలంగా ఉత్సాహంగా ఉన్న యువకుడు. మండుతున్న పొయ్యికి సాధ్యమైనంత దగ్గరగా వెడల్పాటి బెంచీమీద అకీమొవ్ ప్రక్కగా ఆతడు కూర్చున్నాడు.

కొత్తగా వచ్చిన వ్యక్తితో అకీమొవ్ ముక్తసరిగా ఉన్నాడు. అతనిని కూడా రేమి జొావ్ స్థానే యోగ్యమయిన వ్యక్తిగా పరిగణించలేదు. తనను ఆ యింట్లోనుంచి వెలు పలికి వెళ్లగొడుతున్న వాంఛను మరచిపోయేందుకు, తాను మాట్లాడేందుకు సహాయ పడే వ్యక్తి ఎవరో ఒకరు కావాలి అనిపించిందతనికి.

## 5

ఆనిచ్కకు యీ మధ్య ఉత్సాహమే లేకుండ పోయినట్లనుపించింది. తనుకు అకీమొవ్‌కు మధ్య ఉన్న సంబంధమంతా అయిపోయిందని ఆమె భావించింది. తనను క్షణంక్షణం అణగార్చివేసిన విచారాన్ని, భీతిని తొలగించేందుకై తనకు చేతనైన ప్రయ త్నాలన్నీ చేసింది. అతడు రైల్లో తనతో అంత మోటుగా నిరుత్సాహకరంగా ఎందుకు ప్రవర్తించాడో తెలుసుకోవాలనే వాంఛ ఆమెకు లేదు. బహుశ అతనికి మానసిక శక్తి, నిలకడ లేకపోవడమే అందుకు కారణమేమో? అలా ఎన్నటికీ జరగదు. లేదా అవివేకంగా,

నీచంగా, ఆడవాళ్లను వంచించే జిత్తులను పన్నుతూ ఆమెపై అతని ప్రభావాన్ని స్థిర పరచుకొనేందుకు ప్రయత్నం చేస్తున్న కారణం కావచ్చునా?

కాని, ఒక సాయంత్రం ఆమె రెజిమెంటల్ హెడ్‌క్వార్టర్సులో డ్యూటీపై ఉన్నప్పుడు, అకీమొవ్ తిరిగి నౌకాదళంలోకి త్వరలోనే వెళ్లిపోతున్నాడన్న విషయాన్ని సిబ్బంది ఛీఫ్, ఆఫీసర్లలో ఒకరితో మాట్లాడుతూండటం ఆమె విన్నది. అప్పుడన్ని సంగతులనూ ఒక దానికొకటి జోడించి ఆలోచించుకోగా ఆమెకంతా అర్థమైపోయింది.

మర్నాడు ఆమె డ్యూటీలో లేని మరుక్షణానే ఏ మాత్రం సంకోచించకుండా మొదటి బటాలియన్ ఉన్న ప్రక్క గ్రామానికి పరుగెత్తింది. అక్కడి వాళ్లంతా వ్యూహా రచనా శిక్షణపొందేందుకు వెలుపలికి వెళ్లడంచే ఆ గ్రామమంతా నిర్జనమైపోయింది. దండకు ఎర్రపట్టీ గుర్తూ, బెల్టులో సన్నీ ధరించి డ్యూటీపై ఉన్న ఒక సార్జెంటు ఆ వీథిలో అటూ యిటూ గస్తీ తిరుగుతున్నాడు. అతడు అకీమొవ్ కుటీరాన్ని ఆనిచ్కాకు చూపించాడు. ఆమె అక్కడికి వెళ్లింది.

నెరసిన తలతో ఆ కుటీరందగ్గరగా గట్టుపై పొగత్రాగుతూ ఒక ముసలాయన కూర్చున్నాడు. అతని ప్రక్కకి ఒక తెల్లపిల్లి బంతిలా చుట్టుకుని కూర్చుంది.

''కాప్టెన్ లోపల ఉన్నారా?'' అని ఆనిచ్కా అతనికి నమస్కారం చేస్తూ అంది. కచ్చితంగా చెప్పాలని ఆమె మళ్లీ అన్నది: ''పొడుగ్గా, గడ్డంతో ఉంటారు.''

''అతడు పొడుగ్గా ఉంటాడు నిజమే, కాని గడ్డం ఉంటుందంటున్నావే. అత గాడెవడో నాకు తెలియదు. అలాంటి వాడిని నేను చూడ్లేదు. అతనికి గడ్డంలేదే. బహుశ క్షౌరం చేసుకొని ఉంటాడు,'' అని ఆ వృద్ధుడు కొంత చమత్కారంగా నవ్వుతూ అన్నాడు.

ఆనిచ్కా అతని ప్రక్కన కూర్చుంది.

''అవునుగానీ, ధైర్య సాహలతో కూడిన మా సైన్యంలో నీలాంటి కుర్రదానికి ఏం పని?''

అనువాదకురాలుగా పని చేస్తున్నట్టు ఆనిచ్కా చెప్పడంతోటే ఆ వృద్ధునికి ఎక్కువ శ్రద్ధ కలిగింది. ఉత్సాహం కూడాను. అతడు జర్మన్ల గురించీ, వాళ్లెప్పుడు వారి దేశం పరాజయం పొందుతుందని భావిస్తున్నదీ మొదలైన రకరకాల ప్రశ్నలూ అడ గడం ప్రారంభించాడు. విచిత్రమైన విషయం ఏమిటంటే, అతనికి జర్మన్ల సొంత అభి ప్రాయం తెలుసుకోవాలనుకోవడమే.

సైనికులు ప్లాటూన్‌లగా ఏర్పడి పాడుకుంటూ గ్రామానికి తిరిగి వస్తున్నారు. చివరికి దూరంలో అకీమొవ్ కంఠధ్వనిని ఆనిచ్కా విన్నది. తాను అతనిని ప్రేమిస్తున్న దనే భావన ఆమెకు తట్టగానే జంకింది. తర్వాత, చుట్టూ ఉన్న యితర ఆఫీసర్లతో పెద్దగా మాట్లాడుతూ, తాను చెప్పే మాటల్ని తీవ్రంగా కుడి చేత్తో అభినయిస్తూ సమీపంలోకి వస్తున్న అకీమొవ్ పొడుగాటి విగ్రహాన్ని ఆమె చూసింది.

ఆనిచ్కాను చూడ్డంతోటే అకీమొవ్ చెక్కిళ్లలోని రంగు క్షీణించిపోయింది. అతడు ఒక్క క్షణం ఆగాడు. అవివేకంగా కనిపించినా, అతనికి కలిగిన ప్రథమ భావన ఏమంటే తనకు గడ్డం లేనందుకు ఆమె ఏమని అభిప్రాయపడుతుందో అని.

కాని ఆనిచ్కా అతని మొహంలోని మార్పును గమనించనే లేదు. ఆమె త్వర త్వరగా ఇతర ఆఫీసర్లకు నమస్కారం చేసి ఆ తర్వాత అకీమొవ్‌తో అంది:

''మీరు మమ్మల్నందర్నీ వదలి వెళ్తున్నట్టు తెలిసి నాకు చాలా విచారంగా ఉంది.''

''నిజంగానా?'' అని అన్నాడతడు సంభ్రమంతో.

ఇతర ఆఫీసర్లు అక్కడ్నుంచి వెళ్లిపోయారు అసభ్యంగా ఉంటుందని భావించి.

''ఎప్పుడు వెళ్తున్నారు?'' అని ఆనిచ్కా ప్రశ్నించింది.

''కొద్ది రోజుల్లోనే. నా స్థానే మరో వ్యక్తి రాగానే వెళ్తాను.''

''అలాగా.''

''నేను వచ్చి మిమ్మల్ని చూడాలనుకున్నాను. కాని మనస్సునిశ్చయం చేసుకో లేకపోయాను,'' అని అకీమొవ్ ముద్ద గొంతుకతో మాట్లాడాడు. ''ముఖ్యంగా ఎందు కంటే, దానివల్ల ఏం ప్రయోజనం ఉండకపోగా చెడుగా పరిణమిస్తుందేమోనని. మీరు ఏమన్నా అనుకోండి, నేను మాత్రం మీకు నిజాన్ని దాయకుండా చెప్పేస్తున్నా. మీరు లేకుండా నేను బ్రతకలేను — అసంభవం.'' ఆమెకు కోపం వస్తుందేమోననీ, ఇతరుల విషయంలో అలాంటి ప్రకటల్ని ఆమె తృణీకరించడం పరిపాటి అయింది గనక తన మాటల్ని కూడా ఆవిధంగా త్రోసి వేస్తుందేమోనన్న భయంతో తాను అన్న మాటల తీవ్రతను తగ్గించడానికి ప్రయత్నం చేస్తూ యిలా అన్నాడు: ''బహుశ నేనావిధంగా అనకూడదేమో? ఈ పరిస్థితికి రాకూడదని నేను చేయగలిగిందల్లా చేశానంటే నమ్మండి. నేను వెళ్లక తప్పదుగనక ఎక్కువగా అలా చేయవలసి వచ్చింది. నేను నిజంగా సముద్రాన్నీ, నౌకాదళాన్నీ ప్రేమిస్తాను. కాని ఇప్పుడది అప్రస్తుతం: నేను వెళ్లితీరాలి. నేను మీకు

చెప్పగలిగిందంతా ఇంతే. ఏదో నిరుత్సాహంతో నిండిన కారణం అనే చెప్పాలి. ఇలా జరగకుండా ఉంటే ఎంతో బాగుండేది. అందుకు యిది సమయం కూడా కాదు. కోపగించుకోవద్దు. మనం కలుసుకోవడం శోచనీయం. శాంతి సమయంలో అయితే ఎంతో బాగుండేది.''

వింతగా చేసిన అతని ప్రేమ ప్రస్తావనని మాటలలో చెప్పలేని భావనతో ఆమె వింది. అతని నిష్కాపట్యం యించుమించు ఔదార్యంకిందికి పరిణమించినట్లు ఆమె భావించింది.

''కాస్త టీ తీసుకుందురుగాని రండి,'' అని వృద్ధుడు అన్నాడు. అతడక్కడున్నట్లు వాళ్ళు పూర్తిగా మరచిపోయారు.

వాళ్ళు కుటీరం లోపలికి వెళ్లారు. బల్లమీద 'సమొవార్'లోనుంచి పొగలు ఎగజిమ్ముతున్నాయి. వృద్ధురాలు ఆనిచ్కాను ఆహ్వానించింది. అంతా కలిసి టీ పుచ్చుకొనేందుకు కూర్చున్నారు. అకీమొవ్ మాటలు ఎంత ఆశ్చర్యకరమైనవనుకుంటూ ఆమె యింకా ఆలోచిస్తూనే ఉంది: ఆమె అతనిని ప్రేమించిందీ లేనిదీ అడగకుండానే అతడు కేవలం స్వంత విషయాన్నే మాట్లాడాడు. ఆమెను ఆ ప్రశ్నను అడిగేందుకు భయపడినట్లు కనిపిస్తుంది. అతడు భయపడింది అతని ప్రేమను ఆమె నిరాకరిస్తుందేమోనని కాదు కాని ఆమె అతనిని ప్రేమిస్తున్నట్లు చెప్పతుందేమోనని. అతని భయానికిగల కారణాన్ని ఆమె అర్థం చేసుకుని లోలోపల ఆతనికి కృతజ్ఞతలు చెప్పకుంది. అతని మనోశక్తికి, సౌశీల్యానికి ఆమె ఎంతో ఆశ్చర్యపడింది.

ఆ సాయంత్రం ఆలస్యంగా వస్తానని వాగ్దానం చేసి ఆమె త్వరగానే వెళ్లిపోయింది. ఆ తర్వాత వాళ్లిద్దరూ పొలాలగుండా, నిద్రపోతోన్న గ్రామాలగుండా బాగా తెల్లవారిపోయేవరకు నడుస్తూనే ఉన్నారు. ఆ మర్నాడు, మళ్లీ ఆ తరువాత రోజు వాళ్ళు ఆవిధంగానే షికారుకు వెళ్లారు. వాళ్ళు వొకరినొకరు విడిచివుండలేకపోయారు. వారు విడిపోవడానికిపట్టే సమయం త్వరగా సమీపిస్తోంది గనక వారిలో ఉదయించిన ప్రేమ విషయంలో ఏవిధమైన ఆటంకాలనుగానీ, అసహ్యతనుగానీ వారు పాటించలేదు. మొత్తం జీవితమంతా కలసి బ్రతికిన జంట మాదిరిగా వాళ్లు మాట్లాడారు. బంధువుల వైపరీత్య గుణాలను గురించి నవ్వుకున్నారు. వాళ్లిద్దరిలో ఒకరు ఎరిగిన వారి మరణానికి వారు విచారాన్ని వెలిబుచ్చారు. మాస్కోలోని ప్రొఫెసర్ యొక్క నికోలా-పెస్కోవ్స్కీ వీథిలోని యిల్లు అకీమొవ్‌కు ఎంత బాగా తెలుసో కొవ్‌రోవ్ పరిసరంలో ఉన్న జరేచ్

నయా స్లొబోద్‌కలోని ఒక చిన్న యిల్లూ అందులో నివసించేవారూ ఆనిచ్కకు అంత బాగా తెలిసినట్లు అనిపించింది.

ఒకనాడు వారు వెలుపలికి షికారుగా వెళ్లినప్పుడు ఆమె అతనిని ఆపి అన్నది: ''మీరు నన్నెప్పుడూ ముద్దు పెట్టుకోరెందుకు? నేను ముందు ముద్దు పెట్టుకుంటానని అనుకుంటున్నారా, ఏం?''

''నేను భయపడ్డాను,'' అని అతడు అణచుకున్న కంఠధ్వనితో అన్నాడు. తర్వాత అతడు తన ముఖాన్ని విచిత్రమైన మనస్ఫూర్తితో ఆమె ముఖానికిదగ్గరగా పోనిచ్చి ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె ముఖంలోని రంగు ఖాళీ అయిపోయింది. ఆమె అన్నది: ''మీరా భయ పడేది?''

ఆ వారం అంతా కూడా వాళ్లు కేవలం ఒంటరిగా ఉన్నట్టు భావించారు, ప్రతి చోటా సైనికులూ, రైతులూ, పిల్లలూ ఉన్నప్పటికీ.

ఏడవనాడు తెల్లవారుఝామునే, శత్రువులపై దాడిచేసే శిక్షణ కోర్సును యివ్వ డం అకీమొవ్ ప్రారంభించక మునుపే అతని తలుపును ఎవరో తట్టారు. సూటు కేసును తీసుకొని ఒక కాప్టెన్ లోపలికి ప్రవేశించాడు. అకీమొవ్ గుండెలు దడదడా కొట్టుకున్నాయి. అవును, అతడు తన స్థానే బటాలియన్ కమాండరుగా ఏర్పాటైన కొత్త ఆఫీసరు. అతని పేరు చెర్‌నీహ్.

అకీమొవ్ శిక్షణకు వెళ్లలేదు. ఆ కొత్తగా వచ్చిన వానిని తన ఆఫీసర్లకు, సైని కులకు అతడు పరిచయం చేశాడు. బటాలియన్ ప్రాంతమంతటా అతనిని త్రిప్పి చూపించి ఆ యూనిట్‌ను అతనికి ఒప్పగించాడు. చెర్‌నీహ్ నెమ్మదైన మనిషి. అన్ని టినీ జాగ్రత్తగా గమనిస్తాడు. మితభాషి. ఎప్పుడూ నొసలుమీద పడుతూ తీగెల్లా వున్న నారరంగు జుట్టు. అలెక్సాంద్ర్ నేవ్‌స్కీ ఆర్డర్‌ను అతడు ధరించాడు. అతడు అకీ మొవ్‌కు నచ్చాడు. ఇతర మనుషులకు కూడా అతడు నచ్చినట్టుగా అకీమొవ్ గమనిం చాడు, కొంత యీర్ష్యతో.

''బాగుంది. ఇక నేను వెళ్లొచ్చు,'' అని అకీమొవ్ భావించాడు.

అతడు రెజిమెంటల్ హెడ్‌క్వార్టర్సుకు వెళ్లాడు. అతనిని మేజరుగా తరక్కీ చేసినట్టు అప్పుడే వచ్చిన ఆజ్ఞనుబట్టి అతనిని అభినందించాడు గొలొవీన్.

''చార్జి ఒప్పగించావా?'' గొలొవీన్ ప్రశ్నించాడు.

''అవును.''

''కాసేపు కూర్చో.''

వాళ్లిద్దరూ మౌనంగా కూర్చున్నారు.

''చెర్‌నీహ్ విషయమై నీ అభిప్రాయం ఏమిటి?'' అని కమాండర్ అడిగాడు.

''అద్భుతం. అతడు మంచి ఆఫీసరు.''

''అతడు సైబీరియన్.''

''అవును. నాకు తెలుసు.''

అకీమొవ్ ఒక్క క్షణం మౌనం వహించి ఆ తర్వాత అలసినట్టుగా చిరునవ్వునవ్వి అన్నాడు: ''తమ కమాండరు నావికుడని అంతా యిదివరలో గర్వపడ్డారు. ఇప్పుడేమో సైబీరియన్ అని గర్విస్తారు.''

''అవును.'' గొలొవీన్ నవ్వాడు. ''తప్పకుండా గర్విస్తారని నేను చెప్పగలను. అతడు మంచి కమాండరుగా అవగలిగితేనే.''

''తప్పక అవుతాడు. ఇది నా తీర్పు అనుకొని నమ్మండి,'' అని అన్నాడు అకీమొవ్.

''నీకు వెళ్లాలని యిష్టం లేనట్లు తెలుస్తోంది. నువ్వు బెలొజ్యోరొవ... క్షమించు. నీకు తెలుసు... వాళ్లందరూ అంటున్నారు...''

''ఓ. ఏం ఫరవాలేదు. రెజిమెంటల్ కమాండర్ తన యూనిట్‌లో ఏంజరుగుతున్నది తప్పక తెలుసుకోవాలి — అందులో దోషం ఏమీ ఉన్నట్టు నాకనిపించదు. అవును. నేను వెళ్లాలనే ఉద్దేశం నాకు లేదని ఒప్పుకు తీరుతాను. ఆమెను నేను వాస్తవంగా ప్రేమిస్తున్నాను.

''ఆమె చాలా మంచి పిల్ల.''

''అవును. చాలా మంచిది.''

''ముచ్చటైంది కూడానూ.''

''అవును.''

''ఆమె యింకా అందంగా ఉండేది. ఆమెకు చక్కని పొడుగైన వెంట్రుకలుండేవి. మన రెజిమెంట్‌లోకి వచ్చీరావడం తోటే ఆమె తన వెంట్రుకల్ని కురచగా కత్తిరించేసుకుంది. పొడుగాటి వెంట్రుకల్ని యుద్ధరంగంలో ఉంచుకోవడం చికాకే అని ఎవరూ చెప్పనక్కర్లేదంది. ఆమె తన వెంట్రుకల్ని కత్తిరించుకుంది అని నాకు తెలియగానే నేను భలే ఆశ్చర్యపడ్డాను. ఆమె జడల్ని కత్తిరించేసుకున్నందుకు నాకు ఒక విధంగా జాలి

కలిగింది. ఇంతకీ – తన క్రింద పనిచేసే వారు వేంట్రుకలు కత్తిరించేసుకున్న విషయం కంటే ఎక్కువ ఆలోచించవలసి విషయాలు కమాండర్‌కు అనేకం ఉంటాయి. నీవెప్పుడు వెళ్తున్నావ్?''

''రేపు అనుకుంటాను.''

''ఒకటి రెండు రోజులుండు. నౌకాదళంలంగరు ఎత్తేయదులే. సముద్రం యింకి పోదులే. నీకు ఆలస్యమెందుకయిందో మేం సర్టిఫికేటు యిస్తాం.''

''వాయిదా వేసినంత మాత్రాన పరిస్థితులు ఏవీ తేలికవవు.''

''అవును. అలా అని నేనూ అనుకోను.''

కొన్ని క్షణాల తర్వాత గొలొవీన్ కొంత యీర్ష్యతోనూ ఛాయగా అగుపిస్తున్న ఆశ్చర్య వదనంతోనూ అన్నాడు, ''బాగుంది. ఆమెను మచ్చిక చేసుకోవడం ఎవరికీ సాధ్య పడదని నేననుకున్నాను. కాని నువ్వు బాగానే సాధించావు.''

''నేనేం సాధించలేదు. అది ఎలా సంభవించిందో నాకే తెలియదు.''

వాళ్లు కరస్పర్శ చేసుకున్నారు. ఆనిచ్కాను కలుసుకొనేందుకై అకీమొవ్ వెళ్లాడు.

తొలిమంచు కురవడం ప్రారంభమైంది. ప్రతీదీ నాజూకైన లేతబొచ్చు మాదిరిగా తెల్ల బట్టచే కప్పబడినట్లుండడం, విడివిడిగా ఉన్న మంచుపెల్లలనుబట్టి తేలిగ్గా గుర్తించ వచ్చు. ఋతువు మార్పును ముందుగా తెలుపుతున్నట్టుగా పెద్దపెద్ద పెళుసైన పెల్లలు ఉన్నాయి. తానిక సైనికుడు కాదన్న భావనకు యింకా అలవాటు పడక పోవడంచె అకీమొవ్ తన మనుషులకు మంచుపై 'స్కీ' చేసే శిక్షణ యివ్వడానికి సమయం ఆసన్నమైందనీ, వారికోసం వెచ్చని అండర్‌వేర్లు ఫెల్ట్ బూడ్సులు తెప్పించాలనీ భావించాడు.

రెజిమెంటల్ రికన్నాయ్‌సెన్స్ యూనిట్ ఉంటోన్న యింటి దొడ్డిలో అతడు ఆని చ్కాను చూశాడు. కొత్త దళాలు వరసగా నిలబడ్డాయి. వారితో కాప్టెన్ ద్రోజ్‌ద్ రణ రంగ జీవితంలోని గాథలు, రికన్నాయ్‌సెన్స్ మనుషులు అంటే ఎంత ధైర్యంగా, హాస్యం గానూ, సూక్ష్మగ్రాహులుగా, రాజకీయక మెలకువతో ఉండాలో మాట్లాడుతున్నాడు. ఆనిచ్కా అతని ప్రక్కనే నిలబడి ఉంది.

ఆమె అకీమొవ్‌ను చూడగానే ఏదో జరిగిందనుకొని అతనిని కలుసుకోను ముం దుకు వెళ్లింది. ద్రోజ్‌ద్ అకస్మాత్తుగా ఆపుచేశాడు. ''ఇవ్వాళటికి చాలు,'' అని అన్నాడు. అతడు మనుషుల్ని పంపివేసి కుటీరంలోకి వెళ్లాడు.

రికన్నాయ్‌సెన్స్ ఆఫీసర్ల చెక్కిళ్లు లోతుగా పాలిపోయి ఉండడం అకీమొవ్ గమనించాడు. కాని అనిచ్కా త్వరత్వరగా తనను కలుసుకోవడానికి వస్తున్నప్పుడు, ద్రోజ్‌ద్ అక్కడ ఉండి ఆమెను రోజూ కలుసుకోగలుగుతాడనే భావన హఠాత్తుగా అతనిలో కలిగి తీవ్రమైన యీర్ష్యతో కూడిన బాధను అనుభవించాడు.

అకీమొవ్ మొహంలో వచ్చిన విచారపూరితమైన మార్పుకు కారణం ఏమిటో ఆమె గ్రహించగలిగింది.

''అతడు వచ్చాడా?'' అని ఆమె అడిగింది.

''అవును.''

''ఏంఫరవాలేదు,'' అని ఆమె అతని చేతిని తీసుకుంటూ అన్నది. ''మనం ఉల్లాసంగా ఉందాం. విచారించవద్దు. ఆర్నెల్లైతేనేం, సంవత్సరం అయితేనేం మనకు? నేను నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాను.'' ఆమె తన ప్రేమను గురించి బహిరంగంగా వ్యక్తం చేయడం అదే ప్రథమపర్యాయం. ''అది చాలదు?''

ఉహూ, అది చాలదు. తనతోపాటు ఆమెను తీసుకు వెళ్లడమే అతనికి అవసరం. ఆమెను ఒక అగ్గిపెట్టెలో పెట్టి దాచకలిగినట్లయితే అతడెంతో సంతృప్తి పడి ఉండేవాడు.

అతడు ఉంటున్న గ్రామంలోని యింటికి వారిద్దరూ పొలాలగుండా వెళ్లారు.

వారు ఓవర్‌కోట్లను విప్పి పొయ్యి ప్రక్కనే కూర్చున్నారు. ఆమె అతని సామాన్లను పెట్టెలో సర్దింది. వాళ్లిద్దరూ మళ్లీ పొయ్యిదగ్గరే మౌనంగా కూర్చున్నారు. దృష్టిని మరల్చకుండా ఒకరినొకరి చూసుకున్నారు. ఇద్దరు కలిసి భోజనం చేసి షికారుగా బయటకువెళ్లి మళ్లీ తిరిగివచ్చారు. ఆ తర్వాత ఆమె వెలుపలికి వెళ్లిపోయింది. మళ్లీ ఆమె వచ్చినప్పుడు అతడు రేమిజొవ్ మరణించినప్పుడు ఏవిధంగా ఉన్నాడో అదే విధంగా విచారంతో తలవంచుకొని బల్లవద్ద కూర్చోడం ఆమె గమనించింది.

అతనిని కదపకుండానే ఆమె అతని పక్కను సరిచేసింది. అతడు పక్కదుప్పట్ల శబ్దాన్ని విని అప్పటికే చీకటి పడుతోంది గనక దీపం వెలిగించా లనుకున్నాడు. కాని ఆమె అతనినలా చేయనివ్వలేదు.

''నువ్వు పడుకో. నేను యిక్కడే నీతో ఉంటాను. నాకు వెళ్లడం యిష్టం లేదు.''

అతడు చకితుడైనట్లు కనిపించింది.

''నువ్వు అలా చేయకూడదు,'' అని అంటూ, ''నిజంగా నువ్వలా చేయకూడదని నువ్వనుకోవా?'' అని ప్రశ్నార్థకంగా అన్నాడు.

ఆమె కంఠధ్వని ఆ చీకటిలో సన్నగిలింది.

''నాకు ఏభయమూ లేదు. మనిద్దరం శాశ్వతంగా ఒకరికొకరం చెందిన వాళ్లం. విన్నావా?''

ఇవే మాటలు గనక కొద్ది రోజుల క్రితం అని ఉంటే అవి ఆనిచ్కాకు కూడా ఎంతో పరిహాసాస్పదంగానూ, ఎరువు తెచ్చుకున్నవిగానూ అనిపించేవి. కాని యీనాడు ఆమె ఎంతటి ఉద్రేకంతో శక్తివంతంగా పలికిందంటే ఆ మాటలను ప్రపంచంలో ఎవరూ ఎన్నడూ యిదివరలో ఉపయోగించక ఆమె మాత్రమే ఉపయోగించిందన్నంతగా.

అతడు ఆమెను కౌగలించుకున్నాడు. కాని అతడలా చేసినప్పుడు అమె అంగీకరించడం చూసీ, అది ఆమె అనుభవమేనేమోనని అతనికనిపించీ అతని గుండె గడ్డకట్టుకుపోయింది. ఆమె కళ్లల్లో నీళ్లు తిరిగాయి. బాధతో వెక్కివెక్కి ఏడ్చింది. ఎలా చెప్పలో తెలియక అన్నది: ''నేనిదివరకెప్పుడూ అలాంటి పని చేయలేదు.'' ఆమె యెడల అతనికి అంత నీచమైన అపనమ్మకం కలిగినందుకు తనను తాను తిట్టుకున్నాడు. తానిదివరకెన్నడూ ఎరుగనంతటి ఆర్ద్రతతో అతని హృదయం కరగిపోయినట్లనుపించింది. అయినా అతడు కామోద్రేకతాజ్వాలలలో కూడా ఆమె బాధనూ, స్వయంగా లొంగిపోవడంలోని మాధుర్యాన్నీ తప్ప మరేమీ అనుభవించలేదని తెలుసుకున్నాడు.

అనంతమైన ఆశ్చర్యంతోనూ, గర్వంతోనూ అతడు ఆమెను వీక్షించి తల పోశాడు: ''నేను కలగన్నది యీమెనే. ఆనిచ్కా. లేక నేనింకా కలగంటూనే ఉన్నానా?''

ఆమె అతనిని గట్టిగా కౌగలించుకుంది అతని ప్రక్కన ఉండడంకంటే మించిన ఆనందం వేరొకటి లేదనుకుంది. అందరికీ ఏది అన్నిటికంటే ముఖ్యమైనదని అనిపిస్తుందో అది ఏవిధంగానూ అంత ముఖ్యమైంది కాదు. కాని బహుశ అది అత్యంత కష్టమయినదీ అగోచరమైనదీ కావొచ్చు.

ఆ రాత్రి తర్వాత వాళ్లిద్దరూ కలిసి అయిదు రోజులు గడిపారు. అతడు వెళ్లవలసి వచ్చింది. హైనెచే చెప్పబడి, వాగ్నెర్‌చే సంగీతం కూర్చబడినట్టి పూర్వపు జర్మన్ పురాణ గాథలో వీనస్ అనే సౌందర్య దేవతను టాన్హౌసర్ అనే యోధుడు ఏ విధంగా విడిచి వెళ్లలేకపోయాడో అదే మాదిరిగా అకీమొవ్ ఆనిచ్కానుండి వేరుకాలేకపోయాడు. వారి ప్రేమోద్రేకాలు మాంత్రిక పర్వతంమీద కాకుండా ఒక చిన్న చెక్క

కుటీరంలో సంభవించినంత మాత్రాన అవి ఏమాత్రమూ తక్కువ కాకపోయినందువల్ల కాబోలు సారస్వతంనుండి చేసిన యీ పోలికను అనిచ్కా ఎంతో హర్షించి అపరిమిత ఆనందాన్ని పొందింది.

ఆరవ నాడు అకీమొవ్ పెందలకాడే లేచాడు. ఇంకా నిద్రపోతోన్న అనిచ్కా ముఖంవైపు చూశాడు. త్వరగానే తిరిగి వద్దామని అతడు వెలుపలికి వెళ్లి, కార్లో మళ్లీ వచ్చేశాడు. అనిచ్కా మౌనంగా దుస్తులు ధరించింది. వారు తమతోపాటు మాయ్‌బొరొదను వెంటబెట్టుకొని స్టేషన్‌కు వెళ్లారు. అక్కడ వాళ్లు ఆగారు. ఒక్క క్షణం ఆలోచించి అకీమొవ్ డ్రైవర్‌తో అన్నాడు బస్తీకి తీసుకు వెళ్లమని. రిజిస్ట్రీ ఆఫీసు ఎక్కడో వాళ్లు భోగట్టా చేశారు.

"లోపలికి వెళ్దామా?" అకీమొవ్ అడిగాడు. తనకు ఈ భావన తట్టినందుకు ఎంతో సంతృప్తిచెందాడు అకీమొవ్ కాని, "నిజంగా మనికిది అవసరమా?" అని అనిచ్కా సమాధానం చెప్పినప్పుడు అతనికి ఆశ్చర్యం కలిగింది.

ఆమె ఆ చిన్న సైన్‌బోర్డువంక చూస్తూ ఒక్క క్షణం మౌనంగా నిలబడింది. తర్వాత అన్నది: "ఎలాంటి నిర్జీవమైన అధికార పూర్వకమైన పేరుందీ దీనికి: సివిల్ చట్టాల రిజిస్ట్రీ ఆఫీసు..."

వాళ్లు లోపలికి వెళ్లిన గది చిన్నదైనప్పటికీ పండగ జరుపుకుంటున్నట్టుగా ఫర్నీచరు ఉంది. అక్కడ ఒక స్త్రీ కూర్చుంది. చిన్నదేం కాదు. ముక్కుకు అంటి పెట్టుకొని వుండే కళ్లజోడు పెట్టుకుంది. సైన్యంలోని ఉద్యోగులు అక్కడ రిజిస్టరీ వివాహం చేసుకోవచ్చునా అని అకీమొవ్ అడిగాడు. అందుకు అక్కడున్నామె కొంత ద్వేషంతో సమాధానం చెప్పింది: "వాళ్లకిష్టమైతే చేసుకోవచ్చు."

లాంఛనాలన్నీ అయిపోగానే ఆమె తలపైకెత్తి బహుశ కన్నీరు కారడంచే ఎర్ర బడ్డ కళ్లతో వారిని అభినందించి సౌఖ్యవంతమైన వైవాహిక జీవితం వారికి కలగాలని దీవించింది. ఆ యుద్ధ కాలంలో పెళ్లిళ్లు, పుట్టుకలు బదులు మరణాలే ఎక్కువగా రిజిస్టరు చేయబడినట్టి ఆ నిశ్శబ్దంగా ఉన్న గదిని వారు విడిచి పవిత్రమైన మనోభావ నతో స్టేషన్‌కు వెళ్లారు. ఒక గంట తర్వాత అకీమొవ్ వెళ్లిపోయాడు.

—



అ ధ్యా య ం అ యి దు

# సముద్రం

1

అకీమొవ్ రాజధానిని చేరడంతోటే స్టేషన్‌నుండి తిన్నగా నౌకాడిపోకు వెళ్లాడు. అది చాలా పెద్ద భవనం. సోవియట్ నౌకాదళంలోని సభ్యులకు రవాణా ఏర్పాట్లు చేసే కేంద్రంగా ఉపయోగపడుతోంది.

ఆ భవనం మాస్కో పట్టణం నడిబొడ్డులో ఉన్నప్పటికీ, దాని చుట్టూ వీధులూ చౌకులూ, ఇంకా కాస్తదూరం వెళ్తే పొలాలూ, అడవులూ ఇతర బస్తీలూ, గ్రామాలూ ఉన్నప్పటికీ దాని గడపలోకి అకీమొవ్ అడుగు పెట్టీ పెట్టకముందే అతడు అప్పటికే సముద్రంపై ఉన్నట్టు భావించాడు. అది మాస్కో నేలకు లంగరు వేసిన ఒక పెద్ద ఓడ అన్నమాటే. నౌకపై జీవితం ఎలా ఉంటుందో అదే మాదిరిగా అక్కడ

కూడా ఉంది. ఓడ కూతలు, నౌకా ఆజ్ఞలు అక్కడ రోజంతా వినవచ్చు. అక్కడి గడి యారాలు కూడా నౌకలలోని గడియారాల వలెనే ఇరవైనాలుగు గంటలు చూపే డయల్సుతో ఉన్నాయి.

అక్కడ నివసించేవారు, మామూలు నేలను ఓడ 'డెక్కు' అనీ, నల్ల రాయితో ఇనుపచువ్వల్తో మెలికలు తిరిగిన మెట్లను ఓడ 'హాచ్', భోజనాల గదిని 'మెస్-కాబిన్' అనీ, మాస్కో తారురోడ్లు కనిపించే కటికీలను ఓడలోని రేవుకన్నాలనీ నిజంగానే పిలవడం, అకీమొవ్ హృదయాన్ని కరగించి వేసినా, కొంత పరిహాసాస్పదమైన విషయంగానే కనిపించింది.

దూరదేశాలు పర్యటించి యింటికి తిరిగి వచ్చిన వ్యక్తికి వలెనే అతనికి అంతా ఆశ్చర్యకరంగా అగుపించింది. ''నేనిక్కడ 'రోప్' అని అనకుండా ఉండడం మంచిది. లేకపోతే దానర్థం 'లైన్' అని వారెన్నడూ గ్రహించలేరు,'' అని అతడు తలపోశాడు.

అక్కడి వాళ్లంతా 'గ్రీన్స్' (పచ్చని దుస్తులు) అని పిలిచే తన పదాతిదళ దుస్తుల్ని బట్టలస్టోర్‌లోని ఒక పెట్టీ ఆఫీసరుకు యిచ్చి వాటికిబదులు పూర్తి నౌకాదళం దుస్తు లను, ఆఖరికి నౌకాదళం చిహ్నంగల నల్ల టోపీతో సహా మార్చుకున్న తర్వాతగాని తానొక నావికుడ్నని అకీమొవ్ భావించ లేదు. డిపోయొక్క యితర సభ్యులు వలెనే అతడు ''తీరపు సెలవు''గా తన ఉద్యోగంకొరకు నిరీక్షిస్తూ మాస్కోలో ప్రతి రోజూ షికార్లుకొట్టడం ప్రారంభించాడు. ఆ అనంతమైన ''తీరము''పై రాత్రి పొద్దుపోయేవరకు ఒక వీధినుండి మరో వీధికి లక్ష్యం లేకుండా, తాను విసుగుచెందిన భూమికి ఆఖరి వీడ్కోలు చెప్పడానికా అన్నట్లు యేదో అలాగు తిరుగుతున్నాడు. నికోలా-పెస్‌కోవ్‌స్కీ వీధిలో ఉన్న ఆనిచ్కా యింటివద్ద ఒక రోజు ఆగాడు.

చివరికి, తనకు ఎక్కడ ఉద్యోగం యిచ్చిందీ తెలిసింది. అతనికి ఎక్కడలేని ఆశ్చ ర్యం కలిగింది. కేవలం నల్లసముద్రం యుద్ధనావల్లోకి, ఒకే ఒక సముద్రం, నల్ల సముద్రంపైకి తనను పంపుతారని అతడు అభిప్రాయపడ్డాడు. కాని ఉత్తరధ్రువానికి ఆవల వున్న బారెన్‌ట్స్ సముద్రంలోని ఉత్తర యుద్ధనౌకలలో అతనిని నియమించారు.

అతడు రైలుమీద మూర్‌మన్‌స్క్ చేరుకుని అక్కడ దిగగానే తిన్నగా ఓడ రేవుకు వెళ్లాడు.

నిజానికి దక్షిణానికి పోల్చిచూస్తే ప్రతీదీ వేరుగానే ఉంది. నల్లరాతి పర్వత శిఖరాల్లు తెల్లని మంచుతో నిండి వున్నాయి. పొగమంచుతో కప్పబడ్డ నల్లని సముద్రం

ఆ శిఖరాల రంగుకు భిన్నంగా ఉంది. తీరమంతటా దట్టమైన తెల్లని మంచు ఉంది. ఉత్తరధ్రువపు రాత్రి ఆ అఖాతంపై దుఃఖపూరితమైన వినీలపుఛాయల్ని ప్రబలింపచేస్తోంది. అయినా అది సముద్రమే, నాసికా రంధ్రాలను చొచ్చుకు పోయేట్టు ఉప్పవాసనను వెద జల్లే సముద్రం: రవాణా ఓడలు, మోటారు టార్పిడో బోట్లు, ట్రాలర్‌లు, శక్తివంత మైన క్రేన్‌లు, వించిలు, రెపరెపా కొట్టుకుంటున్న జెండాలు, అలలపై వేగంగా నలు వైపులా పరుగులెడుతూన్న మోటార్ లాంచీలు, వీటన్నిటితో నిండిన ఓడ రేవు అది.

అంతకు మునుపు అకీమొవ్‌లో వున్న మాంద్యత, విచారం మటుమాయమై పోయాయి. అతడు తన ఆనిచ్ఛకు ఎంతో దూరమైపోయినా జీవితం మళ్లీ చిరునవ్వు నవ్వింది.

ఓడల్లో ఎగుమతి దిగుమతి చేసే పనిలో నిమగ్నులైనవారి మధ్యనుండి అతడు మార్గం చేసుకొని తనను యుద్ధనావల స్థావరంవద్దకు తీసుకు వెళ్లే మోటారులాంచీ కొరకు ఎదురు చూశాడు. భూమిమీద కాల్బలంలో రెండు సంవత్సరాలపాటు పనిచేశాక ప్రథమ పర్యాయంగా నౌకమీద కాలుపెట్టినప్పుడు అతని గుండెలు పిచ్చిగా కొట్టు కున్నాయి. అడ్డంగా ఉన్న తెరచాపల కంబానికి ఎగురుతున్న నౌకా ధ్వజానికి అతడు సైనిక వందనం చేశాడు. లాంచీ చెరచెరా ఓడల మధ్యనుండి మృదువుగా జారిపోతూ నడిచింది. వాతావరణం బాగానే నునువెచ్చగా ఉంది. తీరపుస్థావరాలలోని సిగ్నల్ కంబాలూ అపా యాన్ని తెలియజేసే గుర్తు దీపాలూ క్రమక్రమేణా పొగమంచులోకి అంతర్ధానమై పోయాయి. ఒక డెస్ట్రాయర్ యుద్ధనావ నెమ్మదిగా పక్కనుండి వెళ్లింది. "జెండా" శబ్దం చేసింది. లాంచీలో ఉన్న మనుషులు ఆ యుద్ధనావవైపు తిరిగి, చేతుల్ని టోపీలదాకా పైకెత్తి వందనం చేశారు. ఆయుద్ధనావలోని జనం కూడా అలాగే చేశారు. త్వరలోనే ఓడరేవు దూరమైపోయింది. గోధుమవర్ణపు జలం ఓడ వెనుకభాగంక్రింద ఉడికిపోయి సలసలా మరుగుతూన్నట్టు కోలాహలంతో నురగలు గక్కింది.

అప్పటికింకా నలువైపులా నీలపు సంధ్యారాగం అలముకొనే ఉంది. ఆ వెలుతురు కొంత అధికమైనా అధికమవాలి, లేకపోతే చీకటైనా పడాలి అని అకీమొవ్ భావించాడు. కానీ ఆ రెండూ జరగ లేదు.

అకీమొవ్ త్వరలోనే తీరంలో ఉన్న వైర్లెస్ స్టేషన్ కంబాలనూ కొండమీద రంగభూమి వలె పెద్దపెద్ద భవనాలనూ చూశాడు. తన చిహ్నాన్ని తెలుపుతూ ఆ లాంచీ సిగ్నల్ చేసింది. అందుకు సమాధానం ఆ మరుక్షణాన్నే తీరపు కంబాలలో ఒక దానిపై

మెరిసింది: ''అంతా బాగానే ఉంది.'' అంటే దానర్థం ఆ లాంచీ రేవులోకి ప్రవేశించ వచ్చని. హార్బరులోకి ప్రవేశించేందుకు అడ్డుదూలం తెరచుకుంది. ఓడలు ఆగే వారథి కట్ట మంచుతో కప్పబడి అవుపించింది. దానినుండి 'గాంగ్‌వే'లు దించారు. లాంచీలో ఉన్నవాళ్లు వాటిమీదనుంచి ఒకరి తర్వాత వరుసగా ఒడ్డుకు దిగారు.

నౌకాదళం హెడ్‌క్వార్టర్స్‌లో ఒక సబ్‌మెరైన్ ఛేసర్ ఓడ కమాండరు కింద 'ద్వితీయుడు'గా ఉద్యోగాన్ని అకీమొవ్‌కు యిచ్చారు. అతడు నౌకాదళంలో చాలా కాలంగా లేని కారణంచేత, అతడు అనుకున్నట్టుగానే, కమాండర్‌గా నియమింపబడటం యోగ్యం కాదు అని అనుకున్నారు పై అధికారులు. కాలాన్ని ఏమాత్రం వ్యర్థపుచ్చక అకీమొవ్ తన ఓడని వెతుక్కుంటూ వెళ్లాడు.

ఆ ఛేసర్ ఓడయొక్క కమాండరు లెఫ్టినెంట్ బదేయ్‌కిన్. పొట్టిగా, లావుగా అనాకర్షణీయంగా ఉంటాడు. అతనికి వయసు రాకమునుపే బట్టతల వచ్చింది. అతడు చాలా కాలం సర్వీసు చేయడంవల్ల లెఫ్టినెంట్‌గా తరక్కీ చేయబడ్డాడు. పొడుగ్గా వెడల్పాటి భుజాలుగల లెఫ్టినెంట్-కమాండరు తనవద్దకు ఎందుకు వచ్చాడా అని కలవర పడుతూ చూశాడు. అతడు అకీమొవ్ ప్రక్క నిలబడితే ఉబ్బిన కుదురులాగా, సిగ్గు పడుతూన్న కుర్రాడిలాగా అవుపించాడు.

అతడు అకీమొవ్‌కు ఓడనంతా చూపించాడు. ఆ తర్వాత ఓడ మధ్యలో కమాండర్‌కై ఉండే 'బ్రిడ్జి'మీదికి తీసుకెళ్లాడు. అక్కడ అతనిని తనక్రింది పనిచేసే రెండవ కమాండర్ జూనియర్ లెఫ్టినెంట్ క్లిమాషిన్‌కు, ఓడలో పనిచేసే తండేలు, ఛీఫ్ పెట్టీ ఆఫీసరు జిగాలొకు పరిచయం చేశాడు. జిగాలొ వయసు ముప్పై ఏళ్లకు మించదు. అయినా అతడు సాంప్రదాయకమైన తండేలు అగుపించాలనే అభిలాషతో కిందకి పడుతూన్న పెద్ద మీసాలను పెంచుకొని, తెచ్చిపెట్టుకున్న ఠీవితో, పాలిపోయిన తెల్లని కళ్లల్లో స్థిరంగా ప్రపంచాన్ని వీక్షిస్తాడు.

''మీ బసెక్కడ?'' అని బదేయ్‌కిన్ అకీమొవ్‌ను అడిగాడు.

''ప్రస్తుతానికి నా సూట్‌కేసును హెడ్‌క్వార్టర్స్‌లో వదలిపెట్టొచ్చాను. మీ నివాసమెక్కడ?''

బదేయ్‌కిన్ సమాధానం అస్పష్టంగా ఉండడంచే ఆ 'పొట్టిబుడంకాయి' ఏమంత అతిథిసత్కారాలు చేసే మనిషిగా అవుపించడం లేదని అకీమొవ్ నిర్ణయించుకున్నాడు.

ఆ ఓడయొక్క యుద్ధ చరిత్రను బదేయ్‌కిన్ అకీమొవ్‌తో చెప్పడం ప్రారంభిం

చాడు. ఆ సబ్-ఛేసర్ ఓడ ఇరవై ఏడువేల సముద్రపు మైళ్ళను ప్రయాణం చేసింది. తొంభై య్యారు రవాణా పడవలకు రక్షణగా వెళ్ళింది. మూడు శత్రువిమానాలను పడగొట్టింది. ఒక శత్రు సబ్‌మెరైన్ని ముంచేసింది. శత్రువులచే ఆక్రమింపబడిన తీరాల పైకి పదహారు మాట్లు లాండింగ్ అపరేషన్లు కావించింది. దాని సేవలకు 'గార్డ్ నౌక' అనే బిరుదాన్ని బహూకరించారు. తన కమాండరుకు నివేదిస్తున్నట్టుగా బదేయ్‌కిన్ నిటారుగా నిలబడ్డాడు. అతని కలవరపాటును గమనించి, అతని అసహ్యతను తొలగించాలనే ఉద్దేశంతో అకీమొవ్ కొంత విసుగుదలతో నిర్మొహమాటంగా అన్నాడు: ''నా హోదా చిహ్నాలను ఏమాత్రం గమనించకండి, బదేయ్‌కిన్. మీవద్ద శిక్షణ పొందేందుకై నన్నిక్కడికి పంపించారు. హోదాగానీ, పొట్టీ పొడుగూ అనే విషయంగానీ ఇక్కడ అప్రస్తుతం. అవునా? మనం యీ అంశంపై ఒప్పుకున్నట్టేనా?''

''చిత్తం'' అని తడబడుతూ అన్నాడు బదేయ్‌కిన్, ఇంకా అలాగే వ్రేళ్లను తన ట్రౌజరు అతుకుల వద్ద వుంచుతూ.

అకీమొవ్ మనసారా విరగబడి నవ్వాడు. బదేయ్‌కిన్ కూడా అలాగే నవ్వాడు. అతడు నవ్వినప్పుడు చదునుగావున్న అతని అనాకర్షణీయమైన మొహం మనోహరంగా, చమత్కారంగా, వివేకవంతంగా అగుపించింది. అలాంటి పొట్టివాని క్రింద పనిచేసేందుకు తనను ఎందుకు పంపారో అకీమొవ్ అర్థం చేసుకోగలిగాడు. బదేయ్‌కిన్ తన యెడల మరింత ఎక్కువ అతిశయోక్తిగా చూపిన గౌరవాన్ని అకీమొవ్ శంకించడం ప్రారంభించాడు. తన విగ్రహం యెడలా తన పెద్ద హోదా యెడలా బదేయ్‌కిన్ అతిగా చూపుతూండే గౌరవము కేవలం తెలివితేటలతోనూ గడుసుదనంతోనూ వేసుకున్న ముసుగు అనీ, ''అవసరం వస్తే'' తన నిజమైన అధికారాన్ని చెలాయించుదామనీ బదేయ్‌కిన్ వేసిన యెత్తు అనీ అకీమొవ్ భావించాడు.

ఆనందబాష్పాలను తుడుచుకుంటూ బదేయ్‌కిన్ అడిగాడు, ''మాతోపాటు కార్యార్థమై వస్తారా లేక ఒకటి రెండు రోజులు విశ్రాంతి తీసుకుంటారా?''

''రెండువారాలనుంచీ నేనేం చేయడంలేదు. మీతోపాటే వస్తాను. సాధారణంగా, ఇహ ఎప్పుడూ నన్ను అడగకండి. ఆజ్ఞాపించండి,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు.

ఆ చిన్న నౌకమీద మామూలుగా రోజూ జరిగే ఊడుపులు, తుడుపులు మొదలైన పనులు జరిగి పోతున్నాయి. కొంతమంది మనుషులు ఓడ డెక్కుమీద పేరుకున్న మంచుని గొడ్డళ్లతో చెక్కుతున్నారు. ఇతరులు తాళ్లనీ కప్పీలనీ మరలనీ తనిఖీ చేస్తూన్నారు.

నీటి క్రిందనుండి తట్టుతున్న శబ్దం వినవస్తోంది. అక్కడ నీటిలో మునిగి పనిచేసే డైవర్లు ఓడ స్థూల భాగాన్ని పరిశీలిస్తున్నారు. ఎలెక్ట్రిక్ గంటలు, ఇంజను గదిలో 'టెలి గ్రాఫ్' చప్పుడు, వైర్లెస్ కాబిన్‌నుండి వచ్చే సంగీతం, అంతా మనోహరంగా ఉంది. నౌక ఈ కొసనుండి ఆ కొసవరకూ దాకా ప్రతి దానినీ సత్వరకార్యచరణకై సిద్ధం చేసేందుకు జిగాలో డెక్కుమీదికి వచ్చాడు. అతడు పార్టీ ఆర్గనైజరు కూడాను. అతడలా వెళ్తున్నప్పుడు, తర్వాత వార్తాపత్రికకొరకు నోట్సుకై నావికులతో ఏర్పాటు చేశాడు.

ఈ రోజువారీ కార్యక్రమం అంతా అకీమొవ్ ఉత్సాహాన్ని హెచ్చించింది. తనకు మొదట యిచ్చిన ఉద్యోగాన్ని అంగీకరించడమే సమంజసమైన పనని అకీమొవ్‌కు గట్టిగా నమ్మకం చిక్కింది.

"చాలా బాగుంది. ఇదే మంచిది," అని అతడు హఠాత్తుగా బదేయ్‌కిన్‌కు ఆశ్చర్యం గొలిపేట్టుగా అన్నాడు. "మన పోస్టు నంబరు ఏమిటో చెప్పండి. చిరునామా లేకుండా ఉండడం విసుగెత్తి పోతోంది."

అతడు వెంటనే ఆనిచ్కకు నాలుగు పంక్తులు వ్రాశాడు. కాని పోస్టు చేయడానికి అతనికి సమయం చిక్క లేదు. కొంతమంది మనుషులు 'గాంగ్‌వే'ను సమీపించారు. వాళ్లను బదేయ్‌కిన్ చూడగానే అన్నాడు: "మనం యిప్పుడు త్వరలోనే బయల్దేరబోతున్నాం."

వాళ్లు జర్మన్ల వెనుక భాగాన దింపవలసిన రికన్నాయ్‌సెన్స్ మనుషులు. టామీ గన్‌లు, గ్రెనేడ్లు, వేటకాండ్ర చాకులు ధరించి ఒకరి వెనక ఒకరు మౌనంగా కవాతు చేసుకుంటూ డెక్కుమీదికి వచ్చి కాబిన్‌కు ప్రక్కగా ఒకరి ప్రక్కనొకరు దగ్గరగా కూర్చున్నారు. వాళ్ల ఆఫీసరు పాలిపోయిన మొహంగల వ్యక్తి. అతని నొసటిపై ఎర్రని మచ్చ ఉంది. అతడు ఓడ మధ్య 'బ్రిడ్జి' వలె ఉన్న కమాండర్ స్థావరంవద్దకు వెళ్లాడు. అతనిని బదేయ్‌కిన్ అకీమొవ్‌కు పరిచయం చేశాడు: "సీనియర్ లెఫ్టినెంట్ లెత్యాగిన్."

పేర్లతోసహా రికన్నాయ్‌సెన్స్ మనుషులందరూ నావికులకు తెలుసు. వారు మనఃపూర్వకంగా వారితో కరచాలనం చేసి స్నేహపూర్వకంగా ఆహ్వానించారు: "హల్లో కోస్త్యా!" "పేత్యా! ఎలా ఉన్నావు?" "మనం కలుసుకొని కొన్ని శతాబ్దాలు గడిచి పోయాయి!" "అప్పుడే ఆస్పత్రినుంచి వచ్చేశావా?"

చివరికి వారు ప్రయాణమయ్యారు. అకీమొవ్ గుండె కొట్టుకోవడం ప్రారంభమైంది. ఆ చిన్న నౌక గజగజా వణకిపోయింది. దారిలోకి వెళ్లింది. చుట్టూ కదిలింది. నడిసముద్రంవైపు అఖాతంలోకి జారిపోతూ ముందుకు నడిచింది.

## 2

నడిసముద్రం! బూడిదె వర్ణంగా భీకరంగా వుంది. భయంకరుడైన ఇవాన్ రాజు కాలంలో తయారుచేసిన భూగోళ మ్యాపుల్లో ఆ సముద్రాన్ని హిమసముద్రం అని ఉల్లేఖించేవారు. కాని దాని అపారమైన జలాలనూ, ఒకదాని వెంట మరొకటి మహోన్నతంగా వచ్చి, విరిగి పడిపోయి, మళ్లీ శక్తిని పుంజుకొని పైకిలేస్తూన్న తరంగాలనూ చూసేసరికి అకీమొవ్‌కి ఆనందంతో కేకలేయాలనిపించింది.

కాప్టెన్‌యొక్క 'బ్రిడ్జి'మీద తన ఎదురొమ్మును గాలికి ఎదురుగా పెట్టుకొని నిలబడినందుకు అతడు తన చిన్నతనంలో వలెనే మరొక పర్యాయం గర్వించాడు. అవును, ఎన్ని ఆటంకాలు వచ్చినా ఎంత ప్రతిష్టంభన కలిగినా ముందుకు వెళ్లడమనేదేమిటో అది భూమిమీదకంటే ఎక్కువ స్పష్టంగా యిక్కడ అగుపిస్తుందని అతడు భావించాడు. అతని ప్రక్కనే అతని వలెనే పొడుగరీ దృఢకాయుడూ అయిన రెండవ తరగతి పెట్టీ ఆఫీసరు కషెవారొవ్ అనే చుక్కాని నడిపే మనిషి నిలబడ్డాడు. బిగుసుకుపోయిన అతని మొహాన్ని చూడగానే తన చిన్నతనంలో నల్లసముద్రంమీద 1936 లో చుక్కాని నడిపేవానిగా పని చేసిన తన మొహమే జ్ఞాపకానికొచ్చింది అకీమొవ్‌కి. అకస్మాత్తుగా కలిగిన ఆ మనోదృష్టి అతనిని కొంత భావగర్భితునిగా చేసింది. అతడు ఆలోచిస్తూ కషెవారొవ్ వైపు ఓరగా చూశాడు: "ఎంతటి ఆనందం, ఎంతటి దుఃఖం నీ కోసం ఎదురు చూస్తోందో! ఎన్ని శిఖరాలను, అగాధాలను నీ ఆత్మ దాటవలసి ఉందో కదా? నువ్వు ఎంతటి సంతోషాన్ని, ఎంతటి దుఃఖాన్ని అనుభవించాల్సి వుందో కదా? ఆ మొండి తలకాయలో ఎటువంటివి భావాలు పుట్టుకొస్తూంటాయో కదా?"

అతడు జేబులో చెయ్యి పెట్టుకునేసరికి ఆనిచ్కాకు యింకా పోస్టుచెయ్యకుండా వుండిపోయిన వుత్తరం చేతికి తగిలింది. పెద్దగా నిట్టూర్చాడు. తనకు తానే ప్రశాంతంగా నవ్వుకున్నాడు: "కాబట్టి నిట్టూర్చడం ప్రారంభించావన్నమాట. అంతేనా! అందుకు స్థావరం సముద్రం కాదు. నీ నిట్టూర్పు కూడా యెందుకు? అసలు గాలే ఝంమని కొడుతూంది."

అతడు అకస్మాత్తుగా ఆనందాన్ని పొందాడు. ఉప్పొంగి పోయాడు. అందుకు కారణం, ఒకానొకప్పుడు — ఎప్పుడో తనకి బాగా జ్ఞాపకమే లేదు — అతడు సరిగ్గా అదే

స్థానంలో తను నిలబడి వుండగా ఇప్పుడతనికి కలిగినట్లుగానే అవే ఆలోచనలు, అవే క్షోభలు మెదడులో కలిగాయి.

ఆ చిన్ననౌకని నిర్దాక్షిణ్యంగా ఊపివేస్తోందా సముద్రం. అప్పుడప్పుడు అల ఓడ డెక్కుమీద కొద్దిగానైనా పొడిస్థలం లేకుండా కడిగిపారేసేది. మరుక్షణానే డెక్కుమీద పడిన నీరు గడ్డకట్టుకపోయి, బరువు ఎక్కువై నౌకను క్రిందికి లాగేయకుండా ఉండేందుకు, ఓడక్రింది వెన్నుదూలం పాడైపోకుండా ఉండేందుకు నావికులు ఆ పేరుకొన్న మంచును చెక్కవలసి వచ్చేది. ఎవరూ చెప్పకుండానే ప్రతి వ్యక్తీ తనతన పనిని వేగంగా నిపుణతతో చేసుకుపోవడాన్నీ వారి సక్రమములైన చేష్టలనూ అకీమొవ్ గమనించి ఆశ్చర్యపోయాడు. ఆ నావికుల కార్యదక్షతను అతడెంత ఎక్కువగా గమనిస్తున్నాడో అంత ఎక్కువ గౌరవం అతనికి వారి యెడల కలిగింది. ఆ నీటైన చిన్న నౌకలో అవుపించే క్రమ శిక్షణని అతడు అంతకంటే ఎక్కువగా మెచ్చుకున్నాడు.

ఆ నావికులలో ఉన్న ఉన్నత నీతి, సంఘీభావం, క్రమం, వీటి తార్కాణాన్ని అతడు వారి చర్యలలో గమనించాడు. వారు పొడిగా ఉన్న కాబిన్‌ను రికన్నాయ్‌సెన్స్ మనుషులకై వొదిలిపెట్టారు, ఆవిధంగా ఆజ్ఞలు లేనప్పటికీ. శత్రువులు ఆక్రమించుకొన్న ప్రాంతంలో చలిలో నిద్రలేకుండా అపాయకరమైన అనేక గంటల్ని గడపవలసి ఉంటుందనే జాలితో మాత్రమే వారావిధంగా చేశారు.

ఆ సబ్-ఛేసర్ నౌక అలలచే తీవ్రంగా గుద్దుకున్నప్పటికీ అది తన దారిని తాను ఠీవిగా ఆత్మవిశ్వాసంతో పట్టుదలతో నడుస్తోంది.

అకీమొవ్ ఉద్రేకత క్రమక్రమేణా తగ్గింది. ప్రతీదీ సులభంగా, సామాన్యంగా ఉన్నట్టు అనిపించి నల్లసముద్రంపై తాను పొందిన శిక్షణ జ్ఞాపకం వచ్చింది. కాని ఒక్కటే తేడా. అదేమంటే దగ్గరలోనే దాగి ఉన్న ఏవో ఒక నిగూఢమైన వెలుతురు నుండి వినీలపు సాంధ్యారాగం వస్తున్నట్లనుపించింది.

భూగర్భశాస్త్ర దృష్ట్యా చతుర్థపాదకాలంలో పుట్టిన గుండ్రని నల్లరాతి కొండలతో యేర్పడి ఉన్న తీరం కనిపించింది. ఆ కొండలు ఎంత నిర్మానుష్యంగా, వెగటును పుట్టించేట్టుగా ఉన్నాయంటే, అక్కడ దిగవలసిన రికన్నాయ్‌సెన్స్ మనుషులను అకీమొవ్ కనికరించక తప్పలేదు.

ఆ శిఖరాలన్నీ ఒకే విధంగా ఉన్నాయి. వాటివాటి మధ్య ఉన్న సంబంధం ఏమిటో తెలుసుకోవడం అసంభవ మనిపించింది. అక్కడ గుర్తులేమీ లేవు, ఎవరైనా వాటి ఆధా

రంగా వెళ్లగలిగే ప్రబలంగా అగుపించే ఎత్తైన శిఖరాలుగానీ, రంగుల తేడాగానీ కనిపించదు — గుండ్రంగా ఉన్న గుండ్రాళ్లు తప్ప. ప్రతిదీ సరిగ్గా దాని ప్రక్క ఉన్నదాని మాదిరిగానే దాదాపు నల్లని రంగుతో, ఏవిధమైన వృక్షకోటీ మొలిచే ఆస్కారం లేకుండా ఉంది. అయినప్పటికీ అవి వాటి మెరకపల్లాలతో వక్రమైన అందంతో ఆకర్షణీయంగానే ఉన్నాయి.

''వరంగెర్ ఫోర్డ్,'' అని ముందుకు చూపుతూ బదేయ్‌కిన్ అన్నాడు.

తీరం చాలా దగ్గరలో ఉన్నప్పటికీ బదేయ్‌కిన్ వేగాన్ని ఎందుకు తగ్గించడా అని అకీమొవ్ చకితుడయ్యాడు.

''అది యింకా చాలా దూరంలో ఉంది. అది చాలా దగ్గరగా ఉందనుకుంటున్నారు కదూ? అవునా? దానికింకా మీరు అలవాటు పడాలి. వెల్తురు కిరణాల వక్రీకరణం,'' అని లెఫ్టినెంట్ అన్నాడు.

బదేయ్‌కిన్ ఆజ్ఞల్ని యిచ్చేప్పుడు వాటికి కారణమేమిటో, కొంతవరకు వాటి ప్రాముఖ్యత ఏమిటో ఎప్పటికప్పుడు వివరించడం మరచిపోలేదు. దీనిని అనింద్యమైన చాతుర్యంతో నిర్వహించేవాడు. ఉదాహరణకు, కాబిన్‌లోని దీపాన్ని ఆర్పేయమని ఆజ్ఞాపించినప్పుడు, నిజానికి స్పష్టంగా ఆకీమొవ్‌ను ఉద్దేశించినప్పటికీ, తనకు తాను అనుకుంటున్నట్టుగా అనేవాడు: ''అది రికన్నాయ్‌సెన్స్ మనుషులకోసం. వాళ్లు చీకటికి అలవాటు పడాలి గనుక.''

బదేయ్‌కిన్ అకీమొవ్‌ను ఒక కంట కనిపెడుతూనే ఉన్నాడు. ఆ కొత్తగా వచ్చిన వ్యక్తి చాలా ప్రశాంతంగా అతని చుట్టూ జరుగుతున్న ప్రతి విషయాన్ని తు.చ తప్పకుండా గమనిస్తూ ఉండడాన్ని బదేయ్‌కిన్ కొంత యీర్ష్యతో తిలకించాడు. ''తర్వాత చూద్దాం ముందుముందు కనిపిస్తుందిలే,'' అని కేవలం భూచరంలాగు బతికిన ఆ మనిషి తన ప్రశాంతతను ఎప్పుడో ఒకప్పుడు పోగొట్టుకోవడాన్ని తాను చూడకపోతానా అని మనసులో ఆశిస్తూ తనలో తాను భావించాడు. నౌకాదళ జీవితం కడుపులో చల్ల కదలకుండా జరిగిపోయే వ్యవహారం కాదనీ, పై ఉద్యోగంలోకి వెళ్లడంగానీ బహుమానాలు అందుకోవడంగానీ రేషన్లు ఇవ్వగా వాటిని అందుకున్నట్టు కాదనీ పదాతిదళం ఆఫీసర్‌కు తెలియజేయాలనే అతని అభిలాష. కాని అతనిపై పగబూనినట్టు అంతా సరిగ్గా సవ్యంగా జరిగిపోయింది. అందుకు బదేయ్‌కిన్ సంతోషించినప్పటికీ ఏదైనా ఒక చిక్కు సంభవించి ఉంటే బాగుండేదనుకున్నాడు.

పెట్టీ ఆఫీసర్లు, నావికులు కూడా అకీమొవ్‌ను కనిపెడుతూనే ఉన్నారు. అతడు కేవలం 'ద్వితీయుడే' నని వారికి తెలిసినప్పటికీ అతని తీవ్రమైన తీక్ష్ణ వీక్షణం ప్రతివ్యక్తిపైనా ఏవిధంగా బలీయమైన ప్రభావాన్ని వేసిందో అదే విధంగా వారిపైన కూడా వేసింది: వారు అతని మెప్పును పొందేందుకు, అతనిని సంతృప్తి పరిచేందుకు కోరుకొనేట్టు జేసింది. దీనిని కూడా పసికట్టాడు బదేయ్‌కిన్. అకీమొవ్ అంటే అతనికి ఛాయా మాత్రంగా అసూయ కలిగింది, ముఖ్యంగా అతని కండపుష్టిగల శరీరాన్నీ భరవసాగా వున్న అతని మూర్తినీ చూసి.

తీరం సమీపించింది. అక్కడక్కడా ఒంటరి దీపాలు తళుక్కుమన్నాయి. బహుశా వారు జర్మన్ తీరపు పరిరక్షకులు కావచ్చు, లేదా తమ శాంతియుతమైన వృత్తిని కొన సాగిస్తున్న నార్వే దేశపు చేపలవాళ్లు కావచ్చు. అవును. వింతగా కనిపించినా బంజరుగా పడివున్న ఆ నేల నార్వే దేశమే. అకీమొవ్ తనకండ్లను తానే నమ్మ లేకపోయాడు. ఎందువల్లనంటే అతడు నల్లసముద్రంపై పనిచేసినప్పుడు నార్వే ఎంతో దూరంలో ఉన్న దేశమనీ, ఇటలీ ఆఫ్రికా దేశాలకంటే ఎక్కువ దూరంలో ఉందని అనుకున్నాడు. అయినా అక్కడది బూడిద వర్ణంతోనూ, అప్పుడప్పుడు తళుక్కుమనే దీపాలతోనూ, చుట్టూ ఉన్న శిఖరాలూ ఫోర్డులతోనూ ఉంది. ఇప్పుడది అదృశ్యమైపోయింది.

నౌక తీరాన్ని సమీపిస్తున్న కొద్దీ అందులో ఉన్న మనుషుల మొహాలు బిగుసుకు పోతున్నాయి. లెత్యాగిన్ 'బ్రిడ్జి'వద్దకు రావడం, ఏమాటా పలక్కుండా అంతర్ధాన మైపోవడం జరుగుతోంది. ఫిరంగిదళంవారు తమ ఫిరంగుల ప్రక్కన సిద్ధంగా నిలబడ్డారు. తండేలు తన మెషీన్‌గన్‌కు అతుక్కు పోయాడు. కొంతమంది నావికులు 'గాంగ్‌వే'ను సిద్ధంచేసి ఉంచారు. ఇతరులు నీళ్ళ అంటని కాన్‌వాస్‌కోట్లను తొడుకు న్నారు. ప్రతీదీ చకచకా, స్వయంగా యంత్రంలాగు కచ్చితంగా జరిగిపోయింది బహు కాలాభ్యాసం ఫలితంగా సాధించిన అందమది.

తీరం పొడుగునా తెల్లని అలల నురుగు అవుపిస్తోంది. క్లిమాషిన్ కొంత వ్యాకు లతతో ఉండడం స్పష్టమయింది. అతడు అక్కడ ఎంత లోతు వున్నదీ తాడువేసి చూసి ఆతురతతో ఏదో బదేయ్‌కిన్‌కు రహస్యంగా చెప్పాడు. లెత్యాగిన్ నిశ్శబ్దంగా 'బ్రిడ్జి' పైకి వచ్చి అక్కడే నిలబడి ఒడ్డువైపుకు చూస్తూ అతనికి తప్ప ఎవరికీ తెలియని తీరం లోని గుర్తులతో నౌకను నడపడానికి సాయపడుతున్నాడు.

చివరికి ఎక్కడ దిగాలో ఆ స్థలం వాళ్లకి ఎదురుగా సూటిగా కనబడింది. ''చుక్కానిని కుడివైపు త్రిప్పు!'' అని బదేయ్‌కిన్ ఆజ్ఞాపించాడు. ''బహునెమ్మదిగా ముందుకు పోనివ్వు.'' ఓడయొక్క విన్యాసాలని అకీమొవ్ అతిశ్రద్ధగా గమనిస్తున్నాడు. తీరంపై అంతా నిశ్శబ్దంగా ఉంది.

రికన్నాయ్‌సెన్స్ మనుషులు కాబిన్‌నుండి వెలుపలికి వచ్చి అంతాకలసి ఒకే కట్ట కట్టుకుపోయినట్టు ఒకరి ప్రక్కనొకరు 'బ్రిడ్జి'కి ప్రక్కగా నిలబడ్డారు.

తీరానికి దగ్గరలో తలవనితలంపుగా దట్టమైన పొగమంచు క్రిందికి ఉంది. ఓడ ఆ పొగమంచులోకి పయనించింది. ఆ పొగమంచు నౌక డెక్కుని కప్పేసింది. 'బ్రిడ్జి' పైనుండి చూస్తే మనుషులు నడుములవరకే అగుపిస్తున్నారు. మిగతా సగం శరీరాలు పాలలాంటి తెల్లని మేఘంలో అంతర్ధాన మయినట్లయింది: మనుషుల సగం శరీరాలు గాలిలో ఈదుతున్నాయా అన్నట్లుందా అద్భుతమైన దృశ్యం.

అకీమొవ్ ఆ పొగమంచులోకి ఏకదృష్టితో చూశాడు. ఆ మంచు తొలగినప్పుడు, అలల తెల్లని నురుగుతో చుట్టబడి అస్పష్టంగా అవుపించే లోతులేని చిన్న సముద్ర శాఖతో కూడిన నల్లరాతి తీరం కాకుండా, ఒక చిన్న ఏరూ—దానికావల కందకాలతోనూ, రహదారి కందకాలతోనూ, గలగలమనే మంచి నీళ్లతో నిండిన బురద కాల్వలతోనూ ఉన్న ఎగువ వాలున్నూ అగుపిస్తుందని ఎలాగో అనుకున్నాడు అకీమొవ్. ఈ వింతైన, తలవనితలంపుగా కలిగిన భావనతోపాటు సముద్రానికి ఎంతో దూరంలో ఉన్న తన మనుషులంతా అంటే ఆనిచ్క, రేమిజొవ్, గొలొవీన్, పొగొస్యాన్, మాయ్‌బొరొద మొదలైనవారు అతనికి జ్ఞాపకాని కొచ్చారు.

ఎంత త్వరగా పొగమంచు ఆవరించిందో అంత త్వరగా అది విడిపోయింది. ఆ చిన్న నౌక డెక్కునీ, బారెన్ట్స్ సముద్రం బూడిద వర్ణపు అలల్నీ, నల్లరాతి కొండల చుట్టూరా వున్న ఆ చిన్న సముద్రశాఖనీ అకీమొవ్ మరొకసారి వీక్షించాడు.

''మీరిక్కడుండండి, నేను దిగే ఏర్పాట్లను చూస్తాను,'' అని అకీమొవ్ దాదాపు ఆజ్ఞాపిస్తున్న కంఠధ్వనితో, బదేయ్‌కిన్‌తో అన్నాడు.

తొందరపడడం అవసరమని అతడు గుర్తించాడు. వాళ్లరాకను తీరాన్న వున్నవాళ్లు పసికట్టొచ్చును. దాంతో తమ ప్రయత్నమంతా వ్యర్థమైపోతుంది. దానికి తోడు నావికులు ఆతురతతో ఆకాశంవైపుకు చూస్తుండడం అతడు గమనించాడు — శత్రువుల విమానాలు ఎక్కడ దాడిచేస్తాయో అని వారి భయం. పరిస్థితి మరింత క్లిష్టమవడానికి

కారణం ఆ సబ్-ఛేసర్ తీరానికి చేరువగా వెళ్ల లేకపోవడమే. అలలు దానిని బండల పైకి నెట్టేస్తాయేమోనన్న భయమే అందుకు కారణం. తీరానికీ నౌకకూ మధ్య పది గజాల దూరం ఉంది.

ఆజ్ఞలకై ఆగకుండానే నావికులు 'గాంగ్‌వే'ను పట్టుకొని నీళ్లలోకి దిగారు. నీరు నడుముకుపైగా వచ్చింది. వాళ్లు 'గాంగ్‌వే' కొనను భుజాలపై పెట్టుకొని ఓపిక పట్టలేక అరిచారు: ''ఊ, రండి. దిగండి.''

రికన్నాయ్‌సెన్స్ మనుషులు 'గాంగ్‌వే'ను సమీపించారు. దాని చివరకూ వెలుపలికి చొచ్చుకొని వచ్చిన కొండరాళ్లకీ మధ్య ఉడికిపోతున్న వెడల్పాటి మంచునీళ్ల ఖండం ఉండడాన్నీ, అలలు తీరానికి కొట్టుకున్నప్పుడు నురుగుతో నిండుతూ అవి వెనక్కు వెళ్లినప్పుడు పూర్తిగా ఖాళీ అవుతూ వున్న మధ్యస్థలాన్నీ వారు చూసినప్పుడు భయం వణికిపోక తప్పింది కాదు. ''వీళ్లను మోసుకు వెళ్లాల్సి ఉంటుందా?'' అని ఆశ్చర్యపడ్డాడు రికన్నాయ్‌సెన్స్ మనుషుల్ని గమనిస్తూన్న అకీమొవ్. అప్పుడు మరో ఆలోచన ఆలోచించకుండా ముందు వెనుకలు పరిశీలించేందుకు సమయం చిక్కనటువంటి వివిధ చిత్తవృత్తులకు చలించిపోయి అతడు 'గాంగ్‌వే'పైన నడచి ఆ మంచునీళ్లల్లోకి దూకాడు. ఎముకలు కొరికే చలి దెబ్బకు తెప్పిరిల్లి ''లెత్యాగిన్!'' అని అరిచాడు.

అతడు లెత్యాగిన్‌ను సునాయాసంగా తన భుజాల పైకెత్తుకొని కెరటం చాలులో తీరానికి మోసుకెళ్లాడు. అతనిని ఒక గుండ్రాయిపై ఉంచి తర్వాతి కెరటం కొండరాళ్లకు కొట్టుకొనేవరకు ఆగి, తిరిగి 'గాంగ్‌వే' దగ్గరికి వెళ్లాడు. అక్కడ ఆ తర్వాత మనిషిని భుజాలపై ఎత్తుకొని తీరానికి వెళ్తున్నప్పుడు తన పద్ధతిని అనుసరిస్తున్న ముగ్గురు నావికుల్ని గమనించాడు. త్వరలోనే ఓడమీదనుండి నేలపై దిగే యీ అసామాన్యమైన పద్ధతి ముగిసింది. నడుంలోతువరకూ నిలబడినట్టి లేదా జనంను మోసుకుంటూ ఆ మంచు నీళ్లల్లో తీరానికి వెళ్తున్న నావికులలో యిది అనుకోనటువంటి ఆనందాన్ని కలుగజేసింది. నీరు మంచువలె చల్లగా ఉన్నప్పటికీ వాళ్లు వాచాలత్వంతో కూడిన నిర్భయాన్ని కనపర్చారు. ''గట్టిగా పట్టుకో!'' ''జాగ్రత్త! లేకపోతే నిన్ను ముంచేస్తా!'' ''ఓ, ఇక్కడ వేడిగా ఉంది!'' అంటూ వారి చురుకైన పలుకులు వినవచ్చాయి.

ఆఖరి రికన్నాయ్‌సెన్స్ మనిషిని తీసుకు వెళ్తున్నప్పుడు అతని తుపాకీ గుండ్లతో నిండుగా ఉన్న ద్రమ్ములు అకీమొవ్ తలకొట్టుకొని బొప్పికట్టింది. అతడు 'గాంగ్‌వే'ను

ఎక్కి తిరిగి నౌక డెక్కుని చేరుకున్నాడు. అసలు ఆ రికన్నాయ్‌సెన్స్ మనుషులు లేనే లేరా అన్నట్లుగా వాళ్లా పర్వత శిఖరాలలో అంతర్ధానమైపోయారు. నౌక నెమ్మదిగా తీరం వెంబడి జారుకుంది.

''కాబిన్‌లోకి వెళ్ళండి, వెచ్చగా వుంటుంది,'' అని ఒక నావికుడు అకీమొవ్‌తో అన్నాడు. అతడు ఆ విధంగా చేశాడు. త్వరగా తడిబట్టలువిప్పేశాడు. లోపల యింకా చీకటిగానే వుంది. ఓడకిటికీలు సరిగ్గా బ్లాక్‌అవుట్ అయ్యాయో లేవో అని నిర్ధారణ చేసుకొనేందుకని ఎవరో ఒక వ్యక్తి ఆ కిటికీలవద్ద చీకట్లో తడవులాడుకుంటూ ఉన్నాడు. తర్వాత దీపం వెలిగింది. అతడెవరో కాదు బదేయ్‌కిన్. అతడు ఒకటి రెండు బూర్నీసులను అకీమొవ్‌కిచ్చాడు. అతని మొహం గంభీరంగా ఉంది. అతడు వెళ్లిపోయాడు. కాని త్వరలోనే ఒక వోద్కా ఫ్లాస్కుతో తిరిగి వచ్చి మళ్లీ అదృశ్యమైపోయాడు. తర్వాత మళ్లీ వచ్చాడు.

''నేనేం తొడుక్కోను?'' అని అకీమొవ్ అడిగాడు.

ఆ విషయాన్ని కూడా బదేయ్‌కిన్ ఆలోచించాడు. అండర్‌వేర్లనూ, నావికుల ట్రౌజర్లనూ రబ్బరు బూడ్సులనూ పట్టుకొచ్చాడు.

''అవి నాకు సరిపోతాయా?'' అని అకీమొవ్ ఆశ్చర్యపోయాడు.

''మన చుక్కాని నడిపే కషెవారొవ్‌నుండి తెచ్చాను.''

''అయితే అవి సరిపోతాయి,'' అని చిరునవ్వు నవ్వుతూ అకీమొవ్ సమాధానం చెప్పాడు.

''బాగుంది, అయితే అది మీ ప్రథమ సముద్ర జ్ఞానస్నానమన్నమాట,'' అని బదేయ్‌కిన్ వ్యాఖ్యానించాడు.

అకీమొవ్‌కు ముఖం ముడుచుకున్నాడు. ''దానిని మీరు సముద్ర జ్ఞానస్నానమంటారా? తడిచాను. అంతే.''

అతడు తనపై తానే విసుగుదల చెందాడు. తానే స్వయంగా నీళ్లల్లోకి వెళ్లకుండా నావికుల్ని పంపి ఉంటే బాగుండేది అని అనుకున్నాడు. అతడు ఆఫీసరువలె కాకుండా ఒక మామూలు నావికుని మాదిరిగా ప్రవర్తించాడు. తనకి రికన్నాయ్‌సెన్స్ మనుషుల యెడల జాలిపుట్టడం నిజమే: లేకపోతే వారు పొడిగా తీరాన్ని చేరలేకపోయేవారే. కాని అతడలా చేయడానికి కారణం కేవలం అదేనా? అతడెంత సాహసంగల పదాతిదళం ఆఫీసరో బదేయ్‌కిన్‌కు నావికులకు చూపాలనే ఉద్దేశం అతనికి కలగలేదా?

చిత్రమేమిటంటే, అతడు కాల్బలసైన్యంలో ఉన్నప్పుడు తానొక నౌకాదళం ఆఫీసరుగా ఎప్పుడూ భావించేవాడు. ఇప్పుడు నౌకాదళంలో ఉన్నప్పుడు అతడు సైన్యంలో ఉన్న సంగతిని మరచిపోలేకుండా ఉన్నాడు.

అవును, తన కొత్త స్నేహితులముందూ, తనకు కొత్తైన వెగుటుపుట్టించే ఆ చల్లని బారెన్‌ట్స్ సముద్రంముందూ తన ప్రతిభ చూపించాలనే ఏదో అభిలాష అతనికుంది.

''నేనిక్కడ 'ద్వితీయుణ్ణి' కాకుండా కమాండ్‌లో ఉన్నట్లైతే ఆ పని చేసి ఉండేవాడ్ని కాదు. కాని నేను 'ద్వితీయుణ్ణి' గనక, చేయవలసిన ప్రత్యేకమైన పని నాకు ఏదీ లేదు గనక నేను పోర్టర్‌పని చేసినా ఏంఫరవా లేదు,'' అని అతడు కొద్దిగా కంగారు పడుతూ అన్నాడు.

తనకు సంబంధించినంత వరకు, అకీమొవ్ చెప్పినదాంతో అతడు ఏకీ భవించినప్పటికీ బదేయ్‌కిన్ నవ్వలేదు.

ఒక దాని వెంట మరొకటి అనుసరించి ప్రేలిన ఫిరంగి శబ్దం వెలుపల వినిపించింది. బదేయ్‌కిన్ మ్రాన్పడి నిలబడిన చోటే నిలబడిపోయాడు.

''వాళ్లు మనల్ని కనిపెట్టారు. లెత్యాగిన్ వెళ్లిపోయి వుంటాడనే ఆశిస్తున్నా. నేను 'బ్రిడ్జి'మీదికి వెళ్తున్నా,'' అని అతడు అన్నాడు.

అతడు వెలుపలికి వెళ్లాడు. కాల్పులు మరింత తరచూ జరుగుతున్నాయి. అకీమొవ్ డెక్కుమీదకి వచ్చాడు. తీరంలో అక్కడక్కడా తళుక్కుమనే ఫిరంగి కాల్పుల వెలుతుర్ని చూడవచ్చు.

''అవి వాండ్నుండి వస్తున్నాయి,'' అని జిగాలొ అన్నాడు.

ఒక పెద్ద అరుపు వినిపించింది: ''మన నౌక వెనకతట్టున విమానాలు. అయిదు 'ఫోక్కేవుల్ఫ్-190'లు.''

అపాయాన్ని సూచించే గంట మ్రోగక మునుపే వినిపించిన సంక్షిప్త రిపోర్టును ప్రశంసించేందుకు అకీమొవ్‌కు వ్యవధి లేకపోయింది. ఆ రిపోర్టును అనుసరిస్తూనే సబ్-ఛేసర్ నౌకనుండి ఫిరంగుల శబ్దం, టపటపమనే మెషీన్‌గన్‌ల శబ్దం వినిపించింది. కాపలా కాస్తున్న వ్యక్తి రిపోర్టా, అలారం గంట శబ్దమా లేక కాల్పులా, వీటిల్లో ఏది ముందు జరిగిందో చెప్పడం కష్టం. అవన్నీ కూడా కలిసి వచ్చేయామోననిపిస్తుంది. ఆశ్చర్యపోతున్న అకీమొవ్ కళ్లముందు, ఐదు జర్మన్ విమానాలకూ, రక్షణేమీ

లేనట్టే అగుపించిన ఆ చిన్న సోవియట్ నౌకకూ జరిగిన సంఘర్షణ మెరుపులాగా మెరిసిపోయింది.

విమానాల వేగం నమ్మడానికి వీల్లేనంతగా ఉంది. కాని నౌక చూడబోతే వేటాడవీల్లేనిదిగా అగుపించింది. బదేయ్‌కిన్ ఆత్మసంయమంతో, మాంచి పటుత్వంతో మొరటుగా ఎలుగెత్తి ఆజ్ఞాపిస్తుంటే, ఆ నౌక అల్లకల్లోలంగా ఉన్న అలలలో అత్యంత చోద్యమైన ఆకృతులతో నడిచింది. అది పైకి ఎగురుతున్నట్టూ, ఎడమవైపూ కుడివైపూ గంతు వేస్తున్నట్టూ అనిపించింది. తర్వాత అది అకస్మాత్తుగా తమాయించుకున్నట్టు వెనుకతట్టు వేగంగా జారుకుంది. ఒక్కొక్కప్పుడు అకీమొవ్‌కు, అది నీళ్లపై మామూలుగా నడవడం లేదనీ, పాము మాదిరిగా అటూ యిటూ కదుల్తూ మెలికలు తిరిగిపోతూ ఉన్నట్టూ, దాని కదలికలు తలవనితలంపుగా భంగపుచ్చేట్టుగా ఉన్నట్టూ అనిపించింది.

అకీమొవ్ బదేయికిన్ వంక చూశాడు. ఆ కమాండర్‌యొక్క పొట్టి ఆకృతిని గుర్తించడానికి వీల్లేనట్లైపోయింది. అతడు ఒక బంతిలోకి కుదించుకు పోయినట్లూ, అతని తల ఆ బంతినుండి బయటకు చొచ్చుకు వచ్చి అన్నివైపులకూ హాస్యాస్పదంగా తిరుగుతున్నట్లు అనిపించింది. నౌకా కదలికలన్నింటినీ నవ్వుపుట్టించేట్టుగా అనుకరిస్తూ, ముందుకు వంగుతూ, వెనక్కి అడుగువేస్తూ, లేదా కదలకుండా నిలబడిపోతూ గట్టిగా అరుస్తున్నాడు. ఆజ్ఞలిస్తున్నాడు. అతని ఆకృతంతా చెదిరిపోయింది. చుక్కాని నడిపే కషెవారొవ్ కూడా మనిషివలె లేనట్టు కనిపిస్తున్నాడు. అతడు చుక్కానితో ఏకమైపోయి, తన ప్రక్కనున్న పొట్టి వ్యక్తి నోటినుండి ఏమాట వెలువడితే సరిగ్గా అదే మాదిరిగా దోషరహితంగా 'ఆటోమేట్'లా పనిచేస్తున్నాడు. అతడు పైకిగానీ క్రిందికిగానీ ప్రక్కకుగానీ ముందుకుగానీ చూడ్డంలేదు: అతడు కేవలం ఆజ్ఞలను వినడం వాటిని ఆచరణలో పెట్టడం చేస్తున్నాడు.

తీరంనుండి విశాల సముద్రంలోకి నౌక చకచకా నడిచిపోతోంది. ఇది అకీమొవ్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎందువల్లనంటే ఆ నౌక తీరం వెంబడే శిఖరాలకు దగ్గరగా ఉంటేనే తేలికగా శత్రువుల విమానాలకు అందుబాటులో లేకుండా ఉండొచ్చునని అతడు భావించాడు.

అకీమొవ్‌ను చకితుడ్నిచేసిన ఇంద్రియనిగ్రహంతో బదేయ్‌కిన్, తనక్రింద శిక్షణ పొందుతున్న వ్యక్తిని జ్ఞాపకం చేసుకొని అతనివైపు సగంతిరిగాడు. "నౌకా విన్యాసానికి మనకి నడిసముద్రంలో ఎక్కువ అవకాశం వుంటుంది," అని అతడన్నాడు.

విమానాలు వెళ్లిపోతూ వెళ్లిపోతూ కొన్ని బాంబుల్ని వొదిలాయి. కాని అవి ఒక

అరనిముషం క్రింద నౌక ఎక్కడైతే ఉందో సరిగా అక్కడే పడ్డాయి. అటోయిటో తేల్చే అంశాలు వేగమూ, ఏంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్‌లు ఎడతెగకుండా పనిచేయడమూ. మెషీన్ గన్‌లు కూడా టపటపా కాల్పులు సాగిస్తున్నాయి. తోటాలలో కొన్ని 'ట్రేసర్' తారా చువ్వలు మెషీన్‌గన్నర్ల చాతుర్యాన్ని వెల్లడిచేస్తున్నాయి. నౌక ఏవిధంగా కదలాడుతున్నప్పటికీ, ఒక్కొక్కప్పుడు ఆ నౌక ఒకే ఒక ప్రక్కకు వంగి నడుస్తున్నా పైన విమానం ఎక్కడ ఉందో సరిగా అక్కడికే 'ట్రేసర్' తారాచువ్వల్ని ప్రవాహంలాగా పంపుతున్నారు. నౌక వెనుకభాగంలో ఉన్న స్వయంచిలిత ఫిరంగి ఎక్కడా ఆగకుండా కాల్పులను సాగిస్తూనే ఉంది. ఆ ఫిరంగివద్ద పనిచేస్తున్న వాళ్లు తడవకి దానిని సమీపిస్తూ దాని దగ్గరనుండి దూరంగా వెళ్లిపోతూ వుండడాన్ని చూడకపోయినట్లైతే ఆ ఫిరంగి కాల పరిమితి లేకుండా నింపబడిందనీ, అనంతంగా కాల్పులు సాగిస్తూనే ఉంటుందనీ ఎవరైనా భావించవచ్చు.

చిత్రమేమిటంటే, శిక్షను అనుభవించింది ఆ చిన్న నౌక కాదు కాని జర్మన్ విమానాలే. అవి అక్కడక్కడా క్రిందిదాకా వచ్చి చెవులుచిల్లులుపడే శబ్దంతో నీళ్లను రాచుకొనిపోతూ సముద్రంలోకి తుపాకీగుండ్లను ప్రేల్చి పర్వత శిఖరాల వెనుక అదృశ్యమైపోయాయి, మళ్లీ ఒకటి రెండు బాంబులు వేయడానికే ప్రత్యక్షమయ్యేందుకు; కాని ఎక్కడైతే వారు సబ్-ఛేసర్ నౌకను పట్టుకోవాలనుకున్నారో అక్కడ అది లేదు.

ఆ చిన్న నౌక అంతుతేల్చాలని తలపెట్టిన విమానాలు చివరికి ఆశలు వదలుకొని కోపంతో యింజన్లను నడిపిస్తూ ఎగిరిపోయాయి. మళ్లీ ప్రశాంతత అలముకొంది. గాలి రొదా, బెదిరిస్తున్నట్టుగా వున్న సముద్రపు హోరూ పిల్లల గోలవలె ఇప్పుడు వినిపిస్తోంది. నౌక తండేలు మెషీన్‌గన్‌ను వదలి నౌక అంచుపై ఒరగి వాంతి చేసుకున్నాడు.

అప్పటికిగానీ అకీమొవ్, తనతోపాటు ప్రతి వ్యక్తీ కూడా తళతళా మెరిసే గడ్డ కట్టుకుపోయిన సముద్రజలంతో కప్పబడినట్టు గమనించలేదు. మెషీన్‌గన్నుల, ఫిరంగుల ఎర్రగా కాల్తున్న గొట్టాలు తప్ప ఆ నౌక డెక్కుమీది ప్రతి వస్తువుపైన మంచు గడ్డకట్టుకుపోయి తెల్లని భాస్వరపు లేపంతో ధగధగా మెరిసిపోతోంది.

## 3

"నేను నిద్రపోయేందుకు క్రిందికి వెళ్తున్నా," అని బదేయేకిన్ అన్నాడు.

చుక్కాని మనిషీ, తండేలూ ఆశ్చర్యపోయారని అకీమొవ్ పోల్చుకున్నాడు. బదేయేకిన్ సముద్రంపై పనిలో ఉన్నప్పుడు అతనికి నిద్రపోయే అలవాటు లేదనీ, ఓడను

నడిపే అవకాశాన్ని తనకు యివ్వాలనే స్పష్టంగా సంకల్పించాడనీ అకీమొవ్ సులభంగా కనిపెట్ట గలిగాడు.

'బ్రిడ్జి'పై ఒంటరిగా నిలబడి నౌకను తన అధికారంలోకి తీసుకున్నాడు. వెనక్కి తిరిగి వెళ్లిపోతున్న ప్రయాణంలో చిక్కులో పెట్టే ఏ ఆకస్మికమైన సంఘటనా జరగక పోవడంచే అకీమొవ్‌లో కలిగిన కొద్ది సంకోచమూ త్వరలోనే తొలిగిపోయింది. నౌకలోని నావికులంతా మారుమాట్లాడకుండా మరుక్షణానే అతని ఆజ్ఞల్ని ఆచరణలో పెట్టారు. అందుకు అకీమొవ్ సంతోషించాడు, ఆ గొప్పతనం తనది కాదని గుర్తించినప్పటికీ. తాను ఒకప్పుడు భావించినట్లుగా కాకుండా ప్రతీదీ అతనికి తెలిసినట్టు బాగా జ్ఞాపకం ఉన్నట్లూ ఆజ్ఞాపించే నౌకా పదాలు, నిబంధనలు, సముద్ర జీవితపు ఆచారాలు, నౌకలోని వివిధ భాగాల సమన్వయావశ్యకత మొదలైనవి ఏమాత్రం మరచిపోనట్లూ క్రమక్రమేణా గుర్తించగలిగినందుకు అతడు అన్నిటికంటే ఎక్కువ సంతృప్తి పొందాడు: మరచిపోయాననుకున్న పాట జ్ఞాపకానికి వచ్చినట్లే అతనికి ఏవిధమైన కష్టం లేకుండా ప్రతి చిన్న విషయం కూడా జ్ఞాపకాని కొచ్చింది. ఈ సంగతినాతడు తెలుసుకొన్న తర్వాత అతనికి మరింత ఆనందం కలిగింది. కాని తనకు ఆత్మవిశ్వాసం ఎక్కువగా ఉన్నట్టు యితరులకు కనపరచకూడదనీ, స్థానిక పరిస్థితులను కుణ్ణంగా తెలుసుకోవాలనీ అతడు నిశ్చయించుకున్నాడు.

ఓడరేవులో అపాయాన్ని తెలియజేసే బీకన్ దీపాలు, వైర్లెస్ కంబాలు, కొండ మీది యిళ్లూ కనిపించాయి. ఆ సబ్-ఛేసర్ నౌకను వారథి కంబానికి కట్టివేశారు. బదేయ్‌కిన్ డెక్కుమీదికి వచ్చి, ఆ తర్వాత రిపోర్టు చేసేందుకుగాను ఫ్లొటిల్లా హెడ్ క్వార్టర్స్‌కు వెళ్లాడు. డ్యూటీలో ఉన్న నావికుడు సాయంత్రపు హాజరు తీసుకోనేందుకై ఈల ఊదాడు. నావికులంతా వరుసగా ఓడకు ఒక ప్రక్కన నిలబడ్డారు. వాళ్లను చూడడంతోటే అకీమొవ్‌కు ఆనందం కలిగింది. వాళ్లల్లో చాలామందికి ముచ్చటైన నిర్మొగమాటమైన నావికామొహాలు ఉన్నాయి. తన పిల్లలందరికీ సమృద్ధిగా వసతులు కల్పించి ఒకరిమీద ఒకరికి యే అసూయలూ ఈర్ష్యలూ లేకుండా తన బిడ్డల ప్రేమని చూరగొంటూన్న ఒక పెద్ద కుటుంబంగల గృహస్థుడ్ని చూసి బిడ్డలులేని తండ్రి ఎలాగైతే అసూయపడతాడో అలాగే బదేయ్‌కిన్‌ని చూసి అకీమొవ్ అసూయపడ్డాడు.

నావ తండేలు నెమ్మదిగా డెక్కుమీదికి వెళ్లాడు, ప్రతి దానినీ క్రమంలో పెడుతూ. ప్రశాంతత నెలకొంది. జీవితం మామూలు రోజువారీ ధోరణిలో పడింది.

బదేయ్‌కిన్ తిరిగి వచ్చినప్పుడు 'బ్రిడ్జి'మీదికి వెళ్లాడు. తానిదివరకు ఒకసారి అడిగిన సంగతి మరచిపోయినట్టుగా అకీమొవ్‌ను అడిగాడు: ''బస ఎక్కడ ఏర్పరచు కున్నారు?''

''ప్రస్తుతానికి నా సూట్‌కేసును హెడ్‌క్వార్టర్స్‌లో ఉంచి వచ్చాను,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు, ఆ ప్రశ్న అప్పుడే ప్రథమ పర్యాయంగా వేసినట్టు.

''మీకిష్టమైతే మా యింటికి రావచ్చు,'' అని బదేయ్‌కిన్ ఒక క్షణం ఆగి అన్నాడు. ''నేను కుటుంబీకుడ్ని. ఇంటివద్ద భార్య ఉంది.''

అకీమొవ్ అతని వెంటవెళ్లాడు. వాళ్లు ఒక పెద్ద భవనాన్ని దాటి త్వరలోనే కొండమీద ఉన్న ఒక చిన్న యింటి ముందుకు వచ్చారు. ఆ లెఫ్టినెంట్ గది బాగా వెచ్చగా ఉంది. కిటికీగడపలోని కుండీలలో రకాలరకాల పువ్వులన్నీ ఉన్నాయి. వాటిలో దక్షిణాది నాగచెముడు మొక్క ఒకటి వుంది.

''మొక్కల్ని పెంచే మా చిన్న ఉష్ణగృహం యిది. ప్రతీదీ యిక్కడ బాగా పెరుగుతుందని అనుకోకూడదు,'' అని బదేయ్‌కిన్ అన్నాడు.

నల్లని శరీరంతో, ఉదయంపూట తొడుక్కునే రంగురంగుల గౌనుతో ఒకామె లోపలికి వచ్చింది.

''నా భార్య,'' అన్నాడు చిరునవ్వునవ్వుతూ బదేయ్‌కిన్.

ఆమె స్నేహపూర్వకంగా అకీమొవ్‌ను పలకరించింది. రాత్రిభోజనం తెచ్చేందుకు వెళ్లింది.

''నేను ఉత్తర ప్రాంతంవాడ్ని,'' అన్నాడు బదేయ్‌కిన్. ''మూర్‌మన్‌స్క్‌లోనే బెస్త కుటుంబంలో పుట్టాను. కాని నీనాది దక్షిణప్రాంతం జార్జియా.'' అతడు తన గొంతు తగ్గించాడు. ''ఆమెకు దక్షిణాదికి వెళ్లాలని బెంగపట్టుకుంది.'' తర్వాత మామూలు ధోరణిలోనే సాగించాడు. ''నేను యీ నౌకాదళం ప్రారంభమైనదగ్గర్నుంచీ యిక్కడే ఉన్నాను. అప్పుడు నీనా మూర్‌మన్‌స్క్‌లో లేదు. మీకు పెళ్లయిందా?''

''కాలేదు,'' అని అకీమొవ్ ఆలోచించకుండా అన్నాడు. తర్వాత అతడు నవ్వాడు. తప్పు దిద్దుకున్నాడు. ''అవును... అవును. నాకు పెళ్లయింది. అవునయ్యోయ్, నేను మరచిపోయాను. నా...'' అని ఆగాడు, భార్య అనే పదాన్ని వాడేందుకు కొత్తనుపించి. ఆ మాటని ఉపయోగించేందుకు ఏదీ నిర్ణయం చేసుకోలేకపోయాడు. — ''నా ఆనిచ్క

సైన్యంలో ఉంది. మాకు పెళ్లి అయి ఎంతో కాలం కాలేదు. అంచేతనే అందుకింకా అలవాటు పడలేదు.''

బదేయ్‌కిన్ దంపతుల ప్రశాంత జీవితానికీ ఒక అరగంటా లేదా గంటక్రితం జరిగిన సన్నివేశాలకీ ఎంత తేడా ఉంది. నీనా నిశ్శబ్దంగా రాత్రిభోజనం వడ్డించే సమయంలో సబ్బువాసన మందువాసన వచ్చేప్పటికి ఆమె నర్సింగ్ వృత్తిలో ఉన్న సంగతి తేలిపోయింది. బదేయ్‌కిన్ తన యూనిఫారం చొక్కా మార్చి, కుచ్చులతో ఉన్న పూర్వపు ఫాషన్ చొక్కాను తొడుక్కున్నాడు, బూడ్సులు విప్పేసి గుడ్డ స్లిప్పర్లు తొడుక్కున్నాడు. అకీమొవ్ అదివరకెన్నడూ చూడనటువంటి సంతృప్తిని అతని మొహంలో వీక్షించాడు.

భోజనం చేసేప్పుడూ, ఆ తర్వాతా అకీమొవ్ ''బారెన్‌ట్స్ సముద్రంలో నౌకా యాత్ర'' అను పుస్తకాన్ని చూస్తూనే బదేయ్‌కిన్నూ అతని భార్యనూ శ్రద్ధగా గమనించాడు. బదేయ్‌కిన్ తన భార్యను నినూస్య అనీ, ఆమె తన భర్తను ల్యోషెంక అని పిలవడం జరిగింది. ఆ పేర్లు అతనికి ఏమాత్రం హాస్యాస్పదంగా అనిపించలేదు. అదే ఒక రెండు నెలలక్రితమైతే ఆవిధంగా అనిపించేవే. అలా పిలుచుకోవడం అతనికి నచ్చింది కూడాను. ఆనిచ్కతో అలాంటి జీవితం గడపడం అతనికి యిష్టమే. అతని భార్యగనక ఇతరుల ముందు తనను పావ్‌లిక్ అనిగానీ లేదా పాషెంక అనిగానీ పిలిస్తే అతనికి అభ్యంతరం లేదనీ, ఆనిచ్కను ఎరుగక మునుపైతే అభ్యంతరం పెట్టేవాడేననీ అతడు భావించాడు.

అదే ధోరణిలో ఆలోచిస్తూ తాను నౌక 'బ్రిడ్జి' మీదనుండి బదేయ్‌కిన్ జర్మన్ విమానాలతో జరిపిన యుద్ధాన్ని గనక చూడకపోయినట్లైతే యీ ప్రశాంతమైన, దాదాపు పామరజనకమైన జీవితం విషయంలో తనకు పూర్తిగా వేరే అభిప్రాయం ఉండి ఉండేదని అతడు అంతిమనిర్ణయానికి వచ్చాడు. ఎటునుంచి గాలివస్తుందో ఆ దిక్కును చూసే సాధన మాదిరిగా బదేయ్‌కిన్ ఒకవైపునుండి మరోవైపుకు ఎలా గిరగిరా తిరిగిందీ, అతని ఆకారం హాస్యాస్పదంగా కాకుండా కోపంగా తీవ్రమైన ఆగ్రహంతో భయం గొలిపేట్టుగా ఏవిధంగా ఉన్నదీ అకీమొవ్‌కు జ్ఞాపకం వచ్చింది. ఇప్పుడు గనక అపాయాన్ని సూచించే గంట మ్రోగితే ఆ పొట్టిగా లావుగా ఉన్న బదేయ్‌కిన్ తన ఉదయం కోటును, స్లిప్పర్లను అవతల పారేసి మరో పర్యాయం ఒక రెండు గంటలక్రితం ఎలా ఉన్నాడో అలా అయిపోతాడని అకీమొవ్ భావించాడు.

మరుచటి దినం — ఆ అనంతమైన వినీలపు సంధ్యాకాలాన్ని దినం అని అనగల్గితేనే — అకీమొవ్ బదేయ్‌కిన్‌తో నౌకపై ప్రయాణమై వెళాడు.

ఆ శిఖరాలపై ఉన్న నావికుల స్థావరాలు జీవకళతోనూ ఉల్లాసంతోనూ ఉట్టి పడుతున్నట్టు గోచరిస్తుంది. లౌడ్-స్పీకర్లనుండి సంగీతం బొంయ్‌మని వినవస్తోంది. కొండగుట్టల మధ్యనున్న లిలాక్ పూలరంగు లోయలపైన చిన్న బల్లకట్టు వారధులో, ఒంటిచెక్క వంతెనలో వున్నాయి. లోయల్లో పిల్లలు ఆడుకుంటున్నారు. అవును, అక్కడ కూడా పిల్లలు ఉన్నారు. ప్రతీదీ సౌఖ్యవంతంగానూ సుందరంగానూ చక్కని ఏర్పాట్లు చేయబడినట్టూ కనిపిస్తుంది. గుట్టలు దిగి నల్లగా నీలంగా వున్న అఖాతపు నీళ్లదగ్గరకు వెళ్లినతర్వాతగానీ ఆ యిళ్లూ, పిల్లలూ, బట్టలు ఉతికి వెలుపల ఆర వేయడం, మొదలైన సుపరిచితమైన మానవ వ్యాపకాలన్నీ బాగా దూరమైనట్లు అని పించదు. సబ్‌మెరైన్‌లూ, డెస్ట్రాయర్ నౌకలూ, మోటార్ లాంచీలూ నెమ్మదిగా వెళ్తున్నాయి. సిగ్నల్స్ తళుక్కుతళుక్కుమని మెరుస్తున్నాయి. గాలిలో జెండాలు రెపరెపలాడుతున్నాయి. వాతావరణమంతా నౌకల కూతలతోనూ, ఈలలతోనూ, లంగరు గొలుసుల శబ్దంతోనూ నిండిపోయింది.

పరధ్యానంలో ఉన్న అకీమొవ్‌ను ఒక పెద్ద కేక మేల్కొలిపింది.

''అకీమొవ్! పావెల్! అవును. అతడే!''

ఆ మారుమూల దూరప్రాంతంలో తనను పేరుతో ఎరిగిన వాళ్లెవరుం టారా అని అకీమొవ్ ఆశ్చర్యపోయాడు. అకీమొవ్ చుట్టూ పరికించాడు. పొట్టిగా లావుగా ఉన్న ఒక నౌకాదళం ఆఫీసరు జనసముదాయాన్ని త్రోసుకొని బయటపడి అతని వద్దకు పరుగున వస్తున్నాడనే చెప్పాలి. ఏం జరుగుతోందో గ్రహించే లోపునే ఆతడు అకీమొవ్‌ను కౌగలించుకున్నాడు. మొదట అకీమొవ్ అతనిని గుర్తించలేదు. చివరికి బాగా పరికించి ఆశ్చర్యంతో అన్నాడు: ''మిగునోవ్! నల్లసముద్రం మనిషివి, యిక్కడుం టావని ఎన్నడూ అనుకోలేదే!''

''మనవాళ్లిక్కడ కొల్లలుగా ఉన్నారనుకో,'' అని సమాధానం చెప్పాడు మిగు నోవ్. ''లిస్కోవ్, స్తెపానోవ్, యింకా అనేకమంది యిక్కడున్నారు. నిన్ను యిక్కడ కలుసుకుంటానని కలలో కూడా అనుకోలేదే!'' అతడు స్నేహపూర్వకంగా అకీమొవ్ వీపుమీద గట్టిగా చరిచాడు. ''అయితే నువ్విప్పుడు కమాండర్ వన్నమాట. అవునా! నాకంటే బాగానే ముందుకొచ్చావ్!''

''అందుకు నేను అభినందించాల్సింది సైన్యాన్ని,'' అని అకీమొవ్ ఉత్సాహంగా సమాధానం చెప్పాడు. ''నన్ను మేజరుగా తరక్కీ చేశారు.''

ఇంకా అక్కడ నిలబడి వున్న ఆఫీసర్లవద్దకు అకీమొవ్‌ను తీసుకెళ్లి మిగునోవ్ యిలా అన్నాడు: ''ఇతడు నా నల్లసముద్రం స్నేహితుడు. పావెల్ అకీమొవ్. ఇహ దీంతో జర్మన్లు హడలిపోతారు.''

అకీమొవ్ సైన్యంలో ఉన్న సంగతినీ, అతడు అంతకుముందే యుద్ధరంగాన్ని వదలిపెట్టిన విషయాన్నీ తెలుసుకొని మిగునోవ్ అకస్మాత్తుగా చల్లబడిపోయాడు. యుద్ధరంగంలోని ముఖ్యమైన వ్యవహారాలను ప్రశ్నించడం ప్రారంభించాడు. మధ్య మధ్య అతడు మనఃపూర్వకంగా అడిగాడు: ''అక్కడ ఎలా ఉంటుంది? కష్టంగా ఉంటుందా?'' అతనికి అలా అడగడం చేతనౌతుందని ఎవ్వరూ అనుకోరు.

అడిగిన ప్రశ్నలన్నిటినీ విన్నాక సైన్యమే ముఖ్యమైనటువంటిదనీ, నౌకాదళం యెంతసేపూ వెనకపాటేననీ నావికులు భావిస్తున్నట్టు అకీమొవ్ గమనించక తప్పింది కాదు. ఇది అకీమొవ్‌కు కొత్తనుపించింది. ఎందువల్లనంటే శాంతికాలంలో నావికులు తమ స్థానం సైనికులకంటే హెచ్చుస్థాయిలో ఉందనే భావిస్తారు. కాని ఇప్పుడు వారి దృక్పథం మారడానికి కారణం యుద్ధగమనమే. యుద్ధం అంటే ఆ నౌకాదళం కుర్రాళ్లకు ఎంతటి గంభీరమైన దృక్పథం ఉందో అకీమొవ్ చుట్టూచేరి అతన్ని ప్రశ్నలు అడుగుతూన్న వ్యక్తులను చూస్తే వ్యక్తమౌతోంది.

ఇప్పుడు శిక్షణ క్రింద ఉండే ఉద్యోగంలో అకీమొవ్ ఉన్నట్టు తెలుసుకుని మిగునోవ్ బాధపడడమే కాకుండా కోపగించుకున్నాడు కూడాను.

''పైనున్న వాళ్లతో ఎప్పుడూ ఉండే చిక్కు ఇదే,'' అని అతడన్నాడు. ''నువ్వు సబ్‌మెరైన్‌లో పనిచేయకపోవడం శోచనీయం. మేం కూడా ఆ పనిలో లేం. నీ బసెక్కడ? ఆ పెళ్లయిన వాళ్లనుండి నువ్వు యువతలికి రావాలి.'' సంభాషణలో పాల్గొకుండా కొంత దూరంలో ఉన్న బదేయ్‌కిన్ వంక అతడు ఓరగా చూశాడు. ''రా. మా ఒంటరి గాళ్లతో వచ్చి ఉండు. నీ జీవితం హుషారుగా ఉండేట్టు చేస్తాం!''

''నువ్వింకా కాస్తయినా మార్లేదు,'' అని అకీమొవ్ అన్నాడు నవ్వుతూ.

అక్కడ కొంతమంది తన నల్లసముద్రం మనుషులు కలిసినందుకు అకీమొవ్ సంతోషపడ్డాడు. అందులోనూ ఎవరికీ లొంగని లెఫ్టినెంటు-కమాండరు మిగునోవ్ కలిసినందుకు మరీ సంతోషపడ్డాడు.

వాళ్లొసగిన ఆతిథ్యాన్ని ఆలోచిస్తానని వాళ్లదగ్గర సెలవు తీసుకొని బదేయ్‌కిన్ వద్దకు తిరిగి వెళ్లాడు.

''మీకు మిగునోవ్ తెలుసా?'' అని అకీమొవ్ అతనిని అడిగాడు.

''కొద్దిగా తెలుసు.''

''నిజంగా, హుషారైన మనిషి. అవునా?'' అని అకీమొవ్ పండ్లికిలించాడు.

''అతడు సోవియట్ యూనియన్ వీరుడు,'' అని బదేయ్‌కిన్ గంభీరంగా అన్నాడు.

''నిజంగానా! నేను అతనికంటే బాగా పనిచేస్తున్నానని అతడంటున్నాడు!''

అకీమొవ్ బదేయ్‌కిన్ కుటుంబంతో కలిసే నివసిస్తున్నాడు. అతనిని చూడ్డాని కని మిగునోవ్ తరచూ వచ్చేవాడు. అతనికి ఆ పొట్టిగా లావుగా ఉన్న లెఫ్‌నెంట్ అంటే కొంత అసూయ కలిగి, అకీమొవ్‌కు ఎరచూపి అతనిని బ్రహ్మచారులవద్దకు తీసుకు వెళ్ళాలని చేతనైనంత ప్రయత్నం చేశాడు.

''కాని నేను కూడా పెళ్లైన వాడినే,'' అని అకీమొవ్ ఒప్పుకున్నాడు.

''నీకు పెళ్లయిందా? నీకు?'' మిగునోవ్ చకితుడయ్యాడు. తర్వాత అకస్మాత్తుగా అతడేదో ఆలోచించి కుదించుకుపోయిన గొంతుతో అన్నాడు: ''మంచి వాళ్లందరూ పెళ్లి చేసేసుకుంటున్నారు. త్వరలోనే నా వంతు వస్తుందనుకుంటాను.''

శిక్షణను అజమాయిషీ చేస్తూ, అన్ని సమావేశాలకీ మస్తర్లకూ హాజరవుతూ తన సమయాన్నంతటినీ సబ్-ఛేసర్ నౌకమీదే గడుపుతున్నాడు అకీమొవ్. బారెన్‌ట్స్ సముద్రం గురించి వాళ్లకు తెలిసినదంతా చెప్పమని అకీమొవ్ నావికులను అడిగాడు. అఖాతాలు, లంగరు స్థలాలూ, ప్రయాణ మార్గాలను గురించి వీలైనంత భోగట్టా పొందగలిగాడు.

ఈ భోగట్టాను గురించీ ఆనిచ్కనుండి వచ్చే ఉత్తరాలను గురించీ తప్ప అతనికి వేరే ఆలోచనే లేదు. అతడు ఏపని చేస్తున్నప్పటికీ ఆమెదగ్గరనుండి ఉత్తరాలు రావడమనే విషయం అతని మనస్సునుండి ఒక్క క్షణమైనా తొలగనంతటి ప్రయాసతో కూడిన నిరీక్షణాస్థితిలో ఉన్నాడు. ఆమె దస్తూరీ కూడా తనకు తెలియదన్న భావన అతనికి అకస్మాత్తుగా కలిగింది. ఆమె మొదటి ఉత్తరం ఎలా ఉంటుందా అని అతడు ఊహించడానికి ప్రయత్నం చేశాడు. ఆమె తనను – ''ప్రియతమా,'' ''ప్రియా'' అలాంటిదే ఏదో పేరుతో సంబోధిస్తుందా? ఆమెనుండి అతనికి తప్పకుండా ఫలానానాడు ఉత్తరం వస్తుందని అతడెప్పుడూ ఒక రోజును నిర్ణయించుకునేవాడు. తాను హెడ్ క్వార్టర్స్‌నుండి తన మొదటి ఉత్తరాన్ని వ్రాసింది మొదలుకొని ఆ వుత్తరం ఆమెకు అందే వరకు పట్టే రోజులను లెక్కపెట్టుకోవడం చూసి తనను తానే హేళన చేసుకొనేవాడు.

ఆమె తక్షణమే తప్పక ఉత్తరం వ్రాస్తుంది కనక ఆమె సమాధానం ఫలానాఫలానా రోజుకు వస్తుందని భావించేవాడు. తాను పెట్టుకున్న గడువులో అతనికి ఉత్తరం రానప్పుడు, దానిని మరికొంత దూరానికి పొడిగించి హృదయవేదనతో మరోతేదీ నిర్ణయించుకునే వాడు, అది తప్పితే మరొకటి, ఆ తర్వాత యింకొకటి.

శత్రువుల సబ్‌మెరైన్లు కేంద్రస్థావరాన్ని సమీపించేందుకు వస్తున్నాయని కని పెట్టి వాటిని వెంటాడినప్పుడు తీరంలో ప్రశాంతంగా గడిచిపోతున్న అతని జీవితానికి అప్పుడప్పుడు అంతరాయం కలగడం కద్దు. మూడు వారాల తర్వాత ఆ సబ్-ఛేసర్ నౌక రెండో పర్యాయంగా వరంగెర్ ఫ్యోర్డుకు వెళ్లింది.

ఈ సారి అకీమొవ్ కమాండర్‌గా ఉన్నాడు. బదేయ్‌కిన్ కాబిన్‌లోనే ఉండి పోయాడు, బహు అరుదుగా అప్పుడప్పుడు 'బ్రిడ్జి'మీదికి వచ్చేవాడు. ఆ పొట్టిగా లావుగా ఉన్న లెఫ్టినెంటు, చేతులు నులుపుకుంటూ చుక్కాని మనిషినిగాని తండేలునుగాని అడిగేవాడు: "నాతో బసచేస్తున్న వాని పని ఎలా ఉందనుకుంటున్నారు. బాగా నేర్చుకో గలుగుతున్నాడా?"

"అతడు బాగానే నిర్వహించగలుగుతున్నాడు, కామ్రేడ్ లెఫ్టినెంట్," అని చుక్కాని వద్ద ఉండే వ్యక్తి సమాధానం చెప్పాడు. తండేలు క్లుప్తంగా: "అతడు నావికుడు," అని అన్నాడు.

తండేలు పెదవులనుండి ఆ మాట వెలువడడం అంటే యిక అంతకంటే పొగడ్త ఉండదన్నమాట. అతని తీర్పు బదేయ్‌కిన్‌కి చాలా సంతోషాన్ని కలిగించింది. అందుకు కారణం, సాధారణంగా అందరితో కలుపుకోలుతనం లేకుండా విడిగా బెట్టుగా ఉండే వాళ్లల్లో జరిగే విధంగానే అతనికి హఠాత్తుగా అకీమొవ్ అంటే ఎంతో యిష్టత ఏర్పడింది.

ఆజ్ఞప్రకారంగా తీరంలో ఉన్న ఏ స్థలంవద్దకైతే వెళ్లవలసి ఉందో ఆ స్థలాన్ని నౌక సమీపిస్తోంది. ఒడ్డున నిర్జీవంగా ఉంది. బదేయ్‌కిన్ 'బ్రిడ్జి' మీదికి వెళ్లాడు.

"మీకేమైనా కనిపిస్తోందా?" అని అడిగాడు.

"అంతా నిశ్శబ్దంగా ఉంది," అని అకీమొవ్ సమాధానం చెప్పాడు.

ఓడని తీరం వెంటనే నడిపిస్తూ నలభై నిమిషాలపాటు నిరీక్షించారు. ఎవ్వరూ కూడా ఒక మాటైనా పలకలేదు.

చివరికి అకీమొవ్ ఓపిక పట్టలేక పోయాడు. "బహుశ నేను వెళ్ళి వాళ్ళకోసం చూస్తేనో?" అని అతడు సలహా యిచ్చాడు.

"వీల్లేదు," అని బదేయ్‌కిన్ తీవ్రంగా అన్నాడు. "అలా చేసేందుకు మనకు ఆజ్ఞ లేదు."

వాళ్ళు యిక వెళ్ళిపోదాం కదా అని సిద్ధమౌతుండగా దక్షిణాన బాగా దూరంగా ఎంతో సేపు వేచి ఉన్న మతాబీచువ్వలు మూడు పచ్చవి, రెండు ఎర్రనివి ఆకాశంలో కని పించాయి. తర్వాత అదే స్థలనుండి కాల్పులు వినిపించాయి.

"ముందుకు పూర్తి వేగంతో పోనివ్వు," అని అకీమొవ్ ఆజ్ఞాపించాడు.

కాల్పులు ఎక్కువయ్యాయి. సబ్-ఛేసర్ నౌకమీది ప్రతివ్యక్తీ తన యుద్ధ స్థావరంలో నిలబడ్డాడు. నౌక ఒడ్డుకు వెళ్ళింది. ఎర్రని మతాబీచువ్వలు, అనగా అంతకు పూర్వం కూడబలుక్కొని నిర్ణయించుకున్న సిగ్నల్‌ను, యివ్వమని అకీమొవ్ సిగ్నలర్‌ను ఆజ్ఞాపించాడు. అకీమొవ్ అనుకున్న ప్రకారంగా తక్షణఫలితం ఏమంటే ఓడమీదకి శత్రువు కాల్పులను ఆకర్షించడమే. తండేలు మెషీన్‌గన్‌వద్ద సిద్ధంగా ఉన్నాడేమో వెంటనే బదులు పేల్చాడు. ఒక నీటికాకి అరచుకుంటూ ఆకాశంలోకి ఎగిరింది.

దగ్గరగా ఒడ్డునుండి బొంగురుపోయిన గొంతుతో ఒక కేక వినిపించింది, "మేం ఇక్కడ ఉన్నాం!"

క్రిందికి దిగే 'గాంగ్‌వే' దుబ్‌మన్న శబ్దంతో రాళ్ళపై పడింది. వీలైనంత వేగంతో మెషీన్‌గన్‌లను ప్రేల్చారు.

"రండి. త్వరగా రండి!" అని అకీమొవ్ 'గాంగ్‌వే' పైనుండి మెల్లగా పిలిచాడు.

రికన్నాయ్‌సెన్స్ మనుషులు బహునెమ్మదిగా వస్తున్నారు. వాళ్ళు దేనినో భుజాల మీద మోసుకు వస్తున్నారు. కాని అది ఏమిటో తెలుసుకొనేందుకు అకీమొవ్‌కు వ్యవధి లేకపోయింది. ఎవరికీ అగపడకుండా కొండల మాటునుండి కాల్పులు కాలుస్తున్న శత్రువులకు ప్రతికూలంగా మెషీన్‌గన్‌లనూ నావికుల టామీగన్‌లనూ కాల్చేందుకు ఆజ్ఞలు యిస్తున్నాడు అకీమొవ్.

తీరంవైపు మొహంపెట్టుకొని తుపాకిని కాలుస్తూ ఓడవైపుకు వెనక్కి నడుచు కుంటూ వచ్చిన చివరి రికన్నాయ్‌సెన్స్ మనిషిని: "అంతా వచ్చినట్లేనా?" అని అకీ మొవ్ అడిగాడు. "అవును," అని అతడు చుట్టూ పరికిస్తూ, తన తుపాకిని క్రిందికి దించుతూ సమాధానం చెప్పాడు.

'గాంగ్‌వే' పైకి లాగి వేయబడింది. సబ్-ఛేసర్ నౌక తీరానికి రెండు (త్రాళ్ల దూరానికి వచ్చిందాకా కాల్పులు ఆపమన్న ఆజ్ఞను యివ్వలేదు అకీమొవ్.

నౌక యింటి ముఖం పట్టింది. రికన్నాయ్‌సెన్స్ మనుషులు డెక్కు(క్రింద అదృశ్యమైపోయారు. వెనకటిలాగానే కాబిన్‌ను వారికే యిచ్చేశారు.

త్వరలోనే లెత్యాగిన్ '(బ్రిడ్జి'మీదికి వచ్చి అకీమొవ్‌ని పలకరించాడు.

''మనం మళ్లీ కలుసుకున్నందుకు చాలా సంతోషంగా ఉంది,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. ''ఎలా జరిగింది?''

''బాగానే నెట్టుకొచ్చాం,'' అని లెత్యాగిన్ బదులు చెప్పాడు. ''కాని ఛీఫ్ వారెంట్ ఆఫీసరు (హంచోవ్ (ప్రాణాలు కోల్పోయాడు. అతడు చాలా మంచి రికన్నాయ్‌సెన్స్ మనిషి. అతని శరీరాన్ని శ(త్రువులు నలగగొట్టకుండా కాపాడి దానిని మావెంట తీసుకు వచ్చి అతని స్వదేశంలో భూస్థాపితం చేయాలని నేను నిశ్చయించుకున్నాను. మేం అతనిని నార్వేయర్లమధ్య సమాధి చేసేవాళ్లమే.'' (అతడు ఎప్పుడూ నార్వేవాళ్లని ''నార్వేయర్లు'' అనిపిలుస్తాడు). ''వాళ్లు చాలా మంచివాళ్లు; జర్మన్లను ద్వేషిస్తారు. జర్మన్ క్యాంపులనుండి తప్పించుకొన్న మనవాళ్లకి శరణ్యమిస్తారు. అవును. అతనిని మేం అక్కడ సమాధి చేసి ఉండేవాళ్లమే. కాని మేం వెనక్కి వచ్చేస్తున్నామేమో అతనిని మావెంట తీసుకొని వచ్చేందుకు నిర్ణయించుకున్నాం. నార్వేయర్లు చాలా మంచి వాళ్లు. మాకు ఎంతో సహాయం చేశారు.'' అతడు కాసేపు మౌనంగా ఉండి ఆ తర్వాత ఉత్సాహంతో నిండిన కంఠధ్వనితో మళ్లీ అన్నాడు. ''మేం మా పనిని భేషుగ్గా నిర్వహించాం. మన హెడ్‌క్వార్టర్సుకు ఎంతో ఉపయోగపడే ముఖ్యమైన భోగట్టాలను సంపాదించగలిగాం.'' అతడు చిరునవ్వు నవ్వాడు. ''మీది చాలా అదృష్టమైన చెయ్యి. అందుకు మా అభివందనాలు.''

''చేయికాదు వీపు అను,'' అని అకీమొవ్ విచారంగా నవ్వుతూ అన్నాడు. చని పోయిన వ్యక్తి అతనికి తెలియక పోయినప్పటికీ అకీమొవ్ ఎంతో విచారించాడు.

లెత్యాగిన్‌కు '(బ్రిడ్జి'ని వదలివెళ్లే యిష్టం లేనట్టు కనిపిస్తుంది. అతడు ఏదో ఒక విషయం విశదంగా చెప్పాలని అనుకున్నాడు. తీరంలో చాలా చల్లని రా(త్రులు గడిపిన తర్వాత మంచుగడ్డలు కరిగినట్టుగా కరిగిపోయి నార్వేవాళ్లను మెచ్చుకుంటూ అదే సమయంలో దాడిసలిపే శ(త్రువును ఎదుర్కోవడంలో వారికి చురుకుదనం లేక పోవడంచే వారిని నిందిస్తూ అంతకంతకు బలీయమౌతున్న కంఠధ్వనితో మాట్లాడాడు.

నాకాస్థావరాన్ని చేరడంతోటే అకీమొవ్ లెత్యాగిన్‌తో తీరానికి వెళ్లాడు. లెత్యాగిన్ తన గదికి రమ్మనిమని అకీమొవ్‌ను ఆహ్వానించాడు. కాని ఆ రికన్నాయ్‌సెన్స్ ఆఫీసరంటే అతనికి యిష్టం ఉన్నప్పటికీ అతని ఆహ్వానాన్ని తిరస్కరించేందుకు ఒక సాకు చెప్పి ఫ్లాటిల్లా హెడ్‌క్వార్టర్సుకి త్వరత్వరగా వెళ్లాడు, తనకేమైనా ఉత్తరాలు వచ్చాయేమోనని. ఒకే ఒక ఉత్తరం వచ్చింది. కొవ్‌రోవ్‌లో వున్న తన తల్లి దగ్గిరనుంచి వచ్చిందా వుత్తరం. అంతేకాని ఆనిచ్కానుండి ఏమీ రాలేదు. తన ఉత్తరం అందిన తర్వాత ఒక వారంలోపుగ ఆమె సమాధానం వ్రాసేందుకు ఏమైనా ఆటంకం కలిగినట్లైతే కనీసం ఆ రోజుకయినా తనకు ఉత్తరం అంది ఉండాలని అతడు భావించి ఆశ్చర్యపోయాడు. ఆశాభంగం చెందాడు.

అవును, ఆమె గనక ఒక వారం ఆగినట్లైతేనూ, తన మొదటి ఉత్తరానికి సమాధానం వ్రాయడానికి ఒక వారం రోజులు వాయిదావేసి వుండగల్గినప్పటికీ కూడా, ఈపాటికి ఆమెనుండి సమాధానం వచ్చి ఉండేదే.

కాస్త వేడివేడి భోజనం చేసేందుకని యింటికి వెళ్తుండగా అతనికి బదేయ్‌కిన్ దంపతులు గడుపుతున్న సుఖమైన సంసార జీవితమూ, ఒకరికి మరొకరియందున్న అనురాగమూ తలచుకొని వెనక్కు మళ్లాడు. ఆ సౌఖ్యమూ, ప్రేమా యిప్పుడతనికి చిరాకు పుట్టించాయి.

''అది అంతే,'' అని అతడు డెక్కుమీద అటూ యిటూ నడుస్తూ గొణిగాడు. ''భార్య మరో వ్యక్తిని చూసుకోగలదు. కాని ఒక తల్లి తన కుమారుడ్ని మరిచిపోలేదు. ఆ సంగతి నీకంటే ముందే ఇతరులకు తెలుసు. ఇప్పుడు నీకు కూడా తెలిసొచ్చింది.''

అతడు ఆ మధ్య బహు అరుదుగా యింటికి ఉత్తరాలు వ్రాశాడు. ఇప్పుడు ఆనిచ్కా అంటే ఏర్పడిన బాధతో కూడిన పగ, తన తల్లితండ్రుల్ని మరిచిపోయినందుకు కలిగిన అంతరాత్మ ఆవేదన యివి రెండూ అతనిలో దుఃఖాన్ని రేకెత్తించాయి. అతడు నిరాశతో క్రుంగిపోయాడు. క్రిందికి కాప్టెన్ కాబిన్‌లోకి వెళ్లాడు. ఇంటికి ఉత్తరం వ్రాశాడు. అతడు జన్మించిన యిల్లునూ, తల్లితండ్రులనూ, అక్కచెల్లెళ్లనూ తలచుకున్నప్పుడు అతనికి కొంత ఉపశమనం కలిగింది. ''వాళ్ళు నాకున్నారు. వాళ్లను నానుండి ఎవరూ దూరంచేయరు,'' అని అతడు తనలో తాను భావించుకున్నాడు.

తర్వాత మళ్లీ డెక్కుమీదికి వెళ్లాడు. అక్కడ అంతా భోంచేస్తున్నారు. సంతోషంతో నిండిన వారి కంఠధ్వనులు వినవస్తున్నాయి. త్వరలోనే కషెవారొవ్ పాడటం

మొదలుపెట్టాడు. డెక్కు ముందరిభాగంలో ఉక్కుమోకుల మధ్య జిగాలో క్లిమాషిన్‌లు నిలబడి ఉన్నారు. జిగాలో సిగరెట్టు త్రాగుతూ తక్కువ స్థాయిలో మాట్లాడుతున్నాడు.

''ఆమె ఏ అమెరికన్‌తోనో పరిచయం చేసుకొంది. 'ఐ లవ్ యు, ఐ లవ్ యు,' అని అతడు అన్నాడు. కాని ఆమె కేవలం ముసిముసి నవ్వులునవ్వింది. అప్పుడతడన్నాడు, 'నేను ఒక కానుక యిస్తాను. అంగీకరిస్తారా?' ఆమెకు ఒక సిల్కు మేజోడు యిచ్చాడు. ఒకే ఒకటి. తెలిసిందా? ఆమె పెద్దగా నవ్వింది. 'ఒక మేజోడును నేనేం చేసుకోవాలి?' అని ఆమె అతనిని అడిగింది. ఆమెకు రెండు కాళ్ళున్నాయని అతనికి తెలియదా? 'రెండోది మీకు తర్వాత యిస్తాను,' అని అతడన్నాడు. ఆమె కాస్త హుషారైన మనిషి. అతని ముఖాన ఊసింది. అతడు పెద్ద గొడవ పెట్టుకున్నాడు. ఆఖరికి టౌన్ కమాండెంట్ వద్దకు కూడా వెళ్ళాడు, ఆమె తనను అవమానపరచిందని ఫిర్యాదు చేసేందుకు.''

జిగాలో నవ్వాడు. అతని నవ్వులో సంతోషం అగుపించదు.

''నీచపు మనుషులు,'' అని అన్నాడు క్లిమాషిన్ విసుగుదలతో తల ఊపుతూ.

'' 'వాంట్-ఎనీ' మనుషులు,'' అని అన్నాడు జిగాలో.

ప్రక్కవీధుల్లో నిలబడి సిల్కు మేజోళ్ళు, సిగరెట్లు అమ్ముకొనే అమెరికన్లకు మూర్‌మన్‌స్క్ మనుషులిచ్చిన పేరు అది. ''వాంట్ ఎనీ?'' (ఏమైనా కావాలా?) అని వాళ్ళడుగుతారు. ఆ రెండు ముక్కల్నీ మామూలుగా మెల్లగా అంటారు. అది బహుశ మొత్తం ప్రపంచంలోని జూదపు వ్యాపారగాళ్ళ ట్రేడ్‌మార్కు అయి ఉంటుంది.

క్లిమాషిన్ వెళ్ళిపోయాడు. జిగాలో ఒక్కడే మిగిలిపోయాడు. తనలో తాను గొణుక్కోవడం, దగ్గడం ప్రారంభించాడు. అప్పుడతను అకీమొవ్‌ను గమనించాడు.

''మీరు ఇంకా యిక్కడే ఉన్నారా? వెళ్ళిపోయారేమోనని అనుకున్నాను,'' అని అతడు ఆశ్చర్యంగా అడిగాడు.

''లేదు. నేనింకా యిక్కడే ఉన్నాను,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. తర్వాత అడిగాడు: ''ఇక్కడి వాతావరణానికి అలవాటు పడడం మీకు కష్టంగా ఉందా?''

''లేదు. మనం ఎక్కడ వున్నా ఉద్యోగం ఉద్యోగమే. నిజానికి మొదట యీ ప్రదేశం కాస్త విసుగు పుట్టించినట్లనిపించింది. అంతా గగ్గురుగగ్గురుగా మెరకపల్లాలే. అంత అందమైనదేం కాదు. కాని కొన్నాళ్ళు అలవాటైన తర్వాత ఇది అంత చెడు అని అనిపించలేదు. వాస్తవానికి యీ ప్రదేశమంటే ఎక్కువ యిష్టం కూడా ఏర్పడింది.''

అతడు అకీమొవ్ వంక కొంత ప్రశ్నార్థకంగా చూసి అడిగాడు: ''మీ మాటేమిటి? మీకు యిష్టం లేదా?''

''నాకేం అభ్యంతరం లేదు. బాగానే ఉంది,'' అని అకీమొవ్ త్వరత్వరగా సమాధానం చెప్పాడు. తర్వాత కోపంతో ఉన్న అలలవైపు చూసి అన్నాడు, ''వెధవ వాతావరణం.''

జిగాలొ కలలో నిట్టూర్చినట్టు నిట్టూర్చాడు.

''ఒకప్పుడు కేవలం మంచి వాతావరణంలోనే మేం నౌకాయానం చేశాం. కాని యిప్పుడు వాతావరణం ఎలా ఉన్నా మాకు ఏమీ తేడా కనిపించదు. శాంతి కాలంలో అయినట్లైతే పెనుగాలిలో యిలాంటి లక్కపిడతలో బయటికి వెళ్లే వాడిననుకుంటారా? ఉత్తది. కాని యిప్పుడో వెళ్తున్నాం. మనం యింకా నావమీదే ఉన్నాం! అక్కడ యుద్ధం జరుగుతోందని ఓడకు కూడా తెలుసునని అనుకోరూ? మనుషుల సంగితేమిటి? ఇప్పుడెవరికీ ఆఫ్ డ్యూటీలో ఉన్నామన్న అభిప్రాయమే లేదు. ప్రతి ఒక్కడూ నలుగురి పని చేస్తాడు. అందుకు సణుక్కోడు. కొద్దిగా అప్పుడప్పుడు సణుక్కున్నా అది ఎక్కువగా హిట్లర్‌పైనే.''

అతడు ఒక క్షణం నిశ్శబ్దంగా ఉండి ఆ తర్వాత అకీమొవ్‌వైపు పరిశీలనగా విచారిస్తూ చూసి అడిగాడు: ''కామ్రేడ్ కమాండర్! బహుశ ఇక్కడ కాస్త విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నారు కదూ? మీకోసం పక్క ఏర్పాటు చేస్తాం ఉండండి. తినడానికి ఏమైనా పట్టుకొస్తాం.''

''చాలా బాగుంది,'' అని అకీమొవ్ అన్నాడు. ''అవును, మనం అలాగే చేద్దాం.''

తానెంత విచారంతో ఉన్నదీ ఓడ తండేలుకి కనపరచినందుకు అకీమొవ్ సిగ్గు చెందాడు. ''వెనకటి రోజుల్లో యీలాగు ఎప్పుడైనా వుండేదా నాకు?'' అని అతడు కోపంతో కూడిన ఆశ్చర్యంతో భావించాడు.

ఆ నాటినుండి అకీమొవ్ ఆ సబ్-ఛేసర్ నౌక వదలి ఉండలేదనే చెప్పాలి. బదేయ్‌కిన్ నొక్కి ప్రశ్నించినప్పుడు, అతడు అందుకు సమాధానంగా నావికులతో మాట్లాడుతుండాలనీ, రోజువారీ విషయాలతో బాగా పరిచయం కావాలనీ, అందువల్ల తనకు ఎంతో ఉపయోగపడుతుందనీ తెలిపాడు. బదేయ్‌కిన్ హృదయంలో బాధపడ్డాడు, కాని అందుకు అభ్యంతరం పెట్టలేదు.



అధ్యాయం ఆరు

# సముద్రం - తీరం

1

"ఆఫ్ డ్యూటీలో వున్నాం అన్న అభిప్రాయం లేదు." జిగాలో మరో విధంగా ఉద్దేశించనప్పటికీ ఆ మాటలు అకీమొవ్‌కు కొంత నిందాస్పదంగానే ఉన్నాయి. అవి అతనికి నొప్పికలిగించాయి. అతడు ఆనిచ్కాను గురించి అంతగా ఆలోచించకుండా వుండడానికి ప్రయత్నించాడు. అతనికి ఇంకా ఆమెనుండి ఏ ఉత్తరమూ లేకపోవడంవల్ల ఒక హద్దు పెట్టుకున్నాడు. అదే చిట్టచివరిదని తనలో తాను అనుకున్నాడు. ఆ తర్వాత అతడు ఆనిచ్కాను మరచిపోవడానికీ ఆమెను తన హృదయంనుండి తొలగించడానికీ ప్రయత్నం చేస్తాడు. వాస్తవానికి అలా చేయడం అసంభవమే. అక్షరాలా ఆవిధంగా చేద్దామని అతని సంకల్పం కాదు. కాని ఆమెను

గురించిన స్మృతులను అతడు తన హృదయాంతరాళాలలో అట్టడుగున దాచుకుంటాడనేది తథ్యం. వాటిని అతడు ఇతర ఆలోచనలతోనూ, యితర స్మృతులతోనూ, ముఖ్యంగా తానిప్పుడు చేస్తున్న పని పాటులతోనూ కప్పిపుచ్చి అణచుకుంటాడు.

ఇక ఆఖరి గడువు 1944 నూతన సంవత్సరాదినాడని నిర్ణయించుకున్నాడు.

ఆ ముందునాటి రాత్రి పర్వత శిఖరాలలో నివాసమేర్పరచుకున్న గ్రామస్థులంతా నూతన సంవత్సరాన్ని ఆహ్వానించేందుకై సన్నాహాలు చేసుకుంటున్నారు. సరఫరా ఆఫీసర్లు వోడ్కాను పెంచిపెడుతున్నారు. స్త్రీలు కేక్ మొదలైన పిండివంటలను తయారు చేస్తున్నారు. పిల్లలు ఉత్తర ధ్రువప్రాంతపు చిన్న దేవదారు చెట్లను స్వయంగా తయారు చేసిన ఆటవస్తువులతో అలంకరిస్తున్నారు. కాని లెఫ్టినెంట్ బదేయ్‌కిన్ నౌక మాత్రం కొన్ని రక్షకనౌకలతో కలసి సముద్రంమీద వెళ్లాలని ఆజ్ఞాపింపబడింది. వందలాది నావికులు తమకు కలిగిన భంగపాటును అణచుకుంటూ లంగరు స్థలాలవద్దకు పరుగెత్తారు.

బదేయ్‌కిన్ తీరంలోనే ఉండాలనీ, అతని 'ద్వితీయుడైన' అకీమొవ్ ఆపరేషన్ సమయంలో నౌకను సంపూర్ణంగా తన కమాండ్‌లోకి తీసుకోవాలనీ ఫ్లొటిల్లా హెడ్ క్వార్టర్సువారు నిర్ణయించారు. నూతన సంవత్సరాదినాడు తన భార్యతో ఉండాలని ఆ పొట్టి లెఫ్టినెంటు వాంఛించిన దానికి యిది సరిగ్గా అతికింది. కాని అతనికి ఆందోళనగానే ఉంది. తాను లేకుండా తన నౌక సముద్రంలోకి వెళ్తుండడం అతడు ఊహించుకోలేకపోయాడు. ఆ నౌక ఇతర వాటితో చీకటిలోకి అదృశ్యమైపోవడాన్ని అతడు వ్యసనపడుతూ వాంఛాపూరిత నయనాల్తో చూశాడు.

అలా వెళ్లిన నౌకాదళం అమెరికన్ వ్యాపార నౌకలను సముద్రంలో కలుసుకొని వాటిని దక్షిణంగా మూర్‌మన్‌స్క్‌వరకు తీసుకు వెళ్లవలసిందిగా ఆజ్ఞాపింపబడింది.

ఇతర నావలను గుర్తించడం అసంభవమయ్యేట్టు చేసింది చీకటి. అయినా ఒంటరిగా ఉన్నామనే భావన మాత్రం లేదు; అందుకు భిన్నంగా, విన్యాసానికి అక్కడ తావున్నట్టు కనిపించదు. అప్పుడప్పుడు ఆ చీకట్లో సిగ్నల్ దీపాలు తళుక్కుమన్నాయి. వైర్లెస్ ఆపరేటరు రక్షక నౌకల సందేశాలను అందుకొని నౌక 'బ్రిడ్జి'మీద ఉన్న అకీమొవ్‌కి అందించాడు. అర్ధరాత్రయ్యేప్పటికి మేఘాలు తొలిగిపోయాయి. ఆకాశం ఉత్తర దిశ దీపాల కాంతితో వెలిగిపోయింది. అకీమొవ్ మెగఫోన్ అందుకొన్నాడు, నౌకడెక్కుమీది మనుషులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలిపేందుకు. తర్వాత క్రింద ఉన్న

వారికి కూడా అదేవిధంగా శుభాకాంక్షలను కమ్యూనికేషన్ గొట్టంద్వారా తెలియజేశాడు. శుభాకాంక్షల సిగ్నళ్లు తళతళా మెరిశాయి, ఒక నౌకనుండి మరో నౌకకు.

''కుడివైపున పొగ. ఇరవై అయిదు,'' అని ఒక సిగ్నలరు నివేదించాడు.

ఇంతలో అమెరికను వ్యాపార నౌకలు అల్లంతదూరంలో అగుపించాయి. వాటిల్లో వివిధ టన్నుల బరువుగల సుమారు ఇరవై నౌకలు ఉన్నాయి; వాటి పార్శ్వాలలో బూడిద వర్ణపు నౌకాదళం యూనిట్లు ఉన్నాయి.

ఆ విదేశ నౌకలలో కొన్నిటిని నావికులు గుర్తించారు. ''అదిగో 'లేడీ జేన్,' '' అని ఒక సిగ్నలర్ అన్నాడు. ''అది 'గోల్డెన్ స్టెల్లా,' '' అని కషెవారొవ్ అన్నాడు, తన చేతులు పనిలో నిమగ్నమై ఉన్నాయి గనక గడ్డాన్ని అమెరికన్ నౌకల దిశకు ఊపుకుంటూ.

త్వరలోనే వర్తకపుటోడలమీది అకారాలు గుర్తు పట్టగలిగేట్టుగా కానవచ్చాయి. అందులో ఉన్నవాళ్లు నాలుగంతస్తుల భవనాలవలె ఉన్న తమ నౌకల డెక్కులమీద నిల బడి తమవద్దకు వస్తున్న సోవియట్ నౌకలవైపు టోపీలను ఊపారు.

మన డెస్ట్రాయర్లు, సబ్‌మెరైన్ ఛేసర్లు, రక్షక నౌకలు, ట్రాలర్లు, వేగాన్ని తగ్గించుకుని ఇదివరలో నిర్ణయించుకున్న క్రమంలో నిలబడ్డాయి. అకీమొవ్ స్థానం ఆ వ్యాపార నౌకలకు ఎడమవైపుగా చిట్టచివర వుంది. క్లిష్టమైన విన్యాసాలను జరిపిన తర్వాత ఆ వ్యాపార నౌకలు మూర్‌మన్‌స్క్‌కు పయనమయ్యాయి. గమనం నెమ్మదిగా వుంది. ఎందువల్లనంటే బరువైన వర్తకపుటోడల వేగాన్నిబట్టి రక్షక నౌకల వేగం అను సరించాల్సి ఉంటుంది.

ధగధగా మెరిసే మంచుతో కప్పబడ్డ పర్వతం కారునలుపు నీళ్లలోనుండి వెలు పలికి వచ్చినట్టు రిబాచీ ద్వీపకల్పం నావకి ఎదురుగా కనిపించినప్పుడు ఎడమవైపు మూడు త్రాళ్లదూరంలో అలలమీద సబ్‌మెరైన్ పెరిస్కోపు గొట్టం ఒక క్షణం కని పించి అదృశ్యమైపోయింది. దానిని అకీమొవ్వూ, అతని నావికులూ కనిపెట్టారు.

ఒక క్షణం కూడా పోగొట్టుకోకూడదు. ''ఎదుర్కోండి. పూర్తి వేగంతో నడ పండి,'' అని అకీమొవ్ ఆజ్ఞాపించాడు. ''సముద్రంలోకి లోతుబాంబులు పేల్చేందుకు సిద్ధంగా ఉండండి.'' తర్వాత ఆ నౌక ఎక్కడయితే పెరిస్కోపు అదృశ్యం అయి పోయిందో అక్కడికి అతి జోరుగా దూసుకుపోతున్నప్పుడు ఓడస్తంభంమీద సిగ్నల్‌ను ఎగర వేయాలని అతనికి జ్ఞాపకం వచ్చింది. అనుకున్న ప్రకారంగా సిగ్నల్ దీపం ధగధగమంది. సము

ద్రపు లోతుబాంబులు వదలబడ్డాయి. నౌక వెనుకభాగాన బ్రహ్మాండమైన స్తంభా కృతులలో నీరుపైకి లేచింది.

సబ్‌మెరైన్ ఛేసర్ నౌక ఒక చుట్టు తిరిగి మళ్లీ వ్యాపార నౌకలూ, నౌకాదళం యూనిట్లూ మరొకసారి మార్గంలోకి వచ్చే లోపుగా తిరిగి వచ్చింది. హెచ్చరిక చేసే తెల్లని రాకెట్లతో ఆకాశం వెలిగింది. తర్వాత ఆ ద్వీపకల్పంమీద మతాబీచువ్వలు పైకిలేచాయి, పట్టపగలువలె వెలుతురునిస్తూ. అన్నిటికంటే దగ్గరగా ఉన్న అమెరికన్ నౌక డెక్కు మీద తత్తరపడుతున్న మనుషుల ఆకృతులు అటూ యిటూ పరుగెత్తడం గమనించవచ్చు.

''ఏంభయం లేదు అమ్మాయీ,'' అని అకీమొవ్ అమెరికన్ నౌకకు మళ్లీ ధైర్యం గొలుపుతున్నట్టుగా గొణిగాడు. ''భద్రంగా తప్పించుకొనేట్టు చూస్తాంలే.'' నిశ్శబ్దంగా ఉన్న నీళ్లల్లో తారట్లాడే శత్రువుయెడల ఈర్ష్య, మేజర్ గొలొవీన్, మాయ్‌బొరొద, పైజూల్లిన్, విత్యగోవ్, ఫిల్‌కోవ్, ఒరెష్‌కిన్‌లకూ, ఆనిచ్కకూ కూడా ప్రాణాధారమైన అవసరమో ఆ సరకులను తీసుకువస్తూన్న ఆ విదేశ నౌకలు ఏమౌతాయోనన్న విపరీతమైన ఆత్రతా యీ రెంటి మేళవింపుతో అతని హృదయం నిండిపోయింది. అపాయాన్ని సూచించే గంట పిచ్చిగా మ్రోగుతోంది. ''తయార్!'' అకీమొవ్ ఆజ్ఞాపించాడు. సముద్రపు లోతుబాంబులు నౌకచే వదలబడ్డాయి.ఆకుపచ్చని జలభారలు మరొకసారి పైకి లేచి నౌక వెనుక భాగానపడ్డాయి. అకీమొవ్ ఆజ్ఞపై నౌక ఒకసారి చుట్టూ తిరిగి విశాల సముద్రంవైపు నడి చింది. నౌక వెనుక భాగం మరో బాంబుల వరుసను సముద్రంలోకి పంపేందుకు సిద్ధంగా నిలబడ్డాడు క్లిమాషిన్. అస్‌డిక్ ఆపరేటరుక్రిందనుండి ఉక్కిరిబిక్కిరౌతున్న గొంతుతో అరిచాడు: ''ఎడమవైపు స్క్రూ చప్పుడు, నూటముప్పై ఐదు.''

ఇంకా ఎక్కువ బాంబుల్ని సముద్రంలోకి వదిలారు. మళ్లీ సబ్‌మెరైన్ ఛేసర్ చుట్టూ తిరిగింది. అకీమొవ్‌కు సహాయం చేసేందుకై రక్షక నౌకల కమాండర్ ఆజ్ఞపై మరో రెండు నౌకలు దగ్గరకు వస్తున్నాయి. అవి చాలా దగ్గర్లోకి వచ్చేశాయి. అప్పుడు ఒక నావికుడు సంతోషంతో 'బ్రిడ్జి'వైపు తల ఎత్తి అకస్మాత్తుగా ఉత్సాహ పూరితమైన కేక వేశాడు.

దగ్గరలోనే లేస్తూన్న పెద్దపెద్ద అలల ఉపరిభాగాన నూనె సన్నని చాలుగా విస్తరించింది. ''శభాష్!'' అని అదే గొంతునుండి విజయ ధ్వానం వినిపించింది.

వాస్తవానికి, జర్మన్ సబ్‌మెరైను తప్పించుకొనే ప్రయత్నంకొద్దీ చెడిపోయి నట్లుగా నటించి నీటి ఉపరిభాగానికి నూనెను పంపి ఉండవచ్చు. దానిని అంతమొందిం చేందుకూ, అది మునిగిపోయిందని నిర్ధారణ చేసుకొనేందుకు అకీమొవ్ హృదయ

పూర్వకంగా అక్కడ ఒక వారం వరకూ రక్షకుడుగా ఉండేందుకు సిద్ధపడేవాడే. కాని అతడు రక్షక నౌకలవద్దకు తిరిగి వచ్చి వేయవలసిందిగా ఆజ్ఞాపింపబడడంచే తాను ఆవిధంగానే వచ్చేశాడు, ఆ స్థలంలో మిగతా రెండు నౌకల్నీ గస్తీ తిరగడానికి వదలిపెట్టి. అతడు సబ్‌మెరైన్ని కనిపెట్టగలిగాడన్న భావనతో తనకు తాను ఉపశమనం చేసుకున్నాడు. తాను సకాలంలో చర్య తీసుకున్నందువల్లనే ఆ జర్మన్ సబ్‌మెరైను ప్రాణాపాయకమైన టార్పిడో బాంబు ప్రేల్చ లేకపోయిందని అతడు సంతృప్తిజెందాడు.

అకీమొవ్ ఆ వ్యాపారనౌకలవెంట మూర్‌మన్‌స్క్‌వరకు బందోబస్తుకు వెళ్లి తిరిగి యితర నౌకాదళాలతో రేవుకు వచ్చేశాడు. అతని నౌక బందోబస్తుకై వెళ్లి వచ్చిన యితర సబ్-ఛేసర్ నౌకలవద్దనే మామూలు లంగరుస్థలాలవద్ద కట్టివేయబడింది.

సరిగ్గా అప్పుడే ఆ అఖాతంలో అతివేగంగా నడిచే నౌకా తపాలా లాంచీ అగుపించింది. పచ్చరంగునుబట్టే దానిని గుర్తించవచ్చు. అది సబ్-ఛేసర్లకు సిగ్నలు యిచ్చింది: ''మీ కోసం ఉత్తరాలు తెచ్చాను. నేను ప్రక్కగా రావచ్చా?'' ఛేసర్ నౌకల నావికులంతా ఉత్తరాలకోసం డెక్కుమీదికి వచ్చారు. ఈలోగా అకీమొవ్ బదేయ్‌కిన్‌తో శత్రువుల సబ్‌మెరైన్‌తో సంభవించిన సాహసకృత్యాన్ని గురించి చెబుతున్నాడు. అతడు వివరాలనన్నిటినీ పూసగుచ్చి చెప్పాడు. అయినా అతని ధ్యానమంతా ఆ ఉత్తరాల సంచీమీదే కేంద్రీకరింపబడింది. తండేలు జిగాలొ ఉత్తరాలను పంచుతున్నాడు. వాటిల్లో కొన్ని పచ్చకవర్లు. మిగతావి కేవలం త్రికోణాకారంలో ఉన్న తెల్లవి. త్వరలోనే అన్నీ పంచబడి ఐదే మిగిలాయి. తర్వాత రెండు మిగిలాయి. చివరికి ఒకటి మిగిలింది. దానిని జిగాలొ అతని చేతుల్లో ఉంచాడు, పండ్లికిలిస్తూ. తర్వాత అతడు దానిని చించి చదవడం ప్రారంభించాడు.

''అంతే,'' అన్నాడు అకీమొవ్.

''బాగా చేశారు కమాండర్!'' అని బదేయ్‌కిన్ పెద్దగా అన్నాడు. ''భలే పని!'' అతని నయనాలు ఆనందంతో తళతళ మెరిశాయి.

## 2

ముచ్చి రంగుగల వెడల్పాటి మొహంతో, మిణకరిస్తూన్న హ్రస్వదృష్టి కళ్లతో ఒక సీనియర్ లెఫ్టినెంటు సబ్-ఛేసర్ నౌకపైకి వచ్చాడు. ''యుద్ధరంగంలోని పత్రికా విలేకరి కొవలేవ్‌స్కీని,'' అని అతడు అకీమొవ్‌తో అన్నాడు. తర్వాత అతడు తన

నోటుబుక్కును తీసుకొని వెంటనే జర్మన్ సబ్‌మెరైన్‌ను ముంచిన విషయం అడగడం ప్రారంభించాడు.

"అది మునగనే లేదు," అని అకీమొవ్ అన్నాడు విచారంగా.

కొవలేవ్‌స్కీ సంపూర్ణంగా చకితుడై బిక్కవోయిన మొహంతో బదేయ్‌కిన్ వంక చూశాడు. "మీరు చెప్పేది నాకర్థం కావడంలేదు," అని అతడన్నాడు. "వాళ్లు హెడ్ క్వార్టర్స్‌లో నాతో అన్నారు..."

"హెడ్‌క్వార్టర్స్ వారికి నిర్ధారణగా తెలియదు. ఒక్క జర్మన్లకు మాత్రమే తెలుసు," అని అకీమొవ్ ఛలోక్తి విసిరాడు.

కొవలేవ్‌స్కీను వదిలించుకోవడమంటే అంత తేలికైన వ్యవహారం కాదు. చివరికి అసలు జరిగిన సంగతంతా అకీమొవ్ అతనికి చెప్పవలసి వచ్చింది. అకీమొవ్‌నూ, పత్రికా విలేకరినీ కాబిన్‌లోకి తీసుకెళ్లాడు బదేయ్‌కిన్. అతడు అకీమొవ్ నమ్రతకు ఒప్పుకోలేదు. "వ్రాయండి. వ్రాయండి," అని పదేపదే అతనితో అన్నాడు.

ఇతరులను మాట్లాడించే ప్రజ్ఞ కొవలేవ్‌స్కీకు ఉంది. ముఖ్యంగా యిలాంటి కష్టమైన సందర్భాలలో అంటే వ్యక్తులు ఏ విషయాన్నీ చెప్ప నిరాకరించినప్పుడు, అతడు బాధపడుతున్నట్లూ, నిస్సహాయుడైనట్లూ నటిస్తాడు. దాంతో అవతల వ్యక్తి తాను తనకు తెలిసిన దానినంతా చెప్పకపోయినట్లైతే నేరం చేసినట్లౌతుందని ఎంచుతాడు.

కొవలేవ్‌స్కీకు సముద్రమన్నా, నావికులన్నా విపరీతమైన యిష్టం. తాను ఒక యుద్ధం చేసే ఆఫీసరు కాకుండా కేవలం ఒక పత్రికావిలేకరి అయినందుకు అతడు కొంతవరకు సిగ్గుపడతాడు కూడాను. అతడు మాస్కోలో సమాచారాలు సరిగా అందని ప్రజలతో మాట్లాడుతున్నప్పుడు తాను ఏదో ఒక నౌకలోని సిబ్బందిలో ఆఫీసర్ననే అభిప్రాయాన్ని వారిలో కలగజేయడానికి ప్రయత్నిస్తాడు. అలా చెప్పడానికి కారణం అతడు వాళ్లను మోసపుచ్చాలని కాదు. అందుకుభిన్నంగా అతడు చాలా విశ్వసనీయమైన మనిషి. కాని ఒక విధమైన ఆడంబరత్వంకొద్దీ అలా చెప్తాడు. అతడు పుట్టుకతోనే నావికుడనీ, కేవలం దురదృష్టంతో కూడిన పరిస్థితుల సముదాయమే అతనిని తీరంలో ఉండేట్టు శిక్షించాయనీ అతడు హృదయాంతరాళాలలో భావించేవాడు. అతనికి అన్ని రకాల నౌకాదళాలూ అన్ని తరగతులవీ తెలుసు. జర్మన్, బ్రిటిష్, అమెరికన్ యుద్ధ నౌకలూ, విమానవాహక నౌకలూ లేదా క్రూయిజర్లూ నిర్మాణమైనవీ మునిగిపోయినవీ

అన్నిటి లెక్క అతనికి కచ్చితంగా తెలుసు. ''బీమ్'', ''హల్'', ''కోమింగ్'' మొదలైన నౌకాపదజాలాన్ని ఉపయోగించకుండా అతడు సంభాషించేవాడు కాదు.

సబ్‌మెరైన్లు, టార్పిడో బోట్లు, డెస్ట్రాయర్లు మొదలైనవాటి గురించి యుద్ధగాథల్ని అతడు సేకరించాడు. ఏదో ఒక విధంగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ప్రతి ఉత్తర నౌకాదళ ఆఫీసరునూ లేదా నావికుణ్ణి అతడు చూసీ చూడ్డంతోనే గుర్తుపట్టగలడు.

''కాబట్టి ఇప్పుడు నేను మీతో పరిచయం చేసుకున్నట్టే,'' అని అతడు అకీమొవ్‌తో అన్నాడు. అతనితో కాసేపు ముచ్చటించుదామనుకున్నాడు కాని అకీమొవ్ ముఖభావాన్నీ పరుషత్వాన్నీ పరికించి కలవరపడ్డాడు. అంతేకాకుండా అతని మనస్సు ఎక్కడో దూరంలో విహరిస్తోందని గమనించగలిగాడు. నమస్కారం చెప్పి తీరానికి వెళ్లిపోయాడు.

''మీ మాటేమిటి?'' అని బదేయ్‌కిన్ అడిగాడు. ''మా యింటికి రండి. మీకోసం నూతన సంవత్సరాది కేక్ ఉంచాం.''

''బదేయ్‌కిన్, నిజంగా నేను రాలేను. క్షమించండి,'' అని అన్నాడు అకీమొవ్ ప్రక్కకి చూస్తూ. ''మిగునోవ్‌ను చూడ్డానికి వస్తానని వాగ్దానం చేశాను.''

ఒక్క క్షణంక్రితం అతనికి ఆ అభిప్రాయం లేకపోయినప్పటికీ అతడు నిజంగానే సబ్‌మెరైన్ మనుషులు నివసించే చోటికి, మిగునోవ్‌వద్దకు వెళ్లాడు.

గస్తీపై వెళ్లిన మిగునోవ్ సుమారు రెండు గంటలకిందటే తిరిగి వచ్చాడు. అతని సబ్‌మెరైను 'లేబెరెఖ్ట్ మాస్' అనే ఒక రకమైన జర్మన్ డెస్ట్రాయర్‌కి కొంత నష్టం కలుగచేసి, స్వయంగా కష్టాల్లో చిక్కుకుంది. మూడు శత్రువుల ముట్టడి నౌకలు దానిని సముద్రం లోతులకువేసే బాంబులతో ఎదుర్కొన్నాయి.

''మేం ఎలాగో తప్పించుకోగలిగాం,'' అని మిగునోవ్ అన్నాడు. ''వాళ్లు సరిగ్గా రెండు గంటలసేపు మావెంటబడ్డారు. దెబ్బతింటామేమోనని అనుకున్నాను. నావల కమాండరు స్వయంగా యిప్పుడే యింతకుముందు మమ్మల్ని చూడ్డానికి వచ్చాడు. 'డెస్ట్రాయరు మునిగిపోయిందని మన విమానాలు వర్తమానం అందిచ్చాయి,' అని ఆయన మాతో చెప్పాడు. అందుకు బహుమానాలు ఉంటాయి. పావెల్! నీవు వచ్చినందుకు నాకెంతో సంతోషంగా ఉంది. నీవు బదేయ్‌కిన్‌తో ఉండడంవల్ల నీనోరు చప్పబడిపోయి ఉంటుంది. నీకు హుషారు కలిగేందుకుగాను త్రాగుతాం పట్టు. నిజంగా నీ మోహం జైలు దర్వాజాలా ఉంది.''

''జర్మన్లు మంచి హుషారుగా వుండి వుంటారనుకుంటాను,'' అని అకీమొవ్ అన్నాడు. ''వాళ్లు సోవియట్ సబ్‌మెరైన్‌ను ముంచేశామనే అనుకుంటూ ఉంటారు. వాళ్ల హెడ్‌క్వార్టర్స్‌వాళ్లు మనల్ని గురించి రిపోర్టులు తయారు చేస్తుంటారనుకుంటాను. వాళ్ల పత్రికా విలేకరులు వ్యాసాలు వ్రాస్తుంటారనుకుంటాను...''

''ఇక్కడ మనమేమో ఎప్పుడూ లేనంతటి పండుగ చేసుకుంటున్నాం!'' అని మిగునోవ్ మధ్యలో అందుకున్నాడు. ఆ భావన నిజంగా తమాషాగా ఉందనే తోచింది.

తన మిత్రుల్ని పిలవడానికని అతడు వెళ్లాడు. బల్లపై అన్నీ త్వరత్వరగా సిద్ధమయ్యాయి. సబ్‌మెరైన్ మనుషులు తాజాగా అంతకుముందే జరిగిన సన్నివేశాన్ని గురించి తప్ప వేరే ఏ విషయాన్నీ మాట్లాడ్డం లేదు. సహజంగా వాళ్ల ప్రగల్భాలు చెప్పకోకుండా ఉండలేకపోయారు. జర్మన్లకు అత్యంత నష్టాన్ని కలిగించిన సబ్‌మెరైన్ నావికులు యుద్ధనౌకలలో చాలా ముఖ్యమైన మనుషులని అకీమొవ్‌ను ఒప్పించేందుకై ఒక నారరంగు జుట్టున్న లెఫ్టినెంట్ ప్రయత్నించాడు. అకీమొవ్ అలసిపోయాడు. అందుకు అభ్యంతరం పెట్టలేదు. కాని ఆ సబ్‌మెరైన్ మనుషుల్ని కొంత ఏడిపించాడు: ''మరి డెస్ట్రాయర్ల మాటో? అవి ఎందుకూ పనికి రావా?''

సబ్‌మెరైన్ కుర్రాళ్లు డెస్ట్రాయర్ల విషయంలో అభ్యంతరం చెప్పలేదు గాని అన్నిదళాలలోనూ సబ్‌మెరైన్‌లే ప్రథమ స్థానాన్ని అందుకుంటాయని యింకా పట్టు పట్టుకొని కూర్చున్నారు. అకీమొవ్ వాళ్లను కాదనలేదు కాని వెంటనే అడిగాడు: ''నౌకా విమానాల మాటో? అవి పనికిమాలినవా? ఏం?''

వాళ్లు విమానాలకు తగినస్థానమే యిచ్చారుగాని సబ్‌మెరైన్ల ప్రాముఖ్యతకు ఏమాత్రమూ భంగం కలుగనివ్వలేదు.

అకీమొవ్ బాగా త్రాగాడు. కాని అదేమంతగా అసరు కలిగించలేదు.

మిగునోవ్ తటాలున జాలిపడి ఆప్యాయంగా, మెచ్చుకుంటున్నట్టుగా చుట్టూ చూశాడు: ''మీరెంత మంచివాళ్లు, మీరంతా కూడాను! అతడా?'' అని పలికి అకీమొవ్ వైపు చూపించాడు. మళ్లీ అన్నాడు: ''అతడు నా ప్రాణస్నేహితుడు! మున్ముందు మీకు అతని ప్రతిభ చూపుతాడు! అతని సంగతి నాకు బాగా తెలుసు. పావెల్, నీవు అద్భుతమైన మనిషివోయ్! కాని నీలో ఒక్కటే లోటుంది – నీవు సబ్‌మెరైన్ మనిషివి కావు. పావెల్ అకీమొవ్‌ని అభినందిస్తూ త్రాగుదాం!''

వాళ్లంతా అతని టోస్ట్‌ను బలపరచారు. తర్వాత నౌకా క్లబ్బుకు వెళ్లడానికి నిశ్చయించారు.

ఉల్లాసంగా ఉన్న ఆ సముదాయమంతా కోట్లు తొడుక్కొని వెలుపలికి వెళ్లారు. దార్లో, ప్రక్కనే నడుస్తున్న మనిషిని గుర్తించలేనంతటి మంచు అణువులతో నిండిన మంచు మేఘంలో, ధ్రువ హిమవృష్టిలో వాళ్లు చిక్కుకున్నారు. ఒక మేఘం వేగంగా ఎగిరిపోతుంది. ఎక్కడా మంచు అనేది లేదనే అనుకుంటాం. తర్వాత హఠాత్తుగా మరో మేఘం వస్తుంది.

దూరంలో వాల్జ్ రాగం వినవస్తోంది. తన కందకపుబసలోనుంచి వెలుపలికి వినవస్తున్న సంగీతం ఆధారంగా ఆనాటి శరత్కాలపు చీకటిరాత్రి సమయంలో ఓర్ష వద్ద కొండలోయగుండా వస్తోన్న ఆనిచ్కాను అకీమొవ్ అకస్మాత్తుగా ఊహించాడు. తానే ఆనిచ్కా అయినట్టూ, వాల్జ్ సంగీతం వస్తున్న చోటికి ఆ ఉత్తరధ్రువపు రాత్రి పూట వెళ్తున్నట్టూ, అతడు బహుశ ఆమెకోసం నిరీక్షిస్తున్నట్టూ అకీమొవ్‌లో ఒక క్షణం సేపు విచిత్రమైన భావన కలిగింది.

ఆ చోద్యమైన భావన కరిగిపోయింది. తాను ప్రేమించిన పిల్ల తనకు చేరువుగా ఉన్నట్టు అతడిక అనుకోలేదు. అందుకు బదులు అతడు నిరాశతోన్నూ, తనను గురించీ ఆనిచ్కాను గురించీ అనుమానాలతోనూ నిండిపోయాడు. ఆనిచ్కా తనను మరచిపోయినట్టూ, తాను విపరీతమైన దురదృష్టానికి బలి అయినట్టూ అతడు నమ్మాడు. అందుకు కారణం ఏమిటా అని అతడు ఊహించడానికి స్వాభావికంగా ప్రయత్నించాడు. మరోవిధంగా జరుగుతుందని అనుకోరాదు. ఆమె తనను ఎల్లప్పుడూ స్మృతిపథంలో ఉంచుకుంటుందనీ, తనను నిరంతరం ప్రేమిస్తుందనీ అతడు ఒకప్పుడు తలపోశాడు; సూర్యకిరణాలను గాజుకూజాలో బంధించగలిగాం అని వాదించిన పూర్వపు రసవాదులు భ్రమపడ్డట్టు అది అతని తెలివి తక్కువ భ్రమే.

ఆమె అకీమొవ్‌ను అంత త్వరగా ప్రేమించ గలిగినప్పుడు మరొకడ్ని ప్రేమించడంలో ఆమెకు ఏం అడ్డు?

అక్కడ అనేకమంది నీటైన కుర్రాళ్లు కొల్లలుగా ఉన్నారు. ఉదాహరణకి కొత్తగా వచ్చిన మొదటి బటాలియన్ కమాండరు చెర్‌నీహ్‌ను తీసుకోండి. అక్కడి వాళ్లందరికి అతనంటే యిష్టం. ఆఫీసర్లకు కూడానూ గొలొవీన్‌కు కూడ. చెర్‌నీహ్ అందంగా, ప్రశాంతతతో, ఎవరితోనూ ఎక్కువ చనవుగా ఉండకుండా ఉంటాడు. అతని కదలి

కలలో చమత్కారం, చురుకుదనం ఉట్టిపడుతాయి, తనవలె అసహ్యంగానూ, అజాగ్రత్తగానూ ఉండకుండా. ఈ విషయాన్ని గురించి అకీమొవ్ ఎంత ఆలోచిస్తే అంత ఎక్కువగా కాప్టెన్ చెర్నీహ్ మాత్రమే అనిచ్కా ప్రేమకు అర్హుడని అతనికి అనిపించింది.

''అయినా మేం యింకా భార్యాభర్తలమే,'' అని అతడు కోపంగా వాదించుకున్నాడు. కాని తర్వాత ఆ భావన కలిగినందుకు నవ్వుకున్నాడు. ఎక్కడో దాదాపుగా ప్రపంచానికి ఆవలవైపున అనిచ్కా పేరూ, తన పేరూ ఒక పెద్ద కచ్చేరి పుస్తకంలో పక్కసక్కనే వ్రాసి వున్నందువల్ల ఏం ప్రయోజనం? ఆ రెండు పేర్లను వ్రాసేప్పుడు కొద్దిగా వణికినట్టి, ముక్కుకు కళ్లద్దాలున్న ఆ మధ్యవయస్కురాలు ఏం చేయగలుగుతుంది?

విచారంతో కుంగిపోయినట్లుగా భావించాడు అకీమొవ్. పండ్లు బిగించి, వడగళ్ల వానలాగా తన మొహాన్ని సూదులవలే పొడుస్తూన్న ఆ గాలితోనూ మంచుతోనూ నెమ్మదిగా అన్నాడు: ''గట్టిగా ఇంకా గట్టిగా! బుద్ధిలేనివాడికి నాలుగు తగిలించడమే మంచిది! గట్టిగా కొట్టు!''

తర్వాత తాను ఎటువంటి నిర్జీవమైన స్థితిలో ఉన్నదీ అకీమొవ్ గ్రహించాడు. అది అతడు అలసిపోవడంవల్లా, వొడ్కా ప్రభావంవల్లనే ఆవిధంగా అయ్యాడని మామూలు ధోరణిలో తలపోసి త్వరలోనే శక్తిని పుంజకున్నాడు.

''అక్కడ నువ్వెలా ఉన్నావ్?'' అని అతడు మిగునోవ్‌నుద్దేశిస్తూ అరిచాడు. ''ఇంకా బతికే ఉన్నావా?''

''ఆ. బతికే ఉన్నా!'' అని మిగునోవ్ తిరిగి అరిచాడు. అతని కంఠధ్వని, వారి చుట్టూ గడ్డకట్టుకుపోయిన మంచు కీచుశబ్దంలోనూ గాలిహోరులోనూ లీనమై పోయింది.

''నువ్వు ఎందుకు మాట్లాడ్డం లేదా అని ఆశ్చర్యపోతున్నాను. మౌనంగా ఉండడం నీకు సరిపడదు. పాట మాట ఏమంటావ్?''

''ఎవరైనా కొంతమంది సీనియర్ ఆఫీసర్లు వింటారనుకో! మనం త్రాగామని అనుకుంటారు.''

''మనకు మత్తెక్కలేదనే అనుకుంటున్నావా? నిజంగానే మనం త్రాగాం! మనం మన సీనియర్లను మోసం చేయకూడదు...''

వాళ్లంత పెద్దగా నవ్వారు. వాల్జ్ సంగీతందగ్గరగా వినవస్తోంది. అప్పుడే కురిసిన మంచుతో కప్పబడ్డ మెట్లున్న ఒక పెద్ద భవనం కనిపిస్తోంది. ఆ మెట్లమీద చెదిరిపోకుండా వున్న ఆ మంచు ఉపరిభాగాన్ని చూస్తే అక్కడ యిప్పుడెవరూ ఉండడం లేదని ఎవరికైనా అనిపిస్తుంది.

కాని దానినిండా జనం ఉన్నారు. మెత్తని తివాచీలూ గోడకు తాచిన పలకలూ ప్రశాంతంగా సమంగా వెలుగుతున్న విద్యుద్దీపాలలో మెరిసిపోతున్నాయి. అక్కడ కేవలం నౌకాదళం, నౌకావిమానదళం ఆఫీసర్లే కాకుండా అనేకమంది ఆడవాళ్లు, డాక్టర్లు, రవాణా సిబ్బంది మనుషులూ, ఆఫీసర్ల భార్యలూ ఉన్నారు. ఆడవాళ్లు గోడకు ప్రక్కగా ఒక జట్టుగా కూర్చున్నారు. వాళ్లల్లో చాలామంది సాయంత్రపు పట్టుదుస్తులు తొడుక్కున్నారు. కొందరు మరీ పొగడుతున్నట్లుగా కాకుండా ఏదో గుసగుసలాడినప్పుడు మిగతా వాళ్లంతా ముసిముసి నవ్వులు నవ్వారు. మొత్తం దృశ్యమంతా, ఎక్కడో దక్షిణప్రాంతంలో, శాంతి సమయంలో ఉన్న నౌకాదళం క్లబ్బు మాదిరిగా ఉంది.

నృత్యం మళ్లీ ప్రారంభమైంది. నేలపై తేలిపోతున్న అందమైన కాళ్లచుట్టూ ఆ పొడుగాటి దుస్తులు గిరగిరా తిరిగాయి. తప్పని సరిగా కర్తవ్యాన్ని నిర్వహిస్తున్న వ్యక్తి మాదిరిగా బిగతీసుకున్న ముఖవర్చస్సుతో కొందరు నావికులు తమతో నృత్యం చేస్తున్న స్త్రీలను గిరగిరా గుండ్రంగా త్రిప్పారు. ఒక్కొక్కప్పుడు మామూలుగాకంటే మరికొంత ఎక్కువగా త్రాగి ధగధగా మెరిసే మొహం వేగంగా కాంతివంతమైంది. గంభీరంగా ఉండేందుకై మానవాతీతమైన ప్రయత్నాలు చేసింది. కాని దానికళ్లు ప్రేక్షకులలో ఎవరినో చూసేప్పటికి సగం క్షమాపణకోరకుంటున్నట్టుగా, సగం వెక్కిరిస్తున్నట్టుగా అయిపోయాయి. "నిజంగా అది అవివేకమే. కాని ఏం చేయగలవు, నాయనా?" అని అంటున్నట్లనిపించింది.

ప్రతీదీ శాంతి సమయంలో ఉన్నట్టే ఉండేదే, డ్యూటీ ఆఫీసరు గనక అప్పుడప్పుడు గుమ్మంవద్దకు వచ్చి నిష్పక్షపాతంగల మొహాన్ని చూపించి ఫలానా లెఫ్టినెంట్ తన నౌకవద్దకు వెళ్లాలి, మరో ఫలానా కమాండరు కమాండింగ్ ఆఫీసరువద్ద హజరుకావాలి, ఫలానాఫలానా నౌకా సర్జన్ జబ్బుగా ఉన్నవారివద్దకు వెళ్లాలి, లేదా మొత్తం నావికులు కూడా తమ నౌకలు లేదా సబ్‌మెరైన్లవద్ద హాజరుకావాలి అని అధికారపూర్వకంగా పొంకంగా ఆజ్ఞాపించకపోయినట్లైతే. ఒక్కొక్కప్పుడు ఆ హాలంతా సగంఖాళీ అయిపోయేట్టుగా చాలా మందినే పిలిచేవాడు. నృత్యపాదం పూర్తి కాకుండా మధ్యలోనే

ఉన్నప్పుడు ఆ పిలవబడ్డవారు తమతో నృత్యం చేసే ఆడవాళ్లను వదలిపెట్టి మరుక్ష ణానే అదృశ్యమైపోయారు. ఆడవాళ్ళు అలాగే ఒక్కక్షణం నిలబడిపోయారు, వాళ్ల చేతులు మగవారి భుజాలు ఎక్కడైతే ఉండేవో సరిగా అక్కడే ఉండిపోయి. వాళ్ల మొహాలలో అలసటచేతనూ, కొద్దిగా మైకంతోనూ నిండిన నవ్వు యింకా తారట్లాడు తూనే ఉంది. అప్పుడు వాళ్లు గోడకుదగ్గరగా ఉన్న తమ స్థానాలలోకి వినయంగా జారు కున్నారు. గాలిహోరు, అలలఘోషలే కాకుండా యింకా ఏమైనా వినవచ్చునని వెలుపలనుండి వస్తూన్న ధ్వనులకు చెవిదొగ్గారు.

ఈ దృశ్యాన్ని చూస్తున్నప్పుడు అకీమొవ్‌కు అకస్మాత్తుగా ఆశ్చర్యాన్ని గొలిపే భావన తట్టింది. "బహుశ ఆనిచ్క చనిపోయిందో, లేదా గాయపడిందో?" ఇదివరలో యీ భావన తనకు తట్టనందుకు విచిత్రమనిపించింది. ఈ విషయాన్ని తానెందుకు పట్టించుకోలేదో ఊహించ లేకపోయాడు. ఇతర విషయాలన్నింటినీ అతడు ఆలోచించాడే గాని ఆనిచ్కకు ఏమైనా జరుగుతుందేమోనని ఎన్నడూ కలలో కూడా అనుకోలేదు. "అలా జరగడం అసంభవం," అని అతడు తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు. "గొలా వీన్ నాకు తెలిపి ఉండేవాడే." తానెంత నిస్సహాయ పరిస్థితిలో ఉన్నదీ ఊహించుకొని వణికిపోయాడు అకీమొవ్. అతడు చేయగలిగింది ఏమి లేదు — అతడు ఆమెవద్దకు వెళ్లడంగానీ లేదా ఆమెను తనదగ్గరకు పిలిపించడంగానీ, ఆఖరికి ఒక టెలిగ్రాంనైనా పంపించడంగాని చేయలేదు.

అతని విషాద భావపరంపరలకు అంతరాయం కలిగించాడు మిగునోవ్. ఆ అజే యుడైన సబ్‌మెరైన్ ఆఫీసరు తానిక నృత్యం చేయలేనన్నంతవరకు మెడికల్ సర్వీసులో ఉన్న ఒక చక్కని అమ్మాయితో నృత్యం చేశాడు. అతడిప్పుడు అకీమొవ్‌వద్దకు వచ్చాడు. అతని చెవిలో ఊదాడు: "పావెల్, మనం వాళ్ళవద్దకు వెళ్దాంపద. అక్కడ దివ్యమైన పిల్లలు ఉన్నారు."

అకీమొవ్ తలపంకించి గ్రంథాలయానికి వెళ్లాడు. అక్కడ జనం నిండిపోయి వున్నా ప్రశాంతంగా ఉంది. అతడు వార్తాపత్రిక చదివాడు. ఆ తర్వాత అనిచ్కకు ఉత్తరం వ్రాయడానికి నిశ్చయించుకున్నాడు.

"ప్రియ ఆనిచ్క, సమాధానం వస్తుందనే ఆశ లేకపోయినా నేను మళ్లీ వ్రాస్తున్నా. నీకు ఉత్తరాలు వ్రాయడం నేనెప్పుడో మానుకొని ఉండాల్సింది. కాని ప్రతి రోజూ, నాకు ఒక్క నిముషం సమయం చిక్కిన వెంటనే, నీకు వ్రాయక తప్పడం లేదు.

నీవు నాదగ్గర లేకపోవడం నాకెంతో విచారంగా ఉంది. నిజం చెప్పాలంటే, ఒంటరిగా ఒక్క రోజైనా గడపలేనంత ఎక్కువగా ఒక వ్యక్తి మరొక వ్యక్తిని ప్రేమించ గలుగుతాడనేది నేనెన్నడూ నమ్మలేదు. నీకు ఏ కాస్త అభిరుచిని కలిగించే విషయాన్నైనా మళ్లీ నీకు చెప్పగలిగేందుకు నేను చూసిన ప్రతి విషయాన్నీ జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నం చేస్తున్నా. ఇదివరకెన్నడూ నాకిలా అనుపించలేదు. నన్ను నేను అర్థంచేసుకొనేందుకు, నా భావాలను నా చర్యల లోతులను తరచేందుకు నేనిదివరకెన్నడూ చేయనంతటి ప్రయత్నం చేస్తున్నాను. ఒక తెలివైన భావం నాకు తట్టినప్పుడు — అప్పుడప్పుడు అలాంటివి వస్తుంటాయిలే — దానిని మరచిపోకుండా ఉండేందుకు ప్రయత్నిస్తాను. ఎందువల్లనంటే, మనం ఒకరినొకరం కలుసుకున్నప్పుడు ఆ భావన నాకప్పుడే తట్టినట్టు నీకు చెప్పవచ్చుననే, నీభర్త ఎంత తెలివైనవాడో నీకు తెలుపవచ్చుననే. ఇదంతా నేనెందుకు వ్రాస్తున్నానో నాకే తెలియదు. బహుశా నువ్వు నవ్వుకోవచ్చు. నేనొకప్పుడు, నీవు నన్ను ఎలా ప్రేమించగలిగావా అనేది అర్థం చేసుకోలేకపోయాను. కాని యిప్పుడు నీవు నన్నెలా మరచిపోగలిగావో అర్థంచేసుకోలేకుండా ఉన్నాను.''

అతడు ఉత్తరాన్ని పూర్తి చేసిన తర్వాత వెళ్లడానికి లేచాడు. హాల్లో డ్యూటీ ఆఫీసరు: ''కమాండర్ అకీమొవ్, హెడ్క్వార్టర్స్‌లో హాజరుకావలసింది,'' అని ఖచ్చితంగా చెబుతున్న మాటల్ని అతడు విన్నాడు.

మొదట తన పేరేగల మరో ఆఫీసరు ఉన్నాడేమోనని అకీమొవ్ అనుకున్నాడు. ఎందువల్లనంటే తనను చూడాలనుకొనే వ్యక్తి ఎవరూ ఉండరనే అతడు ఊహించాడు. అప్పుడతను మిగునోవ్ తనవద్దకు పరుగున రావడం గమనించాడు.

''వాళ్లు నిన్ను పిలుస్తున్నారు. నీకు దారి తెలియకపోతే నేను నిన్ను తీసుకు వెళ్తాను. రా,''అని మిగునోవ్ గబగబా అన్నాడు.

తన స్నేహితుని ఆప్యాయతకు అకీమొవ్ ఆనందించాడు. ఒక స్నేహితుడికోసం అతడు నృత్యాన్నీ తన వాల్యనీ వదులుకొని రావడం అంటే సామాన్యమైన విషయంకాదని ఎంచాడు.

''ఏం ఫరవా లేదులేవోయ్. నేను ఎలాగో వెళ్తాలే. నువ్వెళ్లి నృత్యం చేయి,''అని అతడన్నాడు.

అతడు మిగునోవ్‌ను నృత్యం జరుగుతున్న హాల్లోకి నెట్టాడు. కోటు తొడుక్కొని వెలుపలి చీకట్లోకి వెళ్లాడు. అక్కడ గాలి యింకా హోరుమని శబ్దం చేస్తూనే ఉంది.

పిలిచింది అతనినేనని తేలింది. రియర్-అడ్మిరల్‌ను అతడు కలసుకున్నాడు. బదేయ్‌కిన్ నాయకత్వంకింద వున్న సబ్‌మెరైన్ ఛేసర్‌కంటే పెద్దదీ, ఆయుధబలం కలదీ అయిన ఒక సబ్‌మెరైన్ ఛేసర్ నౌకకు అకీమొవ్‌ను కమాండర్‌గా చేస్తూ ఆయన ఒక కొత్త ఉద్యోగం యిచ్చాడు.

అతడు బదేయ్‌కిన్‌ను తలచుకోగానే కొంత చిన్నతన మనిపించింది. తన అర్హత కంటే మించిన ఉద్యోగానికి తనను తరక్కీ చేస్తున్నట్లూ, బదేయ్‌కిన్‌ను ఉపేక్షిస్తున్నట్లూ అతనికనిపించింది. అతడా విధంగా ధైర్యంచేసి చెప్పాడు కూడా, కాని అందుకా రియర్-అడ్మిరల్ కటువుగా సమాధానం చెప్పాడు: ''మాకు నీకంటే బాగా తెలుసు.''

ఆ తర్వాత అకీమొవ్, బదేయ్‌కిన్ నౌక కట్టివున్న వారథికంబాన్ని సమీపిస్తున్నప్పుడు, దానిని విడిచిపెట్టడం తనకు ఎంత కష్టమో అతడు గ్రహించగలిగాడు. ఆ సబ్-ఛేసర్‌నుండి జిగాలొ బొంగురు గొంతును కషెవారొవ్ పాటను అతడు వినగలిగాడు.

''మా గర్విష్ఠ వర్యాగ్ శత్రువుకెన్నడూ లొంగదు,'' అని ఆ పాట అర్థం. పేరు కూడా లేకుండా కేవలం సంఖ్య మాత్రమే కలిగిన ఆ చిన్న నౌకను ''గర్విష్ఠ వర్యాగ్'' అని పిలవడం, పెద్దపెద్ద మాటల్ని ఉపయోగించడమే అయినప్పటికీ ఆ క్షణంలో అది అకీమొవ్‌లో ఏవిధమైన వ్యంగ్య భావననూ కలిగించలేదు: అంతేకాకుండా ఆ పాట ఆ సబ్-ఛేసరుకూ, దాని కమాండరుకూ సరిపోయినటువంటిదేనని అతడు భావించాడు.

అతడు ''తనది'' అనుకున్న నౌక చార్జ్ తీసుకొని బదేయ్‌కిన్‌కు వీడ్కోలు చెప్పేందుకని వెళ్లాడు. కాని ఆలోపుగానే బదేయ్‌కిన్ నౌక సముద్రంలోకి వెళ్లిపోయింది. ఆ కొండమీది చిన్న యింట్లో ఎవరూ లేరు. తాళం చెవి ఎప్పటి స్థానంలోనే ఉండడం అకీమొవ్ గమనించాడు. అతడు తన వస్తువుల్ని సర్దుకొని తలుపుతాళం వేసి, ఆ తాళం చెవిని యథాస్థానంలో ఉంచి వెలుపలికి వచ్చాడు. అతడు వెళ్లిపోతూ ఆ కిటికీలోని పూల వైపు వీడ్కోలు వీక్షణంతో చూసి పెద్దగా అన్నాడు: ''సెలవు, బదేయ్‌కిన్. సెలవు, నీనా.'' తర్వాత తన నౌకవద్దకు వెళ్లాడు.

''అటెన్షన్!'' అని ఎవరో కేకవేశారు, నూతన కమాండరు నౌకమీదికి వస్తుండగా. నావికులంతా కదలిక లేకుండా నిలబడ్డారు. అకీమొవ్ వాళ్లందరినీ పరికించాడు. ఆ తర్వాత సోవియట్ నౌకాపతాకానికీ తన నావికులకూ సైనిక వందనం చేశాడు.

తన వ్యక్తిగత విచారాలూ, ఆశలూ, అన్నీ గతంలోనివి అని భావించాడు. అతడు ఆ అఖాతంలోని కారునలుపు నీళ్లను చూసినప్పుడు ఇప్పుడతనికి ఎంతో ముచ్చటగా ఉన్న తన ఆనందదాయకమైన కలలకు స్వస్తి చెప్పాడు. అతడు: "విశ్రాంతిగా నిలబడండి," అని ఆజ్ఞాపించి 'బ్రిడ్జి'మీదికి వెళ్లాడు.

## 3

ఆనిచ్కా జీవితంలో అకస్మాత్తుగా గొప్ప మార్పులు రావడంచే ఆమె అకీమొవ్ ఉత్తరాలకు సమాధానం వ్రాయలేకపోయింది. అంతే కాకుండా ఆమె యిక రెజిమెంటులో లేనందువల్ల ఆఖరికి సైన్యంలో కూడా లేని కారణంచేత అతని అడ్రసు ఆమె వద్ద లేకపోయింది. కాప్టెన్ చెర్నీహ్‌తో ఆమెకు పరిచయమే లేదు. బహుశ అతని పేరు కూడా ఆమెకు జ్ఞాపకం ఉండి ఉండదు. అతడెలా ఉంటాడో కూడా తెలియదు. అలాంటి మనిషి విషయంలో, తనకు ఏమీ సంబంధంలేని వ్యక్తి విషయంలో అకీమొవ్ ఈర్ష్యతో ఉన్నాడన్న సంగతి ఆమెకు తెలిస్తే నిర్ఘాంతపోయి ఉండేది.

అకీమొవ్ వెళ్లిపోయిన రెండు వారాలలోపునే బొలొగోయె ప్రాంతంలో రెజిమెంటు పునర్నిర్మాణమయింది. అప్పటికి ఆమెకు అకీమొవ్ మాస్కోనుండి పంపిన రెండు ఉత్తరాలూ అందాయి. అతని మాస్కో నౌకాడిపో చిరునామా తాత్కాలికమైంది కనుక ఆమె సమాధానం వ్రాయ లేకపోయింది. అతడు శాశ్వత చిరునామా తెలిపేంతవరకు ఉత్తరం వ్రాయవద్దని అతడే ఆమెకు సలహా యిచ్చాడు.

రెజిమెంటును సిద్ధంగా ఉండమని నవంబరు ఒకటవ తేదీన ఆజ్ఞ అయింది. దానిని యితర రెజిమెంట్లతో సహా రైలుమీద దక్షిణానికి వెంటనే పంపారు. ఆ రైలు ఇంచుమించు ఎక్కడా ఆగకుండా హుటాహుటిని ముందొక ఇంజనూ వెనుక ఒక ఇంజనూ తగిలించుకుని ఏకాయకీని దక్షిణదిశగా వెళ్లిపోయింది. యుక్రేనియా రాజధానియైన కీయెవ్ వద్ద నవంబరు మూడవ తేదీన ఆ రెజిమెంటును రైలునుండి దింపేశారు. అక్కడ్నుండి డివిజనూ, యింకా ఇతరులు అనేకులూ కలిసి పశ్చిమానికి వెళ్లి, కీయెవ్‌ను విడిపించడానికై ఆజ్ఞాపింపబడిన మొదటి యుక్రేనియన్ సైన్యంతో కలిశాయి.

---

ఒక బ్రహ్మాండమైన ఊపులో జరిగే యుద్ధాల ప్రారంభం ముందు సర్వత్రా వుండే ఉద్రిక్తతా నిరీక్షణలను సంగ్రామం మొట్టమొదటినుంచీ ఎవరైనా గమనించ

వచ్చు. విమానాలు నడినెత్తినే యుద్ధం చేస్తున్నట్లనుపిస్తుంది. ఎందువల్లనంటే శత్రువుల విమానదళాలు బాంబులు, మెషీన్‌గన్ ప్రయోగాలతో మన సైన్యాలను భయకంపితంచేసి వాటి దాడి సార్థకతనూ స్థిరత్వాన్నీ నడలింప జేసేందుకై యత్నం చేస్తున్నాయి. శరత్కాలపు వర్షాలు మార్గాలను పూర్తిగా నడవడానికి వీల్లేకుండా చేశాయనే చెప్పొచ్చు. తరచూ మనుషులు పట్టుకొని నెట్టితేనేగాని బురదలో చిక్కుకున్న బండ్లు బయట పడడం లేదు. సైన్యం వెనుకభాగంలో ఉన్న ఆఫీసర్లలోనూ యితర వ్యక్తులలోనూ చురుకుదనం, విశ్రాంతి ప్రాంతంనుండి దూరమవుతూన్నకొద్దీ తృప్తి క్రమక్రమేణా అంతరించిపోవడం గుర్రంమీద వస్తూన్న గొలొవీన్‌కు దిగులుగొలిపింది.

అయినా మేం పురోగమనంలో వున్నాం. రోడ్లు ఎంత చెడ్డగా ఉన్నా, భయం ఎంత దిగజారకున్నా, మన బలీయమైన సైనిక వాహినినీ దాని సన్నాహాలనూ, దెబ్బతిని రోడ్డుప్రక్క వదలివేయబడి యింకా కాలుతూనే ఉన్న అనేక జర్మన్ టాంకులనూ, శకటాలనూ చూసినప్పుడు మాకు మంచి ధైర్యం కలుగుతోంది.

రెజిమెంటు ద్నేపెర్ నదిని సమీపించింది. విపరీతంగా బాంబులు పడుతున్నప్పుడు, ఫిరంగుల బొంబార్డుమెంటు జరుగుతున్నప్పుడు నదిని దాటడం ప్రారంభమైంది. అవతలి గట్టున ఎత్తైన కొండలు శరత్కాలపు ఆకుల పసుపురంగుతోనూ దగ్ధమైపోయిన కీయెవ్ పట్టణం భవనాల నల్లరంగుతోనూ ఉన్నాయి.

చెవులు చిల్లులుపడే రణరంగ ధ్వానంగానీ, ఉద్రేకంకొద్దీ అరిచే అనేక వేల మంది అరుపులుగానీ విస్మయం గొలిపే ఆనిచ్కా ప్రశాంతతను తొణికించ లేకపోయాయి. ఆమె చుట్టూ ఉన్నవాళ్లందరికీ ఆమె ధోరణి ఉత్తేజాన్ని కలిగించింది. వేగంగా వెళ్తోన్న కవచదళాలు, తెరచుకున్న టాంకుల పైభాగంలో నిలబడ్డవాళ్లూ ఆమెవైపు చేతులు ఊపుతూ ఆ నది అవతలి గట్టున వున్న కోపోద్రిక్త నరకంలోకి అంతర్ధాన మయ్యేవరకూ ఆమెవైపే వెనక్కి తిరిగి చూశారు. ఒక ఆడపిల్ల కమోఫ్లేజ్ జుబ్బాలు ధరించిన ఒక డజను మంది రికన్నాయ్‌సెన్స్ మనుషులముందు నడవడం ఎంతో ఆశ్చర్యకరంగా ఉంది. ఇతర డివిజన్లనుండి వెళ్తోన్న సైనికులు స్నేహభావంతోనూ, ఒక్కొక్కప్పుడు రెండర్థాలతోనూ అరిచారు, విమర్శిస్తూ. రికన్నాయ్‌సెన్స్ మనుషులు వారి విమర్శల్ని ఘోరంగా నోరు మూయించారు: ''ఇహ చాలించండి! మీ మొహాలని చితక కొట్టక ముందే వెళ్లండి!''

ఆ బెదిరింపు ఫలితం వెంటనే అగుపించింది: ఆ పిల్లయెడల రికన్నాయిసెన్స్ మనుషులకు ఉన్న గౌరవం, ఆమెను సమర్థించేందుకై వారికున్న పట్టుదలను ఆ సైనికులు ఆశ్చర్యంతో గమనించి అడుగులు త్వరత్వరగా వేశారు.

ఎక్కడా ఆగకుండా ఫిరంగులు మేఘగర్జనల్లాగా మ్రోగాయి. ఎర్రనక్షత్రాల విమానాలు అవతలి గట్టున అన్నివైపులనుండీ అకస్మాత్తుగా వచ్చి బాంబులు వేసి తిరిగి వెనక్కి ఎగిరిపోయాయి. ఆ మర్నాడు పవిత్రమైన దినం — అక్టోబర్ విప్లవంయొక్క ఇరవై ఆరవ వార్షికోత్సవం — ఈ పరిస్థితి కీయెవ్ యుద్ధానికి మరింత ప్రాముఖ్యతను, భక్తిపూర్వకమైన భయోత్సాహాలను కలుగజేసింది.

నదిని దాటుతున్నప్పుడు ఆనిచ్కాకు హఠాత్తుగా అస్వస్థత కలిగింది. ఆమె మొహం వెలవెలపోయింది. కళ్లు తిరుగుతున్నట్లైంది. మొదట ఆమె దీనినంత ఎక్కువగా లెక్కించ లేదు. ఆ దాడివంతెనమీద వేలాది మనుషుల ముఖాలపై నిరంతరం తారాడుతోన్న మృత్యుభయం కొద్దీ బహుశ ఆవిధంగా జరిగి ఉంటుందని ఆమె అనుకుంది. కాని కీయెవ్ యుద్ధానంతరం కొద్దిరోజుల్లోనే అలా జరగడానికి కారణం ఏమిటో ఆమె ఆకస్మికంగా గ్రహించగలిగి భయపడిపోయింది.

ఆమె సంపూర్ణంగా చకితురాలైందని చెప్పడం చిత్రమే అనుపిస్తుంది. ఆమె యిక యితరులవలె తెలివితక్కువది కాకపోయినా, అక్టోబరు రైల్వేలైనుమీది బొలొగోయె స్టేషన్ సమీపంలోని చిన్న గ్రామంలో తాను ప్రేమించిన వ్యక్తితో గడిపిన కొద్ది రాత్రిళ్లూ, తనకు సంపూర్ణానందాన్నీ బాధనీ కూడా కలిగించిన రాత్రులూ తనలో ఒక నూతన జీవిని అంకురింపచేయడానికి కారణభూత మౌతాయనడం విపరీతమూ అవివేకమూ అనే విషయం అలా వుండగా, ఆమెకు అంతా అగమ్యగోచరంగా కనిపించింది. ఆమె కొంత అలక్ష్యంగా మాట్లాడే ధోరణిని అవలంబించింది: శిశువు జన్మించినప్పుడు ఆ బిడ్డను తన మేనత్త నాద్యవద్ద వదలి తిరిగి సైన్యంలోకి వెళ్లిపోదామని భావించింది. కాని అలా చేయడం అర్థంలేని పని, అని ఆమె గ్రహించింది. ఆ బిడ్డకు పాలివ్వడం, పెంచి విద్యావంతం చేయడం అవసరంగాబట్టి ఆమె ఆ పాపను ఎవరివద్ద విడిచిపెట్టలేదు. ఆ పాప ఏవిధమైన ఆటవస్తువూ కాదు. ఆ బిడ్డ మానవమాత్రురాలు. అది ఆమె బిడ్డ. "నా పాప," అని ఆమె పదేపదే తనలో తాను అనుకుంటూ నమ్మడానికి వీల్లేనంతగా నవ్వింది. అంతత్వరలో అది ఎలా సంభవించగలిగిందా అని ఆమె అపారమైన అమాయకత్వంతో ఆశ్చర్యపడింది, బహుశ స్పష్టంగా అర్థమౌతున్నప్పటికీ.

సైనికులతోనూ శకటాలతోనూ క్రిక్కిరిసి ఉన్న యుద్ధరంగానికి ఆమె రిక న్నాయ్‌సెన్స్ మనుషులతో వెళ్తున్నప్పుడు డోకులను ఆపుకోగలిగింది. తన ఉద్రేకాన్ని కూడా అదుపులో ఉంచుకోగలిగింది. ఆమె అనుక్షణం తనను గురించే ఆలోచిస్తోంది. ఆమె ఏమేం చేయగలుగుతుందనుకుంటామో అవన్నీ చేసింది. కాని అమె తన చుట్టూ ఉన్న మనుషుల్ని చూసినప్పుడు, ఏదో అగోచరమైన తన ప్రస్తుతస్థితి ఫలితంగా, అంటే తన మాతృత్వస్థితి ఫలితంగా ఏర్పడిన అసాధ్యమైన అడ్డంకిచే ఆమె ఆ ప్రపంచానికే దూరంగా ఉన్నట్టు ఎలాగో భావించింది. ఏదో గతానికి చెందినట్టుగా, ఎంతో దూరంలోనుంచి చూస్తున్నట్టుగా ఆమె వారివైపు చూసింది. ఆమెకు యిదివరలో ఉన్న అన్ని అభిరుచుల స్థానే ఒక కొత్త అభిరుచి ఆమెలో బలవంతంగా చొరబడింది. ఎవరి జీవితం విశాలమైన ఆశయాలతోనూ, అతిముఖ్యమైన చింతలతోనూ ఉంటుందో వారికంటే తక్కువ స్థాయిలోనే తనలో దాచుకొన్న రహస్యం తనను దిగలాగేసినట్టుగా ఆమె భావించింది.

తనకు కేటాయించిన గుడిసెలోనో లేదా గుడారంలోనో పడుకున్నప్పుడు ఆమెకు రాత్రంతా నిద్రపట్టలేదు. యుద్ధాన్ని గురించీ, విజయాన్ని గురించీ మాట్లాడు కొంటున్న సైనికుల సంభాషణల్ని ఆమె వింటోంది. ఆ విషయాలు ప్రతి వానికీ ఎంతో ముఖ్యమైనవైనప్పటికీ ఆమెకు అవి అంతప్రధానమైనవిగా గోచరించడం లేదని ఆమె గ్రహించినట్లైతే తప్పక దుఃఖించి ఉండేది.

తనకు సంభవించిన విషయాన్ని తెలపడమా, లేక వేరే చెప్పకుండానే తన స్థితి దానంతటికదే తెలిపేంతవరకూ కాలాన్ని గడపడమా అనేది ఆమె గట్టిగా నిశ్చయించుకో లేకపోయింది.

తన గర్భంలో పెరుగుతోన్న బిడ్డ అంటే ఆమెకు ఒక విచిత్రమైన ఆత్రతతో కూడిన కరుణ కలగడం త్వరలోనే ప్రారంభమై ఆమెలో జాగ్రుతిని కలిగించింది. తాను వేస్తున్న ప్రతి అడుగూ నెమ్మదిగానూ ఆలోచన పూర్వకంగానూ వేయడం జరుగుతోంది. ఇది ఆమెను మరింత అసౌఖ్య పరచింది. ఆమె ఆఖరికి గుర్రపుస్వారీని కూడా నిరాకరిం చింది. ఇదివరలో ఆమెకు గుర్రపుస్వారీకి మించిన ఆనందం వేరే లేదు. అంచేతనే ప్రతి వ్యక్తికీ ఎంతో ఆశ్చర్యం కలిగింది.

కోహాస్తైన్ కొరకు యుద్ధం చేస్తున్నప్పుడు మేజర్ గొలొవీన్‌కు కాలికి గాయం తగిలింది. అతనిని చూడాలని అతడు ఉంటోన్న కుటీరంలోకి అనిచ్కా వెళ్లింది. అతని

ప్రక్కనే కూర్చుంది. తాను ఆస్పత్రికి వెళ్లాననీ, అక్కడే ఉంటాననీ అతడు ఆమెతో చెప్పాడు. దాంతో ఆమెకు అకస్మాత్తుగా కళ్లల్లో నీళ్ల తిరిగాయి. దుఃఖించింది. ఆమె అడిగింది: ''నేనేం చేయాలి?'' తర్వాత ఆమె అతనికంతా చెప్పేసింది.

మేజరు ఆమెకంటే ఎక్కువ కలవరపాటు జెందాడు, ''మంచిది. దానికి మనమేం చేయగలం? ఏమీ చేయలేం...'' అని అతడు గొణిగాడు. ఒక్క క్షణం ఆలోచించి అన్నాడు: ''అకీమొవ్ ఇక్కడసు మనవద్ద లేకపోవడం శోచనీయం. అతనిని అభినందిస్తూ ఒక టెలిగ్రాం పంపేవాడినే.''

''అంతా అకస్మాత్తుగా జరిగిపోయింది. ఎలాగైతేనేం అది మంచి పని కాదు,'' అని ఆమె అంది.

''కాని దానికి మనం ఏం చేయగలం?'' అని గొలొవీన్ అడిగాడు. మళ్లీ సమాధానం చెప్పాడు: ''ఏమీ — చేయలేం.'' అతడు ఆమె మొహంవైపు చూసి దయార్ద్ర హృదయుడై హఠాత్తుగా ఆమె పక్షాన మాట్లాడాడు: ''మీరెందుకలా ఆలోచిస్తారు? అందులో ఏమీ తప్పు లేదు. ఏదో తలవనితలంపుగా జరిగింది కాదు. అంతా సవ్యంగానే ఉంది. మీరు సైన్యంలోనుండి తప్పక తొలిగి మాస్కోకు వెళ్లి, తల్లిగా మీ కర్తవ్యాన్ని నిర్వహించాలి. ఇది ఉపేక్షింపరాని వ్యవహారం, తెలుసాండి! కామ్రేడ్ బెలొజ్యోరొవ! మీరు సరియైన మార్గంలో చూస్తే, పిల్లల్ని కలిగివుండడం ప్రభుత్వ వ్యవహారం సుమండీ! చాలా ముఖ్యమైన విషయం కూడాను.'' అతడు ఒక్క క్షణం ఆగి మళ్లీ కొంత మోటుతనాన్ని నటిస్తూ అన్నాడు: ''నిజంగా యీ విషయమై నాకెంతో సంతోషంగా ఉంది; మీరు యుద్ధంలో చనిపోతారేమోనని నేనెప్పుడూ భయపడుతుండేవాణ్ని. నేను అకీమొవ్‌తో ఏం చెప్పగలిగేవాడినో?''

వాళ్లిద్దరూ చాలా సేపటివరకు మౌనంగా ఉన్నారు. వెలుపల ఇద్దరు సైనికులు మాట్లాడుకోవడం వినవస్తోంది.

''నీ రయ్‌నేత్స్, ష్రఫాన్స్ ఆపిలు పండ్లరకాల గురించీ నాతో మాట్లాడవాకు,'' అని వాళ్లల్లో ఒకడు అన్నాడు. ''నా అభిప్రాయంలో అంతోనొవ్కను మించి ఏ ఆపిలు పండూ ఉండదు.''

రెండోవాడు చిఱచిఱలాడుతూ సమాధానం చెప్పాడు: ''క్రైమియాలో నువ్వెప్పుడూ ఉండలేదు. అందుకే నీ అంతోనొవ్క ఆపిలుపండ్లను గురించి గొప్పలు చెప్పకుంటున్నావు.''

"నాకూ యిద్దరు పిల్లలున్నారు. ఉల్యానొవ్స్క్‌కు తరలించేశారు వాళ్లిద్దరినీ. ఒక అబ్బాయి ఒక అమ్మాయి. అబ్బాయి పేరు వాన్య. అమ్మాయి పేరు కాత్య."

అతని గొంతు వొణికిపోయింది. కమాండర్ ఆవిధంగా ద్రవించిపోవడమూ, ఆతురత పడడమూ ఆనిచ్కా ప్రథమ పర్యాయంగా చూసింది.

"నరాల బలహీనత," అని అతడు ఒక ప్రక్కకు ముఖం త్రిప్పుకొని అన్నాడు.

కొద్ది రోజుల్లోనే ఆనిచ్కాను సైన్యంనుండి విడుదలచేసినట్టు కాగితాలు ఆమెకు అందాయి. ఆమె రికన్నాయ్‌సెన్స్ విభాగం ఉన్న స్థలానికి వెళ్లింది, వాళ్లకు వీడ్కోలు చెప్పేందుకై. కాని ఆమె హెడ్‌క్వార్టర్సుకు వెళ్లినప్పుడు వారు అక్కడ్నుంచి ముందుకు వెళ్లవలసినదిగా ఆజ్ఞ వచ్చిందని తెలుసుకుంది. ఆ స్థలంలో ఎవ్వరూ లేరు.

పసుపురంగు రోడ్డు పొడుగునా ఆ రెజిమెంటు విస్తరించి వుంది. మనుషులు, ఫిరంగులు శకటాలు నెమ్మదిగా పశ్చిమ దిశవైపుకు నడవడం జరుగుతోంది. దేవదారు వనం చివర త్వరలోనే ఆనిచ్కా ఒంటరిగా ఉండిపోయింది. సైనికులు నదీ ప్రవాహంలాగా నడిచిపోతున్నారు. ప్రతివ్యక్తీ, ప్రతివస్తువూ, ఆఖరికి పొలాలూ అడవులూ కూడా పశ్చిమ దిశవైపు కదలిపోతున్నట్టుగా ఆనిచ్కాకు అనిపించింది. తూర్పువైపు వెళ్లే హేతువు అగుపించనే అగుపించదు.

"సెలవు కామ్రేడ్స్!" అని ఆమె కన్నీరుకార్చుతూ పలికింది. తర్వాత ఆమె తన సూట్‌కేసును పట్టుకొని తూర్పుదెసగా వెళ్లిపోయింది.

ఆ శ్రేణికి కొంత దూరం వెనుక నడుస్తోన్న కార్లవరుసలు కొన్ని తూర్పువైపు, కొన్ని దక్షిణానికీ కొన్ని ఉత్తరానికీ వెళ్తున్నాయి. మిలిటరీ మోటారు రోడ్లు జనసందడిని అదుపులో ఉంచే స్థావరాలతోనూ, అదుపులో ఉంచే అధికార్లతోనూ, విశ్రాంతి తీసుకొనే కుటీరాలతోనూ అన్నివైపులకూ కిరణాలు ప్రసరించినట్లు ఉన్నాయి. రైల్వేలు మళ్లీ చురుగ్గా నడుస్తున్నాయి; రైలు తర్వాత రైలు సైన్యాలతోనిండి ప్రశాంతంగా పశ్చిమ దిశకు పరుగెడుతున్నాయి, అవి సరిహద్దుకు వెళ్లవలసి ఉన్నాయి. ఇతర రైళ్లు రొట్టెలతోనూ ఫిరంగిగుండ్లతోనూ, 'మహోర్కా' పొగాకు పెట్టెలతోనూ, తూటాల పెట్టెల్తోనూ నిండి ఉన్నాయి. కాళ్లకు చుట్టే పట్టీలూ చలికాలపు టోపీలూ వెచ్చని అండర్‌వేర్లతో నిండిన పేకేజీపెట్టెలు, యుద్ధరంగపు పొయ్యిలు, యుద్ధ

రంగపు బేకరీలు, శవాలను సమాధిచేసే సైనికదళాలు, ఆస్పత్రికి తరలించే బస్సులు, అన్నీ ప్రవాహంలాగా వెళ్తున్నాయి. మొదట కారులోనూ, ఆతర్వాత రైలులోనూ ఆనిచ్కా వెళ్తున్నప్పుడు, ప్రతిచోటా అనేకమంది ఉండడాన్నీ, అంతా కలసి పనిచేస్తుండడాన్నీ లేక నిరీక్షిస్తుండడాన్నీ చూసి ఆమె చకితురాలైంది. ముఖ్యంగా పిల్లలు ఆమెను ఎక్కువగా ఆకరి ంచారు: ఆమె తన జీవితంలో ఎన్నడూ పిల్లల్ని చూడనట్టు ఎంతో శ్రద్ధతో వాళ్లవైపు చూసింది.

''నేను నా దేశానికి సేవ చేయాలని కలలుగన్నాను!'' అని ఆనిచ్కా భావించింది బాధపడుతూ. ఆమె మాస్కోను సమీపిస్తున్న కొద్దీ, ఎంతో మంది జనం స్పష ంగా యుద్ధానికి సంబంధించనటువంటి మామూలు ఉద్యోగాలను చేసుకుంటూ ఉండడాన్ని గమనించినప్పుడు ఆమె మనసు కుదుటపడింది. యుద్ధం జరుగుతున్న ప్రాంతానికి వెలుపలనున్న దేనినైనా సరే, లేదా సూటిగా యుద్ధానికి సంబంధించని దానినైనా సరే ఎప్పుడూ దూషించే మున్ముందరి యుద్ధ శ్రేణిలోని సైనికుని సంకుచిత దృక్పథాన్ని ఆమె ఖండించింది. ఏదో ఒక నిర్దిష్టమైన చోటుకు చేరుకోవాలంటే స్థలమూ గమనం ఇవే కాకుండా కాలం కూడా అవసరమనీ, ఒక గొప్పదేశం చరిత్రాత్మక తలంలో కదులుతూ ఉంటుందని ఆమె అకస్మాత్తుగా ఆలోచించడం ప్రారంభించింది. తనకూ తన బిడ్డకూ, నిజానికి నిరాడంబరమైన స్థలం ఉందనీ కాని ఆ అగణిత చరిత్రాత్మక గమనంలో ఆ స్థలాన్ని చేరుకోవడం తమకు సాధ్యంకాగలదనీ ఆమె ఆశ్చర్యంతో గుర్తించగలిగింది. కాని, ఆనిచ్కా ఎన్నాళ్లు తన భవిష్యత్తును గురించి ఛాందసపు ఏకైక పరిమాణ భావనను పట్టుకొని వ్రేలాడుతుంటుందో అంతవరకు కూడా ఆమె, ఆమె బిడ్డా ఆ స్థలాన్ని ఎన్నడూ కనుక్కోలేరు.

ఆమె ధ్యానానికి క్రియారూపకమైన ఫలితం ఏమంటే ఆమె మాస్కోలో అడుగు పెట్టీపెట్టడంతోటే, శరత్కాలంలో ఆమె తన చదువు ప్రారంభించేందుకై, మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రవేశించడానికిగానూ ప్రయత్నాలు చేయడం మొదలుపెట్టాలని నిశ్చయించుకోవడమే. ఆవిధంగా ఆమె తన తండ్రిసహాయంతో అత్యుత్తమమైన సర్జన్ అవడంగానీ, లేదా పిల్లల డాక్టరుగా అవడంగానీ జరగవచ్చు. ఎప్పుడైతే ఆమె యీ నిర్ణయాన్ని తీసుకుందో ఆ మరుక్షణానే ఆమె తనలో ఒక శక్తి నూతనంగా ప్రవహిస్తున్నట్టూ, ఏ ఉత్సాహమైతే తనను స్వయంగా సైన్యంలోకి చేర్పించిందో, అదే ఉత్సాహం మళ్లీ తనలో నూతనంగా ప్రవహిస్తున్నట్టూ ఆనిచ్కా భావించింది. ఆమె ప్రస్తుతం

తీసుకున్న నిర్ణయం, ఆమె రెండు సంవత్సరాలక్రితం ఉత్సాహంతో, ఉద్రేకంతో తీసుకున్న నిర్ణయంవలెనే ఉంది. అంతే కాకుండా ఆమె యిప్పటి నిర్ణయం, ఒక పరిపక్వ దశకు వచ్చిన మనస్సు తీసుకొన్న నిర్ణయం.

## 4

1942 ప్రారంభంలో ఉన్న మాస్కో 1943 అంతంలో వున్న మాస్కోవలె లేదు. ఆ రోజుల్లో అది నిర్జనంగాను కఠోరదీక్షలోనూ ఉంది. ప్రజలు కొంతమంది తూర్పుకు కొంతమంది పశ్చిమానికీ వెల్లువలాగా అక్కడ్నుంచి వెళ్లిపోయారు. ఇప్పుడు మళ్లీ యింకా ఎక్కువ సంఖ్యలో మనసుకు నాటే ఉద్వేగంతో గుంపులుగుంపులుగా తిరిగి వస్తున్నారు. మళ్లీ జీవకళతోనూ జనసమ్మర్దంతోనూ కార్లతోనూ ఆ పట్టణం సందడిగా ఉత్సాహవంతంగా ఉంది. ల డ్స్పీకర్లలో ప్రకటిస్తున్న ఎర్రసైన్యం విజయాలనూ, ఫిరంగి వందనాన్నీ వినేందుకై ఆ పట్టణం సాయంత్రంపూట మాత్రమే కొద్దిసేపు మౌనంగా ఉంది.

దాదాపు ప్రశాంతంగా ఉన్న రాజధానియొక్క గొప్ప ఆశలతో నిండినట్టి ఉన్న తోద్రేకమైన జీవితంలోనూ, సందడిలోనూ ఆనిచ్కా తేలికగా లీనమైపోయింది. ఆమె తనలో అలవరుచుకున్న నిశ్చలబుద్ధితో తన నిర్ణయాన్ని సాధించేందుకై ప్రారంభించింది; ఆమె తన స్నేహితులనుండి పాఠ్య పుస్తకాలనూ, ఉద్గ్రంథాలనూ ఎక్సర్ సైజు పుస్తకాలనూ సంపాదించింది.

పాఠశాలల్లోనూ, ఇన్స్టిట్యూట్‌లోనూ చదివేప్పుడు ఆమెకు చదువంటే సంకటంగా ఉండేది. కాని యిప్పుడో థియరెమ్‌లూ, ఫార్ముల్యలాలూ ఆమెకు ఎంతో అభిరుచిని కలిగిస్తున్నాయి. ఇదివరకు, ఏదైనా చిక్కు లెక్క వచ్చిందంటే దానిని పరిష్కరించేందుకు ఆమెకు ధైర్యం చాలేది కాదు. కాని యిప్పుడో ఆ లెక్కను చేసేందుకు ఎంతో ఉత్సాహపడుతుంది. యుద్ధరంగంలో ఆమె అంతకాలం శారీరకంగా పడిన ఉద్రిక్తజీవితం తరువాత ఇప్పటి మానసిక యత్నం అత్యంతుత్తమమైన విరామసమయమేమో. అంతే కాకుండా, లెక్కలూ భౌతిక రసాయనిక శాస్త్రాలూ ఆమెలో తన బడి రోజులలోని ఆనందదాయకమైన స్మృతులను రేకెత్తించాయి. ఆ రోజులు యిప్పుడు సాధింపనశక్యమైన గతంలో పడిపోయాయి. అవి తన జీవితంలో అత్యంత సుందరమైన రోజులుగా ఆమెకు

అనిపించింది. తనలో వచ్చిన మార్పును సరిగ్గా తెలుపుతూ ఆమె: ''నేను వయసు మీరుతున్నాను,'' అని అనుకునేది. చదవాలనే ఆతురతా, ఆమె విజయమూ ఆమెకు సంతృప్తినీ ఆనందాన్నీ కలుగజేశాయి. జీవితంలో కొంత అనుభవం సంపాదించుకున్న మీదటే విద్యను కొనసాగించాలి అనే అంతిమ నిర్ణయానికి ఆమె వచ్చింది. ఎందువల్లనంటే, అప్పడే ఎవరైనా సరే నూతన విజ్ఞానంయొక్క విలువనూ, జీవిత రహస్యాలను కనుగొనేందుకై తన జీవితాన్నే ఉపయోగించిన వ్యక్తియొక్క ఉత్కృష్టమైన గుణాన్ని సరిగ్గా ప్రశంసించగలుగుతారు.

త్వరలోనే ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ మాస్కోకు వచ్చాడు. మాస్కోలోని ఆర్మీ మెడికల్ కోర్ హెడ్‌క్వార్టర్స్‌లో ఒక నూతన ఉద్యోగంలోకి ఆయనను బదిలీ చేసే విషయంలో చర్చించేందుకు గాను పిలవబడ్డాడు.

ఆయన అతని సోదరి నాద్యవద్దకు వెళ్లాడు. ఆనిచ్కా మాస్కోలో ఉందనీ, మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రవేశించేందుకుగాను కష్టపడి చదువుతోందనీ ఆమె ఆయనతో చెప్పింది. ఆ వార్త ప్రొఫెసర్‌కు ఆనందాన్ని కలిగించింది. అతడు గబగబా యింటికి వెళ్లాడు. తన కుమార్తె మరో యిద్దరు పిల్లలు చుట్టూ దొంతులుగా ఉన్న పాఠ్యగ్రంథాల మధ్య అగుపించడం ఆయనకు మరింత ఆనందాన్ని కలిగించింది. వారు తమ చదువులో సంపూర్ణంగా మునిగిపోయి వున్నారేమో, ప్రొఫెసర్ లోపలికి వచ్చింది కూడా గమనించలేదు.

ఆనిచ్కా సైనిక ఖాకీ గౌను తొడుక్కుంది. ఆమె తన తండ్రివైపు తిరిగినప్పుడు ఆయన ఆమె ఉన్నత వక్షోజంపై వున్న రెండు 'ఆర్డర్ల'ను, ఒక 'పరాక్రమపతకం'ను చూశాడు. ఆమె మొహం విస్మయం గొలిపేట్టుగా ప్రశాంతతతోనూ ధ్యానపరత్వంతోనూ ఉన్నట్టు ఆయన భావించాడు.

ఆనిచ్కా సంతోషించింది. కాని అదే సమయంలో ఆమె తన తండ్రిని చూసినప్పుడు కొంత భయపడింది. తన తల్లి అనుభవించిన మనోవికారాలను తాను వెంటనే తిరిగి అనుభవించినట్లు ఆమె గర్భంలోని శిశువు కదిలింది. ''మీ మనుమడు,'' అని ఆనిచ్కా తన మనస్సులో అన్నది తన తండ్రితో. తన తండ్రికి ఒక మనుమడు ఉన్నాడనీ, ఆ సంగతి ఆయనకు తెలియదనీ తలచినప్పుడు ఆమెకు నవ్వు వచ్చింది.

తన కుమార్తెకు ఏమీ అపాయం కలగనందుకూ, అదే సమయంలో ఆమె స్వయంగా శాంతంగా ఉన్నందుకూ ప్రొఫెసరు సంతోషించాడు. ఆమె చిట్టచివరికి శ్రద్ధతో వైద్య

వృత్తిని గౌరవించినందుకు ఆయన సగం గంభీరంగాను సగం పరిహాసంగాను ఆమెను అభినందించాడు. ఆమె తన వృత్తిని తాను స్వేచ్ఛగా ఎన్నుకోవచ్చునన్న సంగతి ఆయన ఆమెకు జ్ఞాపకం చేశాడు. తాను కొంత దుడుకుగా ప్రవర్తించిన సంగతి గుర్తించినట్టూ, వాళ్ళిద్దరి మధ్యా కలిగిన అభిప్రాయభేదానికి తాను విచారిస్తున్నట్టూ ఆయన సూచించాడు.

వైద్యంలో అలాంటి గొప్ప ప్రమాణపురుషుడు అక్కడ కనిపించేప్పటికల్లా ఆ యిద్దరు పిల్లలూ కలవరపడి వెళ్ళిపోయింతర్వాత ఆ ప్రొఫెసరు తన కుమార్తె తిరిగి వచ్చినందుకు ఒక ద్రాక్షాసవం సీసాతో విందుచేయడానికి నిర్ణయించాడు. కాని ఒక్కడే త్రాగవలసి వచ్చింది. ఎందువల్లనంటే అతని కుమార్తె ఆమె కడుపులో ఉన్న శిశువుకు ద్రాక్షాసవం ఎక్కడ హాని కలుగజేస్తుందో అని త్రాగలేదు.

ఆ సాయంత్రం ప్రొఫెసర్ బల్‌షోయ్ థియేటర్‌కు టిక్కెట్లు తీసుకున్నాడు. ''హంసల సరస్సు'' చూడ్డానికని యిద్దరూ వెళ్ళారు. పైకప్పుమీది పురాతన పద్ధతిలోని కుడ్యచిత్రాలు, బరువైన కెంపువన్నె మకమల్ తెర, అన్నిటికంటే కూడా చక్కని సంగీతంతో నిండిన నృత్యనాటిక, అనింద్యమైన నాజూకుతనం గలిగిన అందగత్తె ఉలానొవ, ఆ నాటకశాలలోని మొత్తం వాతావరణమంతా ఆనిచ్కకు సేదదేర్చినట్లైంది. ఇటీవల ఆమె గడిపిన గతం — పొగతో నిండిన దిఙ్మండలం, శరత్కాలపు వాడిపోయిన కొమ్మలతో రంగురంగులుగా కప్పబడిన ఫిరంగులు, ఓవర్‌కోట్లు తొడుక్కొని నిరంతర ప్రవాహం నడిచిపోతున్న జనం, వర్షంతో పరిశుభ్రమైన అనంతమైన రోడ్లపై గలగలమంటూ సాగిపోతున్న కార్లు మొదలైన వాటితో నిండిన గతం పైవాతావరణానికి ఎంతో భిన్నమైనటువంటిది. మానవ శరీర సౌష్ఠవాన్నీ, మానవుడు సృజించిన సంగీతాన్నీ ప్రేక్షకులు స్వతహాగా గాఢంగా మెచ్చుకోవడం చూసి, ఆమె సైన్యంనుండి బలవంతంగా వచ్చివేయడం మరింత న్యాయసమ్మతమేననిపించింది ఆనిచ్కకు.

ఆనిచ్క జనాన్ని ఆకర్షించడమూ వారు శ్రద్ధగా ఆయన వంకా ఆమెవైపూ చూడడమూ ప్రొఫెసర్ గమనించక తప్పింది కాదు. అలాంటి అందమైన ఎదిగిన అంగసౌష్ఠవంగల అమ్మాయి తన కుమార్తె గావడంవల్ల అతడు గర్వించాడు.

రోజులు గడిచిపోతున్నాయి. అయినా ఆనిచ్క అతిముఖ్యమైన విషయాన్ని తండ్రికి తెలపడమా లేదా నిశ్చయం చేసుకోలేకపోయింది. తెలిపినట్లయితే ఆ విషయం అతనిని దుఃఖాన్నీ విచారాన్నీ కలుగజేయడం నిస్సందేహమైన విషయమని ఆమె తెలు

సుకుంది. అతడు అకీమొవ్‌ను ఎరుగనందువల్ల, బహుశ ఆమె స్వభావం నిజంగా తెలియని వారికెవరికైనాసరే సందేహాలు మరింత దృఢమౌతాయి. తన తండ్రి నీలపు కళ్ళ ప్రశాంతతతో నిండిన గర్వంతో తనను చూసినప్పుడు ఆనిచ్కా వ్యాకులత చెందేది. ఆమె తాను చేసినపనికి ఏమాత్రం విచారించకపోయినా, ఆ విషయాన్ని తండ్రితో చెప్పడం వాయిదా వేస్తూ వచ్చింది.

ఉదయాన తండ్రి యింకా లేవకమునుపే ఆనిచ్కా లేచి, అంగడికి వెళ్ళి కొన వలసినవి కొనుక్కొని వచ్చి ఉదయపుభోజనం తయారుచేస్తుంది. ఇద్దరూ కలిసి భోం చేస్తారు. ఆ సమయంలో జరిగిన సంభాషణ ఆనందదాయకంగా ఉంటుంది. కలిసి ఉన్న ప్పుడు వాళ్ళిద్దరూ సంతోషంగా ఉంటారు. తర్వాత ప్రొఫెసరు ప్రజారక్షణ మంత్రి త్వశాఖకు వెళ్తాడు. ఆమె యింటి పని చూసుకుంటుంది. అన్నీ పరిశుభ్రం చేస్తుంది. మధ్యాహ్నం భోజనం సిద్ధంచేస్తుంది, లేదా బట్టలు ఉతుకుతుంది. తన బిడ్డకు ఏవిధ మైన హాని కలగకుండా ఉండేంత సమయంవరకు కూర్చుంటుంది. అప్పుడు ఆమె యిద్దరు స్నేహితురాండ్రు వస్తారు. అంతాకలసి చదువుకుంటారు.

తన కుమార్తెలో వచ్చిన మార్పుకు ప్రొఫెసరు ఆనందాన్ని పొందాడు. తన కుమార్తె కాయకష్టంచేసే పనులను చేయాలని తనకెంత కాలంనుంచో ఉన్న కోర్కెను సైన్యం సఫలీకృతం చేసింది. యుద్ధసమయంలో ఆయన సైన్యాన్ని ప్రేమించడం నేర్చుకున్నాడు. ఆ సైన్యం తన కుమార్తెకు చేసిన మేలు కారణంగా ఆయనకు ఆ సైన్యంయెడల ఉన్న మెప్పుదల కృతజ్ఞతలు ద్విగుణీకృతమయ్యాయి.

1943 వ సంవత్సరం ఆఖరవుతూన్నప్పుడు చివరికి ఆనిచ్కా అకీమొవ్‌నుండి ఒక ఉత్తరాలకట్టను అందుకుంది. అవన్నీ కలిపి ఒక వార్తా పత్రికలో కట్టి వున్నాయి. దానిపై చిరునామా కాప్టెన్ ద్రోజ్‌ద్‌చే వంకరటింకరగా వ్రాసివుంది.

ఆ వుత్తరాలు ఒక క్రమం లేకుండా ఏ వరసలో వున్నాయో అదే పోళంగా ఆనిచ్కా వాటిని ఒక దాని తర్వాత మరొకటి తీసి చదివింది. ప్రతి ఉత్తరము ఆమెకు అకీమొవ్ జ్ఞానసంపదయెడలా, అతని భావప్రకటనలోని శక్తియెడలా, అతనిలోలోన అణగి ఉన్న మనోవికారములయెడలా వున్న మెప్పుదలను యినుమడింప జేసింది. అతడు తెలివితేటలు గల వాడవడమే కాకుండా, కాగితంమీద కూడా తన భావాలను బాగా వ్యక్తం చేయగల గడంవల్ల ఆమె ఆనందానికి మేర లేకపోయింది. ఆమె తన ఇన్‌స్టిట్యూట్‌లో అలవరచు కొన్న, విజ్ఞానాన్నిబట్టి వ్యక్తులను అంచనా కట్టడమనే అహంకారంతో నిండిన అల

వాటు ఇంకా పూర్తిగా వైదొలగలేదని ఆమె ఇప్పుడే గ్రహించింది. తాను ఎన్నుకొనిన వ్యక్తి యుద్ధంలో ఎంత పేరు ప్రఖ్యాతులు గడించుకొన్నప్పటికీ అతడు ఎక్కువ విద్యావంతుడు కానట్లైతే ఆమె బాధపడి ఉండేదేనని ఇప్పుడే ఆమె తెలుసుకోగలిగింది.

ఆమె సుదీర్ఘమైన సమాధానం వ్రాసి ఆ ఉత్తరాన్ని పోస్టులో వేసేందుకు పరుగెత్తింది. ఆమె తిరిగి వచ్చినప్పుడు తన పుస్తకాలమీద మనసుంచలేకపోయింది: ఆమె ఆ ఉత్తరాలను మళ్లీమళ్లీ చదివింది. మళ్లీ వ్రాయాలని ఆమెకు బుద్ధిపుట్టింది. ఆ విధంగానే ఆమె వ్రాసింది. రెండో ఉత్తరం మొదటి దానికంటే యింకా పెద్దదిగా ఉంది. దీనిని కూడా ఆమె వెంటనే పోస్టుచేసింది.

తన కుమార్తెతోనూ, పాత స్నేహితుడు జనరల్ సిలాయెవ్‌తోనూ నూతన సంవత్సరాది పండుగచేసుకోవాలని ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ నిర్ణయించుకున్నాడు. కాందిశీకులుగా వెళ్లిపోయిన జనరల్ సిలాయెవ్ కుటుంబం అప్పుడే తిరిగి వచ్చింది. సరిగ్గా అప్పుడే యుద్ధరంగంలో ఉద్యోగం అయిన జనరల్ సిలాయెవ్‌కు వీడ్కోలు విందు కూడా ఆ సాయంత్రమే యివ్వాలనుకున్నాడు ప్రొఫెసర్. అలాంటి బదిలీకోసమై జనరల్ ఎన్నాళ్లనుంచో చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశాడు. ఎందువల్లనంటే అసలైన ఏ యుద్ధాన్నైనా తాను చూసే భాగ్యం కలగదేమోననీ, అంచేత యుద్ధరంగంలో సైన్యాధిపతులు సంపాదించుకొంటున్న మిలిటరీ అనుభవం అనే భాగ్యం తనకు కలగదేమోనన్న భావనకు అతడు భంగపడ్డాడు కాబట్టే.

ఆ కొత్త సంవత్సరాది సాయంత్రం ప్రొఫెసరు కొంత ఆలస్యంగా యింటికి వచ్చి తన కుమార్తెను త్వరత్వరగా బట్టలు మార్చుకొమ్మన్నాడు. బయటకు వెళ్లేప్పుడు తన సొంత నమూనాతో కుట్టిన కొత్త ఉడుపును తొడుక్కోవాలనీ, సైన్యపు కోటును విడిచివేయాలనీ ఆమె నిర్ణయించుకుంది. ఆ ఉన్ని ఉడుపు పొడుగ్గా, నల్లగా, ఎత్తుమెడ గలిగి ఉంది. దానికి వెడల్పాటి పట్కా, గుండ్రని కాలరు ఉన్నాయి. అది భుజాల కొనల వరకూ ధగధగా మెరిసే ఒకటి విడిచి ఒకటిగా ఉన్న నలుపు తెలుపు రంగుల పట్టుబద్దీలతో తయారుచేయబడింది. దాని చేతులు పొడుగ్గా, వెడల్పుగా, బిగువైన కఫ్స్‌లతో, కాలరు వద్ద ఏ బట్టనైతే ఉపయోగించారో దాంతోనే కుట్టి ఉన్నాయి. ఆనిచ్కాను ఆ ఉడుపు ఎంతో సుందరంగా ఉండేట్టు చేసింది. ప్రస్తుత వయసుకంటే ఆమె పెద్దదిగా అగుపించేట్టు చేసింది. ఆమె వెంట్రుకలు అసలే పొడుగ్గా ఉన్నాయేమో అవి భుజాల పైన ధగధగా మెరిసిపోతున్న సిల్కుకాలరుపైన సొగసుగా పడ్డాయి.

అద్దంలో అగుపించే అందమైన తన ప్రతిబించాన్ని తానే గుర్తించ లేకపోయింది. సైన్యంలో అనువాదకురాలుగా పనిచేసిన బెలొజ్యోరొవ పూర్తిగా వేరే అమ్మాయి అని ఆమెకనిపించింది.

అకీమొవ్‌నుండి వచ్చిన ఉత్తరాలు ఆమెకు ఆనందాన్ని సౌఖ్యాన్ని కలిగించినవేమో ఆ భావన యింకా ఆమెలో హత్తుకుపోయి ఉండడంచే ఆమెకు వెలుపలికి వెళ్ళాలనే ఉద్దేశం ప్రత్యేకంగా లేదు. వెలుపల పెద్దపెద్ద బరువైన కొత్త సంవత్సరపు పెచ్చులతో మంచుకురవడం ఆనిచ్క గమనించింది. మొత్తం పట్టణమంతా చలికాలపు దుస్తుల్లో ఎంతో ఆత్రతతోనూ భోగనిరతతోనూ నిరీక్షిస్తున్నట్లనిపించింది.

ఆమె అప్పుడప్పుడు ఆ ఉత్తరాలు ఉన్న బల్లవైపు చూసింది. చూసిన ప్రతిసారీ ఆమె వాటివైపు చిరునవ్వునవ్వింది.

తండ్రి లోపలికి వచ్చాడు. తన కొమార్తె కొత్త సాయంత్రపు ఉడుపులో ఉండడం అతని ధ్యానాన్ని అకస్మాత్తుగా ఆకర్షించింది. ఆమెను గురించి అతనికి అర్థంకానిదేదో, ఏదో కొత్తదనం, బాల్యావస్థకు మించిన వంపులుగల ప్రౌఢత్వం అతనిని చకితుడ్ని చేసింది.

ఆయన చూపులను చూసి ఆమె వెలవెలబోయింది. అప్పుడామె అతనివద్దకు వెళ్లి, ఏమాత్రం భయపడకుండా, తీవ్రమైన కంఠధ్వనితో అన్నది: "అవును నాన్నా, నాకు బిడ్డ పుట్టబోతోంది."

ఆ వార్తను తెలిపే విధానం నిజానికి అది కాదు. "నాన్నా, నాకు పెళ్లయింది," అని చెప్పడం ఎక్కువ సబబుగా ఉండేది. ఆ తర్వాత, వీలైతే మర్నాడు మిగతా సంగతులన్నీ ఆమె ఆయనకు చెప్పి వుండవలసి వుంది. అవసరమైన దానికంటే ఎక్కువగా చెప్పడం ఆమెకిష్టం లేదు గనుక, తన సొంత తండ్రివద్దనే తాను చాకచక్యంగా ప్రవర్తించడం ఆమె గౌరవానికి భంగంగనుక, వేరే ఏమాటలు కాకుండా, ఎంతో ముఖ్యమైనటువంటి ఆ నాలుగు మాటలే ఆమె నోటినుండి వెలువడ్డాయి.

ప్రొఫెసర్ విన్న మాటల ధోరణినిబట్టి మిగతా విపులీకరణలన్నీ కుదించి వేయబడినట్లయింది. అతని కన్నులు సీసం వలెనూ గుడ్డిగానూ అయిపోయి. మామూలుగా ఉండే మంచి స్వభావము అతనినుండి అదృశ్యమైపోయింది. అతడు కోపంతోనూ భయంకరంగాను తన కుమార్తెవైపు చూశాడు. ఆమె యుద్ధంలో చేరింది, అందరూ చేరే సాధారణమైన ఆశయంతో కాదనీ, అతడే విధంగా మొదటినుంచి అనుకొంటున్నాడో

ఆ అభిప్రాయమే సరియైనదని అతడు వెంటనే తుదినిర్ణయానికి వచ్చాడు. మరుక్షణమే, ఆమెకు సంభవించిన నీచమైన విషయాన్ని ఆతడు నమ్మాడు.

"ఆమె నా కుమార్తె అవగలుగుతుందా?" అని అతడు భావించాడు, తన చిన్నతనంలో తిరిగిన తిరుగుళ్లను అకస్మాత్తుగా మరచిపోతూ. బహుశా అందుకు భిన్నంగా, అతడు ఎరుగనటువంటి అకీమొవ్‌ను తన కొలబద్దతో కొలిచి, వాళ్ల మరచి తన కుమార్తెను నీచంగా ఎంచడానికిగల కారణం, తాను స్త్రీలతో తగని రీతిగా తిరిగిన విషయాలు జ్ఞాపకం రావడంవల్లనే గావచ్చు. తమ కుమార్తెలను ప్రేమించేవాళ్లు పోకిరీవాళ్లని కొంతమంది తండ్రులు ఎలాగో అనుకుంటారు. బహుశ అందుకు కారణం వారు స్వయంగా కొన్నికొన్ని సమయాల్లో పోకిరివాళ్లవడమేనేమో?

తనను పొగడి సమాధానపరచే నెపంమీదనే ఆమె మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాలని సంకల్పించుకున్నట్టు అతడిప్పుడు అనుమానించాడు కూడా. ఆ క్షణంలో అతడు తన కుమార్తెపై ప్రపంచంలో ఉన్న నీచత్వాలన్నింటినీ ఆపాదించాడు.

ఆనిచ్కా గనక అతనితో మాట్లాడ్డానికి ప్రయత్నించి, నెమ్మదిగా ఆయనతో మొత్తం నిజాన్ని చెప్పి ఉన్నట్లైతే, అతడు ఆమె పరిస్థితిని సరైన మార్గంలో గమనించగలిగేవాడు. పురుషులకున్న అసూయను అధిగమించగలిగేవాడు. కాని ఆనిచ్కా అతని ఆలోచనలను గమనించగలిగింది. దెబ్బతిన్న ఆత్మగౌరవంతోనూ, కోపోద్రేకంతోనూ ఆమె మండిపడిపోయి నిరసనగా అన్నది: " ఏమైతేనేం, యిది నా సొంత వ్యవహారం. మీ అభిప్రాయాన్ని మీలోనే ఉంచుకోండి."

ఆమె గదిలోకి వెళ్లిపోయింది. ఆమె తండ్రి కొన్ని నిముషాలు నిశ్చేష్టుడై నిలచి తర్వాత నడవలోకి వెళ్లి టోపీపెట్టుకొని కోటుతొడుక్కొని వెలుపలికి వెళ్లిపోయాడు. నిజానికి అతడు జనరల్ సిలాయెవ్‌వద్దకు వెళ్లలేదు. జనవరి రెండవ తేదీన అతడు మాస్కోలోని ఉద్యోగాన్ని పట్టుదలతో నిరాకరించి యుద్ధరంగంలోని తన పూర్వపు ఉద్యోగానికి వెళ్లిపోయాడు.

## 5

ఆనిచ్కా తన తండ్రి ఆధారంపై బ్రతకడం యిష్టంలేక విదేశసారస్వత గ్రంథాలయంలో ఉద్యోగం స్వీకరించింది. పుస్తకాల జాబితాలను తయారుచేయడం ఆమె పని. ఉదయాన్నే ఆ పనిని ప్రారంభిస్తుంది. కాని ఆమె తరచూ ఆ పని అవడంతోటే మెడికల్

ఇన్స్టిట్యూట్ ప్రవేశించేందుకై తయారు చేసుకోవలసిన పాఠాలను పట్టువిడవకుండా చదువుకొనేది.

ఆమె పావెల్‌కు ఉత్తరాలు వ్రాసేది గ్రంథాలయంలోనే. అవి ఎప్పుడూ సంతోష దాయకంగానూ ఉత్సాహవంతంగానూ, తనకు సంభవించినవన్నట్టుగా ఊహించే వినోద కరమైన సన్నివేశాలతోనూ నిండి ఉండేవి. కాని ఆమె ఉత్తరాలకూ నిత్యజీవితానికీ ఎంతో తేడా ఉంది. అది ఆమె కంటివెంట అశ్రుధారలు ప్రవహించే పర్యంతం బాధకలిగించింది. ఆమె స్వయంగా నాటకశాలకు వెళ్లినట్టు కథా వస్తువునూ, నటకులు నటించిన విధా నాన్నీ, అయిదు సంవత్సరాలక్రితం ఆమె చూసిన జ్ఞాపకాన్నిబట్టి వ్రాసేది. తన తండ్రి, మేనత్త నాద్య ఇతర బంధువులు అతనికి శుభాకాంక్షలు పంపినట్టు వ్రాయడం ఆమె ఎన్నడూ మరవలేదు. గ్రంథాలయం పని విషయమై, వాస్తవానికి అది కేవలం టెక్నికల్ పనే అయినప్పటికీ, అంతకుమించి ఆసక్తిదాయకమైనదీ, అద్భుతమైనదీ, డబ్బునొసగేదీ మరొక పని ఏదీ లేనట్టుగా వ్రాసేది.

ఆమెకు అకీమొవ్‌నుండి ప్రతిరోజూ ఉత్తరాలువచ్చేవనే చెప్పాలి. ఆమె నెలకు ఒక వెయ్యి రూబుళ్లు తీసుకోగలిగే అర్హతనిస్తూ అతడు ఒక సర్టిఫికేటును పంపాడు. ఆవిధంగా ఆమె ఎక్కువ సౌఖ్యవంతంగా జీవింపగలిగేది.

ఏకైక అభిలాషలు కలిగిన ప్రజాసంఘమూ, సాయుధులై నిశ్చలమనస్కులై, హానినుండీ అన్ని యాదృచ్ఛికములనుండీ తమకు రక్షణ లభించగలదనే భావనా వీట న్నిటితో కూడినట్టి సైన్యంలోకి మళ్లీ వెళ్లాలనే వాంఛ ఆమెను తరచూ విస్మితు రాలను చేసేది. అకీమొవ్ ఎక్కడున్నాడో అక్కడికే వెళ్లాలని ఆమె కల. తన బిడ్డే గనక లేకపోయినట్లైతే ఆమె ఆవిధంగా చేసి ఉండేదని గ్రహించింది. ఆమె ఒక్కొక్కప్పుడు, బిడ్డ లేకపోతేనే నయమేమో అని ఆశ్చర్యంతో అనుకునేది. కాని ఆమె ఆ భావనను వెం టనే తిరస్కరించేది. ''ఒక వేళ ఆ బిడ్డ లెనిన్ వలెనో లేక పూష్కిన్ వలెనో గొప్ప వాడైతేనో?'' అని ఆమె తనలో తాను అనుకొనేది స్వాభావికమైన నమ్మకంతో. ''లేదా కేవలం మరొక పావెల్ కావచ్చు?''

ఆమె మగపిల్లలు ఆడపిల్లల పేర్ల జాబితాను పావెల్‌కు పంపింది, అతనికి నచ్చిన పేరు ఎన్నుకోమని. అతడు అన్‌ద్రేయ్ అని పిల్లవానికొరకు, యెకతెరీన అని ఆడపిల్ల కొరకు రెండు పేర్లను ఎంచాడు.

జులైలో తాను ప్రసవించే సమయం ఆసన్నమవడంచేత ఆమె నెమ్మదిగా బొల్‌షాయా

మొల్ చానొవ్కలోని మాతా శిశుపోషణాలయానికి నడుచుకుంటూ వెళ్ళింది. అమె తన తండ్రితో పోట్లాడకుండా ఉన్నట్లైతేనూ, అతనితో రాజీకుదుర్చుకొనే ప్రథమ యత్నాన్ని ఆమె గర్వంతో నిరాకరించక ఆయనను తన మనో వీధినుండి తొలగించక పోయినట్లైతేనూ ఎలా ఉండేదో అని ఆమె ఆలోచించకుండా ఉండలేకపోయింది. ఎన్ని కార్లు, ఎంతమంది ప్రొఫెసర్లు, నర్సులు, ఎన్ని టెలిగ్రాంలు రావడం జరిగేదో! ఆయన స్వయంగా యుద్ధ రంగంనుండి మాస్కోకు విమానంలో వచ్చి ఉండేవాడు.

ఈ భావనలు ఆమెకు అసౌఖ్యాన్ని కలిగించలేదు. తాను ప్రొఫెసర్ కుమార్తెగా కాకుండా, యితర స్త్రీలకు ఉండే విచారాలతోనూ, తన చర్యలకు ప్రపంచం ఎదుట ఉన్న బాధ్యతతోనూ మామూలు వనితగా ఉండడం, తన కాళ్లపై తాను నిలవడం అనే యీ ప్రస్తుత పరిస్థితి ఆమె అహంకారానికి అనుకూలంగా ఉండడమే కాకుండా అహంభావానికి కూడా కొంత తృప్తి కలిగించింది.

ఆ మాతా శిశుపోషణాలయంలో బహు కొద్దిమంది తల్లులు మాత్రమే ఉన్నారు. అంత పెద్ద వార్డుకు అయిదుగురే ఉన్నారు: యుద్ధం యింకా జరుగుతూనే ఉంది.

ఆ మర్నాటి రాత్రి అనిచ్కా ఆడశిశువును ప్రసవించింది. అదే సమయంలో మరో స్త్రీకి మగపిల్లవాడు పుట్టాడు.

తెల్లవారేప్పటికల్లా ఆ రెండో స్త్రీ మంచంమీద అప్పటికే పువ్వులూ ఉత్తరాలూ ఉన్నాయి. కాని అనిచ్కాను చూడ్డానికి ఎవ్వరూ రాలేదు. ఇది ఆమెకు మరింత కష్టాన్ని కలుగజేసింది. ఎందువల్లనంటే అకీమొవ్ వాంఛించిన ప్రకారం మగశిశువు కలగకుండా ఆడపిల్లపుట్టడం ఆమెకు కొంత నిరుత్సాహాన్ని కలుగజేసింది.

తర్వాత మధ్యాహ్నం ఆమె ఒకే పర్యాయం నాలుగు పూలగుత్తుల్ని అందుకుంది — గులాబీలు, వైలెట్లు, ఫ్లాక్సు, చివరకు అప్పుడప్పుడే ఆఖరుకావస్తోన్న లిలాక్‌లు. అవి అనిచ్కాకు ఆమె గ్రామప్రాంతాలలో జరిపిన విహారాలను, మాస్కో వెలుపల నీడలతో నిండిన తోటలను, అన్నిటికంటే ఎక్కువగా వర్ణించడానికి కష్టమైనటువంటి ఆమెకు ఎంతో ముఖ్యమైనటువంటి విషయాన్ని జ్ఞాపకం చేస్తూ అవి ఆ ఆస్పత్రి మంచం పక్కనున్న టేబులుమీద వికసించాయి. ఆమె మొదట అకీమొవ్‌ను కలుసుకున్నప్పుడు, ఓర్షవద్ద ఆ శరత్కాలపు రోజున, రికన్నాయ్‌సెన్స్ పోరాటదళం బాధపడుతున్న సమయంలో ఆయాదళాల రహస్యపు పేర్లను ఆమె చిట్టచివరికి జ్ఞాపకం చేసుకోగలిగింది. బుద రతో నిండిన యుద్ధరంగం, సంకుచితంగా ఉన్న రాకపోకల సారంగాలు, అనంతమైన

కొండ కనుమలు, వేగంగా వీచే గాలిలో నులితిరిగిపోతున్న రెల్లు, నది గట్టుపై ఏట వాలుగా కురుస్తున్న వర్షం – ఆమె మనోవీధిలో కదలాడుతూన్న యీ దృశ్యం ముందు, ఆ ఆస్పత్రి వార్డు, వృద్ధురాలైన నర్సుయొక్క ముడతలబడ్డ మొహం, తెరవబడిన కిటికీ గుండా లోనికి తొంగి చూసే ఒక పెద్ద చెట్టుయొక్క ఆకులతో నిండిన కొమ్మలు, ఇవన్నీ వెలవెలబోయాయి.

త్వరలోనే ఆమెకు ఉత్తరాలు తెచ్చి ఇచ్చారు. మొదట అకీమొవ్‌నుండి వచ్చిన ఉత్తరాన్నే ఆనిచ్కా తెరిచింది. అకీమొవ్ అక్కడే ఉండి ఉండాలన్న భావన ఆమెకు కలగ గానే ఆమెకు యించుమించు స్పృహతప్పినట్లయింది. కాని త్వరలోనే విపులీకరణ అగు పించింది. ఆ ఉత్తరంలో అతడిలా వ్రాశాడు: "ప్రియా! రాజధానికి వస్తోన్న, మాస్కో లోని పత్రికలో విలేకరిగా పనిచేస్తున్న కామ్రేడ్ కొవలేవ్‌స్కీద్వారా యీ నాలుగు మాటలు వ్రాసిపంపుతున్నా. అతడు నిన్ను చూడగలుగుతున్నందుకు నాకెంతో యీర్ష్యగా ఉంది. అతనికోసం లాంచీ వేచి వుంది. అంచేత నేను త్వరబడాలి. ఆతడు నా విషయ మంతా నీకు చెప్తాడు."

కొవలేవ్‌స్కీనుండి కూడా ఒక చీటీ ఉంది: "ప్రియ కామ్రేడ్ బెలొజ్యోరొవ, నేను మీ యింటికి వెళ్ళాను. మీరెక్కడుందీ మీ పొరుగువారు చెప్పారు. హృదయ పూర్వకమైన అభివందనాలు. అకీమొవ్ తరపున, నా తరపున మీకు నేను పూలగుత్తిని పంపుతున్నాను."

మేనత్త నాద్యనుండీ, ఆనిచ్కాతో చదువుకొంటున్న పిల్లలనుండీ, తాన్య నోవి కొవనుండీ, కాప్టెన్ ద్రోజ్‌ద్‌నుండీ సందేశాలు వచ్చాయి. ఒక నెలక్రితం కాప్టెన్ ద్రోజ్‌ద్ మాస్కోలోని మిలిటరీ అకాడమీకు పంపబడినట్లూ, అదే రోజున అతడు ఆమెను చూడాలని నిశ్చయించుకున్నట్టు తేలింది.

ప్రసవవేదన కారణాన, ఉద్రేకత చెందినందువల్లా ఆమె యింకా బలహీనంగా ఉండడంచేత ఆ వుత్తరాలకు సమాధానం వ్రాయలేకపోయింది. అంచేత ఆమె తనను గురించి దర్యాప్తులు చేసే వారందరికీ కృతజ్ఞతలు చెప్పమనీ, తాను ఆరోగ్యంగానూ, సుఖంగాను ఉన్నట్టు వారికి చెప్పమనీ నర్సుతో చెప్పింది.

ఈలోగా మేనత్త నాద్య మేడక్రింది ఆహ్వానపు గదిలో కొవలేవ్‌స్కీని అకీ మొవ్‌ను గురించి కఠినంగా ప్రశ్నిస్తూంది: అతడు ఏ రకమైన మనిషి, అతడు ఎలా

ఉంటాడు, అతని వయసెంత, అతని హోదా ఏమిటి, అతడు తన బాధ్యతను గుర్తించే వాడేనా, వగైరా వగైరా.

ద్రోజ్‌ద్ చిటచిటలాడుతూ కొంత దూరంలో మౌనంగా నిలబడ్డాడు. కాబోయే తల్లులకుండే తెలుసుకోనవలెననే యిచ్ఛతో తాన్య నోవికొవ యింకా యితర పిల్లలు తమ చుట్టూ ఉన్న ప్రతి దానినీ పరిశీలిస్తూ, తమ ప్రియ భార్యలకు ఏదో భయం కరమైన చెడుచేశామని నేరస్థులలాగా దుఃఖకరంగా చూస్తున్న కాబోయే తండ్రుల వైపు దొంగచాటుగా చూశారు.

ఆమె ప్రసూతి గృహంనుండి వెలుపలికి వచ్చింతర్వాత మేనత్త నాద్యకు లొంగి ఆమెతో నివసించేందుకై వెళ్లింది. మేనత్త నాద్య సంపూర్ణంగా ఆనిచ్క పక్షం వహిం చిందనే చెప్పాలి. ఆమె తన సోదరుని పట్ల అమిత పూజాభావం కలిగినదే అయినప్పటికీ యీ సందర్భంలో అతనిని పొగడలేకపోయింది:

"ఎటువంటి అవివేకి!" అని ఆమె అన్నది. "మగవాళ్లంతా తెలివితక్కువ వాళ్లే!"

ఆనిచ్కను చూసేందుకై కొవలేవ్‌స్కీ తరచూ వెళ్లేవాడు. అకీమొవ్ ఉత్తర నౌకలకు వెళ్లీ వెళ్లడంతోటే ఎటువంటి పేరుప్రఖ్యాతులు సంపాదించుకున్నాడో, ఏ విధంగా అతడు ఒక పెద్ద సబ్‌మెరైన్ ఛేసర్ నౌకకు, ఆ తర్వాత మొత్తం సబ్‌మెరైన్ ఛేసర్ల స్క్వాడ్రన్‌కు కమాండర్ అయ్యాడో ఆమెకు చెప్పాడు. నావికులంటే అతని కెప్పుడూ ఉండే ఉత్సాహంతో అకీమొవ్‌ను గురించి మాట్లాడాడు. అకీమొవ్‌తో తనకున్న పరిచయాన్ని ఎంతో అవాస్తవికంగా తెలిపానని అతడు గమనించనే లేదు. అతడు అకీమొవ్‌ను సరిగా ఎరుగకపోయినా, ఏదో మామూలుగా అతనిని కలుసుకున్నా, ఉత్తర నౌకాదళంలో తాను అతనికి ప్రాణస్నేహితుడైనట్టు చెప్పాడు.

ఆనిచ్కను మోసగించే ఉద్దేశం అతనికి లేదు. తాను అకీమొవ్‌కు గొప్ప స్నేహి తుడ్ననే అతడు మాస్కోలో నిజంగానే ఊహించుకున్నాడు. అతడు ఆమెకు చెప్పిన దాని నంతా సంపూర్ణంగా నమ్మాడు. అతడు అకీమొవ్‌ను గురించి విన్నదానినంతా స్వయంగా తనకళ్లతో చూసినట్టే మైమరచి మళ్లీ చెప్పాడు. ఇతర ఆఫీసర్లకు అకీమొవ్ మార్గదర్శకుడని పేర్కొన్న వార్తాపత్రిక కత్తిరింపును అతడొకసారి తీసుకొచ్చాడు.

ఆనిచ్క అంటే అమితమైన యిష్టం కలిగింది కొవలేవ్‌స్కీకి. ఆమె ఎక్కువ కేంద్రీకరించి చదువుకుంటూ, నోట్సు వ్రాసుకుంటూ, లేదా తన బిడ్డకై దుస్తులు

అల్లుకుంటూ మౌనంగా వివర్ణంగా సోఫామీద కూర్చున్నప్పుడు అతడు ఆమెను గంట లకొద్దీ చూస్తుండేవాడు. ఆమె ఒక్కొక్కప్పుడు స్నేహపూర్వకంగా నవ్వుతుండేది. ''మీకు విసుగుపుట్టడం లేదా?'' అని అడిగేది. లేదా అతనికి అభిరుచి ఉన్న ఏ ప్రదేశానికైనా వెళ్లమని సూచించేది.

అతడు ఆమెకోసం ఉంటోంది కేవలం అకీమొవ్ స్నేహితుడుగానేనని అతనికి తెలుసు. అయినా ఆమె మాటలకు అతడు చిన్నబోలేదు. అతనికి ఆమెపై ఏ యితరమైన హక్కూ లేదు. ఊరికే అక్కడ ఉండాలని ఆమెను చూసి మెచ్చుకోవాలని అతనికి యిష్టం. ఆమె తన కూమార్తె కారణంగా సరిగా నిద్రపోదు. ఆమె నిద్రను ఎలా ఆపుకో గలుగుతోందా, ఎలా చదువుకోగలుగుతోందా, లేదా ఎలా బిడ్డను చూసుకోగలుగు తోందా అని అతడు ఆశ్చర్యపోయేవాడు.

జన్మ సర్టిఫికేట్‌లో ఆ బిడ్డ పేరు యెకతెరీన పావ్‌లొవ్న అకీమొవ అని ఉంది. అంత చిన్ని పాపకు అంత పొడుగాటి పేరు ఉండడం నవ్వుపుట్టించేట్టూ గంభీర స్వభావాన్ని కలుగజేసేట్టూ ధ్వనిస్తుంది. ఆ బిడ్డ విషయం కూడా అదేవిధంగా సంభ్రమాన్నీ నవ్వును పుట్టిస్తుంది. అన్నిటికంటే అబ్బురాన్ని కలిగించేదేమంటే అది ఆ పాప ముఖమే, ముఖ్యంగా నిద్రపోతున్నప్పుడు. ఆ బిడ్డ శక్తికి అందుబాటులోలేని కోపం, తిరస్కారం, అలక్ష్యం, భక్తి, అహంకారం, లఘుచిత్తమూ, లేదా గంభీరత మొదలైన భావాలు, మానసిక స్థితులు, ఒక నాడు ఆమె స్వభావానికి లక్షణాలుగా ఉండేవి, ఆ పాప మొహంలో వ్యక్తమౌతున్నట్లనిపిస్తుంది.

తల్లికి ఆ చిన్ని ప్రాణే యావత్ప్రపంచం. ఆనిచ్క ఆ పాపను ఎంతో అంటి పెట్టుకొని ఉంది. తన చిట్టి కాత్య లేనట్లైతే తానెలా జీవించగలిగి ఉండేదో ఆమె ఊహించుకో లేకపోయింది. కాని అది మునుపటి మాటే. యుద్ధం, శాంతి వీటికి సంబంధించిన ప్రతీదీ, యుద్ధం అయిపోయిన తర్వాత వారెలా జీవించేదీ ఇప్పుడు బిడ్డ భవిష్యత్తు పరంగానే పరిగణింపబడింది.

ఆమె యిప్పుడు తల్లిగాబట్టి, ఆనిచ్క తనకు తాను ఎంతో ముఖ్యమూ, క్లిష్టమూ, అమూల్యముగానూ పరిగణించింది. బిడ్డను ప్రసవించడం అనే అద్భుతకార్యాన్ని తన శరీరం ఎలా నెరవేర్చగలిగిందా అని ఆమె ఆశ్చర్యపోయింది. ఆమె తనను గురించి ఎక్కువ శ్రద్ధతీసుకుంది. తన ప్రాణానికి ఎక్కడ హాని కలుగుతుందో అని, తన ప్రాణం ఎంతో ఆవశ్యకమైనదనీ భావించి రోడ్డును త్వరత్వరగా దాటాలంటే కూడా వెరచేది.

యుద్ధరంగంలో ఆమె తన జీవితాన్ని ఒడ్డడానికి ఎంత దుడుకుగా ఉల్లాస పడిందో జ్ఞాప కంచేసుకొన్నప్పుడు కాత్య అసలు ఉండనే ఉండదేమో అనే భావన కలిగి గజగజా వణికి పోయింది.

ఆనిచ్కవైపు ఆమె బిడ్డవైపు పూజిస్తున్నట్టుగా చూశాడు కొవలేవ్‌స్కీ. అన్ని మతాలలోనూ మాతాశిశువుల చిత్రానికి అంతటి స్థానం లభించడానికి కారణం లేకపో లేదని అతడు భావించాడు. ఎక్కడో రష్యా ఉత్తరప్రాంతంలో ఆ బిడ్డ భవిష్యత్తుకోసం తండ్రి యుద్ధంచేస్తున్నాడనే భావన కలగగానే అతని హృదయం ద్రవించి కళ్లల్లో నీరు నిండింది.

అప్పుడు ఉత్తరప్రాంతంలో వేసవి. సూర్యుడు అసలే అస్తమించడు. అనంతమైన పగలు అనంతమైన రాత్రి స్థానే నిలిచింది. కొండల నల్లరాళ్ల సందున పచ్చని గడ్డి మొలిచింది. పాలలాంటి తెలుపురంగు మొదలుకొని ధూమ్రవర్ణం దాకా అనేక చోద్య మైన ఛాయలతో ఉన్న మేఘాలు సముద్రంమీదనుండి భూమిమీదికి వచ్చాయి. అవి ఒక్కొ క్కప్పుడు క్రిందికి వచ్చి పరిసరప్రాంతం అంతటినీ చెమ్మగా పొగతో నిండిన పల్లపు భూమిగా అగుపించేట్టు బూడిదరంగు పొగమబ్బుతో ఆ రాతికొండల్ని కప్పేస్తాయి. తర్వాత పొగను గాలి ఎంత తేలికగా చెదరగొట్టగలదో అంత తేలికగా వాటిని చెల్లాచెదరు చేస్తుంది. దాంతో కొండలపైభాగాలు అఖాతంలో లంగరు వేయబడిన నౌకల స్థంబాలు మళ్లీ అగుపిస్తాయి.

పెద్ద సూర్యబింబం అదృశ్యం కానున్నాదా అన్నట్టు సముద్రంవైపుకు దిగు తోంది. మండిపోతున్న తన తలను నీళ్లల్లో ముంచి చల్లార్చుకోవాలని అభిలషిస్తున్నట్టు కనిపిస్తుంది. కాని ఏదో విచిత్రమూ అదృశ్యమైన శక్తి దానిని ఆపుచేసింది. అది ఆకా శానికి అంటుకుపోయినట్టుగా అక్కడే ఉండిపోయింది, నెత్తురునూ ధూమ్రాన్నీ కక్కు కుంటూ.

"ఇప్పుడు అక్కడ మనోహరంగా ఉంటుంది," అని కొవలేవ్‌స్కీ ఆనిచ్కతో అన్నాడు. "అది యీ కాలంలో నివసించడానికీ యుద్ధంచేయడానికీ ఏమాత్రం చెడ్డస్థలం కాదు. అక్కడకు వెళ్లాలని నాకెంతో తొందరగా ఉంది. త్వరలోనే శత్రువులపై మనమే దాడి చేయడం ప్రారంభం కాబోతుంది."

నిజంగానే అతడు తనను ఉత్తరాదికి పంపమని విడిచిపెట్టకుండా అడుగుతు న్నాడు. కాని సెప్టెంబరువరకు కూడా అతనికి ఆజ్ఞలు అందలేదు. అతడు

తక్షణమే ఆనిచ్కను చూడ్డానికి వెళ్లాడు. ఆమె అకీమొవ్‌కోసం ఒక పార్సిల్‌ను తయారుచేసింది. ఒక ఉత్తరం కూడా వ్రాసి అందులో పాపాయి ఫోటోను కూడా పెట్టింది.

అతడు ఆనిచ్కవద్దకు వెళ్లినసంగతులు యింకా జ్ఞాపకం చేసుకుంటూ, ఆమెను మైమరచి రహస్యంగా ప్రేమిస్తూ, అకీమొవ్ అంటే పూర్తిగా అమాయకంగా అసూయ పడుతూ కొవలేవ్‌స్కీ మాస్కోను విడిచిపెట్టాడు. అతడు కొద్ది రోజులపాటు మూర్‌మన్‌స్క్‌లో ఆగాడు. అతడు నౌకాస్థావరానికి వచ్చినప్పుడు అకీమొవ్‌ను చూడాలి అనే భావనే అతనికి మొదట తట్టింది. ఆ పార్సిల్‌లో ఆపిలుపండ్లు ఉన్నాయని అతనికి తెలుసు. అవి చెడిపోతాయేమోనని అతడు భయపడ్డాడు.

కాని అకీమొవ్ తన పాత స్థలంలో యిక లేడు. అతడు రిబాచీ ద్వీపకల్పంమీది మెరైన్ కోర్‌కు బదలీ అయి ఎంతో కాలంకాలేదు. త్వరలోనే శత్రువులపై దాడీసల పడం అనే తన భావనను ప్రతీదీ స్థిరపరచడం గమనించి, మెరైన్ కోర్‌ను అనుభవజ్ఞులైన సిబ్బందితో బలీయం చేయడమనే చర్యలను నౌకల కమాండ్‌వారు తీసుకోవడం కొద్ది రోజుల్లోనే గొప్ప సన్నివేశాలు జరగబోతున్నవనడానికి చిహ్నం అని కొవలేవ్‌స్కీ భావించాడు.

ఏదో ఒకటి నిర్ణయం చేసే ఘడియ యిక ఎంతో దూరంలో లేదని అనేక సూచనలు కనబడుతున్నాయి. నౌకాదల కమాండరు పదేపదే కరేలియన్ ఆర్మీ హెడ్‌క్వార్టర్సుకు విమానంలో వెళ్తున్నాడు. నౌకాదళాల హెడ్‌క్వార్టర్స్‌లో ఆర్మీ జనరల్స్ తరచుగా అగుపిస్తున్నారు. సైనిక దళాలు మనుషులతోనూ, పరికరాలతోనూ సంపూర్ణసంఖ్యతో బలీయం గావించబడుతున్నాయి. ఓడలు త్వరత్వరగా ఓవర్‌హాల్ చేయబడుతున్నాయి. హిట్లర్‌యొక్క 20 వ లాప్‌లాండ్ సైన్యంయొక్క సముద్రపు రాకపోకల్ని నాశనం చేస్తూ, అడ్డంకొడుతూ సబ్‌మెరైన్‌లూ, నౌకా విమానాలూ తమ పని పరిధిని పెంచుకున్నాయి.

ఇవన్నీ కూడా కొవలేవ్‌స్కీకు తీరిక చిక్కకుండా చేశాయి. అక్టోబర్ మొదటి రోజుల్లోగాని అతడు రిబాచీ ద్వీపకల్పాన్ని చేరుకో లేకపోయాడు.



అధ్యాయం ఏడు

# తీరాన

1

ముస్తా-తుంతూరి పర్వతశ్రేణులపై వున్న జర్మన్ పరిరక్షకసైన్యాలను తీవ్రంగా ముట్టడించడానికై సన్నాహాలు ఉవ్వెత్తుగా సాగుతున్నాయి. మొత్తం కార్యభారపు ఏర్పాట్లలో సూచికపుల్లదగ్గరనుండీ కూడా అన్నీ సిద్ధంచేయబడ్డాయి. ప్రతిదళానికీ కూడా సరిగ్గా ఏభూభాగంపై దాడిసలపాలో తెలుసు. ఆ అపూర్వ సమయంకోసం నౌకాసైనికులు కాల్బలాలు రిబాచీ, స్రేడ్న ద్వీపకల్పాలపై ఆతురతతో ఎదురు చూస్తున్నాయి. ఈలోగా ఎడమ పార్శ్వంలోని మెరైన్ బటాలియన్‌లలో ఒక దానికి తన విభాగాన్ని ఒప్పజెప్పేందుకై సిద్ధంగా ఉండవలసిందని ఆజ్ఞలు వచ్చాయి.

నెలలకొద్దీ, ఆఖరికి సంవత్సరాలకొద్దీ మనుషులు చిత్తడి నేలల్లోనూ, నిటారుగా ఉన్న కొండల కనుమలలోనూ, సున్నపురాళ్ళ గుహల్లోనూ, లేదా బలపపురాళ్ల సందుల్లోనూ, ప్రతిరోజూ పైనుండి బాంబులు, గుండ్లు వర్షంలా కురుస్తుండగా నివసిస్తూ వచ్చారు. ఇతర యుద్ధరంగాలలో శత్రువులపై దాడిసలిపే కార్యక్రమాలను విన్నప్పుడు వారు వాస్తవంగానే అసూయజెందారు. ఇప్పుడు ఆ శిలామయమైన యుద్ధశ్రేణీ విభాగంలో కూడా దాడి చేయవలసిన సమయం ఆసన్నమయింది గనక వారు అకస్మాత్తుగా పిలవబడ్డారు.

ద్వీపకల్పాలపైన ఆధిపత్యం వహిస్తున్న జనరల్, బటాలియన్ కమాండరును పిలిచి అన్నాడు: "అకీమొవ్, మీ మనుషులు అచ్చంగా చార్జి ఒప్పగించేవరకు వారికి మీరు ఒక్కమాటైనా తెలపకూడదు సుమండీ, జాగ్రత్త. ఆవిధంగా జరిగితేనే మంచిది."

బట్టాలియన్ కమాండరు నవ్వాడు. అది జనరల్‌కు ఏమీ నచ్చలేదు. అతడు కఠినంగా అన్నాడు, "స్పష్టంగా అర్థమయిందా?"

"ఆ బాగానే అర్థమయింది," అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. అతని పెదవులపై నవ్వు యింకా తారాడుతూనే ఉంది. ఆ తర్వాత అతడు అడిగాడు: "వాళ్ల మమ్మల్ని ఎక్కడికి పంపుతున్నారో మీకు తెలియదా కామ్రేడ్ జనరల్?"

జనరల్ సమాధానం చెప్పలేదు, ప్రశ్నను విననట్టుగానే. జనరల్ వున్న కందకం బసను వదలి, తిన్నగా ముందలి ప్రాంతంలో ఉన్న తన బటాలియన్‌వద్దకు వెళ్ళాడు అకీమొవ్.

అతడు తన చిన్నతనంలో స్నేహితులతో పిట్టల్ని పట్టడానికి ఎలా వెళ్లేవాడో అదే మాదిరిగా ఉల్లాసంతో యీల వేసుకుంటూ నడిచాడు. ఆ రోజుల్లో వాళ్ళ డబ్బాల నిండా కుమ్మరిపురుగుల్ని, కీటకాల్ని నింపుకొని, స్వయంగా తయారుచేసిన వలలతో వెళ్లేవారు. రెల్లుపొదల్లో దాక్కొని నైటింగేల్ పక్షుల గానాన్ని వినేవారు. వాటి స్వరభేదాలన్నింటిని విని ఆనందించేవారు. ప్రతి స్వరభేదానికీ వారికొక పేరు ఉంది. అవి స్వరకంపం, వణకింపు, వంపు, దొర్లింపు, నిర్ఝరులు.

అతనికి ఆనిచ్కనుండి ఉత్తరం వచ్చింది గనుక అతడు తరచూ పైవిధంగా కుర్రవానివలెగా భావించేవాడు. గుండ్రని అక్షరాలతో ఒక స్త్రీ వ్రాసిన కొద్ది పేజీల ఉత్తరం తన మనోస్థితిని ఆఖరికి అతని శారీరకస్థితిని ఆవిధంగా మార్చగలుగుతుందని అతడిదివరకెన్నడూ ఊహింపలేదు. కాని యిదివరకటికంటే తానిప్పుడు చిన్నవాడైనట్లూ,

ఆరోగ్యవంతంగా ఉన్నట్టూ అతడు భావించాడనడం నిజం. అన్నిటికంటే అతనికి ఆశ్చర్యాన్ని గొలిపేదేమంటే, ఇతరుల యెడల అతని ప్రవర్తన మోటుగా కాకుండా మంచిగా ఉండడమే.

రోజూ మామూలుగా జరిగే పర్యటననుండి తిరిగి వస్తున్నప్పుడు అతడు నౌక డెక్కు మీద మొదటి ఉత్తరం చదువుకున్నాడు. ఎవరూ చూడడం లేదని అతడనుకున్నాడు. ఆ ఉత్తరంలోని ప్రతిమాటా అతనిలో వేదనతో నిండిన ఆనందాన్ని కలుగజేసి అతని మొహం ఎరుపుగా ఒక సారి, పేలవంగా మరొకసారి మారేటట్టు చేశాయి. అతడు ఉత్తరాన్ని చదవడం పూర్తిచేసిన తర్వాత, మళ్లీ ఒకసారి చదువుకొని జేబులో పెట్టుకున్నాడు. పూర్తిగా మూడు నిముషాలు పాటు కదలిక లేకుండా నిలబడిపోయాడు. ప్రశ్నిస్తున్నదీ లేక భావార్థకంగా అంటున్నదీ గుర్తించడానికి వీల్లేనట్టుగా: "ఇంటివద్ద అంతా బాగానే ఉన్నారనుకుంటా, కామ్రేడ్ కమాండర్?" అని ఒక స్నేహ పూర్వకమైన గొంతు పలికేంతవరకు అతడీ లోకంలోకి రాలేదు.

అకీమొవ్ చుట్టూ చూశాడు. అతడు మత్యూహిన్. క్రొన్‌ష్టాద్‌నుండి వచ్చిన నావికుడు. అతని ముఖం గుండ్రంగా త్రుప్పమాదిరి పెద్ద పుట్టుమచ్చల్తో నిండి అతనిపై అకీమొవ్‌కు సదభిప్రాయం కలుగజేసింది. నావికులు, తాననుకున్న దానికంటే ఎక్కువ తీక్ష్ణంగా కనిపెట్టకలుగుతారని అకీమొవ్‌కు అకస్మాత్తుగా అనిపించింది, ఆతని మాటలు విన్నాక.

మర్నాడు అకీమొవ్‌కు మరో ఉత్తరం వచ్చింది. ఆ తర్వాత క్రమం తప్పకుండా వరుసగా వచ్చాయి. మొదట అతడు మరేవిషయాన్నీ ఆలోచించక ఎంతో ఆనందించాడు. కాని రానురాను తనకు తాను నిందించుకోక తప్పింది కాదు. "ఆనిచ్కా యెడల అటువంటి ఊహలు ఊహించుకోవడానికి నువ్వు ఎంతటి అల్పమైన మనిషివి, ఎంతటి నీచమైన మనిషివి," అని అతడు భావించాడు. అనేక లోపాలతోనిండిన మనిషిని, ఆమె ప్రేమకు పాత్రుడుగానటువంటి కుత్సితుని ఆమె ప్రేమించినట్టుగా తెలుపుతూ వ్రాయడం బహుశ ఎక్కువ గౌరవంగా ఉంటుందేమోనని తనలో తాను వాదించుకున్నాడు.

ఆమెను తన మనిషి కాదనడానికి దాదాపుగా సిద్ధం చేసి తనను లొంగతీసుకున్నటువంటి తీవ్రమైన శక్తిని, అంధత్వపు శక్తిని అతడు అర్థం చేసుకో లేకపోయాడు. అయినా, ఆమె విశ్వసనీయమైనదనీ, నిష్కళంకమైనదనీ అతడు ఎప్పుడూ తన అంతరాత్మ లోలోతులలో గట్టిగా నమ్మినట్టు అకస్మాత్తుగా తలపోశాడు, ఎన్ని సందేహాల్లు

అతనిలో మెరమెరలాడినప్పటికీ. కాని అతనికి అలాంటి భయంకరమైన సందేహాలు కలిగిన అదే సమయంలో, పైనమ్మకం కూడా కలుగుతుందా అనేదే ప్రశ్న?

మత్యూహిన్ అంటే అతనికి యిష్టం ఏర్పడింది. అతడు రిబాచీ ద్వీపకల్పానికి బదిలీ అయినప్పుడు మత్యూహిన్‌ను తన వెంట వార్తావహునిగా తీసుకెళ్ళాడు.

ఆనిచ్కనుండి ఎప్పుడైతే అతనికి ఉత్తరాలు రావడం ప్రారంభమైందో అప్పటి నుంచీ అతడు తన మనుషుల యెడల ఎక్కువ నిదానంతోనూ సహనంతోనూ మెలిగాడు. నావికుల వ్యక్తిగత జీవితం యెడల ఎక్కువ శ్రద్ధ తీసుకోవడం ఆరంభించాడు. అతడు చాలా కఠినంగా ఉంటాడనీ అయినా నిష్పక్షపాతంగల మనిషనీ యిదివరలో అంతా అనే వారు. కాని ఇప్పుడు అతడు చాలా మంచివాడని అంటున్నారు.

అతనికిదంతా బాగా తెలుసు. ఎలాటి క్రమశిక్షణ మంచిది అని అతడు తనలో తాను ప్రశ్నించుకున్నాడు కూడా: కమాండరు కఠినంగా ఉండడం మంచిదా, లేక కచ్చితంగా ఉంటూ దయగా ఉండడం మంచిదా? అతడు యీ క్రింది విధంగా తుది నిర్ణయానికి వచ్చాడు. తన నౌకమీది మనుషులు తన ప్రతిమాటా శిరసావహించడానికి కారణాలు రెండు. ఒకటి — వారు విధేయులు, రెండు — అతనంటే వారికి భయం. కాని ఇక్కడో, అందుకుభిన్నంగా, వారు విధేయులు కాబట్టీ, తమ కమాండరుకు బాధకలిగిస్తామని భయపడతారు కాబట్టీ అతని ప్రతిమాటా శిరసావహిస్తారు.

ఈ రెండో విధమైన క్రమశిక్షణే ఉత్తమమైంది.

బటాలియన్ కమాండ్ స్థావరం ఒక సున్నపురాతి కొండ గుహలో ఏర్పాటయింది. ఆఫీసరు లోనికి రావడం చూసి మత్యూహిన్ మొహంమీద చిరునవ్వు విస్తరించింది. అతడు లేచాడు కాని క్రిందికి ఉన్న పైకప్పు అతడు 'అటెన్‌షన్'గా నిలబడేందుకు ఆటంకపరచింది.

"కూర్చో," అని అకీమొవ్ సగం స్నేహపూర్వకంగా, సగం ఎగతాళిచేస్తున్న కంఠ ధ్వనితో అన్నాడు. "నీ తొందరలో నెత్తి బొప్పికట్టుకోవలసిన అగత్యం లేదు." తర్వాత అతడు గుహలోకి ప్రవేశించాడు.

మత్యూహిన్ ఆఫీసరు వంక ప్రశ్నార్థకంగా చూశాడు. కాని ఆయనను జనరల్ ఎందుకు పిలిపించాడో అడగడమా, అడక్కపోవడమా అనేది నిశ్చయించుకో లేకపోయాడు. అకీమొవ్ శీలం ఎటువంటిదో అతడు అప్పటికే గ్రహించి ఉన్నాడు. అతనినుండి తాను పొందగలిగే అత్యుత్తమమైన సమాధానం: "పదాతిదళంలో ఆర్డర్లీలు అలాంటి

ఉబుసుపోని మాటలు మాట్లాడరు,'' అనే అర్థం లేనటువంటి పరిహాసమేనని అతనికి తెలుసు.

మత్యూహిన్ పొందే ఆనందాలలో ఒకటి అతడు అకీమొవ్‌నుండి భూమిపై జరిగే యుద్ధాలను గురించీ, అక్కడ యుద్ధంచేసే సైనికుల గురించీ వినడమే. ఆఫీసరు నిద్రపోయే ముందు సాధారణంగా క్రింద పడుకొని తన జ్ఞాపకాలనుండి యేల్న లేదా స్మొలేన్స్క్‌లకొరకై జరిగిన యుద్ధాల గురించీ, లేదా 1942 లో కాకసస్‌లోని కష్టసమయాలను గురించీ చెప్తాడు.

''మీకు ఎక్కువగా ఎక్కడ యిష్టం, సైన్యంలోనా లేక సముద్రంపైనా?'' అని మత్యూహిన్ అడుగుతాడు.

''అది చెప్పడం చాలా కష్టం,'' అని ఏదో అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చినట్టు ఆలోచనా పూర్వకంగా నవ్వుతూ అకీమొవ్ సమాధానం చెప్తాడు. ''భూమిమీద యుద్ధం చేయడమే ఎక్కువ అభిరుచిని కలిగిస్తుంది. నీ కాళ్ళక్రింద కనీసం నేల అయినా ఉంటుంది. నీ అంతటికి నీవు గోయి తవ్వుకొని అందులో కూర్చోవచ్చు. తర్వాత, ఇక్కడొక అడవి, అక్కడొక చెట్లతోపు, లేదా దగ్గర్లో 'రై' పొలాలూ ఉంటాయి — అక్కడ నువ్వు ఊరికే ఆగి ఆజ్ఞలకోసం ఎదురుచూడొచ్చు. కాని నీలాంటి కుర్రాడికి, బాల్టిక్ సముద్రంమీద పెరిగిన నీలాంటి నావికునికి ఏం తెలుసు? సముద్రం, రేవు అంటే, అసలు సముద్రం అంటే ఏముంది? దానిని గురించి నువ్వాలోచించవలసివస్తే అది విశేషంగా నీళ్లే. ఉప్పు నీళ్లు. కాని భూమిమీదో? అక్కడ రకరకాల వైవిధ్యాలూ, పలు రంగులూ కనబడతాయి. పర్వతాలు, గుట్టలు, పచ్చిక బయళ్లు. ఆ తర్వాత చిట్టడవులు. మహారణ్యాల సామీప్యాలు, చూడ్డానికి ఎంతో మనోహరంగా ఉంటుంది!'' అతడెప్పుడూ నవ్వుతూ: ''మనం ఉన్నచోట తప్ప ప్రతిచోటా బాగానే ఉంటుంది. అయినా వాటిన్నిటిని జ్ఞాపకం ఉంచుకోవడం దివ్యంగా ఉంటుంది,'' అని అంటూ ముగిస్తాడు.

మత్యూహిన్ మొత్తం గుహను ఒక్క చూపులో వీక్షించాడు. అదంతా కూడా త్వరలోనే గతంలో జరిగినట్లయిపోయి, జ్ఞాపకం ఉంచుకోవడానికి దివ్యమైన విషయంగా మారిపోతుంది. ''కాని ఆయనకు హెడ్‌క్వార్టర్స్‌లో ఏం చెప్పారు?'' అని అతడు అబ్బురపడ్డాడు, ఓరగా బటాలియన్ కమాండర్‌ను చూస్తూ. ''మనం త్వరలోనే దాడిసలపబోతున్నామా?''

కొంతసేపయిన తర్వాత అకీమొవ్ బటాలియన్ స్థానే ఉండవలసిన దళంనుండి ముగ్గురు ఆఫీసర్లు వచ్చిన పిమ్మటగాని అతనికి సమాధానం చిక్కలేదు; అది శత్రువులపై దాడిచేసే ఇంజనీర్స బ్రిగేడు.

ఆ సాపర్లు ఆత్రతతో కూడిన ఆశ్చర్యంతో గుహనంతా కలయ చూశారు. ఆ గుహ కొండలోతులకు చొచ్చుకొని ఉంది. మాట్లాడినప్పుడు కంఠధ్వని, విచిత్రంగా బొంగురు పోయినట్లుండి, ముందుకు చొచ్చుకొని వచ్చిన వాటికీ, గోడలకూ కొట్టుకొని వంపులు తిరిగి వింతగా ప్రతిధ్వనిస్తోంది. సున్నపు రాయినుండి ప్రత్యేకంగా చెక్కబడినట్టు అక్కడ బీరువా సొరుగులు స్వభావసిద్ధంగానే ఏర్పడివున్నాయి. వాటిమీద భోజనశాల డబ్బాలు, గాస్ మాస్కులు, చేతిబాంబులు మొదలైన అన్ని రకాల సైన్యపు సామాన్లు వ్యూహం మాదిరిగా పన్ని వరసగా పేర్చబడి ఉన్నాయి. గోడవద్ద చాలా మంచి స్థితిలో ఉన్న ఒక నికిలు మంచం ఉంది. అది బటాలియన్ కమాండరుది. గోడమీద ఒక బఠామీటరు, శ్రమతో అలంకరించిన జర్మన్ సెక్స్టెంట్ ఉన్నాయి. రబ్బరు చాపలు నౌకనుండే వచ్చాయనడం స్పష్టం. ఆవిధంగానే చిన్న బల్లలు, కూర్చీలు కూడా వచ్చాయి అక్కడనుండే.

గుహలో వెనకాల కొంత దూరంలో బటాలియన్ హెడ్క్వార్టర్సునుండి వచ్చిన మనుషులు నిద్రపోయేందుకు పరుపులు, ఇంట్లో తయారుచేసిన దీపం, చీకట్లో నడిచే ఆకారాలపై మినుకుమినుకు మంటోంది. కంఠధ్వనులు వినవచ్చు. కాబిన్కూ — అనగా నావికుల గదులకూ, 'మెస్రూమ్'కూ— అనగా ఆఫీసర్ల భోజనశాలకూ మధ్య గోడలేనప్పటికీ అక్కడ ఊహించుకోదగిన అడ్డుగోడ ఉంది. చీకటిగా ఉన్న లోతులనుండి వెలుపలికి వచ్చే నావికులు సాంకేతికమైన హద్దును దాటే ముందు ప్రవేశించేందుకై అనుమతిని అడగకుండా ఎన్నడూ ఉండరు.

''మా గుహ మీకు నచ్చిందనుకుంటాను, అవునా?'' అని అకీమొవ్ అడగాడు ఇంజనీర్ల ఆశ్చర్యాన్ని గమనిస్తూ. ''సౌఖ్యవంతంగా ఉండేందుకై మేం చేయగలిగిందంతా చేశాం. నా వార్తావహుడు, — మీ సైన్యం వాళ్లు అతనిని ఆర్డర్లీ అంటారు — అన్నిటినీ చక్కగా అమర్చడంలో నిధి.''

మత్యూహిన్ ఒక పెద్ద టిన్ను టీపాత్రనుండి పెద్దపెద్ద ముంతలలో టీ ని నింపాడు. అతడు ఇంజనీరు ఆఫీసర్లవైపు దాదాపుగా శత్రువులను చూస్తున్నట్టుగా

ముందుజాగ్రత్తతో చూశాడు. ''రాగానే అన్నీ సంసిద్ధంగా ఉండాలి వీరికోసం,'' అని అతడు గొణిగాడు, ఆ ముంతల గలగలల మధ్య.

ఆ ఆగంతకులలో అందరికంటే చిన్నవాడైన సన్నగా ఉన్న కాప్టెను అబ్బురపడుతూ తల పంకించాడు.

''మీరు యీ రిబాచీకి రావడం మొదటి సారనుకుంటాను, అవునా?'' అని అకీమొవ్ అడిగాడు.

''అతడింతకు ముందెన్నడూ ఉత్తరాదికి రాలేదు,'' అని ఆ కాప్టెన్ తరఫున ఒక లెఫ్టినెంట్-కర్నల్ సమాధానం చెప్పాడు. ''ఇప్పుడే మాస్కోనుండి వచ్చాడు. అన్నిటికంటే అతని దురదృష్టం ఏమంటే యిలాంటి కారుచీకటి స్థలానికి రాక తప్పక పోవడమే.''

''అవును, ఇక్కడంతా వింతగానే ఉంది. పుస్తకాలలో ఎంతో సహజంగా ఉన్నట్టు కనిపిస్తుంది. కాని వాస్తవంగా అది ఎందుకో నిజంకాదు,'' కాప్టెన్ అన్నాడు.

''కాదు. మీరు చెప్పిందానికి సరిగ్గా వ్యతిరేకంగా ఉంటుందది,'' అని ఒక చిన్న నవ్వునవ్వుతూ అన్నాడు అకీమొవ్. తర్వాత అతడు కాప్టెన్‌ను సూక్ష్మంగా పరీక్షిస్తూ మళ్లీ అన్నాడు: ''చికాకు పడకండి. కాస్త అలవాటవగానే మీకు నచ్చుతుంది. బహుశ యింటి నుండి ఉత్తరాలు రావడం లేదనుకుంటాను?''

''లేదు.'' ఆ కాప్టెన్ మొహం ఆశ్చర్యంతో కొద్దిగా ఎర్రబడింది.

ఇంజనీర్లతో జరిగిన సంభాషణ సందర్భంలో అకీమొవ్ ఎంతో ఖాతరు లేకుండా ఉన్నప్పటికి అతడు వాస్తవానికి ఆందోళనతో నిండి ఉన్నాడు. తనని కలవర పరచినదేమిటో అతడు మొదట గ్రహించలేదు. కాని ఆ తర్వాత అది అతనికి స్ఫురించింది, ఒక సంవత్సరంక్రితం ఓర్షవద్ద అతడు చార్జీని ఒప్పగించిన జ్ఞాపకమేనని.

''ఇక్కడ ఉన్న బల్లలూ కుర్చీలూ అన్నీ మునిగిపోయిన జర్మన్ మైన్-స్వీపర్ నౌకలోనివే. మన టార్పిడో నౌకలు దానిపై కాల్పులు జరిపాయి. తీరంలో ఉన్న ఫిరంగి దళాలు దానిని నాశనం చేశాయి. వారు దానిని మాకు చాలాదగ్గర్లోనే ముంచివేశారు. కాబట్టి మేం దానిలోని సామాన్లను భద్రపరిచే పనికి పూనుకున్నాం. బారెన్ట్స్ సముద్రం అడుగునుండి మాకుర్రాళ్లు మొదట ఒక సూట్‌కేసును, తర్వాత ఒక కుర్చీ, ఆ తర్వాత ఒక మంచాన్ని గాలంవేసి బయటకు లాగారు. ఆ సెక్స్టెంట్‌ను కూడాను. పనికిరాని చెత్త చాలా ఉందనుకోండి. మా స్నేహితుడు మత్యూహిన్ సహజంగా ఎక్కు

వగా పాటుబడ్డాడు. అతడు ఆఖరికి ఒక సారా పీపాను కూడా ఈడ్చుకు వచ్చాడు. నాకు విందు యివ్వాలనుకున్నాడు కాబోలు. కాని నేను ఆ సారాను సముద్రంలో పారపోయించేశాను. ఆ సారాని తాగి చేపలన్నీ చచ్చి వుంటాయి. ఆ మాట ముమ్మాటికి నిశ్చయం.''

మత్యూహిన్ మొహం సంపూర్ణంగా ఎర్రబడిపోయింది. ప్రతి ఒక్కరూ నవ్వారు. తాను మాట్లాడుతున్నంత సేపూ కూడా అకీమొవ్ లెఫ్టినెంట్-కర్నల్ వైపు రహస్యంగా చూశాడు, అతడు ఏ నిముషాన్నైనా: ''అంతా చాలా బాగానే ఉంది. కాని శత్రువులయొక్క ఏఏ దళాలు యిక్కడ ఉన్నాయో వాళ్ళబలం ఎంతో మాకు స్పష్టంగా తెలియదు; మేం రికన్నాయ్‌సెన్స్ పోరాటదళాలుగా తయారవ్వాలనుకుంటున్నాం,'' అని అంటాడేమోనని ఎదురు చూశాడు.

ఏమైతేనేం, ఆ లెఫ్టినెంట్-కర్నల్ కుర్రవానిలా నవ్వుకొని చివరికి లేచి నిలబడి అన్నాడు: ''కామ్రేడ్ అకీమొవ్, చాలా కృతజ్ఞతలు. మేం యిక వెళ్తాం యిప్పుడు. ఆజ్ఞప్రకారంగా ఉదయం ఆరు గంటలకు చార్జీ తీసుకుంటాం.''

''అసలు టయిమును తెలుసుకోవడం కష్టం యిక్కడ,'' అని కాప్టెను గొణుక్కున్నాడు.

భారం దిగిపోయినట్టుగా అకీమొవ్ నిట్టూర్చాడు, వాళ్ళంతా వెళ్లిపోగానే.

ఆ గుహలో మిగిలినవాళ్ళు అతని ఆఫీసర్లు మాత్రమే. అతని రాజకీయ సహాయకుడు, లెఫ్టినెంటు-కమాండరు మర్‌తీనొవ్, కంపెనీ కమాండర్లు లెఫ్టినెంట్స్ కొజ్‌లోవ్‌స్కీ, వెన్‌త్సోవ్, మినేవిచ్‌లు మాత్రమే ఉన్నారు.

''మనని ఎక్కడికి పంపిస్తారో నీకేమైనా తెలుసునా?'' అని మర్‌తీనొవ్ అడిగాడు. మిగతావాళ్ళు తల పంకించుకుంటూ ఆశాభంగంతో విచారంగా కూర్చున్నారక్కడ. తమ విభాగాన్ని ఒప్పజెప్పమని అకస్మాత్తుగా ఆజ్ఞలు ఎందుకు యివ్వబడ్డాయో వారికర్థం కాలేదు. అలాచేయడం అన్యాయమని వారందరికి అనిపించింది.

''నాకు నిజంగా తెలియదు. ఏమాత్రం కూడా ఊహించలేకుండా ఉన్నాను,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. ''నేను జనరల్‌ని అడగలేదని మీరనుకుంటున్నారా? అతడు నాకు చెప్పలేదు. బహుశ అతనికి కూడా తెలియదేమో? మనం చేయవలసిందంతా ఏమిటంటే, దారిబట్టి రిబాచీకి స్వస్తి చెప్పడమే. ప్రతి వస్తువునూ, ఆఖరి తోలుపట్టీతో సహా సరి చూడండి. ఆయుధాలన్నీ పరిశుభ్రంగా ఉండేట్టూ, మనుషులంతా క్షౌరం చేసుకొనేట్టూ చూడండి.''

అసంతృప్తితో నిండిన ఆఫీసర్ల ముఖాలు చూసి అకీమొవ్ తనలో తాను నవ్వుకున్నాడు. కలిసి ఉన్న కొద్దికాలంలోనే తాను ప్రేమించగలిగిన వ్యక్తులతోనూ, తన సహాయకులతోనూ వెళ్తున్నాడనీ, తాను ఒంటరిగా వెళ్లడం లేదనీ తలపోయడం, అతనికి నిబ్బరాన్ని కలిగించింది. మేజర్ గొలొవీన్‌యొక్క రెజిమెంటునూ, బదేయ్‌కిన్ సబ్-ఛేసర్ నౌకనూ, యిటీవలదాకా తాను ఆధిపత్యం వహించిన ఛేసర్ నౌకల డిటాచ్‌మెంటునూ వదలిపెడుతున్నప్పటికంటే ఎక్కువ ఆనందదాయకంగా ఉందతనికిప్పుడు.

సైనికులకంటేను, సామాన్య నావికులకంటేనూ అతనికి ఎక్కువగా నౌకాసైనికులంటే సంతృప్తి కలిగింది. అది బహుశా కేవలం అతని తలంపు కావచ్చు. సైనికులు, నావికులు వీరి రెండు అంశాలూ వారి ఒక్కరిలోనే మూర్తీభవించి ఉన్నాయి. ఐక్యతతో కూడిన విచిత్రమైన ఉత్సాహమూ, చొరవగల ధైర్యమూ, సముద్రం అంటే పక్షపాత బుద్ధిగల గర్వమూ వారికి ఉన్నాయి. వారు సరిగ్గా నావికుల వలెనే అంతర్బాహ్యాలలో నిర్మలంగా హుషారుగా ఉంటారు. అంతే కాకుండా వారు అదే సమయంలో ఒక సైనికునికి ఉండే తెగువతోనూ గణనీయమైన ధైర్యంతోనూ, భూయుద్ధరంగంలో ముందంజ వేయడమనేదే మొత్తం సంగ్రామాన్నే అటోయిటో తేల్చే అంశమని ఆ సైనికునికి ఉండే విశ్వాసంతోనూ ఉంటారు.

ఒక నెలపదిహేను రోజులక్రితం అకీమొవ్ అక్కడికి వచ్చినప్పుడు, ఆ ప్రాంతంలోని కష్టభూయిష్ఠమైన పరిస్థితులతో సరిపోల్చదగే వాటిని తానిదివరకెన్నడూ చూడలేదనీ అతడు ఒప్పుకోక తప్పింది కాదు. అయినా అక్కడి నౌకాసైనికులలో ఏదో ఒక దుందుడుకుతనం కూడా ఉంది. వారు యుద్ధంలో ఆరితేరినవారు. ఎండవానలకు లెక్కించనివారు. సముద్రపు ఉప్పునీళ్లు వారిని చర్మాన్ని కొరికేశాయనే చెప్పాలి. వారు అచంచలమైన నౌకా స్నేహంతో బంధింపబడ్డారు. కొండలపై వెళ్లేప్పుడుగానీ, తంగ్రా భూభాగంపై నడిచేప్పుడుగానీ వారు నౌక డెక్కుమీద ఉన్నట్టే ఉంటారు.

లెనిన్‌గ్రాడ్ నావికుల కుటుంబంనుండి వచ్చిన మర్తీనొవ్ చాలా పొడుగ్గా, సన్నగా, కొద్దిగా ఎత్తుగానూ తిన్నగానూ ఉన్న వెడల్పాటి భుజాలతోనూ, నోట్లో ఎప్పుడూ పొగ గొట్టంతోనూ ఉంటాడు. కలుపుకోలుతనంగల మనిషికాదు. అతడెప్పుడూ క్షౌరం చేసుకొని శాంతంగానూ, పరిశుభ్రంగానూ ఉంటాడు. అతడి టాయిలెట్ పరికరాలని అంతా మెచ్చుకుంటారు: అతనివద్ద రకరకాల సైజుల బ్రష్షులు, స్పాంజిలు, ధగధగా మెరిసే నికిల్ సబ్బుపెట్టెలు, దంతపు సబ్బుపెట్టెలు ఉన్నాయి. అకీమొవ్ గమనించి

వట్టుగా నీటుగా దుస్తులు తొడుక్కోవడంలో రేమిజోవ్ తెచ్చిపెట్టుకున్న నిర్లక్ష్యభావం మర్తీనొవ్‌లో అగుపించదు — మర్తీనొవ్ నీటుగా ఉంటాడనడం లోక విదితం — ఏమైన ప్పటికీ మర్తీనొవ్‌లో రేమిజొవ్‌ను జ్ఞాపకం చేసేదేదో అకీమొవ్‌కి అగుపడింది — సమిష్టి ఆదర్శానికి ఎట్టి మినహాయింపూ లేకుండా నిర్నిబంధంగా సంపూర్ణంగా అంకితమై పోవడం, మౌనంగా బాధలను భరించగలిగే శక్తి, బహుశా ఇదే అయివుండొచ్చు.

కొజ్‌లోవ్‌స్కీ పొట్టిగా దిట్టంగా నల్లగా వుంటాడు, కుర్రవాని ముఖం, చురుకైన కళ్లు, పొడుగాటి మెడపై కుదురైన చిన్నతల. వెన్‌త్సోవ్ అందుకు భిన్నంగా, దృఢకాయుడు. వెడల్పాటి భుజాలు. కండపుష్టి గలవాడు. అతనికి కనుబొమలు లేవు. దళసరి పెదవులు. మంచి స్వభావంగల మనిషి. నరాలబలహీనతతో ఎప్పుడూ అదురుతూండే అందమైన మొహం మినేవిచ్‌ది. నల్లని మీసం. పొగసైన పొట్టి జులపాలు.

నౌకాసైనికు లందరిలాగానే వారూ సైనిక యూనిఫారాలు తొడుక్కున్నారు, కాని వారిలో వున్న అంతు చిక్కనిది అదేదో మాత్రం వారు నౌకాదళానికి చెందినవారే అని తెలియజేస్తుంది. నౌకమీదికి మళ్లీ ఎప్పుడు వెళ్లిపోతామా అనే వారు ఎప్పుడూ కలలు కంటూంటారు, కాని ఆ కలలు ఫలించేవరకూ ద్వీపకల్పం, గుహ, సర్వప్రపంచమూ వారి నౌకే. మినేవిచ్ తన సైనిక టోపీకి బంగారు జల్తారు లంగరు వున్న నౌకాదళపు బాడ్జి సహితమూ తగిలించుకున్నాడు.

టీ త్రాగిన తర్వాత ఆఫీసర్లు తమ కంపెనీలకు వెళ్లిపోయారు. అకీమొవ్, మర్తీనొవ్‌లు కూడా అక్కడికి వెళ్లాలనుకున్నారు కాని ప్రక్క విభాగంలో ఉన్న లెఫ్టినెంట్-కమాండర్ సెలెజ్‌న్యోవ్ రాకవల్ల ఆలస్యమైపోయింది. అకీమొవ్ త్వరలో వెళ్లనున్నాడని అతడు విన్నాడు. దాంతో అతడు ఎంత కలవరపడిందీ అతని విచారంలో నిండిన ముఖవర్చస్సే చెబుతుంది. ఏమైనప్పటికీ, అకీమొవ్ 'పరికరాల్లో' తనకు ఉపయోగపడే వస్తువు నేదైనా యింజనీర్లకు ఉపయుక్తమయ్యే ఏ వస్తువునైనా సరే వదలిపెట్ట కూడదనే నిశ్చయంతో అతడు ఎంచుకోవడం మొదలుపెట్టాడు.

''మంచిదే. నీకేంకావాలో ఒకసారి అన్ని వస్తువుల్నీ చూసుకో. నేను నా కంపెనీలకు వెళ్తున్నాను,'' అని అకీమొవ్ అన్నాడు.

యుద్ధరంగానికి ముందరిప్రాంతం నిటారుగా ఉన్న కొండల అంచున ఉంది. బలంగా కట్టుదిట్టం చేసుకున్న ఒక స్థావరంనుండి మరొక స్థావరానికి రాకపోకల సంబం

ధం ఏర్పరచుకొనేందుకుగాను చాలా ఎత్తుమీదనుంచి పుంత మార్గంద్వారా టెలిఫోన్ తీగలు, లావుపాటి త్రాళ్లు వేశారు. యుద్ధరంగం పొడుగునా యిలాంటి లావుపాటిత్రాళ్లు అనేకం ఉన్నాయి, ఎందువల్లనంటే ఆ ఉత్తర ధ్రువపు చీకటి రాత్రులందు మార్గం తెలుసుకోవడం అసంభవం.

ఇప్పుడు మధ్యాహ్నం. ఈ కొద్ది సమయమూ ఎక్కడో పగటి వెలుగు ఉన్నట్లు జ్ఞాపకం చేస్తుంది. అతి ఏటవాలుగా ఉన్న కొండగట్టుమీద అకీమొవ్ నిలిచినప్పుడు, అతడు క్రింది కొండరాళ్ల మధ్య కొందరు అసంతృప్తితో మాట్లాడుకోవడం విన్నాడు. "వాళ్లకప్పుడే తెలిసింది," అని అతడన్నాడు.

అడుగుల చప్పుడ్నిబట్టే తమ బటాలియన్ కమాండరు, అతని రాజకీయ సహాయకుడు వస్తున్నారని నావికులు గుర్తుపట్టి మౌనం వహించారు.

"తుల్యకోవ్!" అని అకీమొవ్ పిలిచాడు.

"అవును కామ్రేడ్ కమాండర్!" అని ఛీఫ్ పెట్టీ ఆఫీసర్ తుల్యకోవ్ సమాధానం చెప్పాడు, దట్టమైన కనుబొమలతో ఉన్న తన గంభీరమైన ముఖాన్ని ఆఫీసర్ల వైపుకు త్రిప్పుతూ.

"ఏం అలా బిక్కమొహం వేశావు?"

"అవును. కొద్దిగా అలాగే ఉంది, కామ్రేడ్ కమాండర్. సరిగ్గా దాడి సలిపే ముందు మనం వెళ్లిపోవడం శోచనీయం. ఈ పర్వతాల మధ్య నేను మూడు సార్లు నా జన్మదినోత్సవం జరుపుకున్నాను. నేనిక్కడ పాతకాపనే చెప్పాలి."

"నేను కూడా యిక్కడ మూడేండ్లబట్టీ ఉంటున్నాను," అని మొదటి తరగతి పెట్టీ ఆఫీసరు యెగోరొవ్ అందుకున్నాడు. అతని కండ్లు మెరిసిపోయాయి. అతడు శత్రువులున్నవైపు చూపుతూ ఆకస్మికోద్రేకంతో అన్నాడు: "దొంగ వెధవల్లారా! మూడు సంవత్సరాలనుండీ మిమ్మల్ని ముఖాముఖీ ఎదుర్కొని మీదగ్గరనుంచి వడ్డీతో సహా వసూలు చెయ్యాలని అనుకున్నాం..." అతడు పిడికిలిని గట్టిగా బిగించాడు. ఆ తర్వాత పిడికిలి వదిలేసి ప్రక్కకు నిలిచాడు. అతడు అకీమొవ్వైపు చూసి సిగ్గుపడుతూ చిరునగవుతో అన్నాడు: "వాళ్ల అలవాట్లన్నీ నేనిక్కడ కుణ్ణంగా తెలుసుకున్నాను — వాళ్లల్లో కొంతమంది ఎలా ఉంటారో నాకు తెలుసు."

రెండవ తరగతి పెట్టీ ఆఫీసరు గున్యావిన్ ఎక్కడో చీకట్లోంచి అన్నాడు: "మనల్ని ఎక్కడికి పంపుతున్నారో మీకు తెలుసా? రిజర్వుకా, మరెక్కడికన్నానా?"

ఎంత వాస్తవమైన ఆతురత అకీమొవ్‌కి కనబడిందంటే, అతడు నవ్వకుండా వుండలేక పోయాడు. "మనం ఏం తొందరపడక్కర్లేదు. వాళ్లు మనల్ని పిక్‌నిక్కుకు పంపర్లే."

వాళ్లంతా నవ్వారు.

"బాగా చెప్పారు," అన్నాడు యెగొరొవ్.

తమ ఆఫీసరు నిండు విగ్రహాన్ని చూసినప్పుడు ఆ నావికుల కళ్లల్లో గర్వం అగుపిస్తుంది. అతడంటే వారందరికీ యిష్టం. వారు ఇతర బటాలియన్ల వారికి తరచుగా సగర్వంగా చెప్తారు: "మా ఆఫీసరు మాస్కోవద్దా, స్మొలేన్స్క్‌వద్దా సైన్యంలో యుద్ధం చేశారు. ఆయనక్రింద పనిచేసేవారికి ఏ అపాయమూ కలగదు."

అకీమొవ్ ముందుకు నడిచాడు. మార్గంలో ఒక వంపుదగ్గర నిలిచి జర్మన్ల ముందరి ప్రాంతాన్ని చూశాడు. ముస్‌తా-తుంతూరి పర్వతశ్రేణి భూసంధికి అడ్డంగా ఎత్తుగా ఉంది. అతడు నిలబడ్డ చోటునుండి చూస్తే ఆ దృఢమైన కొండలు అభేద్యంగా అగుపించాయి. శత్రువుల రక్షణదుర్గాలను స్పష్టంగా ఆనవాలుపట్టవచ్చు. వాటిలో ఫిరంగులను ఉంచే అనేక రాతికట్టు వరసలూ, కాంక్రీటు ప్లాట్‌ఫారాలూ ఉన్నాయి.

ఆ బలీయమైన రక్షణస్థావరాల్ని చూసినప్పుడు అకీమొవ్‌కు, ఒక సంవత్సరం క్రితం ఓర్ష వద్ద జర్మన్లు దాడిసలిపిన బైలొరష్యన్ భూమిని తన కందకంలోని ఫిరంగి కాల్పుల రంధ్రంనుండి తానేవిధంగా చూసిందీ, ఆ దండయాత్ర సలిపినవారి బంధాల నుండి యూరప్‌ను విముక్తి చేసేందుకు తానెలా మున్ముందుకు వెళ్లాలని కలగన్నదీ జ్ఞాపకానికొచ్చింది. ఆ రోజుల్లో అది సుదూరమైన కలగా అనిపించింది. కాని ఇప్పుడో మన సైన్యాలు పశ్చిమదిశవైపున వార్సాను సమీపిస్తున్నాయి. దక్షిణాన రుమేనియా, యుగోస్లావియా హంగరీలకోసం పోరాడుతున్నాయి. ఉత్తరాన నార్వే సమయం ఆసన్నమయిందా?

"మనల్ని ఎక్కడికి పంపుతారనుకుంటున్నావ్?" అని అకీమొవ్ తలవని తలంపుగా మర్‌తీనొవ్‌ను అడిగాడు. అతడు సమాధానంకొరకు నిరీక్షించకుండానే అతనివైపు చూసి మళ్లీ అన్నాడు: "మనల్ని బహుశ తీరంపై లాండింగ్ చేయడానికి పంపవచ్చు."

"దేనినిబట్టి అలా అనుకుంటున్నావు?" అని మర్‌తీనొవ్ అడిగాడు అకస్మాత్తుగా ఆశ్చర్యపడుతూ.

“మనల్ని యింకెక్కడికి పంపుతారు? నేను పొరబడకపోతే, మనం ఒకటి రెండు రోజుల్లో ఆల్ప్ టిరోల్, స్టెయిర్‌మార్క్ జర్మన్ సరిహద్దు రక్షణసైనికుల వెనుక భాగంలో ఉంటామనుకుంటా.”

“నిజంగానే!” అని మర్‌తీనొవ్ అన్నాడు తొందరపాటుతో నిండిన కంఠధ్వనితో. అతడు ఒక్క నిముషం ఆలోచించి అన్నాడు: “నీ ఊహలు గురించి మనవాళ్లకు చెప్పకుండా ఉంటే మంచిది.”

“మనవాళ్లకా?” అని అకీమొవ్ చెయ్యి ఊపుకుంటూ అన్నాడు. “వాళ్లంతటికి వాళ్లేకనుక్కుంటారు, యీపాటికి వాళ్లకి తెలియకుండా ఉంటే. వాళ్లనుండి మనం ఎక్కువగా దాయలేం.”

యుద్ధరంగం పొడుగునా అణగారిన శబ్దం వినిపించింది: ఆయుధాలు గలగల మన్నాయి. కంపెనీ పెట్టీ ఆఫీసర్లు తాళిమి లేకుండా అరుస్తున్నారు. అప్పటికే అస్తమించ బోతున్న వెలుగులో అన్ని సన్నాహాలు జరిగిపోవాలని మనుషులు తొందరపడుతున్నారు. బహుత్వరగా చీకటిపడింది. అకీమొవ్ తిరిగి తన గుహకు వచ్చేప్పటికల్లా ప్రతీదీ కారు చీకటిలో మునిగిపోయింది.

సెలెజ్‌న్యొవ్ వెళ్లిపోబోతున్నాడు. “సెక్స్టెంట్ తీసుకో,” అని అకీమొవ్ అత నితో అన్నాడు.

“ఎందుకు?”

“అది మంచిది. దానిని పారేయడం మంచిది కాదు. నీకది జ్ఞాపకార్థంగా ఉంటుంది.”

“సరే మంచిది. ధన్యవాదాలు. వీటన్నిటినీ తెచ్చేందుకు నాకుర్రాళ్లల్లో ఎవరి నైనా పంపుతాను.”

“ఆలస్యం చేయవాకు, లేకపోతే సాపర్లు తీసుకుంటారు.”

“మంచం మాటో, కామ్రేడ్ కమాండర్?” అని మత్యూహిన్ అడిగాడు కోపంగా. “మనం దానిని ఒదిలిపెట్టడం లేదు కదూ?”

“నీకు ఏం కావాలన్నా తీసుకో. కాని ఒకటి మాత్రం గుర్తుంచుకో. నీ అంతటికి నీవే దానిని మోసుకుపోవాలి.”

ఆ హెచ్చరిక సబబైనదేనని మత్యూహిన్ గ్రహించి, విచారంతో నిండిన వీడ్కోలు

వీక్షణాన్ని ఆ నికిల్ మంచంవైపూ, తాను అతి కష్టంతో ఒక చోటుకు చేర్చిన యితర వస్తువులవైపూ ప్రసరించాడు.

అది అప్పటికే గతంలో ఒక భాగం అయిపోయింది. జ్ఞాపకంగానే మిగిలిపోయింది. తెలియని భవిష్యత్తు ముందుంది.

## 2

మర్నాడు కొవలేవ్‌స్కీ వచ్చేప్పటికే అకీమొవ్ గుహ ఇంజనీర్లకు వొప్పజెప్పవేయ బడింది. ఆపిల్సు ఉన్న పార్సిల్‌ను పట్టుకొని కారు దిగిన దగ్గరనుండి అక్కడికి చేరు కొనేదాకా దారి పొడుగునా కొండరాళ్లపై ఎగబ్రాకడంవల్ల ఆ పత్రికా విలేకరి బాగా అలసిపోయాడు.

అకీమొవ్వూ, అతని బటాలియనూ ఎవరికీ తెలియని గమ్యస్థానానికి వెళ్లారని వినగానే అతడు క్రుంగి పోయాడు. సరిగ్గా వెళ్లిపోబోయే సమయంలో అతడు అక్కడి యింజనీర్ల విషయం తెలుసుకుందామనుకున్నాడు. వాళ్లతో మాట్లాడిన తర్వాత అతడు వాళ్లను గురించి వ్రాయాలని, ముంచివేయబడ్డ శత్రువుల నౌకనుండి సంగ్రహించ బడిన మంచంమీద కూర్చున్నాడు. ''ఈ సాపర్లు, నావికులుకానప్పటికీ అద్భుతమైన ధైర్యంకల కుర్రాళ్లు,'' అని అతడు భావప్రేరితుడై ఆలోచించి పేజీలు నింపాడు. తర్వాత పరిసరంలో ఉన్న నౌకాదళ యూనిట్‌వద్దకు బయల్దేరాడు. అతడు విపరీతంగా జరుగుతున్న కాల్పులలో చిక్కుకొని, ఆనిచ్చ పార్సిల్‌ను గట్టిగా పట్టుకొని ఒక అరగంట సేపు నేలమీద పడుకోవలసి వచ్చింది. అదృష్టవశాత్తు అతడు గాయపడకుండా తప్పించు కున్నాడు. ఆపిమ్మట అతడు ఎవరిని గురించైతే తాను చాలా కాలంనుండి వ్రాద్దా మనుకుంటున్నాడో, ఎవరి పేరు మొత్తం నౌకాదళంకు తెలుసో ఆ సోవియట్ యూనియన్ వీరుడు, ఛీఫ్ పెట్టీ ఆఫీసర్‌ను అతడు కలుసుకున్నాడు.

అతనితో మూడుగంటలసేపు మాట్లాడిన తర్వాత, అక్కడున్న ఒక రెజిమెం టుతో కలిసి పలచని పులుసు, రొట్టెలు భోజనం చేసింతర్వాత వెళ్లేందుకు మళ్లీ సిద్ధ మయ్యాడు. కాని యిటీవల జర్మన్ స్వయంచోదిత నౌకను ముంచివేసిన తీరపు ఫిరంగి దళం అక్కడికిదగ్గర్లోనే ఉందని విన్నాడు. దానిమీద మంచి ఉత్సాహకరమైన ఒక వ్యాసం వ్రాయవచ్చునని భావించాడు. దానిని చూసేందుకై వెళ్లాడు. మార్గమధ్యంలో అతడూ,

అతనితోపాటే వస్తున్న మరో సైనికుడూ మెషీన్‌గన్ కాల్పులలో చిక్కుకున్నారు. ఈదఫా బ్రతికి బయటపడడం దుర్లభం అని అతడు భావించాడు.

తాను ఉత్తపిరికిపందని కొవలేవ్‌స్కీ భయంకొద్దీ తలపోశాడు. రోజుకు వెయ్యి సార్లు అతని హృదయం క్రుంగిపోతుంది. అయినా అతడెప్పుడూ ఎక్కడ ముఖ్యమైన సమావేశం ఉందని తెలిసినా, అభిరుచిని కలిగించే భేటీ ఉందన్నా, లేదా మంచి కథ వ్రాయడానికి వీలైన విషయం తెలుస్తుందన్నా అక్కడికి దేకుకుంటూనైనా సరే వెళ్తాడు. మొహం వెలవెలబోయి యింకా వణికి పోతున్నప్పటికీ అతడు ఎక్కడో ఒకచోట చతికిలబడి సైనికులనుండి యాదాస్తును తీసుకుంటాడు, వారిని ప్రశ్నలు అడుగుతాడు, వాళ్ల ప్రశాంతతకు యీర్ష్యజెందుతూ, ఆ సైనికుల కళ్లల్లోని మెప్పుకోలు కనిపెట్టకుండానూ. "ఆ విలేకరి మంచిధైర్యశాలి," అని వారంటారు. తన హృదయాన్ని తెలుసుకోగలరేమోనని కొవలేవ్‌స్కీ భావించాడు. బహుశ తెలుసుకోగలరు. కాని, వారతనిని నిందించేకంటే ఎక్కువ గౌరవిస్తారు, మెచ్చుకుంటారు. "అతడు అప్పుడప్పుడు భయపడిపోయినా అలాగే ముందుకు సాగిపోతూ వస్తాడు," అని వారు భావిస్తారు.

తన వ్యవహారాన్ని ముగించుకున్నాక కొవలేవ్‌స్కీ తనకోసం వేచి ఉన్న కారు వద్దకు మళ్లీ ఆ ఆపిల్సుపెట్టెను భుజానపెట్టుకొని వెళ్లాడు. యుద్ధరంగం ప్రథమశ్రేణికి కొంత దూరంలో పర్వతాలక్రింద ఉన్నప్పుడు అతనిలోని భయం అదృశ్యమైపోయింది. కొద్దిగా ధైర్యాన్ని కూడా తెచ్చుకున్నాడు. నౌకాదళాల కమాండరు ఏర్పరచిన ప్రత్యేకమైన సమావేశంలో పాల్గొన్ని తిరిగివస్తున్న కొంతమంది ఆఫీసర్లను అతడు కలుసుకున్నప్పుడు, ఆమర్నాడు మున్‌తా-తుంతూరి పర్వతాలలోని శత్రువుల శ్రేణులపై దాడి సలపవలసి ఉందని వారు అతనితో చెప్పారు. నౌకాదళ యూనిట్లలో ఒక దాని గిడ్డంగి లోపల ఆ ఆపిల్సును వదలిపెట్టి అతడు తిరిగి వెనక్కి వెళ్లిపోయాడు. ఆ తర్వాత, ఉద్రేకంతో ఊపిరాడక ఆ సన్నివేశాన్ని చూసి యాదాస్తులు వ్రాసుకొనేందుకు సిద్ధమయ్యాడు.

యుద్ధరంగం ముందరిప్రాంతం మౌనంగా చీకటిలో ఉంది. చట్టిక్కున ప్రతి ఒక్కరూ పైకివెగిరారు. వాయవ్యదిశవైపు దగ్గర్లో ఫిరంగుల ప్రేలుడుశబ్దం మెషీన్‌గన్‌లశబ్దం ఒక దాని తర్వాత మరొకటి వినిపించింది.

"అదెక్కడ జరుగుతోంది?" అని కొవలేవ్‌స్కీ అడిగాడు, తన ఉద్రేకాన్ని అణచుకోలేక.

కమాండర్ సెలెజ్‌న్యోవ్ తన మ్యాపుల డబ్బీనుండి ఒక పటాన్ని తీసి చూశాడు. "ఇక్కడ, మట్విపుఓనో ఫ్యోర్డ్," అని అన్నాడు. "మన సైన్యాలు అక్కడికి చేరి ఉంటాయి. అకీమొవ్ అక్కడ ఉన్నాడని గట్టిగా చెప్పగలను."

కొవలేవ్‌స్కీ గుండె కుదించుకుపోయింది. శత్రుశ్రేణుల వెనుక, దాడి చేసేందుకై వెళ్లడం అంటే ఏమిటో అతనికి బాగా తెలుసు. అతడు ఆనిచ్కాను, ఆమె బిడ్డను తలచుకోకుండా ఉండలేకపోయాడు.

ఎప్పుడైతే తమ వెనుక యుద్ధం ప్రారంభమైందని ముస్‌తా-తుంతూరిపైని జర్మన్లు తెలుసుకున్నారో, వారు వెంటనే స్రేడ్నీ ద్వీపకల్పంమీది సోవియట్ స్థావరాలపై తీవ్రంగా ఆకస్మికంగా కాల్పులు సాగించడం ప్రారంభించారు. కాని అక్కడి మన ఫిరంగి దళం మౌనంగా ఊరుకుంది, అచ్చంగా ప్రతి ఒక్కరూ నిద్రపోతున్నట్టు. కొద్ది గంటల యిన తర్వాతగాని, లాండింగ్ విజయవంతంగా జరిగిందని హెడ్‌క్వార్టర్సు వారు స్థిర పరచుకున్న తర్వాతగాని, రిబాచీ, స్రేడ్నీ ద్వీపకల్పాలపై కేంద్రీకరింపబడిన ఫిరంగి దళంవారు కాల్పులు ప్రారంభించలేదు.

ఒక గంటన్నరవరకు కాల్పులు సాగాయి. ఆ తర్వాత రెఫిల్ రెజిమెంట్లు నౌకా దళ యూనిట్లు శత్రువులపై దాడి చేసేందుకు వెళ్లాయి. జనరల్ రెన్‌డులిట్జ్ క్రింద ఉన్న పర్వత సైన్యాలు ఏమంత తీవ్రమైన ప్రతిఘటనను చేయలేదు. త్వరలోనే కొండ అంచులను పట్టుకొని, పైకెగ్రబాకుతున్న సోవియట్ సైనికులతో ముస్‌తా-తుంతూరి నిండిపోయింది. చేతిబాంబుల మంటలు పరిసరప్రాంతాన్నంతా చూడగలిగేట్టు వెలుతురి నిచ్చాయి. ఆ మొత్తం ప్రాంతం అంతా చెవులు చిల్లులుపడేలా విజయ నినాదంతో ప్రతిధ్వనించింది.

కోర్ హెడ్‌క్వార్టర్సునుంచి త్వరలోనే వచ్చిన సిబ్బంది ఆఫీసర్లు, లాండింగ్ పటాలాలూ దిగి పారావార రోడ్డును తెగగొట్టాయనీ, ఆవిధంగా జర్మన్లలో కలవర పాటును కలుగజేసి, తమ కార్యక్రమాన్ని విజయవంతం చేసేందుకు హామీనిస్తున్నాయనీ కొవలేవ్‌స్కీకు చెప్పారు.

అది అక్టోబరు పదవ తేది.

మన సైన్యాలు ఆ సందునుండి పశ్చిమానికి ప్రవాహంలాగా వెళ్లాయి. నౌకా కమాండ్‌వారిచే తనకోసం కేటాయించబడిన కార్లో కొవలేవ్‌స్కీ, ముందంజవేస్తున్న

యూనిట్ల అడుగుజాడల్లో నడిచే లారీలూ, ట్రాక్ శకటాలూ, ఫిరంగుల ప్రవాహం మధ్య అతికష్టంతో దారిచేసుకున్నాడు.

ఆ ఉద్రిక్తమైన సన్నివేశాలు అతడు ఆనిచ్కి సందేశాన్ని మరచిపోయేట్టు చేయ లేదు: అతనికి దారిలో తటస్థపడిన ప్రతివారినీ అకీమొవ్ ఎక్కడున్నాడని అడిగాడు. అకీమొవ్ బటాలియను మట్టివుఓనో ఫ్యోర్డ్‌వద్ద లాండింగ్ కార్యంలో పాల్గొందని తెలుసుకున్నాడేగాని అది సరిగ్గా ఎక్కడుందో ఎవరూ చెప్పలేకపోయారప్పుడు. అక్టోబరు 13వ తేదీ రాత్రి లినహమారి నౌకా స్థావరంవద్ద నౌకాదళంవారు ఎక్కువసైన్యాల్ని దింపినట్టు పుకార్లు. ఈ సైన్యాలు ఓడ రేవును ముట్టడించి వశపరచుకున్నాయి. ఇవి ఆవిధంగా జర్మన్ కమాండువారు తమ సైన్యాలను సముద్రంద్వారా ఖాళీ చేయించకుండా ఆటంక పరచాయి. అక్కడ అకీమొవ్ వుండే అవకాశం వుంది.

ముందుకు వెళ్తున్న యూనిట్ల పురోగమనం తగ్గిపోయింది. అందుకు కారణం వారు గుండ్రాళ్లతోనూ బురద నేలతోనూ చిత్తడులతోనూ నిండిన నిర్జన పీఠభూమిని దాటవలసి ఉండడమే. సైన్యం ముందు భాగపు పదాతి యూనిట్లతోపాటు ఇంజనీర్లు నడిచి ఆ నిర్మానుష్యమైన తండ్రా రోడ్లను శకటాలకోసమూ, ఫిరంగులకొరకూ బాగు చేశారు.

శకటాలు తరచుగా బురదనేలల్లో చిక్కుకున్నాయి; అప్పుడు వాటిని ఖాళీచేసి వాటిల్లోని ఫిరంగి గుండ్లను బాగా ముందుగా వెళ్లిపోయిన ఫిరంగులవద్దకు మనుషులే మోసుకుపోయారు. ఈలోపుగా ఆ శకటాలను వారు తమ చేతులతో తామే ముందుకు నెట్టేవారు. వర్షం, లేదా మంచు ఎక్కడా ఆగకుండా కురిసింది. చల్లగా చెమ్మగా ఉంది. ఇదివరకు అనేక సార్లు చిక్కుపడ్డట్టే కొవలేవ్‌స్కీ కారు బురదలో చిక్కుకున్నప్పుడు అతడు సహాయం చేయమని అరుస్తూ దారిని పోతూన్న యూనిట్‌వారిని కోరేవాడు. సీనియర్ లెఫ్టినెంటు పాసింజరు కార్లో ఎందుకు ప్రయాణం చేస్తున్నాడో అర్థంకాక సైనికులు సాయపడేందుకు తొందరపడేవారు కాదు. కాని అతడు తాను పత్రికా విలేకరినని చెప్పిన వెంటనే వారు యిష్టపూర్వకంగా అతని కారును మళ్లీ రోడ్డుమీదికి లాగేవారు. ఎవరో సైన్యానికి సంబంధించని వ్యక్తి తాము పడే కష్టసమయాన్ని వీక్షించి "దక్షిణాన" ఉన్న ప్రజలకు తమను గురించిన యీ సంగతులని తెలపాలని కుతూహల పడుతూండడం చూసి వారి మనసులకి అపరిమిత ఆనందం కలిగింది. తామున్న చోటకి మాస్కో దక్షిణాన ఎంతో దూరంలో ఉందని వాళ్లు తలపోశారు.

కొవలేవ్‌స్కీ కోర్ టెలిగ్రాఫ్ ఆఫీసు ఎక్కడుందో కనుక్కొని ఆశ్చర్యకార్థాకాలతో నిండిన వార్తని పంపాడు. అది యీ మాటల్తో ప్రారంభమైంది: "ముందుకు వెళ్తున్న సైన్యాలతో నా కారు వెళ్తోంది. పెచేన్‌గ మా ముందు ఉంది."

పెచేన్‌గను పూర్వం ఫిన్‌లాండుభాషలో పెత్‌సామొ అనిపిలిచేవారు. ఆ పెచేన్‌గ యిప్పుడు నిజంగానే ఎంతో దగ్గర్లో ఉంది. మంచుపొగతో కప్పబడ్డ ఆ పల్లపు భూమి ఫిరంగుల శబ్దంతో కంపించి పోయింది. చూడ్డానికి ఎంతో హృదయవిదాకరంగానూ తలకాయలు వేలేసుకుని వున్న ముగ్గురు జర్మన్‌ఖైదీలను కార్లో తీసుకొచ్చారు. వారు టిరోల్ నుండి వచ్చారు. ఆల్ప్సు పర్వతాలలో ష్యోర్‌నర్, డీటిల్‌లవద్ద వారు శిక్షణ పొందారు. యుద్ధం ప్రారంభదశలో, జర్మన్ జనరల్ స్టాఫ్ డాక్యుమెంట్లలో "బ్లూ ఫాక్స్" అని పేర్కొనబడ్డప్పటి వారి స్థితికీ, యిప్పటి స్థితికీ పోల్చి చూసినట్లయితే విచారింపవలసిన దృశ్యమే.

కొవలేవ్‌స్కీ వాళ్లతో అప్పుడే, అక్కడే మాట్లాడి వెంటనే వార్తను వ్రాసి తక్షణమే తంతిద్వారా మాస్కోకు పంపాడు. "తలకాయలు వేలేసుకొని, తండ్రా నేలలపై కష్టంతో కాళ్లీడ్చుకుంటూ నడుస్తోన్న క్రీట్ నార్‌విక్ వీరులు యిక్కడున్నారు," అని ఆ వార్త ప్రారంభమైంది.

పెత్‌సామొను ఆక్రమించుకున్న మర్నాడు అతడక్కడికి వెళ్లాడు. జనరల్లను సైనికుల్నీ కలుసుకొని యింటర్‌వ్యూ తీసుకున్నాడు. నావికులతోనూ, నౌకాసైనికులతోనూ ముచ్చటించాడు. ప్రపంచందృష్టి యిప్పుడు ఉత్తరదిశకు మళ్లిందని అతడు భావించాడు.

పెత్‌సామొ! జర్మన్ నౌకలు యిక్కడ్నుంచే యుద్ధంచేశాయి. ఎంతో కాలం బాధపడుతున్న మూర్‌మన్‌స్క్‌పై నాజీ విమానాలు దాడిచేసింది యిక్కడ్నుంచే. మన ప్రక్కలో బల్లెంమాదిరిగా ఉన్న ఆ పట్నం, చొరరానిదనిపించిన ఆ పట్నం ఇప్పుడు మన చేతుల్లో ఉంది.

కొవలేవ్‌స్కీ బ్రిగేడ్ హెడ్‌క్వార్టర్స్‌లో తాపీగా కూర్చొని వ్రాయడం మొదలు పెట్టాడు. అతని ప్రథమవ్యాసం యీవిధంగా ప్రారంభమైంది, "ఇప్పుడిప్పుడే మన సైన్యాలు విముక్తి చేసిన పెచేన్‌గ వీధుల్లో నా కారు నెమ్మదిగా నడుస్తోంది." నిజానికి పెచేన్‌గలో వీధులు అసలు లేనే లేవని చెప్పాలి. కాని అక్కడక్కడా దూరదూరంగా చెక్కల యిళ్లతో ఉన్న ఒక రోడ్డు మాత్రమే ఉంది.

అకీమొవ్ పార్సిల్ మాటే మరచిపోయాడు కొవలేవ్‌స్కీ. ఆ సంగతి జ్ఞాపకం రాగానే అతని అంతరాత్మ చివుక్కుమంది. ఆ బస్తీలో ఉన్న నౌకా సమన్వయశాఖ ఆఫీసరువద్దకు పరుగెత్తాడు, అతడు అకీమొవ్‌ను చివరికి ఎక్కడ కలుసుకో గలుగుతాడో తెలుసుకుందామని. లినహమారి ప్రాంతంలో శతవిధాలా కలుసుకోగలుగుదునని తెలుసుకొని అతడు అక్కడికి బయల్దేరాడు. కొవలేవ్‌స్కీ ఆపిలుపండ్లును వదలిపెట్టిన నౌకాదళ యూనిట్ నార్వే దేశపు సరిహద్దువైపు ఎంత కాలంక్రితమో వెళ్లిపోవడంచే ఆ పండ్లు ఐపులేకుండా పోయాయి. "ఏం దురదృష్టం!" అని కొవలేవ్‌స్కీ ఆశ్చర్యంతో పలికాడు. ఆ ఆపిలుపండ్లు నిజంగా అతనికి పీడకల వలెనే ఉండేవి. అతడు వాటిని అకీమొవ్‌వద్దకు తీసుకు వెళ్లాలని ఎంతో అనుకున్నాడు. వాటిని అకీమొవ్ అందుకున్నట్లైతే ఎంత ఆనందించేవాడో, ఎంత కృతజ్ఞతలు చెప్పకొనేవాడో అతనికి తెలుసు. ఎంతో దూరంలో ఉన్న ఉత్తరాదికి తాజా ఆపిలుపండ్లు వచ్చాయంటే, మనమే ఆలోచించుకోవాలి!

ఆనిచ్కా, ఆమె పాపాయి, ప్రవేశ పరీక్షలోని ఆనిచ్కా విజయం, అకీమొవ్ యెడల ఆమె ప్రేమ, వీటిని గురించి అతడు అకీమొవ్‌కు చెప్పినప్పుడు, అకీమొవ్ పొందే ఆనందాన్నీ, తాను పొందే అయిష్టంతో కూడిన సంతృప్తినీ కొవలేవ్‌స్కీ ఊహించుకోగలిగాడు.

ఎంతైనా, ఆపిలుపండ్లకంటే యీ వార్తే ఎక్కువ ముఖ్యమైందని అతడు భావించి లినహమారికి కార్లో వెళ్లాడు. కాని అక్కడ కూడా అతనికి అకీమొవ్ కనిపించలేదు. కొద్ది గంటలక్రితమే దాడి చేసేందుకు దిగిన లాండిగ్ యూనిట్లు ఎవరికీ తెలియని గమ్యస్థానానికి నౌకలో వెళి పోయాయి.

## 3

ఈ కొద్ది రోజులోనే మూడవ పర్యాయంగా నౌకాసైన్యాలు లాండింగ్ నౌకలలో, యీసారి నార్వే మండలంలోని జర్మన్ సేనల వెనుకనూ, పార్శ్వానా దిగేందుకై ప్రయాణమైయ్యాయి.

కార్యక్రమం యీక్రింద విధంగా ఏర్పాటు చేయబడింది: పూరోగామిదళం పది సబ్‌మెరైన్ ఛేసర్లలో పయనమయింది. దానిననుసరిస్తూ పదిమైళ్ల దూరాన పది రక్షక నౌకల, పది మైన్ – స్వీపర్ల కంటింజెంటు, వాటికి పది పన్నెండు మైళ్లదూరాన

మరో నౌకల కంటింజెంటూ వున్నాయి. నౌకలలోకి ఎక్కివెళ్లే విషయం అతి రహస్యంగా జరిగింది. ఆయుధాల గలగల, క్రిందికి దిగే 'గాంగ్‌వే'ల కిర్రుశబ్దం తప్ప మరే శబ్దం వినబడలేదు.

సైన్యాలు విదేశానికి బయల్దేరే ముందు నౌకల కమాండరు, సిబ్బంది ఆఫీసర్లు వెంటరాగా, తీరం వెంట వెళ్లాడు ఒక బటాలియన్‌నుండి మరొక బటాలియన్‌కు, ఒక కంపెనీ నుండి మరొక కంపెనీకి. అక్కడక్కడా టార్చిలైట్లు వెలిగాయి, ఆడ్మిరల్‌కు మార్గం చూపుతూ.

అతడు అకీమొవ్ బటాలియన్‌వద్దకు వచ్చినప్పుడు, ఉత్తర నౌకలలో ఆఖరికి వంటవానితో సహా అందరూ ఎరిగిన కంఠ్యజన్యమైన ఒత్తులతో అడిగాడు: "ఇక్కడనుండి బయల్దేరుతున్న వాళ్లెవరు?"

అందుకు అకీమొవ్ తగు విధంగా సమాధానం చెప్పాడు. అకీమొవ్ ప్రక్కను నిలబడగా ఆడ్మిరల్ నౌకాసైనికుల మధ్య నడిచి వారితో మాట్లాడాడు. అతడు అక్కడ్నుంచి వెళ్లేందుకు సిద్ధమయ్యాడు. అకస్మాత్తుగా టార్చిలైటును అకీమొవ్ ముఖం పైకి వెలిగించాడు. బటాలియన్ కమాండరు ముఖవర్చస్సు ఎండవానలకు కాయదేరి గంభీరంగానూ ఉద్రిక్తంగానూ నిష్కపటంగానూ అగుపించింది. "మళ్లీ నౌకాదళంలోకి వెళ్లడం మీకు యిష్టంలేదా?" అని ఆడ్మిరల్ అడిగాడు.

ఈ ప్రశ్న అకీమొవ్‌ను చకితుడ్ని చేసింది. ఎక్కడో చాలా కాలంక్రితం ఎవరో సరిగ్గా అదే ప్రశ్నను, అదే రాత్రి సమయంలో, టార్చిలైటు వెలుగులో అతనిని అడిగినట్లు అకీమొవ్‌కు జ్ఞాపకం. అది వాస్తవమో, లేక కేవలం తన భావనో అతనికి జ్ఞాపకం లేదు.

"అది కమాండ్ వారి యిష్టం," అని తన అభిప్రాయాన్ని స్పష్టంగా తెలియనివ్వకుండా అతడు సమాధానం చెప్పాడు.

ఆడ్మిరలు తన టార్చి లైటును ఆర్పేశాడు. ఆ మరుక్షణానే అంతటా కారు చీకటి. కాసేపు మౌనం వహించి ఆడ్మిరల్ అన్నాడు. "పేరు నిలబెట్టుకోండి. మిమ్మల్ని పని పూర్తి చేయడంతోటే నేను మళ్లీ నౌకలకు బదలీ చేస్తాను. మీరు భూమిమీద తగినంత యుద్ధం చేశారు. సరేనా?"

"అలాగే," అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. ఆడ్మిరల్ గొంతులో అలసట, ఆతురత గమనించి అతడు అకస్మాత్తుగా ఆయన యెడల విచారాన్ని పొంది

అన్నాడు: ''మీరేం విచారపడకండి కామ్రేడ్ ఆడ్మిరల్. మేం యీ పనిని బాగానే నిర్వహిస్తాం.''

ఆడ్మిరల్ ఉద్వేగంతో అకీమొవ్‌తో కరస్పర్శచేసి మరోమాట పలకకుండా తీరం వెంబడి వెళ్లిపోయాడు. త్వరలోనే జేబుటార్చిలైట్ల వెలుగు దూరంలో అదృశ్యమై పోయింది.

తనకు కేటాయింపబడిన సబ్‌మెరైన్ ఛేసర్ నౌకవద్దకు అకీమొవ్ వెళ్లాడు. అదే నౌకపై కొజ్‌లోవ్‌స్కీ కంపెనీ కూడా ఎక్కవలసి ఉంది. మిగతావారు మొదటి కంటింజెంటు నౌకలలో ప్రయాణమయ్యారు.

ఓడలలో బయల్దేరే పని మంచి చురుగ్గా జరుగుతోంది. ఛేసర్ నౌకలలోని నావికులు నౌకాసైనికుల్ని కాబిన్లవద్దకు పంపమని ఆజ్ఞలనొసగారు. మెల్లని కంఠధ్వనులతో: ''వాళ్లకు గిన్నెల్నీ, ముంతల్నీ యివ్వడం మరచిపోవద్దు. లేకపోతే వారికి సుస్తీ చేసినప్పుడు నౌక అంతటా వమనం చేసుకుంటారు. ఈ వేళ సముద్రం మరీ ఛండాలంగా వుంది,'' అని మంచి స్వభావంగల ఒక మనిషి గొంతు వినిపించింది.

''మేం వమనం చేసుకోంలే, భయపడవాకు,'' అని నౌకా సైనికులలో ఒక డన్నాడు. ''మీ నౌకకంటే హుషారైన నౌకల్నే చూశాంలే.''

''అలాగా? మంచిదే, ముందు ఆ సిగరెట్టు పారేయ్. లేకపోతే మరిదేనినో చూడాల్సి ఉంటుంది.'' నౌకాసైనికుడు పెద్దగా నవ్వాడు.

'గాంగ్‌వే'ను పైకెక్కించిన తర్వాత అకీమొవ్ ఒక నిముషం ఆగాడు, తన మనుషులు మెట్లమీదనుండి కాబిన్‌వద్దకు వెళ్లడాన్ని చూస్తూ. తర్వాత, అతడు ఆ ఛేసర్ నౌక కాప్టెన్‌కు స్వయంగా తనను తాను పరిచయం చేసుకొనేందుకై 'బ్రిడ్జి' వద్దకు వెళ్లాడు. లాండింగ్ నౌక అధిపతితో స్నేహంగా ఉండడమంటే జరుగనున్న కార్యం విజయవంతం కావడానికి ఎంతో తోడ్పడుతుందనే అర్థం.

అతడు 'బ్రిడ్జి'ని చేరుకుంటుండగా నావికులలో ఒకనికి గుద్దుకున్నాడు. దగ్గరగా చూసి జిగాలొను గుర్తుపట్టాడు.

''జిగాలొ నువ్విక్కడున్నావా?'' అని అతడు ఆశ్చర్యంతో తన కళ్లను తానే నమ్మలేక అన్నాడు.

''కమాండర్ అకీమొవ్!'' అని జిగాలో సమాధానం చెప్పాడు. ''నిజంగా మీరేనా?'' అతడు తనకందిచ్చిన చేతిని పట్టుకొని హృదయపూర్వకంగా కరచాలనచేస్తూ అన్నాడు: ''మా కమాండరు సంతోషించడా!''

అకీమొవ్ త్వరత్వరగా 'బ్రిడ్జి'వద్దకు వెళ్లాడు. పొట్టి లెఫ్టినెంట్‌ను కౌగలించుకున్నాడు. గొంతులో మాట గొంతులోనే అడ్డుకొనేంతగా ఆ లెఫ్టినెంట్ ద్రవించిపోయాడు. అతడు అనగలిగిందంతా: ''నమ్మదగిందేనా?'' అని అనడమే.

వారు సంభాషణ ప్రారంభించాలనుకుంటుండగానే, నౌక సముద్రంలోకి వెళ్లవలసిన సిగ్నల్ యివ్వబడింది.

పెనుగాలి వీస్తోంది. ఆ సబ్-ఛేసర్ నౌక ఖాళీగా ఉన్న చిన్న తెడ్డుపడవ మాదిరిగా ఎగిరిపడుతోంది. నిర్దాక్షిణ్యత అంటే ఎలా ఉంటుందో చిన్న నౌకలకు స్పష్టంగా చూపించాలనే వాంఛతో బారెన్ట్స్ సముద్రం కోపంగా వాటిని పచ్చడి చేస్తోంది. గాలి పెడబొబ్బలు పెడుతూ, గుడ్లగూబలాగా అరుస్తూ సముద్రానికి వంతపాడుతోంది.

అప్పుడప్పుడు మొహంమీది నీళ్లను తుడుచుకుంటూ, సంతోషంతో మెరిసే కళ్లతో ఉన్న ఆ పొట్టి కాప్టెన్ వంక చూస్తూ అకీమొవ్ బదేయ్‌కిన్ ప్రక్కనే 'బ్రిడ్జి' మీద నిలబడ్డాడు. అందుకు సమాధానంగా బదేయ్‌కిన్ చిరునవ్వునవ్వాడు. ఆ నవ్వుతో ఆ చప్పిడి ముఖానికి కొంత అందాన్ని చేకూర్చిందనే విషయం అకీమొవ్‌కి గుర్తుకొచ్చింది.

''బాగా చిక్కిపోయారు,'' అని బదేయ్‌కిన్ పెద్దగా అరిచాడు.

''ఏమిటి?'' అని అడిగాడు అకీమొవ్, గాలిహోరుకి వినబడక.

''చిక్కారు.''

''నాకు వండిపెట్టేందుకు మీ నీనా లేదుగా!''

''అవునవును!''

''అభినందనలు!'' అకీమొవ్ అరిచాడు.

''ఎదుకని?''

''మీకు ప్రమోషన్ వచ్చినందుకు, కామ్రేడ్ సీనియర్ లెఫ్టినెంట్. ఇంతవరకూ నేను గమనించలేదు సుమండీ?''

''ధన్యవాదాలు,'' అని సమాధానం చెప్పాడు నవ్వుతూ బదేయ్‌కిన్.

''ఏమిటన్నారు?''

''ధన్యవాదాలు.''

"ఏమి వాతావరణం నాయనా!" అని అకీమొవ్ అన్నాడు పెద్దగా నవ్వుతూ.

"మీకెక్కడ బాగుంటుంది?" అని బదేయ్‌కిన్ గలికంటే పెద్దగా అరిచాడు. "ఇక్కడా లేక సైన్యంలోనా?"

"ప్రతిచోటానూ," అని అకీమొవ్ పండ్లికిలించాడు. తర్వాత అతడు బదేయ్‌కిన్‌మీదికి వంగి అతని చెవిలో అరిచాడు: "మీరు కూడా నన్ను అభినందించవచ్చుండి: నాకు కుమార్తె పుట్టింది."

"ఏమిటీ?"

"పాపాయి. కుమార్తె. కాత్య."

"అభినందనలు!"

ఒక పెద్ద అల ఆ నౌకను కుడిప్రక్కకు వంచేసింది. "జాగ్రత్తగా పట్టుకోండి!" అని అరిచాడు అకీమొవ్ డెక్కుమీద పోగవుతున్న తన మనుషుల్తో. హోరుమని వీస్తున్న గాలి శబ్దంకంటే శక్తివంతంగా మ్రోగింది అతని గొంతు. ధైర్యస్థైర్యాలతో నవ్వుతూ ఉన్న ముఖాలన్నీ డెక్కునుండి చూశాయి. అకీమొవ్‌ను చూసేందుకై ఒక్క క్షణం ప్రక్కకు తిరిగాడు కషెవారొవ్. అతనికి తన యౌవనపు దినాలు జ్ఞాపకం వచ్చాయి. అకీమొవ్ కషెవారొవ్ భుజాన్నితట్టాడు ఆప్యాయంగా. కషెవారొవ్ చిరునవ్వునవ్వి ఏదో అన్నాడు. అది అకీమొవ్‌కు వినిపించలేదు. డెక్కుమీద నిలబడి నల్లటోపీలు పెట్టుకున్న తన మనుషుల్ని అకీమొవ్ బాగా గుర్తించగలడు: తుల్యకోవ్, మత్యూహిన్, గున్యావిన్, యెగోరొవ్, యింకా యితరులు. తన కుర్రాళ్లంతా బదేయ్‌కిన్ కుర్రాళ్లకి ఏమాత్రం తీసిపోరనీ, ఎటువంటి పనైనా వారితో చేయించుకోవచ్చుననీ అతడు కాస్త అసూయతో భావించాడు.

తనకు పరిచయం ఉన్న ఆ తీరపు ఆకారం అకీమొవ్‌ను ఆకర్షించింది. సముద్రంలో ముందుకు చొచ్చుకు వచ్చిన ఆ నల్లని నిటరపు పర్వతాలు తానిదివరలో చూసిన వాటికంటె ఏమాత్రమూ భిన్నంగా లేకపోయినా వాటి పట్టుచిక్కని లక్షణాలు వాటికే ఉన్నాయి. వారిప్పుడు వరంగెర్ ఫ్యోర్డ్ ముఖద్వారంలో ఉన్నారు. అదే సబ్-ఛేసర్ నౌకలో తాను బదేయ్‌కిన్‌క్రింద 'ద్వితీయుని'గా ఉన్నప్పుడు అకీమొవ్ ఆ ప్రదేశానికి యిదివరలో వెళ్లాడు. అక్కడే యింక కాస్తదూరంలో వారు లెత్యాగిన్‌ను, రికన్నాయ్‌సెన్స్ దళాన్ని భూమిమీదికి దించారు. ఆ విషయాన్ని బదేయ్‌కిన్ కూడా

జ్ఞాపకం చేసుకున్నాడు. అతడు అకీమొవ్ భూజాన్ని తట్టి తీరంవైపు చూయించాడు. ''అవును,'' అన్నాడు అకీమొవ్.

ఆ శీతలంగా ఉన్న ఎత్తుపల్లాల తీరంలో ఎటువంటి కష్టాలు, ఏలాంటి అపాయం ఆ రికన్నాయ్‌సెన్స్ మనుషులకు కలగనున్నదో అని తాను వాళ్లపై జాలి పడిన సంగతి అకీమొవ్ జ్ఞాపకం చేసుకున్నాడు. ఇప్పుడు తానే స్వయంగా అక్కడ దిగవలసి ఉంది. అయినా అందులో భయపడాల్సింది అతనికి ఏమీ కని పించలేదు. శత్రు ఆక్రమణకింద క్రుంగిపోతూన్న తన మిత్రుల మాతృభూమి తీరంలో దిగడమనే భావన, తాను సభ్యుడైన జాతియొక్క, సాయుధబలాలయొక్క ఔన్నత్య శక్తులయెడల తాను గర్వంతో ఉప్పొంగి పోయేట్టు చేసింది. సోవియట్ సైన్యం అప్ప టికే తన దేశాన్ని బారెన్ట్స్ సముద్రంనుండి నల్లసముద్రంవరకూ శత్రువుల నుండి విముక్తి చేసిందనీ, ఇప్పుడు దాని కర్తవ్యం కేవలం తన ప్రజల్ని రక్షించుకోవ డమే కాకుండా ఇతరులను కూడా విముక్తి చేయడమేననే భావన అతనిని పర మానందభరితుడ్ని చేసింది. ఆ కార్యం నిర్వహింపయోగత్యతగల కార్యం. వారు నిర్వ హించవలసిన, నిర్వహించగలిగిన కార్యం అది.

అతడు యువకమ్యూనిస్టు లీగ్‌లో ఉన్నప్పుడు యావత్ప్రపంచాన్ని నిరం కుశత్వంనుండీ, హింసనుండీ విముక్తి చేయాలనే శూన్యమైన, రూపరహితమైన అయినా అద్భుతమైన ఉద్రేకంతో నిండిన పలురకాల కలలుగని ఉప్పొంగిపోయాడు. ఇప్పుడా కలలే నిజమైనాయి. అవి ఒక స్పష్టమైన ఆకారాన్ని పొందాయి. అవి సరిగ్గా తాను యువకుడుగా ఉన్నప్పుడు కన్న కలలవలే లేకపోయినా వాస్తవానికి అద్భుతమైనటు వంటివే. అవును, ఆ వాస్తవికత యిది: ఓడ కంబంపై సోవియట్ పతాకం రెప రెపలాడడం, సబ్-ఛేసర్ నౌకా యింజను వేగంగా కొట్టుకోవడం, దీపాలు సాంకేతిక సిగ్నళ్లను మినుకుమినుకు మనిపించడం, లాండింగ్‌దళం డెక్కుమీద మౌనంగా బిఱ్ఱుగా కుర్చోవడం, ఇంకా యౌవనంలోనే ఉన్న అతని హృదయం ఉద్వేగంతో కొట్టుకోవడం, ఎక్కడ స్వాతంత్ర్యేచ్ఛతో ప్రజలున్నారో ఆ విదేశ తీరపు నల్లని ఆకృతులూనూ.

ఆ తీరం దగ్గరబడుతోంది. కొండల ఆకృతులు స్పష్టంగా, యింకా స్పష్టంగా ఎత్తుగా, మరింత మరింత ఎత్తుగా కానవస్తున్నాయి. ఆ సబ్-ఛేసరు నౌకలు చివరికి లోతుగా సన్నంగా ఉన్న ఆ ఫ్యోర్డ్ ముఖద్వారంవద్దనున్న రెండు రాతి శిఖరాల మధ్యగుండా వెళ్తున్నాయి.

ఆ నౌకలు, దీపాలుగానీ, వైర్‌లెస్ సిగ్నళ్లుగానీ లేకుండా నడుస్తున్నప్పటికీ, వాటి యింజన్లయొక్క ఎఘ్జాస్టుగొట్టాన్ని నీటిలోకి దింపివేసినప్పటికీ, త్వరలోనే వాటిని తీరంలోనివారు గుర్తుపట్టేశారు. ఒక తేజోవంతమైన మెఱుపు అగుపించింది. ఫిరంగి కాల్పుల చప్పుళ్లు వినిపించాయి. దగ్గర్లోనే ఒక ఫిరంగి గుండు సముద్రంలో పడింది. ఫ్యోర్డ్ రెండు ప్రక్కలనుండీ కాల్పులు సాగాయి. పైనుండి అస్పష్టమైన శబ్దంతో ఫిరంగి గుండ్లు దూసుకుపోయాయి. డజన్ల కొద్దీ మతాబీచువ్వలు ఫ్యోర్డ్‌నుండి వచ్చి, ఆకాశాన్ని వెలుగుతోనింపి నెమ్మదిగ నీళ్లల్లో కలిసిపోయాయి.

తమ నౌక కనుపించకుండా ఉండేందుకు పొగను విడవవలసిందిగా బదేయ్‌కిన్ ఆజ్ఞనొసగాడు. ఇతర నౌకలూ ఆవిధంగానే చేశాయి. తర్వాత ఆ నౌకలన్నీ తీరానికి పయనమయ్యాయి, ఆవిధంగా పొగను దట్టంగా విడుస్తూ. త్వరలోనే ఆ ఫ్యోర్డంతా ఆ పొగ మేఘాల కెరటాలతో నిండిపోయింది. తీరంలోని జర్మన్ ఫిరంగులు ఎక్కడా ఆగకుండా యిష్టం వచ్చినట్లూ ఎటు పడితే అటు కాల్పులు సాగించాయి. ఒక్కొక్కప్పుడు కాల్పుల వల్ల కలిగిన మకమకలాడే ఎర్రనికాంతి ఆ పొగలో తళ్లుక్కుమంది. ఆశ్చర్యాన్ని కలిగించే అందంతో పచ్చని నీళ్ల స్తంభాల ఆకృతిలో ఫ్యోర్డ్‌కంటే ఎత్తుగా పైకి లేచాయి.

బదేయ్‌కిన్‌కు ఆ తీరం బాగా తెలుసు. ఆ తీరంలోని నిర్ణీతస్థలంవద్దకు తన నౌకకు తీసుకు రావడంలో అతనికి ఏమీ కష్టం కలగలేదు. కాని అకీమొవ్‌ను గురించే అతనికి బెంగపట్టుకుంది. తన స్నేహితుడు బలవంతంగా దిగి, ఆ తర్వాత బట్టలు ఆర్చుకోవడానికిగానీ, వేడి చేసుకోవడానికిగానీ ఎక్కడా వీలులేనటువంటి ఆ ఆదరణలేని భూమిపై ముందుకు వెళ్లవలసి వుంటుందే అని అతడు విచారపడ్డాడు. తన చెంపలపై బడి గడ్డ కట్టుకుపోతోన్న ఉప్పు నీళ్లను తుడుచుకుంటూ "మా నావికులకూ వాళ్లకీ అదే తేడా," అని అతడు భావించాడు. "తీరంలో యుద్ధం చేసేందుకు అతడు వెళ్లకుండా ఉండవలసింది."

సైన్యాలు దిగేందుకు సంజ్ఞ యివ్వబడింది.

సబ్-ఛేసర్ నౌకలు అప్పటికే సముద్ర తీరానికి దగ్గర్లో ఉన్నాయి. శత్రువుల్ని తీరంనుండి తొలిగించేందుకై నౌకలు ఫిరంగులనూ మెషీన్‌గన్‌లనూ తీవ్రంగా ప్రేల్చుతున్నాయి. జర్మన్ మతాబీలు రివ్వున ఆకాశంలో కెగసి కొంతసేపు అక్కడ నిల్చి గజగజా వణికాయి. వాటి కాంతిలో తుఫానుగా ఉన్న సముద్రం, నురుగులు క్రక్కుతున్న అలలు, ఉద్రేకంతో నిండిన నావికుల గంభీరమైన మొహాలు, ఎమెచ్యూర్ తీసిన స్నాప్

షాట్ మాదిరిగా దట్టమైన నల్లని ఛాయలపూర్వరంగానికి ప్రతికూలంగా వెలుగుతో నిశితంగా ప్రకాశిస్తున్నాయి.

దగ్గర్లో ఒక ఫిరంగిగుండు ప్రేలి రవ్వలు ధ్వనిచేసుకుంటూ అన్నివైపులకు ఎగిరాయి. భారీ మెషీన్‌గన్‌లు 'గాంగ్‌వే'నుండి గణగణమని చప్పుడు చేసుకుంటూ దిగాయి. రెండో ఫిరంగిగుండు ప్రేలింది. ఒక మనిషి మూల్గాడు. మరొకడు నీళ్లల్లోకి పడిపోయాడు. 'గాంగ్‌వే'నుండి దిగుతున్న పటాలాల చీకటి ఆకృతులు తీరంలో నలువైపులా చెల్లాచెదరుగా సర్దుకున్నాయి. చాలా దగ్గర్లో మూడో ఫిరంగిగుండు బ్రద్దలైంది.

" 'కొలీజన్ చాపలు' తెండి!" అని బదేయ్‌కిన్ బొంగురుగొంతుతో ఆజ్ఞాపించాడు.

"ఛేసర్ నౌక దెబ్బతింది," అని అకీమొవ్ భావించాడు. కాని దానిని గురించి ఆలోచించడానికి యిప్పుడతనికి సమయం లేదు. అప్పటికే అతని ధ్యానం భూమిపై యుద్ధం చేయడానికి నడుస్తోన్న అతని మనుషులపై ఉంది. అతడు బదేయ్‌కిన్‌కు తాను వెళ్తున్నట్టు కూడా చెప్పలేదు. అలా చేయడానికి కారణం, అతడు మరచిపోయైనా ఉండాలి, లేదా ఏదైనా ఆటంకం కలిగేనా ఉండాలి. కాని అతడు 'గాంగ్‌వే'మీద అడుగు వేసినప్పుడు, తాను తన స్నేహితుడ్ని అవసరమైన సమయంలో బలవంతంగా విడిచి పెడుతున్నానే అనే భావన అతని హృదయంలో పొడిచినట్లయింది.

తీరన్ని చేరడంతోటే ఒక ఫిరంగిగుండు బ్రద్దలైన కారణాన అతడు ప్రక్కకు ఎగిరిపోయి నీళ్లల్లోపడ్డాడు. ముందుకు చొచ్చుకువచ్చిన ఒక రాయిని అతడు పట్టుకున్నాడు. అతని చెవులు గింగురుమన్నాయి. వేడితో మాడిపోతూన్న గాలి అతనిని అకస్మాత్తుగా కప్పేసింది. అతడు ప్రక్కకు తిరిగి చూసేసరికి, సబ్-ఛేసర్ నౌక మంటల్లో తగుల్కొని మండిపోతూంది. వెనక్కి తిరిగి వెళ్లకుండా వుండేందుకై అతడు తన మనోశక్తినంతా ప్రయోగించాడు. అతడు పుంజుకొని, ఉప్పునీళ్లు మ్రింగుతూ తీరానికి ఎగబ్రాకాడు. ఆ సబ్-ఛేసర్ నౌకపై అతడు చూసిన ఆఖరి వ్యక్తి జిగాలొ. ఆ తండేలు యింకా మెషీన్‌గన్‌వద్దే ఉన్నాడు, తీరంలోని బలీయమైన జర్మన్ స్థావరాలపై ఏకధాటిగా కాల్పులు సాగిస్తూ — అతని వెనుక అగ్నిశిఖలు బుసకొడుతున్నాయి. ఫిరంగిగుండ్ల ప్రేలుళ్ళు ఆకాశాన్ని బ్రద్దలు చేస్తున్నాయి.

''పదండి ముందుకు! పదండి ముందుకు!'' అని ప్రాకుతూ, పదేపదే ప్రేరేపిస్తూ నెమ్మదిగా అన్నాడు అకీమొవ్. అతని ప్రక్కనే మత్యూహిన్ ఉన్నాడు. కొంచం వెనకాలగా, తీరంపై సరిగ్గా ఎక్కడ కాల్పులు సాగించవలసిందీ నౌకలకు తెలిపేందుకై ఒక వైర్లెస్ సెట్‌తో నౌకాస్పాటర్లు ఉన్నారు.

అకీమొవ్ హృదయం కఠినమైనట్టీ, అమిత నిర్దాక్షిణ్యమైనట్టీ ఆగ్రహంతో బద్దలైపోతున్నట్లనుపించింది. వెనక్కి తిరిగి చూడకూడదని అతడు గట్టిగా ప్రయత్నం చేశాడు. కాని, అతడు నేలపై నక్కుకొని నడుస్తున్నప్పుడు, తనకు కొత్తయిన ఆ విదేశపు మట్టి వాసన సహితమూ ఫ్యోర్డునుండి వీస్తూన్న రంగుకాలిన దుర్గంధాన్ని తొలగించివేయ లేకపోయింది. తన వెనకాల మునిగిపోతున్న ఛేసర్ నౌకనుండి వచ్చే హెచ్చరిక కేకలనూ, చిన్నచిన్న ప్రేలుళ్లనూ, కిఱ్ఱుమనే శబ్దాన్నీ, నీళ్ల త్రుళ్లిన శబ్దాన్నీ తన పార్శ్వాలనుండి వస్తూన్న మెషీన్‌గన్‌ల మ్రోతగానీ, ఆ అలల గర్జనగానీ అతనిని విననివ్వకుండా చేయలేకపోయాయి.

''ముందుకు పదండి! పదండి ముందుకు!'' అని అకీమొవ్ తానెక్కడనుంచైతే యుద్ధాన్ని నడపాలనుకున్నాడో ఆ పర్వత శిఖరంపైకి ఎగ్రబాగుతూ నెమ్మదిగా అన్నాడు. అతడు చివరికి దానిని చేరుకొన్నాడు. అప్పటికే లెఫ్టినెంట్ కొజ్‌లోవ్‌స్కీ అక్కడ ఉండడం అతడు కనుగొన్నాడు. లాండింగ్ పటాలాలు ముందుకు ప్రాకుకుంటూ పోతోన్నట్టే, నిటంగాపైకి లేస్తున్న యుద్ధభూమిని అతడు కలయజూశాడు.

ఆ సైన్యాలలో ముమ్మందరి సైనికులు అప్పటికే నీళ్లకు ఒకతాడు దూరాన ఉన్నారు. ఎదురు కాల్పులవల్ల వారు నేలపై బోర్లా పడుకోవలసి వచ్చింది. చిన్న అర్ధచంద్రాకారపు మెట్టును మాత్రం వారు స్వాధీనపరచుకోగల్గారు. ఎడమవైపు తీవ్రమైన పోరాటం సాగుతోంది. అక్కడ తుల్యకోవ్ ఎడతెగకుండా మెషీన్‌గన్ కాల్పులను సాగిస్తున్నాడు. కొండ అడుగుభాగాన బాగా కట్టుదిట్టం చేసుకున్న జర్మన్ తీరపు ఫిరంగి బాటరీకి బలీయమైన పదాతిదళాలు ఉండడం స్పష్టం. అంచేతనే కాల్పులు అక్కడనుండి తీవ్రతరంగా జరుగుతున్నాయి.

నౌకా ఫిరంగిదళాలు సహాయం చేస్తూ ఉండవలసిందిగా తెలుపమని అకీమొవ్

నౌకా స్పాటర్లకి ఆజ్ఞాపించి ఆ తర్వాత, నేలపై బోర్లా పడుకొని వున్న నౌకాసైనికుల యుద్ధశ్రేణి వెంట అతడు నెమ్మదిగా ప్రాకుకుంటూ వెళ్లాడు.

"తయార్!" అని అతడు నెమ్మదిగా అన్నాడు. తమ కమాండర్ నోటినుండి వెలువడిన ఆజ్ఞ, తమకు పరిచయమున్న నౌకాపదాన్ని, ఎప్పుడైతే వారు విన్నారో ఆ వెంటనే తమకు అర్థమయింది అన్నట్టుగా వారు తలలు ఊపారు. రహస్యంగా ఉన్న శత్రువుల మోర్టార్లనుండి చెవులు చిల్లులుబడే శబ్దంతో మొదట నీటితీరం పొడుగునా, ఆ తర్వాత క్రమక్రమేణా నౌకాసైనికుల సమీపానా బాంబులు పడ్డాయి. అకీమొవ్ చెవులు నిక్కబొడుచుకొని విన్నాడు. చివరికి నౌకల ఫిరంగికాల్పులు మొదలు పెట్టడం విన్నాడు. ఆ తర్వాత అతడు ఎడమవైపున ఎదో ప్రేలిపోయి మంటలుపైకి లేవడం చూశాడు.

చటాలున బగ్గుమన్న ఆ మంటల వెలుగు ఒక్క క్షణం సేపు చుట్టూ ఉన్న పరిసరాలను కనబడేట్టు చేసింది. విసుగు పుట్టించే కొండలు, వాటిపైన వున్న పలురంగుల శాకములు, పాచి, మరిగుజ్జు విల్లోచెట్లు, కొండలపైన నల్లగా ఉన్న పాకలు ఆ వెలుగులో అగుపించాయి.

పిస్తోలుసంచినుండి పిస్తోలును బయటికి తీసి, లేచి నిటారుగా నిలబడి, "చలో!" అని అకీమొవ్ అన్నాడు.

మత్యూహిన్ తన మతాబీచువ్వల పిస్తోలును పైకెత్తి వరుసగా మూడు ఎర్ర మతాబీచువ్వలను ప్రేల్చాడు.

అకీమొవ్‌ను అనుసరిస్తూనే మిగతా మనుషులంతా లేచి నిలబడి, లోపల బాగా ఉడకపోసినట్టు వెంటనే తమ యూనిఫారం చొక్కాల ముందరి భాగాన్ని విప్పదీసుకున్నారు. మత్యూహిన్ తన జేబులోనుండి నావికుల టోపీని ఎంత తాపీగా వెలుపలికి తీశాడో అంత తాపీగానే తన సైనిక టోపీని ఓవర్‌కోటులో పెట్టుకున్నాడు.

పరిశుభ్రతంటేనూ, క్రమమన్నానూ ఎంతో యిష్టపడే మర్తీనొవ్ తమ నియమాలను ఉల్లంఘించే నావికుల్ని తరచుగా, తీవ్రంగా ఎన్నో సార్లు చీవాట్లు పెట్టేవాడు. వారు తమ పశ్చాత్తాపాన్ని కళ్లల్లో వ్యక్తపరుస్తూ అతని మాట వినేవారు. కాని ఆ మరుసటి పోరులోనే మళ్లీ మామూలు ప్రకారంగానే అదే పని చేసేవారు.

భయం ఎరుగని నావికుని చిహ్నమైన చారల బనియనులను నలుగురికి చూపించేందుకే కాదు వారీవిధంగా బెదరింపు సంజ్ఞచేయడం. ఆ బనియన్ని అలా

విప్పదీసి ఛాతీని చూపడం తమ త్యాగనిరతినీ, మరణం అంటే నిర్భయాన్నీ తెలియజేయడానికే.

''ముందుకు పదండి!'' అని అకీమొవ్ గర్జించాడు, మంచి పట్టులో ఉన్న పరిస్థితికి కైపెక్కి.

పదాతి దళాలవలె అరుపులుపెట్టకుండా నిశ్శబ్దంగా వాళ్లంతా ఆ నిటారుగా వున్న వాలుమీదికి తిరుగులేని వూపుతో పరుగెత్తారు. వారు శిఖరాన్ని చేరగానే దానిమీద ముందుకు పరుగెత్తి ఆ తర్వాత పీఠభూమిపైకి త్వరబడ్డారు. అక్కడ అంతా చీకటిగా ఉంది; అక్కడ యిక ఏ మతాబీచువ్వలూ మండటంలేదు. అందుకు కారణం బహుశ వాటిని యిదివరకు కాల్చిన జర్మన్లు అక్కడ్నుంచి పారిపోవడంవల్ల కావచ్చు. కొండలు అడ్డుగా ఉండడంవల్ల సముద్రం అక్కడికి అగుపించడంలేదు; తమ ప్రియమైన నౌకలూ, తమ సోదర నావికులు, తమ మాతృభూమి పతాకం, సముద్రంపైనున్న ప్రతీదీ, సముద్రంద్వారా వెనక్కి తిరిగివెళ్లే అవకాశం — ఇవన్నీ కూడా అవాస్తవమైనట్టూ, ఎంతో దూరంలో ఉన్నట్టూ అనిపించింది.

అకీమొవ్ కొండశిఖరంపై ఆగాడు, సేనా పార్శ్వాలుగానీ ఫ్యోర్డుగానీ తన దృష్టి నుండి తప్పిపోకుండా ఉండేందుకు. నౌకా స్పాటర్లు మళ్లీ తమ వైర్లెస్ సెట్టును నెల కొల్పారు. ముందుకు ఎంత దూరం వెళ్లిందీ తెలిపేందుకై మత్యూహిన్ మతాబీచువ్వలు పైకి ప్రేల్చాడు. ప్రతివ్యక్తీ చాలా కష్టంగా గాలి పీలుస్తున్నాడు. గాయపడ్డవారు గబ గబా సముద్రంవొడ్డుకు దేకుకుంటూ వెళ్లారు. అన్ని వైపులనుండీ వార్తావహకులు నివే దనలను అందివ్వడానికి వచ్చారు. తర్వాత ఆ చీకట్లో అంతర్ధానమైపోయారు. నెమ్మది పడింది. కాని ప్రతీదీ నమ్మించి మోసంచేసేదానిలాగా, ఉద్రిక్తతతో భయంకరంగా ఉంది. ఆ తర్వాత ప్రతీదీ మళ్లీ తిరిగి మతాబీచువ్వలతో వెలిగిపోయింది.

''మళ్లీ ప్రారంభమైంది,'' అని అకీమొవ్ విమర్శించాడు.

జర్మన్ల కాల్పులు యిదివరకెన్నడూ జరగనంత తీవ్రంగా జరిగాయి.

సేన వామపార్శ్వాన్నుండి ఒక మనిషి పరుగెత్తుకుంటూ, అప్పుడప్పుడు క్రిందికి నక్కుకుంటూ వచ్చాడు. తిరస్కారమో భయమో మనం చెప్పలేంగాని, అతని కండ్లు మతాబీల వెలుగులో తళుక్కు మన్నాయి. అతడు యింకా కొంత దూరంలో వుండగానే ఉల్లాసంతో ఉన్న గొంతుతో గట్టిగా అరిచాడు: ''వాళ్లు కొరకరాని కొయ్యలాగవుతు న్నారు. ఆ జర్మన్ ముండా కొడుకులు...'' అతడు బటాలియన్ కమాండరును గుర్తు

పట్టి, కావాతు మైదానంమీద వున్నట్టు 'ఎటెన్‌షన్'గా నిలబడి నివేదించాడు: "కామ్రేడ్ కమాండర్, శత్రువులు మనల్ని తిరిగి ఎదుర్కొంటున్నారు. తుల్యకోవ్ సహాయాన్ని కోరుతున్నాడు."

ఆ నావికుని ముఖంనిండా దుమ్ము, నెత్తురు చిమ్ముకొని ఉండడంవల్ల అతనిని గుర్తుపట్టలేకుండా అకీమొవ్ ఒక అరనిముషంవరకు అతనిని చూశాడు.

"ఎంతమంది మనుషులు మిగిలారు?" అని అతడు ఆ తర్వాత అడిగాడు కదులుతోన్న చెట్ల నీడలవైపు ముందుకు చూస్తూ. తనముందున్నవారిని ఎవరినో అడుగుతున్నాడని ఆ నావికుడు సమాధానం చెప్పలేదు. "నేను మాట్లాడేది నీతోనే," అని అకీమొవ్ అన్నాడు.

ఆ నావికుడు నాలుగు ప్రక్కలా చూసి ఆ తర్వాత అకీమొవ్ దగ్గరగా వచ్చి అతని చెవిలో చెప్పాడు, "చాలా కొద్దిమంది మాత్రమే మిగిలారు."

"నువ్వు పదిమంది మనుషుల్ని తీసుకొని అక్కడికి పద," అని అకీమొవ్ కొజ్లోవ్‌స్కీతో అన్నాడు.

ఆ లెఫ్టినెంటు తన మనుషులకు ఆధిపత్యం వహిస్తూ వాలుక్రిందికి వెళ్లిపోయాడు. తేలిక మెషీన్‌గన్‌లకు తగిలించిన గొట్టాలు ఆ వెలుగులో మినుకుమినుకుమన్నాయి. ముఖంనిండా నెత్తురు మరకలున్న ఆ నావికుడు లెఫ్టినెంటుకు ముందుగా పరుగెత్తాడు విచిత్రంగా గంతు లేసుకుంటూ, గొణుక్కుంటూ. అప్పటికిగాని అకీమొవ్ అతడు యెగోరొవ్ అని గుర్తించ లేకపోయాడు.

మరో పర్యాయంగా యుద్ధభూమి శాంతంగా ఉంది. సరిగ్గా నీటి అంచునే జర్మను ఫిరంగిగుళ్లు ప్రేలుతున్నాయి. "ఏమిటీ విశేషం?" అని అకీమొవ్ ఆలోచించాడు. అదే క్షణంలో అతడు అనేక అడుగుల చప్పుడు తనవెనుక విన్నాడు. అప్పుడెవరో అతనిని క్రింది నుండి పిలిచారు. కొద్ది నిముషాల్లోనే లెఫ్టినెంట్-కమాండర్ మర్తీనొవ్ పరుగెత్తడం వల్ల వగర్చుకుంటూ దాదాపుగా అతని ప్రక్కనే పడిపోయాడు. "మేం వచ్చాం," అని అతడన్నాడు.

ఆ మొత్తం ప్రదేశమంతా జనంతో నిండిపోయినట్లయింది. అక్కడ సందడి, అరుపులు చలరేగాయి. అకీమొవ్ తాను సముద్రాన్నీ, తీరానికావలనున్న నౌకలనూ వదిలిపెట్టేసి వెళ్లిపోతున్నట్టుగా అటువైపు చూసి, బ్రతికున్నవారికీ చనిపోయినవారికీ వీడ్కోలు నమస్కారం మనస్సులో చెప్పుకొని, తన బటాలియన్‌ను నడిపించుకుంటూ

ముందుకు వెళ్లాడు. అలల హోరు క్రమంగా దూరంలో సమసిపోయింది. మతాబీచువ్వల మంటలు కూడా పేలవంగా మినుకుమంటున్నట్లు కనిపించాయి. ఆ తెలియని తీరపు భూమిమీద ఆ బటాలియన్లు బండరాళ్ల రోడ్డుమీద రెండు కొండల సంధ్రుత్రోవలో బాగా దూరం నడిచాయి.

కొద్దిసేపు విశ్రాంతికై ఆగిన సమయంలో అకీమొవ్ తన కమాండర్లందరినీ ఒక దగ్గరకు పిలిపించాడు: ''యెగోరొవ్‌కు ఏం జరిగింది?'' అని అతడు అడిగాడు. ''గాయపడ్డాడా?'' ''అవును, కాని అతడు వెనక వుండిపోవ నిరాకరించాడు,'' అని సమాధానం వచ్చింది.

''బుయ్‌కోవ్?''

''గాయపడ్డాడు, అయినా వెనక వుండిపోవ నిరాకరించాడు.''

''సెమ్యోనొవ్?''

''చనిపోయాడు.''

''లెవషోవ్?''

''చనిపోయాడు.''

''సొత్‌నికొవ్?''

''తలకుగాయం తగిలింది, వెనక్కి పంపించేశాం.''

''బోయ్‌చేంకొ?''

''గాయపడ్డాడు. కాని వెనుక ఉండిపోవ నిరాకరించాడు.''

మర్తీనొవ్, తెల్లని దంతపుపిడిగల గోళ్లబ్రష్షుతో జాగ్రత్తగా చేతుల్ని తోముకుంటూ స్నానం చేశాడు. అతని మంగలికత్తి చదునుగా ఉన్న ఒక బండమీద ఉంది. క్షౌరం చేసుకొనేందుకై దగ్గర్లోనే ఉన్న మంటమీద నీళ్లు కాగుతున్నాయి. ''ఎవరైతే ప్రత్యేకంగా ధైర్యసాహసాలు చూపించారో వారిని బహుమతులకోసం సిఫారసు చేయ్యాలి,'' అని అతడన్నాడు.

క్రింద ఒకరి ప్రక్క మరొకరు పడుకున్న నావికులవైపు అకీమొవ్ చూసి వక్రంగా నవ్వుతూ అన్నాడు: ''వాళ్లకు కావలసింది బహుమానాలు కాదు, వాళ్లకి కాలసింది – నిద్ర.'' అతడు అలసటతో పైకి లేచి అన్నాడు, ''త్వరగా క్షౌరంచేసుకోండి. అందరిని వరసలో నిలబెట్టే ఆజ్ఞనివ్వండి. మనం కిర్‌కెనేస్‌కు వెళ్దాం.''



అధ్యాయం ఎనిమిది

# తీరాన (శేషం)

1

కిర్కెనేస్ బస్తీ రూపులేకుండా అయిపోయింది. జర్మన్లు పారిపోయే ముందు వరుసపెట్టి ఒక్కొక్క యింటినీ తగలబెట్టేసి ఆ వూరును నాశనం చేసేశారు.

తీరంవెంట కుప్పలుగా పడున్న బొగ్గుకు కూడా జర్మన్లు నిప్పంటించడంవల్ల కనుచూపు మేరవరకూ మిణుకుమిణుకుమనే నీలపుకాంతి కనిపిస్తోంది. స్మొలేన్స్క ప్రాంతంలోనూ బైలొరష్యాలోనూ అకీమొవ్ ఆఘ్రాణించిన హృదయ విదారకపు వాసన, ఎన్నడూ మరువరానటువంటి వాసన అగ్నిజ్వాలలకూ వినాశానికీ చిహ్నమైన వాసన నాలుగు చెరగులనుండీ వీస్తూ ముక్కును పగలగొట్టేస్తోంది.

మృత్యు నిశ్శబ్దత నలువైపులా అలముకొంది. అప్పుడప్పుడు, ఆ బస్తీకి ఎదురుగా యింకా జర్మన్లు తమ వశంలో ఉన్న కొండరాళ్ల స్కాగ్గెర్ ద్వీపంనుండి ప్రతి అరగంటకొకసారి, తెలివి తక్కువతనంతో అర్థంలేకుండా ఇంకా పేల్చుతూన్న కొద్ది ఫిరంగి గుళ్ల శబ్దంచే ఆ నిశ్శబ్దతకు భంగం వాటిల్లుతోంది. ఆ ఫిరంగిగుళ్లు బోలుగా ఉన్న శబ్దంతో ప్రతిధ్వనిస్తూ దగ్ధమైన వీధుల్లో ప్రబద్దలై న్యాయి.

నిర్మానుష్యంగా ఉన్న ఆ బస్తీని అకీమొవ్, అతని మనుషులూ నిశ్శబ్దంగా గస్తీ తిరిగారు. తోటలచుట్టూ ఉన్న పరిశుభ్రమైన వలతీగ కంచెలను బట్టీ, అక్కడక్కడా రాళ్లమధ్య కూలినయిండ్ల కప్పులనుండి చొచ్చుకు వచ్చిన చిమ్నీ గొట్టాలను బట్టీ వీధుల ఆకారాన్ని వారు ఊహించుకోగలిగారు. ఎక్కడైతే పరిశుభ్రమైన చక్కని వీధులు ఉండేవో అక్కడిప్పుడు రంగురంగుల జర్మన్ తెలిఫోన్ తీగలు బాగా చిక్కుబడిపోయి ఉన్నాయి. ఎక్కడైతే భూమి సముద్రంలోకి చొచ్చుకొని ఉందో ఆ ప్రదేశంలో ఒక చర్చి ఉన్నట్టు పటం చూపుతోంది: అంచేతనే ఆ బస్తీకి 'చర్చి అగ్ర'మని అర్థానిచ్చే పేరుంది. కాని ఆ చర్చి కూడా నాశనం చేయబడి దాని శ్మశానభాగపు కంచె మాత్రమే మిగిలింది.

వారు సూడ్-వరంగెర్ వర్క్స్ ఎడమటివైపు వెళ్లారు. పెత్తైన చిమ్నీలలో ఒకటి యింకా అలాగే నిలబడి ఉంది. కాని శిథిలంకాకుండా మిగిలివున్నదంతా ఒక పెద్ద యిటుకల కుప్ప మాత్రమే. ఇక్కడ కూడా నిశ్శబ్దత భయంకరంగా ఉంది. చుట్టూ ఒక్క పురుగైనా కనుపించదు.

''ఓర్షవద్ద ఉన్నట్టి జర్మన్లే యిక్కడా ఉన్నారు,'' అని అకీమొవ్ అన్నాడు. ''అక్కడివాళ్ల చేతలే యిక్కడా అగుపిస్తోందనడంలో సందేహంలేదు.''

''అవును, సరిగ్గా లెనిన్‌గ్రాడ్‌లో జరిగిన మాదిరిగానే ఉంది,'' అని మర్‌తీనొవ్ పరుషంగా జోడించాడు, మరికొన్ని జర్మన్ ఫిరంగిగుళ్ల ధ్వని చెవులసోకగా.

అకీమొవ్ వైర్లెస్‌ద్వారా హెడ్‌క్వార్టర్స్‌తో మాట్లాడాడు. బ్యోర్నెవత్న్ అనే గ్రామానికి వెళ్లి తర్వాత ఆజ్ఞలకోసం ఎదురు చూస్తుండవలసిందిగా అతనికి అజ్ఞలివ్వబడ్డాయి.

మినేవిచ్‌ను, అతని దళంతోనూ మూడు రోజుల ఆహారపదార్థాలతోనూ, మందుగుండు సామానుతోనూ తీరం సమీపాన వదలిపెట్టి మిగతా బటాలియన్‌ను అకీమొవ్ వెంటబెట్టుకొని వీధులగుండా కూలిన యిండ్ల కుప్పలుమీదుగా, నాటి వెనకాల ఉన్న వీధిలోకి వెళ్లాడు.

ఆ రోడ్డు దక్షిణానికి దారితీసింది. దాని పక్కనే బురదగా, మంచుపాడితో ఉన్న తండ్రా నేలమీద, అక్కడక్కడా వదలివేయబడిన సామాన్ల ట్రక్కులకోసం వేయబడిన చిన్నరైల్వే పట్టాలు నల్లగా కనపడ్డాయి. ట్రక్కులు తుప్పుపట్టిపోయి గడ్డకట్టుకపోయిన మంచుతో కప్పి వున్నాయి.

బ్యారెన్సెవత్స్ కిర్‌కెనేస్‌కంటే తక్కువగానే దెబ్బతింది. తెల్ల అంచుగల నీలపు శిలువతో ఉన్న నార్వే దేశపు ఎర్రజెండా ఎత్తుగా ఉన్న ధ్వజస్తంభాలపై, ఇండ్ల సమీపాన అప్పటికే ఎగురుతోంది. ఆ యిండ్లల్లో నివసించే జనం వెలుపలికి వచ్చి అణచుకొన్న ఆనందంతో సోవియట్ దళాలను ఆహ్వానించాయి. వారు గ్రామం పొలిమేరలో ఉన్న గనుల్లోనూ గుహల్లోనూ నివసిస్తున్నారు. సైనికులూ నౌకాసైనికులూ, హింసకు గురియై డస్సిపోయిన ఆ నార్వేదేశస్థుల ముఖాలను కరుణతో చూశారు.

స్నానాలకై ఏర్పడినట్టు కనిపించే పొడుగాటి ఎర్రని చెక్కల భవనంలోనూ, ఆఖరి క్షణందాకా జర్మన్లచే ఆక్రమింపబడి నాశనం చేయబడకుండా ఉన్నటువంటి మూడు యిళ్లల్లోనూ అకీమొవ్ తన మనుషులకు వసతి కల్పించాడు. అక్కడ యినుప మంచాలు, సైనికుల ఉన్ని బూర్నీసులూ లోపల ఉన్నాయి.

డ్యూటీలో ఉన్న వాళ్లు తప్ప బటాలియన్ వంటమనుషులు తమకు, ఉదయం భోజనం, మధ్యాహ్నం భోజనం లేదా రాత్రి భోజనం వీటిల్లో ఏమని పిలవాలో తెలియనటువంటి భోజనాన్ని తయారుచేసేంతవరకు ఆగకుండానే కాలవ్యవధి జ్ఞానాన్నే కోల్పోయిన మిగతా సైనికులంతా వెంటనే నిద్రపోయారు.

తన మనుషులందరికీ వసతి కల్పించిన తర్వాత అకీమొవ్ పడుకోబోతుండగా, ఫిరంగిగుళ్ల మోతకు సగం చెవుడు వచ్చినా అతనికి దగ్గర్లోనే ఒక బిడ్డ ఏడుస్తున్న శబ్దం వినిపించింది. అతడు వీధిలోకి వెళ్లాడు. అలసటచే ప్రాణాలు పోతోన్న మత్యూహిన్ తన ఆఫీసరు వెలుపలికి వెళ్లడం చూసి తాను నిద్రపోవడమా లేదా అనే విషయాన్ని నిర్ధారణ చేసుకోలేక అతనిని అనుసరించాడు. అకీమొవ్ గని దగ్గరకి వెళ్లాడు. లోపల ఎక్కడో ఏడుస్తున్న బిడ్డల్ని తల్లులు ఓదార్చుతూ ఉండడం విన్నాడు.

అతడు చీకటిగా ఉన్న భూగర్భ మార్గాన్ని ప్రవేశించాడు. అతడు పిల్లల్ని చూసినప్పుడు తనకు తెలిసినంతవరకు తానూ ఒక తండ్రినేనని ప్రథమ పర్యాయంగా భావించాడు.

కార్బైడ్ దీపాలకాంతిలో ఆ పిల్లల ముఖాలు ఎంత భయానకంగా తెల్లబడిపోయి ఉన్నాయంటే అకీమొవ్ హృదయం కనికరంతో నిండి, ఎక్కడో దూరంగా ఉన్న మాస్కోలోని తన చిన్ని కుమార్తె విషయంలో ఆతురత చెందింది. గోడలవద్ద మౌనంగా నిలబడ్డ మనుషులు అతనికి, శత్రువులచే సంపూర్ణంగా కొల్లగొట్టబడిన మానవమాత్రులుగానే గోచరింపక, తమ పిల్లలకై భయపడే తల్లితండ్రులవలెనే ఎంచి తానూ వారిలో ఒక భాగస్వామి అయ్యాడు.

దాదాపుగా అక్కడ ఉన్నవాళ్లంతా సముద్రతీరంలో నివసించే బెస్తవాళ్లవలె రాటుతేలిన ముఖాలతోనూ లేతరంగు వెంట్రుకల్తోనూ పొడుగ్గా ఉన్నారు. వాళ్లల్లో చాలామంది, ఆడవాళ్లతోసహా వులెన్ బనియన్లు 'స్కీ'యిజార్లు తొడుక్కున్నారు.

అకీమొవ్ ఏం చేయాలో తెలియక ఏదీ నిశ్చయం చేసుకోలేక మౌనంగా అలాగే నిలబడ్డాడు, ఆ గని లోలోతులనుండి ఒక వ్యక్తి సోవియట్ యూనిఫారంలో వెలుపలికి వచ్చే దాకా. ఆ వ్యక్తి లెత్యాగిన్ అని అకీమొవ్ గుర్తించి అతనివైపు త్వరత్వరగా నడిచాడు.

''మీరు కూడా యిక్కడే ఉన్నారన్నమాట?'' అని లెత్యాగిన్ అన్నాడు. వెలవెలబోయిన తన ముఖం సంతోషంతో వెలిగిపోగా తర్వాత తన చుట్టూ ఉన్న ప్రజలవైపు చూపిస్తూ విచారంగా పలికాడు: ''ఇక్కడేం జరుగుతోందో చూడండి? జర్మన్లు ప్రతి దానినీ ప్రేల్చి నాశనంచేసి వేశారు. వాళ్ల చేపలుపట్టే చిన్న దోనెల్నీ, మోటారు బోట్లను తీసుకువెళ్లిపోయారు. వీళ్లు ఆఖరికి చేపల వేటకైనా వెళ్లలేరు. పస్తులున్నారు.''

అకీమొవ్ ఒక్కక్షణం ఆలోచించి అతర్వాత అన్నాడు. ''నేను మొదట సుమారు రెండువందలమందికి భోజనం పెట్టించగలను — నా వంటమనిషి యిప్పుడు వంట చేస్తున్నాడు.''

లెత్యాగిన్ మొహం వికసించింది. అతడు నార్వేదేశస్థులతో నాలుగు మాటలు చెప్పాడు. వాళ్లు తక్షణమే తమ పిల్లల్నీ ఆడవాళ్లనీ పిలిచేందుకు గనుల్లోకి వెళ్లారు. వాళ్లు మరుక్షణంలో తిరిగివచ్చి మత్యూహిన్‌తో వంట యింటికి వెళ్లారు. మగవాళ్లు ఆడవాళ్లతోపాటు వెళ్లకుండా ఎక్కడ ఉన్నవాళ్లు అక్కడే ఉండిపోవడం అకీమొవ్ ఆనందంతో గమనించాడు.

''వాళ్లను కూడా వెళ్లమనండి,'' అని అతడన్నాడు. ఆ తర్వాత అతడు నవ్వి యింకా యిలా అన్నాడు, ''క్రీస్తు తన మొత్తం డివిజన్‌కు అయిదు రొట్టెల్తో భోజనం పెట్టాడని ప్రతీతి. నేను అతనికంటే బాగానే భాగ్యవంతుడ్ని, నాకు ఎక్కువ నిలువలున్నాయి:

మేం రెండ్రోజులు పోరాడాం. ఒక్క ముద్ద కూడా మింగ లేదు.'' మళ్లీ తట్టిన భావంతో అతని మొహం విచారంతో నిండిపోయి అన్నాడు: ''అంతే కాకుండా యిప్పుడు బటాలియన్‌లో ఇదివరకున్నంత మంది లేరు.''

అకీమొవ్ లెత్యాగిన్‌లు నెమ్మదిగా నార్వేవాళ్లను అనుసరిస్తూ వంటింటికి వెళ్లారు. యుద్ధసమయంలో మెషీన్‌గన్నర్‌గా పనిచేసిన వంటమనిషి దెర్యాబిన్ నిజమైన నౌకా వంటమనిషి వలెనే లావుగా వుంటాడు. దయార్ద్ర హృదయుడు. అతడు మత్స్యాహినుతో నిద్రపోతున్న నావికుల మెస్‌టిన్నులను సేకరించమని నియమించి, కొంతవరకు చూడ్డానికి సామాన్యంగానే అగుపడినప్పటికీ చిక్కగానూ సంతృప్తికరంగానూ ఉన్న జొన్న అంబలిని ఆడవాళ్లకి, పిల్లలకి వడ్డించాడు. బటాలియన్ కమాండర్‌ను చూసి పెద్దగా అడిగాడు: ''కామ్రేడ్ కమాండర్, రొట్టె మాటేమిటి?'' ''కొద్దిగా యివ్వు,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు.

లెత్యాగిన్‌ను కలుసుకున్నందుకు అతడు అమితానందాన్ని పొందాడు. ఆ రికన్నాయ్‌సెన్స్ ఆఫీసరు ధారాళంగా మనసు విప్పి మాట్లాడడు. అయినా నార్వే ఉత్తర ప్రాంతంలో తెలుసుకోవలసినదంతా అతనికి తెలుసు. అతడు ధారాళంగా వారి భాష మాట్లాడగలడు. అతనికక్కడ స్వస్థానంలో ఉన్నట్టుగానే ఉంది. నార్వేదేశస్థులు అతనిని ప్రత్యేకంగానే స్నేహభావంతో చూస్తారు. అతడంటే వారికి మంచి విశ్వాసం. అతడు జర్మన్ శ్రేణుల వెనుక యుద్ధం చేస్తున్నప్పటినుంచీ అతనిని వాళ్లల్లో చాలామంది ఎరుగుదురు. వారు అతని పేరును ''లెట్ట్‌యేగెర్'' లేదా ''నౌకల వేటకాడు'' అని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేసేట్టు మార్చేశారు.

''మీరెక్కడ భోంచేస్తున్నారు?'' అని అకీమొవ్ అడిగాడు.

''ఎక్కడబడితే అక్కడ,'' అని నవ్వుతూ సమాధానం చెప్పాడు లెత్యాగిన్.

''లేదా బహుశ ఎక్కడా చెయ్యక పోవచ్చు? వచ్చి నాతో భోంచేయండి.''

''అభివందనాలు,'' అన్నాడు లెత్యాగిన్. తర్వాత అతడు వెనక్కి తిరిగి అన్నాడు, ''అదుగో, కమాండెంట్ వస్తున్నారు.''

ఆ కమాండెంటు వెంట్రుకలు నెరసిన కర్నల్. అతడు సీనియర్ లెఫ్టినెంటుతో పాటు వచ్చాడు. నార్వేదేశస్థులు భోజనం చేస్తుండడం కొంతసేపు గమనించి ఆ తర్వాత అకీమొవ్‌ను అడిగాడు. ''ఇక్కడ కమాండ్‌లో ఉన్నది మీరేనా?''

''అవునండి.''

''చాలా మంచి పని చేశారు వాళ్లకు భోజనం పెట్టడం,'' అని అతడన్నాడు.

''లోగినొవ్, అనువాదకుడు,'' అని ఆయన మళ్లీ అన్నాడు తన సీనియర్ లెఫ్టినెంటును పరిచయం చేస్తూ.

లోగినొవ్ చాలా చిన్నవాడు. కొమ్ము చట్రంగల కళ్లజోడు. జీవకళ ఉట్టిపడే చక్కని మొహం. అతనికి నౌకాదళం ఆఫీసరంటే వెంటనే యిష్టం ఏర్పడింది, ముఖ్యంగా అతడు శ్లాఘనీయమైన చొరవ తీసుకొని ప్రజలకు భోజనం పెట్టిస్తున్నాడని విన్నప్పుడు. భోజనం చేస్తున్న మనుషులని తానిదివరకెన్నడూ చూడనట్టు మళ్లీ ఒకసారి చూశాడు నార్వేదేశస్థుల వంక కర్నల్. ఆ తర్వాత అతడు ఆ గ్రామంలో సైనిక దళాలకూ, చుట్టూ ఉన్న మొత్తం అన్ని సైనిక దళాలకూ స్థానిక జనానికి, ఎక్కువ సరఫరాలు వచ్చేంతవరకు, నిర్దిష్టమైన ఏర్పాట్లు జరిపేంతవరకు, తిండిపెట్టవలసిందిగా ఆజ్ఞనొసగాడు.

త్వరలోనే లోగినొవ్, ఇతర నార్వేదేశస్థులవలెనే పొడుగ్గా తెల్లగా ఉన్న బర్గోమాస్టర్‌ను (పురపాలక సంఘాధ్యక్షుడు) తన వెంట తీసుకువచ్చాడు. అతడు ఎంతో భయపడి పోయినట్లు కనిపించాడు. ఎక్కడో శిథిలాలలో అతడు దాగొన్నాడు. కిర్‌కెనేస్‌లోనూ పరిసరప్రాంతాలలోనూ ఏం జరుగుతూందో అతనికి తెలియదు. ఎంతో వెదికింతర్వాతగాని లోగినొవ్ అతనిని కనుక్కోలేకపోయాడు. కొంత గంభీరతతో అతనిని మిత్రసేనల పరిపాలనయొక్క ప్రజాప్రతినిధిగా నియమించాడు.

ఆ బర్గోమాస్టర్తూ, కమాండెంటూ కలిసి గనులలో నివసిస్తున్న ప్రజల్ని చూడడం మంచిదేమోనని లెత్యాగిన్ సూచించాడు. ''ఈ నార్వేవాళ్లు చాలామంది ఉన్నారు. నాకనేకమార్లు సహాయం చేశారు,'' అని తాను వాళ్లయెడల శ్రద్ధచూపడం న్యాయసమ్మతమైనదని సమర్థించుకొనే వాంఛతో గొణిగాడు.

గజగజా వణుకుతున్న పిల్లలవైపూ, పాలిపోయిన స్త్రీలవైపూ, నిరుత్సాహపడిన తండ్రులవైపూ మరొక పర్యాయం చూసి నిట్టూర్చుతూ అకీమొవ్ అన్నాడు: ''మనం యీ యిళ్లను వీరికి వొప్పజెప్పవలసి ఉంది, యేంచెయ్యడం!'' అంత మెత్తబడినందుకు క్షమాపణ కోరుకుంటూ మళ్లీ అన్నాడు: ''మళ్లీ మన మనుషులు కందకాలలోనూ గుహల్లోనూ ఉండవలసి వస్తుంది. అందుకు మనం ఏం చేయలేం.''

అందుకు కర్నల్ చిరచిరలాడుతూ అభ్యంతరం తెలిపాడు: ''మన మనుషులకు విశ్రాంతి అవసరం. వాళ్లు కూడా మానవమాత్రులే.'' ఒక క్షణం తర్వాత అతడు తన చేతుల్ని పైకెత్తాడు. అతని పరుషమైన చదరపు మొహంలో నిస్సహాయతను వ్యక్తంచేసే భావం

కనబడింది. అతడు నిరాశతో అన్నాడు: ''ఎంతైనా మీరు చెప్పిందే నిజం అనుకుంటాను, మేజర్. పిల్లల్తో యిక్కడ ఉండడం మంచిది కాదనుకుంటాను. మోటుతనమే అవుతుంది. అవును, లోగినొవ్! మంచి స్థితిలో వున్న అన్ని యిండ్లను ఖాళీ చేయవలసిందిగా ఆజ్ఞను వ్రాయండి. అదే మనం చేయవలసింది.''

కమాండెంట్ నిర్ణయాన్ని లోగినొవ్ ఆ బర్గో మాస్టరుకు వెంటనే తెలియపరచాడు. ఆశ్చర్యంతో సమ్మిళితమైన సంతృప్తిని తెలియపరచేందుకై అతడు తన మౌనాన్ని అధిగమించాడు.

అకీమొవ్ తన బటాలియన్‌వద్దకు వెళ్లిపోయాడు. తాను వసతి కల్పించిన యిళ్ల ల్లోనూ, పూర్వం స్నానపు గదులు ఉండే భవనంలోనూ మనుషులు విచిత్రమైన స్థితులలో గాఢంగా గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. వేడిగా గుండ్రంగా ఉన్న యినుప పొయ్యిప్రక్కనే డ్యూటీలో ఉన్న మనిషి కునుకు తీస్తున్నాడు. బటాలియన్ కమాండరు లోపలికి రావడాన్ని ఒక్క యెగొరొవ్ మాత్రమే గమనించాడు. అతడు కళ్లు సగం తెరిచి, నిందిస్తున్న కంఠ ధ్వనితో అన్నాడు: ''కామ్రేడ్ కమాండర్, మీరు పడుకొని నిద్రపోండి.''

''త్వరగానే పడుకుంటాను,'' అని అకీమొవ్ పరధ్యానంగా సమాధానం చెప్పాడు.

యెగొరొవ్ తన నావికుల బనియను చూయించి నవ్వుతూ అన్నాడు. ''దుస్తులు విప్పుకున్నాను. రెండున్నర సంవత్సరాల అనంతరం యిదే మొదటి సారి అనుకుంటాను. చాలా హాయిగా ఉంది.''

అకీమొవ్ మొహం కందిపోయింది. అతడు ప్రక్కకు తిరిగాడు. ''నీకు మెత్తని పరుపూ వేడి నీళ్ల సీసాకావాల్నా?'' అని అతడు అడిగాడు. ఆ తర్వాత డ్యూటీలో ఉన్న మనిషిని ఊపాడు. ''అందర్నీ లేపు.''

''లేపండి!'' అని డ్యూటీ మనిషి పెద్దగా అరిచాడు. అంతా చటిక్కున లేచి త్వరగా బట్టలుతొడుక్కోవడం ప్రారంభించారు.

వాళ్లను తానెందుకు మేల్కొలిపిందీ అకీమొవ్ కొద్ది మాటల్లో తెలియజేశాడు. తర్వాత అతడు సిగరెట్టు వెలిగించి వెళ్లాలనుకున్నాడు. కాని ఎలాగో వెళ్ల లేకపోయాడు. అక్కడే అటూ యిటూ తిరిగాడు. ఒక్క మాటైనా మాట్లాడకుండా తమ కోట్లు తొడుక్కుంటూ, కంబళ్లను చుట్టుకుంటున్న తన మనుషులవంక అతడు ఓరగా చూశాడు. వాళ్ల మొహాల్లో ఎక్కడైనా అసంతృప్తి కనిపిస్తుందేమోనని గమనించడానికి ప్రయత్నించాడు. కాని వాళ్లల్లో విసుగుదలగానీ, అయిష్టతతో గొణుక్కోవడంగానీ యీషణ్మాత్ర

మైనా కనుపించకపోవడంతో అతనికి ఎంతో ఉపశమనం కలిగినట్లయింది. ఆ మనుషులు తమకొసగిన ఆజ్ఞను ప్రపంచంలోకల్లా అతి సహజమైనటువంటి దానిగా పరిగణించారనడం నిస్సందేహమైన విషయం.

## 2

అకీమొవ్ తన బటాలియన్‌కు స్నానాల యింటినొక్కదాన్నే ఒదలిపెట్టాడు. వంటిల్లూ, భోజనాల గదీ, ఒక విధమైన క్లబ్బూ, బటాలియన్ ఆఫీసూ మొదలైన వాటన్నిటినీ ఆ యింట్లోనే యేర్పాటుచేశాడు. మనుషుల్ని యిండ్లల్లోంచి వెలుపలికి పంపించి వాటిని ఆడవాళ్లకు, పిల్లలకు, వృద్ధులకు యిచ్చాడు.

"ఇది మనకు సరియైనస్థలం," అని అకీమొవ్, తన వచ్చిన ఆఫీసర్లతో కందకంబస చుట్టూ వెక్కిరిస్తున్నట్టుగా చూస్తూ పండ్లికిలించాడు. "మత్యూహిన్, వస్తువులన్నీ క్రమంలో పెట్టు."

దెర్యాబిన్ ఆఫీసర్లకోసం వేయించిన చేపను పట్టుకొచ్చాడు. "చాలా తాజాది. ఇప్పుడే పట్టిన చేప," అని అతడు నవ్వుతూ అన్నాడు.

వాళ్ల ఆ చేపను భోంచేసి నిద్రపోవాలని పడుకున్నారు. నౌకాసైనికులు కూడా నిద్రపోతుండడంచే నిశ్శబ్దత అక్కడ నెలకొంది. మత్యూహిన్ తప్ప అంతా నిద్రపోతున్నారు. అతడు వెళ్లి ఒక చిన్న బల్ల, కొన్ని కుర్చీలు, కార్బైడ్ దీపం, చేతులు కడుక్కొనే పెద్ద గిన్నె, మెట్లమీద ఉండే కాలిపోయిన తివాచీ ముక్క, వీటన్నిటినీ తిరిగి తీసుకొచ్చాడు. ఆ తివాచీని ప్రవేశద్వారంవద్ద పరచాడు. త్వరలోనే ఆ కందకంబస యుద్ధరంగపు మొదటి శ్రేణిలో బాగా ఏర్పాటుచేసిన భోజనశాలవలె అవుపించింది. ఆ ఆర్డర్లీ సంతృప్తితో నవ్వుకున్నాడు. ఎలాగైతేనేం అతడు చివరికి పడుకోవడానికి సిద్ధమయ్యేసరికి అనువాదకుడు ఒక వృద్ధుడైన నార్వేమనిషిని వెంటబెట్టుకొని అక్కడికి వచ్చాడు.

"ష్," అని మత్యూహిన్ వారిని హెచ్చరించాడు కోపంగా, "కమాండర్ నిద్రపోతున్నాడు. ఒక వారం రోజులనుండీ అతనికి నిద్రలేదు."

"తప్పదు. నాకాయనతో పనుంది. నిజంగా పనుంది," అని లోగినొవ్ క్షమాపణకోరుకుంటున్న కంఠధ్వనితో పలికాడు.

ఆ వచ్చిన నార్వేమనిషి స్థానిక మతగురువని తేలింది. ఆ వ్యూళ్లోకల్లా దేవతార్చనకు సరిపడే ఒకే ఒక పెద్ద భవనం — స్నానల గదులున్న భవనం. దానిలో దేవతార్చన జరుపుకొనేందుకై అంగీకారం పొందాలని అతడు వచ్చాడు.

అకీమొవ్ తన నొసలు రుద్దుకుంటూ నిద్రమత్తులో లోగినొవ్ వంకా, నార్వే మనిషివైపూ చూశాడు, తానెక్కడుందీ తెలియక, వాళ్లకేం కావాలో అర్థంకాక. చివరికి అతనికి బాగా మెలుకువ వచ్చింది. ''తప్పకుండాను. మనం నార్వేలో ఉన్నాం. మీరు దేవతార్చన జరపాలనుకుంటున్నారా?'' అని అతడన్నాడు.

ఇది వింటూనే మర్తీనొవ్ కళ్లు తెరచి చటిక్కున లేచి కూర్చున్నాడు. ''వీల్లేదు. మనం అలా చేయడానికి వీల్లేదు,'' అని అతడు కోపంగా అన్నాడు. ''నేను మొత్తం ప్రదేశాన్నంతా రూప-చిత్తరువులతోనూ నినాదాలతోనూ అలంకరించాను. పార్టీ నాయకుల, ప్రభుత్వ నాయకుల రూప-చిత్తరువుల మధ్య మత కర్మకాండ జరగడమనేది ఊహించుకోగలరా?''

అకీమొవ్ నవ్వాడు. గాబరాపడి కందకంబసలోని ఒక మూలకు తప్పుకున్న ఆ లూథెరన్ మత గురువువైపు మర్తీనొవ్ ప్రసరించిన చూపులను చూస్తే, నిజంగా నవ్వే వస్తుంది.

''ఇదేం నవ్వులాట కాదు. రెడ్ ఫ్లీట్ క్లబ్బులో మత సంబంధమైన అర్చనలు జరగడం నేనొప్పుకోను,'' అని మర్తీనొవ్ కోపంగా అన్నాడు.

ఆ విషయంలో కొద్దిగా వాదన లేచింది. మత్యూహిన్ తన అభిప్రాయాన్ని యిలా వ్యక్తం చేశాడు: ''వాళ్ల ప్రార్థనలను వాళ్లే సలుపుకోనివ్వండి. ఏ వ్యక్తి అయినా ప్రార్థన సలపకూడదని పార్టీ నిషేధించలేదు. కాని స్థానిక ప్రజానీకానికి ఉపద్రవం కలుగజేసేటట్టి ప్రవర్తనని మాత్రం పార్టీ నిషేధిస్తుంది.''

''ప్రజా వాక్కే పరమాత్మ వాక్కు,'' అని అకీమొవ్ నవ్వాడు.

ఒక గంటలోపలే నార్వేజియన్లు క్లబ్బులో సమావేశం కావడం ప్రారంభమైంది. చేతుల్లో తమతమ ప్రార్థన పుస్తకాలు పట్టుకొని ఒక క్రమపద్ధతిలో తమతమ స్థానాలలో కూర్చున్నారు. అక్కడ బెంచీలు సరిపోనందువల్ల మిగతావాళ్లు నిలబడ్డారు. పొడుగుపాటి ఫ్రాక్‌కోటు వేసుకొని మతగురువు లోపలికి వచ్చాడు. అతని మొహం సన్నగా, ఎండవానలకు రాటుదేలిన బెస్తవాని మొహంవలే, దేవతార్చన జరిపే సమయంలో ప్రపంచమంతటా మతగురువులు తమ ముఖవర్చస్సులో కనపరచే విధంగానే పవిత్రతతోనూ

కొద్దిగా వ్యాకులతతోనూ ఉంది. అతడు సరిగ్గా కొవ్‌రోవ్ మతగురువు ఫాదర్ వసీలి వలెనే ఉన్నాడని తన చిన్నతనంను జ్ఞాపకం చేసుకుంటూ అకీమొవ్ తలపోశాడు.

వాళ్ల ప్రార్థనలు వినేందుకని ఆగాడు లోగినొవ్. ఏ రాజకీయ ఉపన్యాసమూ వాళ్ల నంత సంతృప్తి పరచనట్టుగా ఆ మతగురువు వుపన్యసించాడని తర్వాత అతడు అకీమొవ్‌తో చెప్పాడు. ఆ మతగురువు సోవియట్ సైన్యాలకూ, సోవియట్ సైనిక కమాండ్ వారికీ ధన్యవాదాలు తెలిపి, తన చర్చికి చెందిన వారందరూ వారికి సాయపడాలనీ, యావత్ నార్వే విముక్తికోసం అపవిత్రులైన జర్మన్ సైన్యాల ఓటమికోసం ప్రార్థనలు చేయాలనీ ప్రోత్సహించాడు. ఆ తర్వాత అక్కడ సమావేశమైన వాళ్లంతా ఒక కీర్తన పాడారు.

''ఎంతైనా, ఏమంత చెడ్డగా లేదు. కాని అతడు ఆ భగవంతుని పేరు మధ్య ఎందుకు ఎత్తాడో మాత్రం నాకు అర్థం కావడంలేదు,'' అని మర్‌తీనొవ్ మనస్ఫూర్తిగా చింతం చేసుకొని వ్యాఖ్యానించాడు.

దేవతార్చన అనంతరం ఆ మతగురువు, బర్గోమాస్టరు, ఆ గ్రామంలో పలుకుబడిగల మరో యిద్దరూ కలసి అకీమొవ్‌వద్దకు వచ్చి అతడు వాళ్లనక్కడ దేవాతార్చన సలుపుకోనిచ్చినందుకు, ఆతడు వారి ప్రజలపై కరుణ చూపినందుకు వారు అతనిని అభినందించారు.

''ఓల్‌సెన్, బడిపంతులు,'' అని అనువాదకుడు రష్యన్‌లో చెప్పాడు. ''ఇతడు విక్కొల, ధనవంతుడైన భూస్వామి. పక్కా దుర్మార్గుడు. జర్మన్లతో చేతులు కలిపి పనిచేశాడు. కాడ్, సాల్మన్ చేపల టోకువ్యాపారస్థుడు. స్థానికంగా ఉన్న అంగళ్లన్నీ వీడివే.''

అతని గొంతు పెద్దగా గంభీరంగా ఉంది. ఎర్రగా, అహంకారంతో, ప్రాణాంతకంగా వ్యాకులతతో ఉన్న విక్కొల మొహంమీద నవ్వకుండా ఉండేందుకై తన బలాన్నంతా ప్రయోగించాడు అకీమొవ్. ఆ విక్కొల మొహంలో ఒకే ఒక కదలిక కనిపిస్తుంది. అది, గాజువుండల వలెవున్న అతని కళ్లు తప్పించుకోవాలని చూడడమే.

అకీమొవ్‌కు లౌకికం తెలియదనే చెప్పాలి: అతడు ఆ మనిషితో కరచాలనం చేసేందుకు నిరాకరించాడు. కేవలం అతనిని గుర్తిస్తున్నట్టుగా కొద్దిగా తలను మాత్రం పంకించాడు. తర్వాత అతడు విక్కొల కళ్లల్లోకి సూటిగా చూశాడు. దాంతో ఆ వ్యాపారస్థుని కనురెప్పలు అదిరిపోతూ నులితిరిగిపోయాయి.

"ఏం బొజ్జన్నా! నువ్వు గాలికి ఎటుబడితే అటు తిరిగే రకం కదూ?" అని అకీమొవ్ అడిగాడు. లోగినొవ్ కొద్దిగా నవ్వి త్వరత్వరగా అనువదించాడు: "మీకేం కావాలి?"

నార్వేవాళ్లు ఒకరి తర్వాత ఒకరు మాట్లాడారు, మొదట బర్గోమాస్టరు, ఆ తర్వాత మతగురువు, పిమ్మట బడిపంతులు, చివరికి విక్కొలు. అతడే అందరికంటే ఎక్కువ చెప్పింది. అతని గొంతు ప్రశాంతంగా ఉంది కాని అతని కళ్లు మాత్రం మోసంగా అటూ యిటూ తిరిగాయి.

"విజయవంతమైన రష్యన్ పటాలాలకు తాను హృదయపూర్వకంగా స్వాగతమిస్తున్నానని అతడంటున్నాడు. యుద్ధం ముగింపుకు వస్తూన్నందుకు కిర్కెనేస్ ప్రజలు చాలా సంతోషిస్తున్నారు. వారు ఘనతవహించిన హాకొన్ రాజుగారి లండన్‌లోని నార్వే ప్రభుత్వంయొక్క, సోవియట్ మిలిటరీ కమాండ్‌యొక్క ఆజ్ఞలన్నిటినీ విధేయతో శిరసావహిస్తారు. దాడిసలిపిన వారి నిరంకుశత్వంనుండి విముక్తి చెందినందుకు వాడెంతో సంతోషిస్తున్నట్లు చెబుతున్నాడు. నిలువెల్లా విషంగల దుర్మార్గుడు," అని లోగినొవ్ భాషాంతరం చేశాడు.

అనువాదకుడు ఏం చెప్పాడో విక్కొలకు అర్థమయిందీ లేనిదీ చెప్పడం చాలా కష్టం. చేనేత పారిశ్రామికుల కుమారుడూ మనుమడూ అయిన ఆ అకీమొవ్ కళ్లలో ఆ దోపిడీగాడైన 'కులాక్'ను గురించి ఏమనుకున్నాడో అతడు బహుశా గ్రహించి ఉంటాడు. ఏమైతేనేం అతడు వెళ్లిపోయేప్పుడు సోవియట్ ఆఫీసర్ల కళ్లను చూడకుండా జాగ్రత్తపడుతూ వినయపూర్వకంగా బాగాక్రిందికి వంగి నమస్కారం చేశాడు.

అకీమొవ్, లోగినొవ్‌లు ఆ నార్వేవాళ్లని తమ కందకంబసనుండి వెలుపలదాకా వచ్చి సాగనంపారు. ఆ గ్రామానికి మళ్లీ బాగా జీవకళ రావడం వారు గమనించారు. ఆ పీఠభూమిపై వున్న అడవులలోనూ లోయలోనూ వున్న రక్షణస్థావరాలనుండి మగవాళ్లు ఆడవాళ్లు తమ పిల్లల్తో సైకిళ్లను తోసుకుంటూ, వీపుమీద మూటల్ని మోసుకుంటూ తిరిగి వస్తున్నారు. ఆడపిల్లలు యించుమించు మంచి బట్టలనే తొడుక్కొని, గుండ్రని కుచ్చులుగల అల్లిక టోపీలు పెట్టుకొని ఉండం చూసి అకీమొవ్ చిరునవ్వు నవ్వాడు. తల్లి చేతినో తండ్రి చేతినో పట్టుకొనిగానీ, సైకిలు సీటును పట్టుకొనిగానీ, ఆ పిల్లలు తమ తల్లిదండ్రుల పెద్దపెద్ద అంగలతో సమంగా నడిచేందుకై పరుగెత్తవలసి వచ్చేదనే చెప్పాలి. వాళ్లు రష్యన్లవైపు విచిత్రంగా చూశారు, కనుచూపుమేర దాటి అదృశ్యమైపోయేవరకు.

దూరంగా ఉత్తరదిశవైపున బొగ్గుకుప్పలు తగలబడిపోతుండంచే కానవస్తోన్న నీలపు మంటల వెలుగు చూసి అకీమొవ్ లోగినొవ్ వైపుతిరిగి అడిగాడు: ''వాళ్లా బొగ్గు మంటల్ని ఎందుకు ఆర్పరు? ఇళ్లను వేడి చేయడానికి వాళ్లకేమీ లేనటువంటి సమయంలో అక్కడ ఆ బొగ్గు అలా కాలిపోతూ ఉండడం శోచనీయం.''

లోగినొవ్ బర్గోమాస్టరును నాలుగు మాటలు అడిగాడు. ఒక నిముషం మౌనంగా ఆలోచించి బర్గోమాస్టరు యిలా అన్నాడు: ''డెట్ ఎర్ ఇక్కెవార్ట్.''

''అది మాది కాదు,'' అని లోగినొవ్ అనువదించాడు. ఆ తర్వాత అతడు మంచి స్వభావంతోనే కీచుమంటూ నవ్వి ఆ బొగ్గు పురపాలక సంఘానిది కాదనీ, ఫ్యాక్టరీ వాళ్ల దనీ విశదీకరించాడు. ''దానిని కాపాడి వారికి బహూకరించాలంటే మనం మనసైనికుల్ని తీసుకు వెళ్లాల్సుంటుంది,'' అని అతడు ముగించాడు.

నార్వేజియన్లు వెళ్లిపోయారు. లోగినొవ్ కూడా వెళ్లాలనుకుంటుండగా ఒక వృద్ధుడు తిన్నగా అకీమొవ్ కందకంబసవద్దకు వచ్చి, బటాలియన్ కమాండరును చూస్తూనే కొంతదూరంలో ఆగి నివ్వెరపోతూ అతనివైపు చూశాడు. ఏదో విషయాన్ని అతడు గట్టిగా నమ్మినట్లూ, ఆ విషయం తనకొక్కడికే తెలిసినట్లూ, అకీమొవ్‌కు దగ్గరగా వచ్చి టోపీని తీశాడు, తన ఎత్తైన నుదిటిపై తిన్నగా క్రిందికి పడుతోన్న నెరసిన జుట్టు కనబడేట్టుగా. అతడు ధగధగా మెరుస్తున్న తన నిశ్చలమైన కండ్లను అకీమొవ్‌కు లోగినొవ్‌కు మధ్య దూరంగా వున్న ఒక స్థలంపై కేంద్రీకరించి చూస్తూ నిశ్చితమైనట్టీ విసుగు పుట్టించేట్టీ దుఃఖకరమైన కంఠధ్వనితో మాట్లాడాడు.

ఆ వృద్ధ బెస్త మాట్లాడుతున్నప్పుడు అనువాదకుని మోము ఎర్రబడిపోయింది. ''మన కుర్రాళ్లు అతని మోటారు బోటును దొంగిలించారట,'' అని అతడు అనువదించాడు. ''అతడు బెస్తవాడు. అతని పేరు కారె పెడెర్‌సెన్. 'నేను దానిని జర్మన్లనుండి దాయ గలిగాను. కాని రష్యన్లు నాకంటె తెలివైన వాళ్లని బుజువు పరచుకున్నారు, అదెక్కడుందో కనుక్కున్నారు,' అని అతడంటున్నాడు. ఇది సిగ్గుచేటు. వాస్తవమైన అవమానం. నిజంగానే యిది వాస్తవమైన అపకీర్తి.''

అకీమొవ్ కోపంతో మండిపడ్డాడు. ''తొందరపడవాకండి మీ అవమానాన్ని, సిగ్గుచేటును ఒక ప్రక్క ఉంచండి. యుద్ధం జరుగుతోందని మీకు తెలియదా? బస్తీలు బుగ్గైపోతున్నాయని మీకు తెలియదా? కేవలం ఒక పడవపోయిందని ఆడపిల్లలాగా ముఖం ఎర్రగా పెట్టుకోవడంలో మీ ఉద్దేశమేమిటి? ఏదో ఘోరమైన విషయం జరిగినట్లూ

దాంతో ప్రపంచం అంతమైపోయినట్టూ లేదా మొత్తం మానవ జాతి ముందు మేం స్వయంగా అవమాన పడ్డట్టూ మీరనుకుంటారు,'' అని అతడన్నాడు. కాని చేతిలో టోపీతో నిశ్చేష్టుడై నిశ్శబ్దంగా నిలబడ్డ ఆ వృద్ధుని పరిస్థితి చూడగానే అతని నాలికపై మిగతా మాటలు గడ్డకట్టుకు పోయినట్లయింది. ''ఆ విషయం మేం చూస్తామని చెప్పండి,'' అని అతడు చిరచిరలాడే కంఠధ్వనితో చెప్పాడు.

లోగినొవ్, పెడెర్‌సెన్‌లు వెళ్ళిపోయిం తర్వాత అకీమొవ్ కాసేపు సిగరెట్టు కాల్చుకొని ఆలోచనలో పడ్డాడు; తర్వాత కంపెనీలు ఉన్న కందకంబసలకు వెళ్లాడు.

అక్కడ వాళ్లు యింకా నిద్రపోతూనే ఉన్నారు. ఎవరికీ ఉపయోగపడని ఒక పాతపడవకోసం వాళ్లనెందుకు లేపడం? అతడక్కడ ఒక నిముషం ఆగాడు, బూడ్సు జోళ్లు విడవకుండానూ ఓవర్‌కోట్లతోనూ నిద్రపోతూన్న యెగోరొవ్ వంక ఓరగా చూస్తూ, తర్వాత వెళ్లాలని వెనక్కు మళ్లాడు. కాని అకస్మాత్తుగా ఆగి డ్యూటీ మనిషితో అన్నాడు. ''వాళ్లను లేపు.''

మనుషులంతా వరుసగా నిలబడినప్పుడు అకీమొవ్ అడిగాడు, ''పడవను ఎవరు తీసుకున్నారు?''

సుమారు ఒక నిముషం దాకా ఎవ్వరూ ఏ మాటా మాట్లాడలేదు. చివరికి ఛీఫ్ పెట్టీ ఆఫీసరు తుల్యకోవ్ ముందుకు అడుగు వేసి ప్రశాంతంగా అడిగాడు: ''మీరు మాట్లాడేది ఏ పడవ గురించి కామ్రేడ్ కమాండర్? నేను ఒక పడవ ఉపయోగించుకున్నాను.''

అకీమొవ్ తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు. ''ఎందుకని?'' అని అతడు అడిగాడు.

కొద్ది సేపు కలవరపడ్డాక తుల్యకోవ్ సమాధానం చెప్పాడు. ''చేపలు పట్టడానికై వెళ్లేందుకు.''

''చేపలు పట్టడానికా? ఎందుకని?''

''మీకోసమే కామ్రేడ్ కమాండర్,'' అని గొంతు తగ్గించి సమాధానం చెప్పాడు తుల్యకోవ్.

''నాకోసమా?'' అకీమొవ్ తెల్లబోయాడు. ''నేను చేపలు లేకుండా బతకలేననుకుంటున్నావు అవునా ఛీఫ్ పెట్టీ ఆఫీసర్? ఊఁ. నాకోసం విచారిస్తున్నావు, అవునా? కాబట్టి నువ్వు నన్ను మెప్పించాలని వెళ్లి నువ్వూ నేనూ నలుగురిలో తలెత్తుకో లేకుండా చేశావు? ఎక్కడుందా పడవ?''

''నేను దానిని తీసుకువెళ్లిన చోటే తిరిగి పెట్టేశాను.''

''సునాయాసంగా నిలవండి,'' అని అకీమొవ్ నావికులతో అన్నాడు. ''మీరు వెళ్లొచ్చు.''

వాళ్లంతా ఉపశమనాన్ని పొంది తమ కందకంబసల్లోకి అదృశ్యమైపోయారు. తుల్యకోవ్ ఒక్కడే బటాలియన్ కమాండరుతో మిగిలాడు.

''ఆ స్థలం ఎక్కడో చూపించు,'' అని అకీమొవ్ ఆజ్ఞాపించాడు.

ముందు తుల్యకోవ్ వెళ్లాడు. చాలా దూరం నడిచాక వారు కుడివైపునున్న సన్నని ఫ్యోర్డువద్దకు వచ్చారు. ఏ సంకోచమూ లేకుండా తుల్యకోవ్ గట్టును అనుసరించి నడిచాడు. ఒక్క క్షణం ఆగి ఆలోచించి గట్టు దిగి నీటిదగ్గరకెళ్లాడు. అక్కడ కొండ రాళ్ల మధ్య ఒక సందులో ఆ పడవ ఉంది.

''దానిని నువ్వెక్కడ్నుంచి తీశావు? ఇక్కడ్నుంచేనా?'' అని అకీమొవ్ అడిగాడు.

''అవును, ఇక్కడ్నుంచే ననుకుంటాను.''

అకీమొవ్ చుట్టూ చూశాడు. ఫ్యోర్డుకుపైగా సుమారు మూడువందల అడుగులదూరాన నల్లని ఆకృతిలో ఉన్న ఒక బెస్త కుటీరాన్ని అకీమొవ్ గుర్తుపట్ట గలిగాడు. అతడు దగ్గరగా వెళ్లి కంచెపై వలలు ఆరవేసి ఉండడం చూశాడు. అతడాకంచెను దాటి తలుపుతట్టాడు. వెంటనే తలుపు తెరిచి, ఆడపిల్ల ఏదో అన్నది నార్వే భాషలో.

''పెడెర్‌సెన్?'' అని అకీమొవ్ అడిగాడు.

''య,'' అని ఆ పిల్ల సమాధానం చెప్పింది. అకీమొవ్ ఆ పదాన్ని జర్మన్‌నుండి అర్థం చేసుకున్నాడు.

''కారె పెడెర్‌సెన్?'' అని అతడు నొక్కి అడిగాడు.

''డెన్ గామ్లే మాన్ ఎర్ ఉతే యి స్యోన్,'' ('ముసలాయన సముద్రంమీదికి వెళ్లాడు'), అని ఆ పిల్ల సమాధానం చెప్పింది, దీర్ఘాలు తీస్తూ. ఆమె మాట్లాడిన విధానం దక్షిణాది రష్యన్లు మాట్లాడే పద్ధతిని పోలి ఉండడం చూసి అకీమొవ్ ఆశ్చర్యపోయాడు.

''గామ్లే మాన్?'' అని అకీమొవ్ చెవి గీక్కుంటూ అన్నాడు. ''ఎవరతను? అనువాదకునికోసం కబురు పెట్టాలనుకుంటాను.''

''నార్వే భాషలో 'ముసలాయన' అని దాని అర్థం,'' అని తుల్యకోవ్ విశదీకరించాడు, కనుపించీ కనుపించనటువంటి నవ్వుతో.

''నీకు నార్వే భాష తెలుసునన్నమాట. అవునా?'' అని అకీమొవ్ కోపంతో ఎగతాళిగా అన్నాడు. ''తెలివైన వాడివే. అవును కదూ? ఆ 'గామ్లే' మనిషి పడవే గనక తీయకుండా ఉంటే యింకా ఎక్కువ తెలివైనా వాడిగా ఉండే వాడివి!''

అతడా పిల్లకు సౌంజ్ఞలు చేసి ఆ కొండరాళ్ల వద్దనున్న పడవదగ్గరకు ఆమెను తీసుకు వెళ్లాడు. మొదట ఆమె భయపడినట్లు కనిపించింది, కాని ఎప్పుడైతే ఆమె పడవని చూసిందో ఆ మరుక్షణానే సంతోషంతో పెద్దగా అరిచింది.

అకీమొవ్ తుల్యకోవ్‌వైపు తిరిగాడు. ''ఈ సారి నువ్వు దేనినైనా అరువు అడగదలచుకుంటే మొదట యజమానిని అడుగు. మళ్లీ తిరిగి దానిని స్వయంగా అతనికే అందజెయ్యి. తెలిసిందా?''

''తెలిసింది.''

''ఆరచణలో పెట్టేట్టు చూడు.''

వాళ్లు తామున్న ప్రాంతానికి తిరిగి వెళ్లేందుకు బయల్దేరారు. చాలా సేపటి వరకు అకీమొవ్ ఏమీ అనలేదు. తర్వాత తుల్యకోవ్‌వైపు తిరిగి అన్నాడు: ''నువ్వు మనలందరినీ అంతర్జాతీయ చిక్కుల్లోకి తెచ్చిపెడతావు. అందుకు సంజాయిషీలు యిచ్చుకోవలసి వుంటుంది. ఎవరి దోషంవల్ల? 1920 లో జన్మించిన, యువకమ్యూనిస్టు లీగు సభ్యుడైన ఇల్యా తుల్యకోవ్ అనే చీఫ్ పెట్టీ ఆఫీసరు పుణ్యమా అంటూ. ఏమీ బాగా లేదు, తుల్యకోవ్. ఇక వెళ్లు.''

తుల్యకోవ్‌ను చీవాట్లు పెట్టడం అకీమొవ్‌కు హృదయపూర్వకంగా అంత యిష్టం లేదు. అతడు తన అంతరాత్మలో అతనిని తప్పుపట్టలేదు. అతడు పడవను తీసుకోవడం వాస్తవమే కాని అతడు దానిని ఏవిధంగా కనుగొన్నాడో ఆదేవిధంగా దానిని తిరిగి అక్కడే ఉంచేశాడు. అతడు దానిని ఆ వృద్ధుని గుడిసెలోకి గుంజలేకపోయాడు అంచేత దానిని దగ్గర్లోనే నీటిపై ఉంచేశాడు.

ఆ రహస్యం కొంతసేపయిన తర్వాత స్పష్టమయింది. అకీమొవ్ తన ఆఫీసర్లతో భోంచేస్తున్నప్పుడు లెత్యాగిన్ లోపలికి రాగా అతనిని వారు తమతో భోజనం చేయమని ఆహ్వానించారు. ఆ తర్వాత వృద్ధుడైన పెడెర్‌సెన్ గబగబా ఆ కందకంబసలోకి వచ్చాడు.

అతడు అమితానందంతో ఉన్నాడు. ఇదివరకు హృదయవిదారకంగా కదలిక లేకుండా నిందిస్తున్నట్టుగా ఉన్న ఆతని కళ్లు యిప్పుడు తేజోవంతంగానూ, నవ్వుపుట్టిం

చేట్టుగా ముడతలుపడి సంతోషదాయకంగా మినుకుమినుకుమని ప్రకాశిస్తున్నాయి. అకీమొవ్‌పట్ల, యితర ఆఫీసర్లయెడల అతని ప్రవర్తన ఎంతో స్వేచ్ఛగా ఉంది. తండ్రి కుండే నిగర్వం కూడా అందులో గోచరిస్తుంది. వారు వేరేదేశపు యూనిఫారంలు తొడుక్కున్నప్పటికీ అతడు వారిని కేవలం సామాన్యమైన యువకులవలెనే, తన స్నేహితులవలెనే పరిగణించి ప్రస్తావించాడు. ఈ తలవనితలంపుగా జరిగిన, మనసు కరగించే గాఢమైన కృతజ్ఞతావ్యక్తీకరణ అకీమొవ్‌కు అమితంగా వినోదాన్ని కలిగించింది. అంతే కాకుండా అతని హృదయాన్ని ద్రవింపజేసింది.

పడవ విషయం అడగమని అతడు లెత్యాగిన్‌తో చెప్పాడు. అతడు తెలుసుకున్నది యిది. ఫ్యోర్డు పొడుగునా ఉన్న భూమి చిన్నచిన్న భాగాలుగా విభజింపబడింది. ఒక్కొక్క భాగానికీ వేర్వేరు సొంతదారులున్నారు. తుల్యకోవ్ ఆ వృద్ధ బెస్తవానికి చెందిన చిన్ని భూభాగంనుండి పడవను తీసుకొని వెళ్లి వేరేవాని స్థలంలో వదలిపెట్టాడు. తన బోటు కోసం యితరుల భూమిదగ్గరకు వెళ్లి వెదికే హక్కు తనకు లేదనీ, తనకిష్టం వచ్చిన వారిని తప్ప ప్రతిసొంతదారుడూ ఏ మనిషినీ తన ఆస్తి అయిన భూభాగంలోకి అడుగు పెట్టనివ్వడనీ పెడెర్‌సెన్ ఎంతో గంభీరంగా విశదీకరించాడు.

"అవును, ఇక్కడి విధానం అదే," అని చెప్పాడు లెత్యాగిన్.

అక్కడున్న భూమి, ఆఖరికి లంకలపైని భూమి అయినా సరే, నిజంగానే చిన్న చిన్న ఆస్తులుగా విభజింపబడింది. చాలా వాటిల్లో 'అడ్‌గంగ్ ఫర్‌బుడ్ట్' అంటే 'ప్రవేశించడానికి వీల్లేదు' అనే నోటీసు బోర్డులు ఉన్నాయి. గడిసబారిన బర్చిచెట్లూ, మరిగుజ్జు కేబేజీ మళ్లూ, రవంత పచ్చిక భూమి ఈరిక — వీటి మధ్య తాను నివసిస్తున్న దౌర్భాగ్యమైన చిన్న పొలం పిసరుకు దారితీసే తన సొంత ప్రయివేటు బాట ఒకటి ప్రతి సొంతదారుడికీ ఉంది. చుట్టూ అన్నివైపులా మనిషికి చెందని నిర్మానుష్యమైన పీఠభూమి ఉంది. మొత్తం వేసవికాలమంతా మేసేందుకని లాప్ దేశస్థులు తమ ధ్రువపుజింకలను అక్కడ విడిచి పెడతారు.

ఆఫీసర్లు తమతోపాటు భోంచేయమని ఆ వృద్ధ బెస్తవానిని ఆహ్వానించారు. అతడు నల్ల రైరొట్టెతో సహా ప్రతి దానియందూ విపరీతమైన ఆకలిని కనపరచాడు. ఆ నల్ల రొట్టె, వెన్నలో వేయించబడిందన్న చిత్రమైనపుకార్లు నార్వేవాళ్లలో ప్రసరించి ఉన్నాయి. "నిజంగానే... నిజంగానే!" అని అకీమొవ్ అన్నాడు ఆ వార్త విని ఆశ్చర్యపోతూ. "ప్రజలు ఎలాంటి విషయాలను ఊహిస్తారు!"

అతని మాటలు వృద్ధుని మాటలచే స్థిరబడ్డాయి. రష్యన్లు శాశ్వతంగా అక్కడ ఉండిపోతారనీ, యావత్తు నార్వేదేశాన్నీ జయిస్తారనీ, మొత్తంపడవల్నీ, భూమినీ, అడవుల్నీ, పశువుల్నీ, స్త్రీలనీ స్వాధీనం చేసుకుంటారనీ అనుకోవడం నిజమేనా అని ఆ వృద్ధుడు బహు జాగ్రత్తగా అడిగాడు. "వయసులో ఉన్న ఆడవాళ్లనే అని నేను అనుకుంటా?" అని అతడు అడిగాడు, తన పేలవంగా ఉన్న నీలపు కళ్లతో చమత్కారంగా సైగచేస్తూ.

"అవన్నీ కూడా క్విస్లింగ్ వెధవలు అల్లే అబద్ధపు కల్లిబొల్లికబుర్లు," అని లెత్యాగిన్ ఆ వృద్ధునితో చాలాసేపు కోపంగా సంభాషించిన తర్వాత వ్యసనం చెందిన కంఠధ్వనితో అన్నాడు. "విక్కాల, యింకా అలాంటి మనుషులే మీకు ఆవిధంగా బోధ చేసింది." అతడు మర్‌తీనొవ్‌వైపు చూశాడు. మర్‌తీనొవ్ బాగా ఉద్రిక్తుడై అతనిని హెచ్చరించాడు: "అది మన వ్యవహారం కాదు కామ్రేడ్ లెఫ్టినెంట్ కామాండర్; అది నార్వే ప్రభుత్వం చూసుకోవలసిన పని. మాస్కోనుండి వచ్చిన ఉత్తరువులు తెలిపేది అదే."

ఆ వృద్ధుడు త్వరగానే భోజనం ముగించి వెళ్లిపోయాడు. ఆ తర్వాత కొద్దిసేపట్లోనే లెత్యాగిన్ కూడా లేచాడు. అతని రికన్నాయ్‌సెన్స్ మనుషులు అతనికోసం వచ్చారు.

"చాలా దూరం వెళ్తున్నారా?" అని అకీమొవ్ అడిగాడు.

"రెండు రోజుల్లో తిరిగి వచ్చేస్తాం."

"అప్పుడు తిన్నగా మావద్దకే రాండి, ఏం?"

"విధిగా! ధన్యవాదాలు. మీ వాళ్లందరూ భేషైన కుర్రాళ్లు."

అకీమొవ్ అతనిని సాగనంపాడు.

"సెలవు అకీమొవ్," అని లెత్యాగిన్ అన్నాడు. రికన్నాయ్‌సెన్స్ మనుషులు అతని కోసం వెలుపల చీకటి ముద్దలాగా గుంపుగా చేరి నిరీక్షిస్తున్నారు.

"శుభం!"

లెత్యాగిన్ అప్పటికే నడుస్తూ ఉన్నాడు. అతడు అకస్మాత్తుగా వెనక్కి తిరిగి అకీమొవ్‌తో అన్నాడు: "బదేయ్‌కిన్ జ్ఞాపకం ఉన్నాడు, కదాండి?"

"అవును."

"సహజమే, మీరతని నౌకలో ఉన్నారు, కదూ. లాండింగ్ పటాలాలను తీరంపై దించుతున్నప్పుడు అతని సబ్-ఛేసర్ నౌక మునిగి పోయింది. అతనికి చాలా ప్రమాదకరమైన గాయాలు తగిలాయి."

''నిజంగానే?'' అని అకీమొవ్ అన్నాడు.

రికన్నాయ్‌సెన్స్ ఆఫీసరు, అతని మనుషులు రోడ్డు మలుపులో అంతర్ధానమై పోయారు. జబ్బు మాదిరిగా ముంచెత్తుకు వచ్చే అలసటను అకీమొవ్ అకస్మాత్తుగా అనుభావించాడు. అతను వాంఛించినదల్లా వీలైనంత త్వరగా పడుకొని నిద్రపోవడమే. ఒక గంట కాదు — చాలా సేపటివరకు. ఎందువల్లనంటే, అతడు మేల్కొనే సరికి చాలా విషయాలను మరచిపోగలుగుతాడు. వాటిల్లో ఒకటి — యింకా తన చెవులలో ప్రతిధ్వని స్తోన్న అనంతమైన గర్జన. అతడు త్వరత్వరగా యిండ్లను దాటి వెళ్తుంటే, నార్వే వాళ్లు అప్పటికే ఆ యిండ్లల్లో స్థిరపడుతూండడం అతడు చూశాడు. జనం తాము దాచుకొన్న సామాన్లను, పాతిపెట్టిన సామాన్లను, చరాస్తులను తిరిగి తెస్తున్నప్పుడు ఆ యిళ్ల తలుపులు తెరుచుకుంటూ మూసుకుంటూ ఉన్నాయి.

''బాగుంది. చాలా బాగుంది,'' అని అకీమొవ్ లోలోన అనుకున్నాడు.

బటాలియన్ డ్యూటీ ఆఫీసరు లెఫ్టినెంట్ వెన్‌త్సోవ్ తనను పిలవడం అతడు విన్నాడు.

''ఒక వైర్‌లెస్ వర్తమానం.''

''దీపం ఉందా?''

ఆ లెఫ్టినెంటు తన టార్చి దీపం వెలిగించాడు.

అకీమొవ్ ఆ వర్తమానాన్ని చదివాడు. ''సరి! అంతేమరి,'' అని పలికి కందకం బసను ప్రవేశించాడు. తన గిటార్ వాయిద్యాన్ని చేతుల్లోనే ఉంచుకొని కూర్చొనే నిద్ర పోతున్నాడు లెఫ్టినెంట్ కాజ్‌లోవ్‌స్కీ. ఒక మూల మత్యూహిన్ కునికి పాట్లు పడుతున్నాడు. బటాలియన్ కమాండరు లోపలికి వచ్చిన చప్పుడు వినగానే అతడు గబుక్కున లేచి నిల బడి సంతృప్తికరమైన నవ్వునువ్వాడు. కందకంబస గోడలకు కప్పిన టార్పాలిన్ గుడ్డనీ, కందకంబసను అలంకరించేందుకై తాను సేకరించిన వస్తువుల్నీ చూపేందుకు అతడు మొహాన్ని పెద్దది చేసుకొన్నాడు. అతడు అడిగాడు: ''కామ్రేడ్ కమాండర్, మీ మాయ్ బొరొద అలంకారంచేసినంత బాగా యిది ఉందా?''

''ఉందనే అనుకుంటాను,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు, అటువైపు చూడనన్నా చూడకుండానే. అతడు తన మ్యాపును బయటికి తీసి వైర్లెస్ వర్తమానంలో తెలిపిన మార్గాన్ని అందులో చూడ్డం ప్రారంభించాడు. ఆ మార్గం తంద్రాకు అడ్డంగా,

తానా-ఫ్యొర్డులోకి ప్రవహిస్తూన్నట్టి సుదీర్ఘమైన తన-యెల్వనది వరకూ ఉంది. రోడ్డుమీద ఒక బస్తీగానీ లేక ఒక గ్రామంగానీ లేదు.

మత్యూహిన్ బటాలియన్ కమాండరుని గమనించి, నిట్టూర్చి, సహనంతో తన కంబళ్లను చుట్టేసి, తన వస్తువులన్నిటినీ ఒక దగ్గరికి సమకూర్చుకోవడం ప్రారంభించాడు.

''మర్తీనొవ్ ఎక్కడ?'' అని అకీమొవ్ అడిగాడు.

కంపెనీలలో మనుషులు నిద్రపోతున్నారేమోనని చూడ్డానికి మర్తీనొవ్ అక్కడికి వెళ్లాడని చెప్పారు.

''నిద్రపోతున్నారా!'' అని అతడు కోపంగా అరిచాడు. ''వాళ్లు కావలసినంత నిద్రతీశారు.''

అతడు తిట్లుతిట్టి వెనక్కి తిరగకుండానే ద్వారంవద్ద నిలబడి ఉన్న వెన్త్సోవ్‌తో అందరినీ సిద్ధంగా ఉండేట్టు ఆజ్ఞాపించమని అరిచాడు.

వెన్త్సోవ్ అడుగుల శబ్దం దూరంలో సమసిపోతుండగా అకీమొవ్ చలనం లేకుండా చెవులు నిక్కబొడుచుకొని నిలబడ్డాడు. కొజ్‌లోవ్‌స్కీ ప్రశాంతంగా గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. అతనిని నిద్రనుండి లేపడమంటే ఏవగింపు కలిగింది. ఆ నిశ్శబ్దత మరికొన్ని నిమిషాలవరకు ఉంది. ఆ తర్వాత మొత్తం పరిసర ప్రాంతమంతా కేకలతోనూ అడుగుల శబ్దంతోనూ ఆయుధాల గలగలతోనూ నిండిపోయింది. అకీమొవ్ ఎక్కడైతే నిలబడ్డాడో అక్కడే మరో అయిదు నిమిషాలపాటు ఉన్నాడు. చివరికి విన్నాడు పెద్దగా అరుస్తూ యిచ్చిన ఆజ్ఞను, ''ఫాల్‌యిన్!'' ఎప్పటి మాదిరిగానే మర్తీనొవ్ నిటారుగా నిలబడి, నీటుగా క్రమపద్ధతిలో లోపలికి వచ్చాడు. ఏమాటా మాట్లాడకుండా అతడు బల్లవద్దకు వెళ్లి వర్తమానాన్ని చదివి కూర్చున్నాడు. నిద్రనుండి లేవగొట్టబడినతర్వాత గబగబా తన గితార్ వాయిద్యాన్ని పెట్టెలో పెట్టేసి చలితో వణకుతూ లేచినిలబడ్డాడు కొజ్‌లోవ్‌స్కీ.

అకీమొవ్ కొద్దిసేపు శ్రద్ధగా విని ఆ తర్వాత వెలుపలికి వెళ్లాడు.

''అటెన్‌షన్!'' అని వెన్త్సోవ్ ఆజ్ఞాపించాడు. ఆ తర్వాత అతడు తన బలీయమైన యువకంఠధ్వనితో, ఆజ్ఞాపించిన ప్రకారంగా బటాలియన్ ఏర్పడి సిద్ధంగా ఉందంటూ ఆ చీకటిలో చురుకుగా ఎలుగెత్తి నివేదించాడు.

బటాలియన్ కమాండరు శ్రేణి పొడుగునా నడిచాడు. బాగా పరిచయమున్న తన మనుషుల కళ్లు అతనిని ప్రశాంతతోనూ ధైర్యంతోనూ వీక్షించాయి. దాంతో అకీమొవ్ ఆవేశాన్ని పొంది స్వయంగా ధైర్యోత్సాహాలతో నిండిన మనోస్థితిని పొందాడు.

వినీల సాంధ్యారాగం ఆ బటాలియన్‌ను నాలుగువైపులా పరివేష్టించింది. అస్ప ష్టంగా అగుపించే ఉత్తరదిశ వెలుగులు, పైన ప్రశాంతంగా తేలుతూన్నట్లు కనిపించాయి. ఆ కొండరాళ్ల మధ్య పకులు పెద్దగా కీచుమంటూ ధ్వని చేశాయి.

చలిగాలి మనుషుల మొహాలపైకి వీస్తుండడంవల్ల వారి నిద్రమత్తు మటు మాయమైంది. పిట్టల కీచు కూతలూ, అలవాటు కాని అక్కడి మొత్తం వాతావరణమూ నౌకాసైనికులలో భయం గొలిపే వింతైన భావాన్ని రేకెత్తించాయి. అలాంటి క్షణాల్లో, ఊగుకుంటూ మధ్యమధ్య వెనక్కి తిరిగి చూస్తూ, తమను నడిపించుకుంటూ వెళ్తోన్న కండపుష్టిగల బటాలియన్ కమాండరుయొక్క ఛాయాకృతిని చూసినప్పుడు ప్రతీ వ్యక్తికీ మంచి ధైర్యం కలిగేది. అతడు వెనక్కి తిరిగి చూసినప్పుడు వారు అతని వెడల్పాటి, సగం ఎగ తాళి చేస్తున్న, ఉత్సాహపూరితమైన ప్రశాంతవదనాన్ని చూసేవారు. ఒక్కొక్కప్పుడు అతడు వారితో మాట్లేడేవాడు. అప్పుడు అతనికిదగ్గరగా ఉన్న మనుషులు నవ్వేవారు. వెనుక ఉన్నవాళ్లు కూడా అతడేమన్నాడో వినకపోయినా నవ్వేవారు.

''అదీ వరస!'' అని యెగోరొవ్ అంగీకరిస్తున్నట్టుగా గొణిగేవాడు.

ఇంకా మంచి స్థితిలోనే ఉన్న కొన్ని యిండ్లకు సమీపంగా, కిర్‌కెనేస్‌కు దక్షి ణంగా ఉన్న చౌరస్తావద్ద తమను రైఫిల్ డివిజన్ వారి ప్రతినిధులు కలుసుకోవాలనీ, తమ బటాలియను తాత్కాలికంగా ఆ రైఫిల్ డివిజన్ కమాండరు ఆజ్ఞల ప్రకారం నడచుకోవాలనీ వారికి అందిన వైర్లెస్ వార్త ఆజ్ఞాపించింది. ఏమైతేనేం అనుకున్న చోటికి నౌకాసైనికులు అరుదెంచినప్పుడు, వారికి అక్కడ ఎవరూ అగుపించలేదు. రక్షణకై గార్డులను ఉంచి, వారు అక్కడ కాపలా కాస్తున్నంత సేపూ యిండ్లల్లో సుఖంగా ఉండ వలసిందని అకీమొవ్ తన మనుషులను ఆజ్ఞాపించాడు. తర్వాత మినేవిచ్ కంపెనీను తీసుకురమ్మనమని యిద్దరు మనుషుల్ని అతడు పంపి, తానూ, మర్‌తీనొవు, మత్యూహిన్‌లూ కలసి అక్కడ ఉన్న మొదటి యింటి తలుపుతట్టారు. ఆ యింటిప్రక్కనే నార్వేజి యన్ జెండా ఎగురుతోంది.

ఆ చిన్న యిల్లు నార్వేజియన్ మగవాళ్లతోనూ ఆడవాళ్లతోనూ పిల్లలతోనూ నిండిపోయివుంది. కొంతమంది తివాచీలపై పడుకున్నారు. కొంతమంది కుర్చీలలో కూర్చు న్నారు. ఇతరులు కాళీ నేలమీద గోడలకానుకొని కూర్చున్నారు. దానిని యిల్లు అనేకంటే

స్రతం అంటే బాగుంటుందేమో. అకీమొవ్ లోపలికి ప్రవేశించగానే అన్ని వైపులనుండీ పిల్లల చూపులు అతనిపై కేంద్రీకరించబడ్డాయి. అది అసలే సహింపరానంత చిన్న యిల్లు అవడంచేత, అక్కడ వారు స్థలం ఏర్పాటు చేసుకోవాలనుకోవడం వృథా అని కల వరపాటుతో ఆగిపోయాడు. కాని పొడుగ్గా, ఒక్కపలచగా గడ్డం చేసుకున్న చెంపలతో ఉన్న ఒక మనిషి, బల్లదగ్గరనుండి లేచి ఉద్రేకంతో మిణకరిస్తూ అతనివైపుకు వెళ్లాడు. మాట్లాడడం మొదలుపెట్టాడు. గదినిండా పిల్లలకండ్లు మినుకుమినుకుమని ప్రకా శించినట్లు కనిపించాయి. ఆడవాళ్ల కన్నులు నవ్వుల్లోకి కరిగిపోయాయి. మగవాళ్లు హుందాగా ఘుర్ఘురించారు.

అకీమొవుకొరకు, అతని మిత్రులకోసం ఒక పొడుగాటి బల్లదగ్గర త్వరత్వరగా మూడు కుర్చీలని వేశారు ఆ నార్వేజియన్లు. బల్లమీద కార్బైడ్ దీపాలు వెలుగుతున్నాయి. ఇంటి యజమాని ఎక్కడా ఆగకుండా మాట్లాడుతున్నాడు, అతని మాటలు రష్యన్లకు అర్థంకావని అతనికి బాగా తెలిసినప్పటికీనూ, అకీమొవ్ మర్తీనొవ్ మత్యూహిన్‌లకు అతని భాష అర్థం కాకపోయినా, అతని వాగ్ధాటినీ, కాంతితో కళకళలాడుతున్న అతని ముఖవర్చ స్సునూ చూసి చిరునవ్వు నవ్వుకున్నారు. వారు తమ పరిస్థితి కొంత చికాకుగానే ఉన్నట్టు భావించినా ఎంతో సంతోషదాయకంగా ఉన్నట్లే భావించారు.

ఆ గృహస్థు గనిలో పనిచేసేవాడు. అతడు ఆ సంగతి తన అతిథులకు విశదీకరిం చాలని ఆత్రత పడ్డాడు. అతని కనిష్ఠ కుమార్తెకు, తెలివితేటలు ఉట్టిపడుతూన్న చూపు లుగల పౌసెకు, ఒక చేతిలో గడ్డ పలుగ పట్టుకొని గనివాని దుస్తుల్లో దిగిన తన తండ్రి ఫోటో చూపాలన్న ఆలోచన కలిగేంతవరకు కూడా అతనికి ఆ ఆలోచన తట్టలేదు. ఆఖ రికి అతనిని వారు అర్థం చేసుకున్నారు. ఆ తర్వాత రష్యన్లు హృదయపూర్వకంగా అత నితో కరచాలనం చేశారు. అతడు వాళ్లతో ఏదో చెప్పడానికి ప్రారంభించి, వారు తనను అర్థం చేసుకోలేదని తెలుసుకుని, నిరాశతో కళ్లు తిప్పుకొంటూ, మాటలకు బదులు సౌంజ్ఞలు చేయడం మొదలుపెట్టాడు. వాళ్లు అర్థం చేసుకొన్న పదాలు రెండే. ఒకటి 'కమ్యూనిస్టు', రెండోది 'దూస్కర్'. ఈ రెండో మాటకు నార్వే భాషలో జర్మన్లు అని అర్థం. కాని యీ రెండు మాటలే చాలు.

"అతడు కమ్యూనిస్టా?" అని మర్తీనొవ్ ఆ గృహస్థువైపు చూపిస్తూ అను మానంగా అడిగాడు.

"య, య, య!" అని ఆ మొత్తం గదిలోని వాళ్లంతా సమాధానం చెప్పారు.

అందులో ఏమాత్రం సందేహం లేదు. అది రష్యన్ ఆఫీసర్ల అనుగ్రహాన్ని సంపాదించుకోవాలనే కుయుక్తి కాదు. కిర్కెనేస్ వాస్తవ్యులైన బర్గో మాస్టర్, బడిపంతులు ఓల్సెన్, ధనికుడు విక్కాలా, వీరి మాటల్లోనూ, వైఖరిలోనూ అకీమొవ్ గమనించినటువంటి నీచంగా ప్రాధేయపడుతూ కనపరచిన గౌరవం యిక్కడ అగుపించదు.

ఆ నార్వేజియన్లు ఎంత ఉద్రిక్తులయ్యారో మర్తీనొవ్ కూడా బహుశ అంత ఉద్రిక్తుడూ అయ్యేవుంటాడు. అతడు జేబులోనుంచి తన పార్టీ కార్డు తీసి స్వయంగా తన రొమ్ముపై పొదుచుకొని, అదే విధంగా అకీమొవ్‌ను కూడా గుచ్చి అన్నాడు: "చూడండి కమ్యూనిస్టులం. నేనూ అతడూ."

ఆ గృహస్థు జాగ్రత్తగా ఆ చిన్ని పుస్తకాన్ని తీసుకొని తన భార్యకు, పిల్లలకి, మిగతా వాళ్లందరికీ చూపించి ఆ తర్వాత మర్తీనొవ్‌కు తిరిగి యిచ్చేశాడు. మర్తీనొవ్ దానిని లోపల పెట్టుకున్న తర్వాత ఆగని మనిషి అకస్మాత్తుగా మొదట అతనిని ఆ తర్వాత అకీమొవ్‌ని కౌగలించుకున్నాడు. తర్వాత మత్యూహిన్‌వద్దకు సందేహపడుతూ వెళ్లి అతనికి దగ్గరగా ఆగి అడిగాడు, "కమ్యూనిస్ట్?"

"కాదు. నేను పార్టీకి చెందను," అని అన్నాడు అతలకుతలంగా తల ఊపుకుంటూ మత్యూహిన్.

గని మనిషి ఆశ్చర్యపోయాడు. ఎందువల్లనంటే రష్యాలో ఉన్న ప్రతివ్యక్తీ కమ్యూనిస్టని అతడు భావించాడు. కాని అకీమొవ్ పెద్దగా నవ్వి అతనిని మత్యూహిన్‌వైపు తోశాడు. నార్వేజియన్ కూడా నవ్వి మత్యూహిన్‌ను కూడా కౌగలించుకున్నాడు.

రష్యన్లకు నమస్కారం చేసి తన పేరు ఇన్‌గ్రిడ్ అని చెప్పిన ఒక పిల్ల ప్రక్క గదిలోకి పరుగెత్తి 'క్నెక్కీ బ్రోట్' అని పిలవబడే చదునైన భోజనపు కేకులను తీసుకు వచ్చింది. అక్కడి ప్రజలు రొట్టె బదులు ఆ కేకులనే తింటారు. కాసేపు బాగా ఆలోచించిన తర్వాత మత్యూహిన్ తన సామాన్ల సంచీలో జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చిన ఒక మద్యపుసీసాను వెలుపలికి తీశాడు. టేబులుపై గాజు గ్లాసులు ప్రత్యక్షమయ్యాయి. ప్రతి గ్లాసులోనూ కొద్దికొద్దిగా వొంపాడు. ప్రతి ఒక్కరూ లేచి నిలబడ్డారు. నార్వేజియన్లు తమ దృష్టిని రష్యన్లపై కేంద్రీకరించి గ్లాసుల్ని తమ హృదయాలపై ఆనించుకుని "స్కాల్" అని పలికి నెమ్మదిగా త్రాగారు. రష్యన్లు "నజ్దరోవ్యె" (ఆరోగ్యం కలుగుగాక) అని పలికి ఒక్క గుక్కలో త్రాగారు.

ఆ యింటి యజమాని ఒక్కొక్కప్పుడు మాట్లాడుతూ, ఒక్కొక్కప్పుడు ఊరికే నవ్వుతూ, వాళ్లకు అర్థమయ్యేట్టు తాను చెప్పలేకపోయినప్పుడు నిరాశతో చేతులు బిగించుకున్నాడు. కమ్యూనిస్టులకు అక్కడ ఎంత కష్టమో, ఆ ప్రాంతమంతా తమ సొంతంగా భావించి సూడ్-వరంగెర్ వర్క్స యజమానులు ఎలా అధికారం చెలాయించినదీ, యజమాన్లకు తొత్తులైన వారి యూనియన్లు ఫ్యాక్టరీలో అధికారాన్ని ఎలా హస్తగతంచేసుకున్నదీ అతడు చెప్పాడు. అనేక కుటుంబాలను, వారి యిండ్లు తగలబడిపోవడంచేత వారిని తనవద్ద ఉంచుకున్నట్టు అతడు చెప్పాడు. అతడలా చేయడానికి కారణం తాను కమ్యూనిస్టు అవడంచేతనేననీ, దురదృష్టానికి బలి అయినవాళ్లకు సహాయం చేయడం తన కర్తవ్యమనీ చెప్పాడు. కాని ఐక్యతాభావంతో కలిసి వచ్చారు కారు కొంతమంది. ఇండ్లులేని అనేక కుటుంబాలు వాస్తవానికి వీధుల్లో నివసించవలసి వచ్చింది.

మర్‌తీనొవ్ తలపంకిస్తూ శ్రద్ధగా విన్నాడు: ఆ గృహస్థు మాట్లాడుతున్న విషయాలు అత్యంత ముఖ్యమైనవిగా అతడు గుర్తించాడు. అతనిని అర్థం చేసుకోలేక పోతున్నందుకు తనమీద తనకే కోపం వచ్చింది. "నిజంగా మనం తప్పక నార్వే భాష నేర్చుకోవాలి," అని అతడు అకీమొవ్ చెవిలో చెప్పాడు.

అక్కడున్న వాళ్లల్లో ఒక స్త్రీ గ్రామఫోన్ పెట్టెనుపెట్టింది. బహుశ ఏదన్నా ఒక జానపద నృత్యం చేయ సంకల్పించారేమో. కాని సరిగ్గా అప్పుడే దడాలున తలుపు తెరిచి, పొడుగాటి టోపీపెట్టుకుని తోలుకోటు తొడుక్కొని ఒక కర్నల్ గబగబా లోపలికి వచ్చాడు. అతని బరువుకి క్రింది చెక్కకూర్పుల నేల కిర్రుమంది. అతడు అకీమొవ్ ఎదురు చూస్తున్న రైఫిల్ డివిజన్ ప్రతినిధి. అతడు అక్కడ కన్నులపండువుగా సమావేశమైన వారందరినీ ఆశ్చర్యంతో చూశాడేగాని పల్లెత్తుమాటైనా పలకలేదు. తర్వాత అతడు అకీమొవ్ దగ్గరికి వెళ్లి ఒకే ఒక మాట తీక్ష్ణంగా పలికాడు "రాండి" అని.

అతని కళ్లల్లో వ్యాకులత గోచరించింది. అకీమొవ్ వెంటనే లేచి అతని వెంట తలుపుదాకా వెళ్లాడు. కాని అతడక్కడ నేలలో పాతుకుపోయినట్టు నిలబడి పోయాడు. సరిగ్గా అప్పుడే పెట్టిన గ్రామఫోను రికార్డు అతని మనసులో తీగను మీటినట్లయింది. అంతకంటే ఎక్కువగా, తేజోవంతమైన ఆంతరంగిక స్మృతులు ఎలాగో అతనిని ముంచి వేసినట్లనుపించింది.

"గ్రీగ్ కృతి అనిత్ర నృత్యం," అని అతడన్నాడు. ఆ మాటలు తన నోటినుండి కాకుండా ఆనిచ్క నోటినుండి వెలువడినట్లను పించింది. రెల్లు చువ్వలతో వరుసగా

ఉన్న కందకంబస, అతడు ఆ సంగీతంతో సంబంధం ఏర్పరచుకున్న ప్రతీదీ అతనికి స్పష్టంగా కళ్లకు కట్టినట్టు కనిపించాయి.

రష్యన్ ఆఫీసరు నోటినుండి వెలువడిన ఆ పరిచయమున్న మాటల్ని విన్నప్పుడు నార్వేజియన్లు ఆశ్చర్యంతో కూడిన ఆనందంతో నిండిపోయారు. ''య, య, య!'' అని మరుక్షణానే మొత్తం గదంతా ఉత్సాహంతో ప్రతిధ్వనించింది.

''ఒక్క నిమిషం,'' అని అకీమొవ్ అన్నాడు. కర్నలు ఓపిక పట్టలేని చూపు చూసినా ఆ రికార్డు పూర్తి అయ్యేంతవరకు అకీమొవ్ అక్కడ్నుంచి కదల్లేదు. అలాంటి సుదూరపు దేశంలో తనకెంతో ప్రియమైన సంగీతం రికార్డుని వారెలా పెట్టగలిగారా అని అతడు ఆశ్చర్యపోయాడు. ఆ రికార్డు పూర్తై సంగీతం ఆగిపోయిన తర్వాతగాని ఆ సంగీతాన్ని కూర్చిన వ్యక్తి నార్వేజియన్ అనీ, బహుశ అక్కడి ప్రజలు గర్వించదగిన ఆ దేశం సుపుత్రుడనీ అతనికి జ్ఞాపకం రాలేదు.

అకీమొవ్ చివరికి నార్వేజియన్ల ఆ చిన్న యిల్లు వదలి చౌరస్తా ప్రక్కని వేచి ఉన్న ఆకుపచ్చరంగు స్టాఫ్ కారు వద్దకు కర్నల్‌తో వెళ్లాడు. ఇద్దరు ఆఫీసర్లూ తమ మ్యాపులను వెలుపలికి తీశారు.

''పరిస్థితి చాలా క్లిష్టంగా ఉంది. జర్మన్లు తన-యెల్వ్‌మీది పోల్‌మక్ ప్రాంతంలో ప్రతికూలదాడి ప్రారంభించారు. అది చాలా ప్రమాదకరమైన తిరుగుదెబ్బ కావచ్చు. నది ఎడమగట్టున శత్రువులు పెద్ద సైన్యాన్ని కేంద్రీకరిస్తున్నట్టు కనుగొన్నాం. నేను మీ బటాలియన్‌లోని కనీసం కొంత భాగం అక్కడికి చేరేందుకు పది లారీలు యిస్తాను. మిగతావారు నడిచే వెళ్లవలసి ఉంటుంది. వెంటనే కార్యాచరణకు పూనుకోండి,'' అని కర్నల్ అన్నాడు.

''అర్థమయింది. ప్రతీదీ అక్షరాలా జరుగుతుంది,'' అని అకీమొవ్ సమాధానం చెప్పాడు. అతడు కాసేపు మౌనం వహించి ఆ తర్వాత నవ్వుతూ అన్నాడు, ''తెలిసిన సంగీతం విన్నప్పుడు, పాత స్నేహితుడ్ని కలుసుకున్నట్టుగా ఉంటుంది.''

''ఆ? ఏమన్నారు?'' అని ఆ సంగీతం గురించి కాక మరేదో పూర్తిగా భిన్నమైన విషయాన్ని ఆలోచిస్తున్న ఆ కర్నల్ అడిగాడు. అకీమొవ్ సమాధానం చెప్పలేదు. అప్పటికే రోడ్డుమీద సిద్ధంగా ఏర్పడిన తన బటాలియన్‌వద్దకు అకీమొవ్ ఊగుతూ నడుచుకుంటూ వెళ్లాడు.

సరిగ్గా అప్పుడే వచ్చిన లారీలలోకి మొదటి కంపెనీ ఎక్కింది. నడుస్తూన్న మొదటి లారీ మెట్టుమీదికి అకీమొవ్ దూకి, నూనెజిడ్డుతో నిండి పొట్టిగా ఉన్న డ్రైవరుతో పెద్దగా అన్నాడు: ''మనం వెళ్దాం! ఏక్సిలరేటరు జోరుగా నొక్కు!'' ఆ శ్రేణి లారీలలో వెళ్లిపోయింది.

''హెడ్‌లైట్లు వెయ్యి. ఎందుకు భయపడుతున్నావు?'' అని అకీమొవ్ అన్నాడు డ్రైవరు ప్రక్క స్థానంలో కూర్చుంటూ. ''ఈవిధంగా ఐతే మనం ఎంతో దూరం వెళ్లలేం. మనం త్వరగా వెళ్లాల్సుంది. జర్మన్లు ఏదో ఒక కొత్త ఎత్తు వేయ బోతున్నారు.''

లారీలు పెద్ద పెద్ద కొండరాళ్ల మధ్యగా ఉన్న బండశిలల రోడ్డుమీదుగా అతి వేగంతో పరుగెత్తాయి. వింతైన స్వరమాధుర్యాన్ని లారీలు నడుస్తున్నంత సేపూ వినగలి గాడు అకీమొవ్. అదిప్పుడతనికి విచారకరంగా వినిపించకపోవడమే కాకుండా, సవాలు చేస్తున్నట్లూ, మరులు కొలుపుతున్నట్లూ, ఆఖరికి కొద్దిగా భయపెడుతున్నట్లూ వినిపించి, అతడెరిగిన దృశ్యాలన్నిటినీ జ్ఞప్తికి తెచ్చింది. అతని చుట్టూ ఉన్న భూమి కరకుతనాన్ని కోల్పోయి ఆకర్షణీయంగా మారినట్లనిపించింది. తనపై ఆకాశంలో అరుస్తున్న పక్షుల కలకలారావం, వినీలపు సంధ్యారాగం అతనికిక విసుగుపుట్టించడం లేదు. అతడొక క్షణంసేపు యుద్ధం సంగతే మరచిపోయి అపరిచితమైన అభిరుచిని కలి గించే స్థలాలలో తాను ప్రయాణం చేస్తున్నట్లూ ఆ రా స్థలాల గురించి ఆనిచ్కాకు చెప్పవలసి ఉంటుందనీ అతడు భావించాడు. రోడ్డుపక్కనే వున్న పర్వతాలపై ఎగురు తున్న పక్షుల కీచుకీచు ధ్వనులు, అభినందనతో నిండిన నార్వేజియన్ మగవాళ్ల, ఆడవాళ్ల, పిల్లల ముఖాలు, స్వాతంత్ర్య చిహ్నంగా అన్ని ధ్వజస్తంభాలపై ఎగురుతున్న నీలిరంగు క్రాసు ఉన్న నార్వేజియన్ ఎర్రజెండాలు, మొదలైన విషయాలన్నిటినీ తు.చ తప్పకుండా అతడు జ్ఞాపకం ఉంచుకోడానికి ప్రయత్నించాలి. ఇంకా అనేక యితర విషయాలను కూడానూ.

త్వరలోనే ఫిరంగిగుండ్ల ప్రేలుడులు వినిపించాయి. ముందరి ప్రాంతంలో మంటలు చెలరేగాయి. వాటి కాంతి నల్లని ఛాయగా అగుపించే గ్రామంమీద, దూరంలో ఉన్న అడవి భూభాగంపైనా ప్రసరించి అందంగా అగుపించింది. తన-యెల్వ్ లోయ పొడుగునా ఉన్న అడవి అదే కావచ్చునని అకీమొవ్ తలపోశాడు. ఎందువల్లనంటే అతడు ఆ చెట్ల వెనుక ప్రవహించే నదీగర్భం వెంట వంపుతిరిగి ఉన్న పర్వతాల రేఖాకృతిని పోల్చుకోగలిగాడు.

రోడ్డుకు ఎడమవైపు కొండపైన పశ్చిమ దిశను బైనాక్యులర్స్‌తో పరికిస్తున్న నల్లని ఆకృతులూ, అదే సమయంలో కొండ అడుగు భాగాన సిగ్నలు మనుషులు టెలిఫోను తీగల డ్రమ్ములను లాగుతూ ఉండమూ కనబడ్డాయి.

అకీమొవ్ తన సైనిక శ్రేణిని ఆపుజేసి బయటికి దూకి కొండమీదికి వెళ్ళి, ఆఫీసర్లతో అన్నాడు: "ఏం జరుగుతోంది? నేను అకీమొవును. మెరైన్ కోర్‌తో వచ్చాను."

వాళ్ళు చుట్టూ చూశారు. వాళ్ల ముఖాలపై విరిసిన సంతోషాన్ని గమనించవచ్చు. ఒకతను — బహుశా వాళ్లలో సీనియరు కావచ్చు — మంటలవైపు చూపించాడు.

"కామ్రేడ్ అకీమొవ్, మీరు వెళ్లాల్సింది అటువైపు," అని అతడన్నాడు. "మేం మీకు ఒక మోర్‌టార్ దళాన్ని యిస్తాం." తర్వాత అతడు బిగ్గరగా అరిచాడు: "ఏయ్, మోర్‌టార్లూ!"

మోర్‌టార్ దళం లెఫ్టినెంటు వచ్చి అకీమొవ్‌కు సైనిక వందనం చేసి అన్నాడు: "నన్ను మీదగ్గరకు పంపారు."

ఆఫీసర్లతో సంభాషించిన తర్వాత అకీమొవ్ కొండక్రిందికి దిగి పెద్దగా అరిచాడు: "లారీల్లోంచి క్రిందికి దిగండి!"

నౌకాసైనికులు లారీల్లోంచి దిగి ఒక్క క్షణంలో రోడ్డుమీద వరుసగా నిలబడ్డారు. అకీమొవ్ ముందుండగా వాళ్ళు కొజ్‌లోవ్‌స్కీతోనూ, మోర్‌టార్ దళం లెఫ్టినెంట్‌తోనూ నడిచి వెళ్లారు. అకీమొవ్ మోర్‌టార్ దళం లెఫ్టినెంట్‌తోనూ ఓరగా చూసి అన్నాడు: "నా ఆజ్ఞ లేకుండా మీరు మోర్‌టార్ కాల్పులు సాగించవద్దు. వృథాగా యుండ్లను నాశనం చేసి ప్రయోజనముండదు."

కొద్ది దూరంలోనే జర్మన్ ఫిరంగి గుళ్ళు పేలాయి. అవి నది పడమర గట్టు నుండి వచ్చాయనడం స్పష్టం.

"మనుషుల్ని బారలుతీర్చి వరుసలో నిలిబెట్టు," అని అకీమొవ్ కొజ్‌లోవ్‌స్కీ వైపు తిరిగి ఆజ్ఞాపించాడు. "మనం వెళ్తున్నాం."

నావికులు కొండరాళ్లపైకి ప్రాకారు. వారి ఆకృతులు ఆకాశం వెలుగులో స్పష్టంగా అగుపించాయి.

"నీ పేరేమిటి?" అని అకీమొవ్ మోర్‌టార్ ఆఫీసరును అడిగాడు.

"సెలివేర్‌స్తొవ్, కామ్రేడ్ మేజర్."

"మంచిది. కామ్రేడ్ సెలివేర్‌స్తొవ్ అప్పుడే కాల్పులు ప్రారంభించవాకు. నా ప్రక్కనే ఉండు. జర్మన్లకు ఇండ్లను ప్రేల్చివేసేందుకు సమయం చిక్కనివ్వకుండా గ్రామంనుండి వెళ్లగొట్టడమే మనం చేయ్యవలసిన పని. ఆ మోర్‌టార్లను ప్రయోగించే అవకాశమే నీకిస్తే ఆ ఇళ్లను నువ్వే ముక్కముక్కలుగా ప్రేల్చి పారేస్తావు, సదభిప్రాయం ఉన్నప్పటికీ. కోపం తెచ్చుకోవాకు."

"నాకేం కోపం లేదు," అన్నాడు సెలివేర్‌స్తొవ్ కలవరపడుతూ.

వారు నెమ్మదిగా ముందుకు వెళ్లారు. ఒక వార్తావహుడు పరుగున వచ్చి జర్మన్లు ఏ మాత్రం తొందరపడకుండా యిండ్లకు నిప్పంటించి వెనక్కి పారిపోతున్నారని చెప్పాడు. ఇండ్లల్లో నివసించేవారు అడవులకు పారిపోతున్నారు. నదిమీద మోటారు నౌకల దళం ఒకటి చిన్నది ఉంది. పశ్చిమదిశ గట్టునుండి ఫిరంగులు కాల్పులు సాగిస్తున్నాయి.

"మీరు దాడిచెయ్యాలి! మీరేం చేస్తున్నారు? వాళ్లు వారి పని చేసుకొని పారిపోయేదాకా కండ్లప్పజెప్పకొని కూర్చున్నారా?" అని అకీమొవ్ అరిచాడు.

అప్పుడప్పుడు ఫిరంగి కాల్పులమంటలు తళుకుతళుకుమంటూ అగుపిస్తూ ఎదురుగా ఉన్న అడవితో నిండిన గట్టును అతడు తానెక్కి నిలుచున్న గుండ్రాయి మీదినుండి చూడగలుగుతున్నాడు.

"మీరు బదేయ్‌కిన్‌కు చేసిన ద్రోహానికి ప్రతీకారం సలిపి తీరతాను. ఇండ్లకు నిప్పంటించడం నేర్పుతాను!" అని అతడు గొణిగాడు.

అతడు కొండమీదినుండి అడవివైపు గబగబా దిగి మొదటి చెట్లను సమీపించాడు. అక్కడ చీకటిగా ఉంది. అడవి చుట్టూ జరీ అంచు వలె ధగధగా మెరిసిపోతున్న నదిని అతడు తరుకొండల మధ్యనుండి చూడగలిగాడు. ఎడమవైపున దూరంలో నదిలో అనేక మోటారునౌకలు ఉన్నాయి. అవి నార్వేవాళ్లవి. అవి బలవంతంగా యుద్ధంలో సేవచేయవలసి వచ్చింది. వెనుకటి రోజుల్లో అవి మొత్తం నది పొడుగునా ఉండేవనడం స్పష్టం.

"నావికులారా, పదండి ముందుకు!" అని అకీమొవ్ గర్జించాడు.

నది గట్టువెంట అంతటా మెషీన్‌గన్‌లు, టామీగన్‌లు, రైఫిల్స్‌ల గలగల శబ్దం వినిపించింది. ఆ తర్వాత ఒక పెద్ద అరుపు: "హుర్రా!"

"సెలివేర్‌స్తొవ్, ఇక నీవంతు. ఆ పడవలకు కాస్త రుచి చూపించు."

తనతోపాటు వస్తున్న సైనికులకు సెలివేర్‌స్తొవ్ కొన్ని మాటలు చెప్పి తన బైనాక్యులర్స్‌ను కండ్లదగ్గరకు ఎత్తాడు. చెట్లగుండా తుపాకీగుండ్లు రయ్యిమంటు న్నాయి. పడవల మోటార్లు దడదడా కొట్టుకుంటున్నాయి. అందమైన పలురంగుల మతాబీచువ్వలు ఆకాశాన ఎగిరాయి.

అకీమొవ్ నదివద్దకు పరుగెత్తాడు. అప్పుడప్పుడు అతడు దేవదారు చెట్లను రాచుకున్నాడు. ఆ చెట్ల కరకుదనం అతనిని ఆనందంతో జలదరించేట్టు చేసింది.

''నువ్వేనా తుల్యకోవ్?'' అని అతడు మెషీన్‌గన్ వద్దనున్న ఒక మనిషిని అడిగాడు.

''అవును, కామ్రేడ్ కమాండర్.''

''బాగా కాల్చు! వాళ్లకు బాగా బుద్ధి రావాలి! ఆ సెలివేర్‌స్తొవ్ ఏం చేస్తున్నాడు? ఏమంత చెడ్డ నది కాదు. ముచ్చటగా ఉంది. వేగంగా ప్రవహిస్తోంది. గడ్డకట్టుకపోదు కూడాను. పర్వత ప్రవాహం. గట్టు వెంబడే మరికాస్త ఎడమవైపు వెళ్లండి.''

మనుషులు నెమ్మదిగా ఎడమవైపు గట్టువెంటే గ్రామానికి వెళ్లారు. నదిమీది జర్మన్ నావల్ని చెల్లాచెదురుచేసేట్టుగా మోర్టార్ దళం చివరికి కాల్పులు ప్రారంభించింది. నలువైపులా గర్జనలూ, గజగజలూ. చెట్లగుండా గుండ్లు భయానకంగా దూసుకు పోయాయి.

''కామ్రేడ్ కమాండర్! కామ్రేడ్ కమాండర్! ఆయనెక్కడ?''

''ఇంతకు ముందు యిక్కడే ఉన్నాడు.''

''కామ్రేడ్ కమాండర్!''

సమాధానం లేదు. మత్యూహిన్ ఆ చెట్లల్లోకి చొచ్చుకు పోయాడు, అకీమొవ్‌ను వెతుక్కుంటూ.

''తుల్యకోవ్! తుల్యకోవ్!'' అని మత్యూహిన్ అరిచాడు, ఆ మెషీన్‌గన్నర్‌మీద వంగి. ''నాకు సమాధానం చెప్పు!''

''ఏమిటి?''

''బటాలియన్ కమాండరు ఎక్కడ?''

''ఆయనక్కడ ఉన్నాడు,'' అని తుల్యకోవ్ అన్నాడు. అతడు మెషీన్‌గన్‌నుండి వెనక్కు తిరిగి ఆశ్చర్యంతో మిణకరించాడు. బటాలియన్ కమాండరు అక్కడలేదు.

అకీమొవ్ నది గట్టున పడి ఉండడం మత్యూహిన్ చూశాడు. ఎండకు నల్ల

బడ్డ ఒక పెద్ద చెయ్యి నీళ్లల్లోకి వ్రేలాడుతోంది. ఆ చేతి నాలుగు వ్రేళ్ల చుట్టూ నాలుగు చిన్న జలపాతాలవలె నీళ్ళు ప్రవహిస్తున్నాయి.

''ఆ-అ-ఆ!'' అని మత్యూహిన్ ఒక స్త్రీ మాదిరిగా కేక వేశాడు.

జర్మన్ల అరుపుల్నీ, నీటి జలజలా ధ్వానాన్నీ, ఫిరంగుల, మోర్టార్ల గర్జనల్నీ మించిన ఆ కేకను ప్రతివ్యక్తీ విన్నాడు. పరుగెత్తుకుంటూ వస్తూన్న మనుషుల ఆకారాలు కనబడ్డాయి. మొదట వెన్‌త్సోవ్ మనుషులు కుడివైపునుండీ తర్వాత మర్‌తీనొవ్ కొజ్లోవ్‌స్కీలు ఎడమవైపునుండీ పరుగున వచ్చారు. వారు అకీమొవ్‌ను ఎత్తుకొని గ్రామంలోకి తీసుకు వెళ్లారు. ఎవరో మత్యూహిన్‌ను అక్కడ్నుంచి లాగడానికి ప్రయత్నించాడు. మత్యూహిన్ అతనిమీద విరుచుకుపడ్డాడు: ''నన్ను ముట్టుకోవద్దు. నన్ను వంటరిగా వదిలేయ్. నేను బ్రతకడం నాకిష్టం లేదు.''

అకీమొవ్ మత్యూహిన్ కేకను విన్నాడు. కాని ఆ ధ్వని ప్రవాహపు ధ్వనో లేక రాత్రిపూట అరిచే పిట్ట కూతో ఏదో ప్రకృతినుండి వచ్చిందేగాని మనిషినుండి వచ్చిన ధ్వని కాదనీ భావించాడు. వాళ్లు అతనిని మోసుకొని వెళ్తున్నప్పుడు అతనికి ఒక్క క్షణం తెలివి వచ్చింది. మర్‌తీనొవ్, మత్యూహిన్ యింకా ఎవరో తన మంచం ప్రక్కనే ప్రతి రాత్రీ కూర్చుంటున్నట్టూ, అతడు తనకు బాగానే ఉందనీ, వాళ్లకు నిద్ర అవసరం గనక తప్పక వెళ్లి నిద్రపోవాలనీ చెప్పదలచుకున్నట్టూ భావించాడు. అతడు అలా చెప్పినట్టూ, దాంతో వారు వెళ్లిపోయినట్టూ, కేవలం అదృశ్యులైనట్టూ, ఇప్పుడతనికి దాహంవేయగా నీళ్లు యిచ్చేందుకు అక్కడ ఎవరూ లేనట్టూ, అందుకు కారణం అతడు వాళ్లందరినీ తన మంచం దగ్గరనుండి వెళ్లమని ఆజ్ఞాపించడమేనని ఆలోచించాడు. అతడు నౌకలోని తన గదిలో పడుకున్నట్టూ, అది ఉయ్యాల మాదిరిగా ఊగుతున్నట్టూ, ఎక్కువగా, యింకా ఎక్కువగా, మరీ ఎక్కువగా ఊగుతున్నట్టూ, అతని నగ్నహృదయం వాడిగానూ అదే సమయంలో మొద్దుబారిపోయీ ఉన్నటువంటి దానికి దేనికో గుద్దుకుంటున్నట్టూ అతడు భావించాడు. ఆ ఊపు ఎంత తీవ్రమైన రూపాన్ని దాల్చిందంటే, అతని హృదయాన్ని ఎంత విపరీతమైన శక్తితో ఆ వాడిగానూ మొద్దుబారిపోయీ ఉన్న వస్తువుపైకి విసరేసిందంటే, అతని బాధ పెరిగిపెరిగి యిక అతడు దానిని భరించలేకపోయాడు. అది ఆవిధంగా ఊగకుండాతప్పక ఆగిపోవలసిందేనని అతడు భావించాడు; అతడు తన హృదయాన్ని ఆ విధంగా చిత్రహింస చేయలేదు, — అది అతనిది కాదు. బహుశ అది ఆనిచ్కదని అతడు ఆ క్షణంలో అనుకునుండవచ్చు. అతడు ఆమె పేరును గుర్తు తెచ్చుకోలేకపోయాడు.

అతడు ఆమె ముఖాన్ని జ్ఞప్తి తెచ్చుకో లేకపోయాడు. ఆఖరికి ఆమె ఎవరైందీ కూడా జ్ఞాపకం లేదు. కాని అతని శిరస్సులో వెలుగూ, సంతోషమూ యీ రెండూ ఉన్నటువంటి స్థలం ఒకటుంది. ఆ స్థలంలోనే ఆమే, అతడు జీవితంలో ప్రేమించిన ప్రతీదీ, సాయుజ్యాన్ని చెంది ఉన్నాయి. సంఘర్షణతోనూ బాధతోనూ వణికిపోతున్న అతని హృదయం ఆ కాంతి ఉల్లాసాల స్థలానికే చెంది ఉంది.

అతడు గిలగిలా కొట్టుకుని శాశ్వతంగా కన్నుమూశాడు.

''అయిపోయింది,'' అన్నాడు మర్‌తీనొవ్. శత్రువులపై దాడిచేసేప్పుడు నావికులేవిధంగా తమ బనియన్లను చించుకుంటారో అదే విధంగా మర్‌తీనొవ్ తన చొక్కాను చించుకున్నాడు.

వారు బటాలియన్ కమాండరును అతడు బ్రతికున్నట్టుగానే జాగ్రత్తగా మోసుకెళ్లారు. అలాంటి శక్తివంతమైన మహాకాయం, అలాంటి విశ్రాంతినెరుగని సాహసోపేతమై క్షణం క్రితం వరకూ జీవంతో నిండి ఉన్నటువంటి హృదయం మరణించిదనడం ఎవరూ నమ్మలేకపోయారు. అతడెప్పుడూ ఆవిధంగానే పడుకుని మరే ప్రక్కకు కదలడం అతనికి యిష్టముండదన్నట్టుగా అతడు అచేతనంగా పడుకొని ఉండడం విచిత్రమనిపిస్తుంది. యుద్ధంలో మరణించిన మరో యిద్దరు, యువనావికులు ఇవనొవ్, గొర్యూష్‌కిన్ అనే వారిని అతని వెనకాలే మోసుకు వెళ్లారు. అకీమొవ్ మరణానికి అతని స్నేహితులు ఎంత దుఃఖించారో, ఎంత నిరుత్సాహపడ్డారో, ఆ యిద్దరి నావికుల మరణానికి కూడా వారి స్నేహితులు అంతటి దుఃఖాన్నీ అంతటి నిరుత్సాహాన్నీ పొందారు.

లాప్ జనపదం వద్ద, కొయ్యలపై పరచబడ్డ ధ్రువపుజింక చర్మంతో నిర్మింపబడ్డ పేదవాళ్ల గుడారాల మధ్య అగవలసిందిగా ఆజ్ఞాపించాడు మర్‌తీనొవ్. త్వరలోనే మంచు విపరీతంగా కురవడం ప్రారంభమయింది. మరణించినవారి భౌతికకాయాల నుంచిన బండ్లకు తమ ధ్రువపు జింకల్ని కట్టారు లాప్‌లు. అవి తమ కొమ్ముల్ని పైకెత్తి జాగ్రత్తగా చెవులు నిక్కపొడుచుకున్నాయి. భయంతో నిండిన ఆ పొట్టి లాప్‌లు బండ్ల ప్రక్కనే నడిచారు. వారి శరీరాల వాసన చేపల వాసనే. వాళ్ళు హాస్యగాని టోపీలు వంటి అనేక రంగుల పొడుగాటి టోపీలను ధరించారు.

రికన్నాయ్‌సెన్స్ డిటాచ్‌మెంటు వారు అక్కడి కొచ్చారు. వాళ్ళు ఎక్కడ్నుంచి వచ్చిందీ ఎవరికీ తెలియదు. ముందున్న లెత్యాగిన్ వచ్చి కమాండర్ అకీమొవ్ ఎక్కడ అని అడి

గాడు. అతనికి వచ్చిన సమాధానమల్లా అక్కడున్న బండివైపుకు సంజ్ఞతో చూపించడమే. అతని నొసటిమీది ఎర్రని గాయపు మచ్చ వివర్ణమైపోయింది.

వాళ్లు వెళ్తూనే ఉన్నారు. లెత్యాగిన్ బండి ప్రక్కనే నడుస్తున్నాడు, అప్పుడప్పుడు ఆ మంచులో కాలుజారిపడడం కొంత చికాకే అయినప్పటికీ. అయినా అతడు దాని ప్రక్కనుండి నడవడం మానలేదు. అందుకు కారణం టార్పాలిన్ గుడ్డక్రింద ఉన్న అకీమొవ్ ముఖాన్ని అతడు చూడడం ఎంతో అవసరమూ, ముఖ్యమూ అని అతనికి అనిపించడమే.

కొవలేవ్‌స్కీ చివరికి ఆపిలుపండ్ల పెట్టెను కనుక్కో గలిగాడు. వాటిని కిర్కెనేస్‌వద్దకు తీసుకువచ్చి అకీమొవ్‌కోసం నిరీక్షించాడు. ఆపిలుపండ్లు చెడిపోలేదు — అవి మంచి అన్‌తోనొవ్క ఆపిల్‌పండ్లు. అతడు జరిగిన సంగతిని తెలుసుకున్నప్పుడు క్రుంగిపోయి దుఃఖించాడు. 'రెడ్ బానెర్' బహూకరింపబడిన నౌకావైమానిక యూనిట్ ఉన్న పెచేన్‌గకు అతడు దుఃఖంతో వెళ్లిపోయాడు. అతడా యూనిట్ గురించి వ్యాసం వ్రాయాలనుకున్నాడు.

హొయ్‌బుట్‌ముయెన్ పీఠభూమి పాదప్రాంతాన మొదట్లో సమాధికొరకై కొంత స్థలాన్ని కేటాయించారు నార్వే అధికారులు. నాజీలచే మందలు మందలుగా నార్వేకు తోలుకెళ్లబడి, ఆ నాజీల చిత్రహింసలతో మరణించిన రష్యన్లను సమాధి చేసింది అక్కడే. యుద్ధం ఆఖరి రోజుల్లో మరణించిన, కిర్‌కెనేస్ యూనిట్లకు నౌకలకూ చెందిన మనుషుల దేహాలనూ, ఆఫీసర్ల మృతకాయాలనూ అక్కడికే తెచ్చారు. నార్వే దేశస్థులు తమ పతాకాలను ధ్వజస్తంభాలనుండి సగంవరకు దించేశారు. వారు నల్లని దుస్తులు తొడుక్కొని అప్పుడే కురిసిన మంచుపై స్కీలమీదా, నడిచీ ఆ నూతన శ్మశానానికి వచ్చారు. సోవియట్ మిలిటరీ దళాలు, నౌకా దళాలు కూడా అక్కడికి వచ్చాయి.

లెత్యాగిన్ మర్‌తీనొవ్‌లు మౌనంగా ప్రక్కప్రక్కల్నే నడుస్తూ వెళ్లారు. కమాండ్ యొక్క తీక్ష్ణమైన సంక్షిప్త పదాలు కొండల మధ్యా కొండరాళ్ల మధ్యా మాంద్యంగా దుఃఖపూరితంగా ప్రతిధ్వనించినట్లనుపించింది. మంచు విపరీతంగానూ మందంగానూ కురిసింది.

నార్వేజియన్ మగవాళ్లయొక్క బాధపడుతున్న మొహాలను, ఏడుస్తున్న స్త్రీలను చూసినప్పుడు, గత కొద్ది రోజులలో జరిగిన సంఘటనల కారణంగా ప్రపంచ చరిత్రలో తమకు స్థానమివ్వబడిందన్న సంగతి వారికి తెలుసునా అనీ, యూరస్ అంచునున్న

ఫిన్‌మార్క్‌లో, రష్యన్ రక్తంతో తడిసిన జార్ఫ్యోర్డ్‌బొటెన్, ఎల్‌వినీస్, బ్యోర్నెవత్న్, హొయ్‌బుట్‌ముయెన్ తదితర స్థలాలు చరిత్రాత్మకమైన వాస్తవాంశాలే కాని కేవలం భౌగోళిక వాస్తవాంశాలు మాత్రమేకావని వారు గుర్తించగలిగారా అనీ లెత్యాగిన్ ఆశ్చర్య పోయాడు.

లెత్యాగిన్, నిశ్చలమైన సైనికుల ముఖాలను చూసి, ఏ విదేశసైన్యమైనా ఆఖరికి మిత్రసేనలైనా ఏ గడ్డపైనైనా ఉన్నప్పుడు ఆ సైన్యంవల్ల అక్కడి ప్రజానీకానికి ప్రయోజనమే అయినా వారికి తక్కువలో తక్కువ ప్రయాస కలుగజేసేందుకు కేవలం ఒక్క సోవియట్ సైన్యం తప్ప మరే సైన్యమూ ఎన్నడూ ప్రయత్నించేయలేదనీ, స్వయం ఆత్మసంయమాన్ని సోవియట్ సైన్యం ఆచరణలో పెట్టినట్లు మరే సైన్యమూ పెట్ట లేదనీ, సోవియట్ సైన్యం చూపినటువంటి నిస్వార్థమూ స్నేహభావమూ మరే సైన్యమూ చూపలేదనీ భావించాడు.

లెత్యాగిన్ ఇలాంటి గంభీరమైన, ఆవేశ పూరితమైన భావాలతో నిండి చివరికి అకీమొవ్ ముఖాన్ని చూడ్డానికి నిశ్చయించుకున్నాడు. ఆ ముఖం ప్రశాంతంగానూ సుంద రంగానూ వుంది. అకీమొవ్ తన కళ్లు తెరచి ఏదో ఒకటి చెప్తాడని లెత్యాగిన్ భావించాడు. అతడేం చెప్పేవాడో? అతని ఘంటానాదంలాంటి గంభీరమైన కంఠధ్వని బహుశ వ్యంగ్యమైన నవ్వుతో కలిసి యిలా అనేదేమో: ''ఇహచాలు! ఎందుకు బాధను పెంచు తారు! నన్ను సమాధి చేసి చాలించండి.''

ఈ అవివేకమైన ఆలోచన లెత్యాగిన్ కళ్లల్లో నీళ్లు నింపింది. అతడు తన పెదవులను నొక్కుకొని మర్‌తీనొవ్‌వైపు ఓరగా చూశాడు. అతడు అక్కడ వెలవెల బోతూ నించున్నాడు.

వీడ్కోలు తెలియజేస్తూ ఫిరంగులు మ్రోగాయి. యావత్ప్రపంచంలోని ఆడవాళ్ల మాదిరిగానే అక్కడి స్త్రీలు దుఃఖించి, రోదనం చేశారు. ఒక వృద్ధ బెస్తవాడు నార్వే భాషలో పెద్దగా అన్నాడు: ''మేం మిమ్మల్ని ఎన్నటికీ మరచిపోలేం!'' వింతగా ఒకే విధ మైన పోలికలున్న యిద్దరు ఆడపిల్లలు పెద్దగా వెక్కివెక్కి ఏడ్చారు. అంతా అయి పోయింది.

ఇతరులంతా వెళ్లిపోయింతర్వాత లెత్యాగిన్, మర్‌తీనొవ్‌లు సుమారు ఒక అరగంటదాకా ఎర్ర నక్షత్రంతో ఉన్నటువంటి కొయ్య స్మృతిస్తంభంవద్ద నిల బడ్డారు.

"మనం అతనిని యింటికి తిరిగి తీసుకు వెళ్ళాలి," అని లెత్యాగిన్ అన్నాడు. "జన్మభూమిలో సమాధి చేయబడడం మంచిది." కాని కాసేపు ఆలోచించిన మీదట అతడు తన మనస్సును మార్చుకున్నాడు. "కాదు. నార్వేయర్లు చాలా మంచివాళ్లు. వాళ్లు మనవారిని గౌరవిస్తారు. వాళ్లు సమాధులను జాగ్రత్తగా చూస్తారు. మంచును తుడిచి వేస్తూ పరిశుభ్రంగా వుంచుతారు."

తెల్లని పొగమంచు వరంగెర్ ఫ్యోర్డ్‌పై వ్యాపించింది. మంచు విపరీతంగా పెల్లలు పెల్లలుగా సముద్రంమీదా భూమిమీదా కురిసింది, ఆ మంచు ఏకంగా సముద్రాన్నీ, కొండల్నీ, పీఠభూమినీ కప్పేస్తుందా అన్నట్టు, కాని సముద్రం అలలు దానిని మ్రింగేశాయి. కొండశిఖరాలనుండి తెల్లని మంచును గాలి ఊది పారద్రోలింది. ఒక పల్లపు బురదనేలలో మాత్రమే మంచు చలనం లేకుండా లోతుగా నిర్లక్ష్యంగా నిలబడిపోయింది.



అధ్యాయం తొమ్మిది

# మరణించినవారి జీవితం

1

**1949 లో** తన విద్యను మాస్కోలోని మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో పూర్తిచేసి డాక్టరైనప్పుడు ఆన్న అలెక్సాండ్రొవ్న బెలొజ్యోరొవ తన కుమార్తెతో తూలనగరంలో స్థిరనివాస మేర్పరచుకొంది. ఆమెను అక్కడికి ఒక ఆస్పత్రిలో డాక్టరుగా పనిచేసేందుకు పంపారు. ఆమె అక్కడకు వచ్చినందుకు వాళ్లు చాలా ఆనందించారు. ఆస్పత్రివాళ్లకు అక్కడ ఆనందాన్ని కలుగజేసిన కారణాల్లో ఒకటి ఏమంటే — ప్రతి ఆదివారమూ ఆమెను చూడ్డానికి ఆమె తండ్రి కార్లో రావడమే. ప్రొఫెసర్ యొక్క యీ అలవాటును అక్కడి ఆస్పత్రివాళ్లు సిగ్గువిడిచి స్వప్రయోజనానికై ఉపయోగించుకున్నారు. ఆయన నవ్వుతూ అందుకు అంగీకరించి, వైద్యసలహాలు యివ్వడం, అప్పుడప్పుడు ఒక ప్రత్యేకమైన ప్రమాదకరమైన శస్త్రచికిత్సను కూడా చేయడం జరిగేది.

ఆనిచ్కాకు సంభవించిన ఘటనతో ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్ చాలా కాలంక్రితమే సమాధానపడిపోయాడు. అతడు కూలంకషంగా విచారించినప్పుడు, ఈ విషయం ఇతరు లకెవరికైనా సంభవించిందని అతనికి ఎవరైనా చెప్పి ఉన్నట్లైతే, అతడు తప్పకుండా ఆ తండ్రిపై హృదయం లేనటువంటి అవివేకి అనే దోషాన్ని ఆరోపించేవాడేనని అతడు ఒక నిర్ణయానికి వచ్చాడు. కాలం గడిచిన కొద్దీ అతని కరకుదనం అతనినే మరీమరీ భయ పెట్టింది. అతడు తన అహంకారాన్ని దిగమ్రింగాడు. పైతృకమైన తీక్ష్ణబుద్ధి, నీతి విషయాలలో తానిదివరలో తనకు తానే సాటి అని నీటుగా తలపోసిందంతా తప్పేననీ, తాను ఏవిధంగానూ ఆ విషయంలో ఆదర్శనీయుడు కాదనీ తనకుతాను ఒప్పుకున్నాడు.

అతడు యీ విషయాన్ని 1944 శరదృతువులో ఆనిచ్కాకు వ్రాసిన ఉత్తరంలో హృదయపూర్వకంగా ఒప్పుకున్నాడు. ఆ తర్వాత అతడు యుద్ధరంగంనుండి తిరిగి వచ్చి నప్పుడు తన తప్పును తొలగించి వేసుకొనేందుకై చేయగలిగిందంతా చేశాడు. మనుమరాల మీద తాతయ్యకి బాగా ప్రేమ కుదిరిపోయింది.

ఒక రోజున జనరల్‌గా తరక్కీ చేయబడిన తన పాత స్నేహితుడు వెర్‌స్తొవ్‌స్కీని కలుసుకున్నాడు. అతడు సైనిక మంత్రిత్వ వైదేశిక సంబంధాల శాఖలో పనిచేస్తున్నాడని విన్నప్పుడు, నార్వేలోని ఆనిచ్కా భర్త సమాధి విషయమై భోగట్టా తెప్పించవలసిందిగా కోరాడు.

"అతని పేరు పావెల్ గొర్దేయెవిచ్ అకీమొవ్," అని ఆయన చెప్పాడు. "అతడు నౌకాదళంలో కమాండరు. అతనిని సమాధి చేసింది... ఒక్క నిమిషం ఆగు, కొంచం చూస్తాను... నార్వేలోని హొయ్‌బుట్‌మునెన్‌లో."

వెర్‌స్తొవ్‌స్కీ యిదంతా తన నోటుబుక్కులో వ్రాసుకున్నప్పుడు అకస్మాత్తుగా చకితుడయ్యాడు. "అకీమొవ్ అని కదూ నువ్వన్నది? కాస్త జ్ఞాపకం తెచ్చుకోనీ. ఆ బటాలియన్ కమాండరు కావచ్చా? పొడుగ్గా, పట్టుదలతో, ఉల్లాసంగా ఉండే కుర్రాడు. అతడు నౌకాదళంలో కూడా ఉన్నాడు."

"నీకతడు తెలుసా?"

"ఓ తప్పకుండానూ! అవును. అతడే. అందుకు సందేహం లేదు! ఆనిచ్కా కూడా అదే రెజిమెంటులో ఉండేది. అతడు మరణించాడన్నమాట, అవునా? పాపం. చాలా మంచి ఆఫీసరు!"

ఉత్సాహాన్ని కనపరచడం వెర్‌స్తొవ్‌స్కీకు అలవాటు కాదని ప్రొఫెసర్‌కు తెలుసు. ఎవరినైతే ఆనిచ్కా దురదృష్టానికి కారకుడని అతడు పరిగణించి దోషాన్ని ఆరోపించాడో

అలాంటి వ్యక్తిని గురించి తన స్నేహితుడు పొగడి గొప్ప అభిప్రాయాన్ని కనపరచినప్పుడు అతని హృదయం ద్రవించిపోయింది.

వలసిన భోగట్టా సేకరిస్తానని వెర్‌స్తోవ్‌స్కీ వాగ్దానం చేశాడు. అతడు త్వరలోనే ప్రొఫెసర్‌కు ఫోన్ చేసి తనను కలుసుకొమ్మన్నాడు.

''అవును, నేననుకున్న వ్యక్తే అతను. చాలా మంచి ఆఫీసరు. అతనిని తిరిగి నౌకా దళంలోకి పిలిపించారు. ఆ విషయంలో ఓర్ష వద్ద నా సమక్షంలో సంభాషణ జరిగినట్టు నాకిప్పటికీ జ్ఞాపకం. ఉత్తర నావికాదళం నావికులు అతనిని బాగా ఎరుగుదురు. వాస్తవానికి, అంత తేలికగా మరచిపోదగిన మనిషికాదతడు. నౌకాదళం జనరల్ హెడ్‌క్వార్టర్స్‌లో ఉన్న లెఫ్టినెంటు-కమాండర్ లెత్యాగిన్ అతని మరణాన్ని గురించిన సరియైన పరిస్థితులను నీతో చెప్పగలడు. నార్వేలోని మన మిలిటరీ అటాచీని అతని సమాధి విషయంలో కనుక్కోవలసిందిగా కోరాను. అకీమొవ్ నీకూ నాకూ బంధువనీ, ఆనిచ్కా భర్తనీ నేనతనితో చెప్పాను,'' అని అతడు ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్‌కు చెప్పాడు.

ఆనిచ్కా వయస్సు యిప్పుడు ఇరవై ఎనిమిది సంవత్సరాలు. ఆమె సౌందర్యం సంపూర్ణంగా వికసించింది. ఆమె ప్రజ్ఞావంతురాలైన డాక్టరుగా పరిణమించింది. ఆమె ప్రజలతో నిరాడంబరంగా సమానత్వంతో మెలగడంవల్ల రోగులూ, తోటిఉద్యోగులూ ఆమెను ఎక్కువగా ప్రేమిస్తారు.

త్వరలోనే ఆమె, ఆమె తండ్రి కోరికపై రాజధానిలోని క్లినిక్కుకు బదిలీ అయింది. ఆమె గనక ప్రఖ్యాతి గడించిన ప్రొఫెసరు కుమార్తె కాకపోయినట్లైతే అక్కడ ఆమె విజయం మహోన్నతంగా ప్రశంసించబడేదే. ఇప్పుడు ఆమె నిపుణత్వమూ శక్తి సామర్థ్యాలూ ఆమె తండ్రి నాయకత్వానికీ, వృత్తి సూక్ష్మగ్రాహ్యతలూ ఇక అక్కడకు వంశపారంపర్యంగానే వస్తాయన్నట్టుగా అదేదో ఒక విధమైన ఆనువంశికతకూ ఆపాదించబడ్డాయి.

కాని ఆమె దీనిని పట్టించుకోలేదు. ఆమె తన వృత్తిలో పరిపక్వదశను అందుకొనబోతూన్నట్టూ, తన తండ్రి యితర సర్జన్లు కనపరచిన ఆశ్చర్యకరమైన శక్తియొక్క ప్రారంభదశను ఆమె అప్పటికే చవిచూసినట్టూ భావించింది గనక ఆమె యిందుకు చింతపడలేదు.

ఆమె జీవితం పూర్తిగా తన వృత్తికీ తన కుమార్తెకూ అంకితం చేయడంచేత అది ప్రశాంతంగాను నిరాడంబరంగానూ గడిచిపోతోంది. ఒకప్పుడు ఆమెను బాగా బాధ

పెట్టి, ఒక్కొక్కప్పుడు యిప్పుడు కూడా ఆమెను ఆవరించే నిరాశను ఆమె ప్రశాంత మైన ముఖవర్చస్సులో కనుక్కోవడం కష్టం.

ఆమె రెండు సంవత్సరాలు పాటు నిరాటంకంగా కర్కశంగా దుఃఖంతో గడి పింది. తన చదువులో చాలా బాగానే ముందంజవేసింది. కాని ఆమె విద్యార్థిని దశ ఆమె నంటకుండానే గడచి పోయింది. తనను ఒక తరంగం పైకెత్తి సునాయాసంగా, తనకు ఏమీ కష్టంకలగకుండా ముందుకు తీసుకు వెళ్లినట్టుగా ఆమె భావించింది. ఆ తరం గం కర్తవ్యం కావచ్చు, బాధ్యత కావచ్చు, దేశభక్తి కావచ్చు, మాతృప్రేమ కావచ్చు, లేదా ఏదో మరొకటి కావచ్చు. కాని అది ఆనిచ్కను మాత్రం ఎన్నడూ దుఃఖంలో మునగ నివ్వలేదు.

కాని ఆనిచ్క తానేది చేసినప్పటికీ ఎప్పుడూ ఆశ్చర్యపడుతూనే ఉండేది: ''అతడు మరణించిన తర్వాత నేనెలా పుస్తకం చదవగలను? అతను యిక్కడ యిక లేనప్పుడు నేనెలా అన్నపానాదులు ముట్టగలను? అతడు నాకిక లేనప్పుడు నేను ఏ విధంగా గ్లౌవ్స్ తొడుక్కో గలను?'' అయినా, మేనత్త నాద్య, తన కొడుకు యుద్ధంనుండి తిరిగి రాకపోయినా సరే ఏవిధంగా అన్ని పనులూ చేసుకునేదో అదే విధంగా తాను కూడా పుస్తకాలు చదివేది, అన్నపానాదులు ముట్టుకొనేది, గ్లౌవ్స్ తొడుక్కొనేది.

ఇది ఒక్కొక్కప్పుడు ఆనిచ్కకు తనపైన తనకే విపరీతమైన కోపం పుట్టిం చేది. తాను ఒక దౌర్భాగ్యమైన ప్రాణికావడం వల్లనే అంత తుచ్ఛంగా జీవితాన్ని పట్టు కొని వ్రేలాడుతున్నట్టు భావించేది. అకీమొవ్ మరణించాడు గనక తాను జీవించ కూడ దనుకుంది. అలాంటి పరిస్థితులలో నిజమైన స్త్రీ ఎన్నడూ జీవించి ఉండదని ఆమె తలపోసింది. అయినా ఆమె జీవించింది. తనకోసం, కాత్యకోసం, తన తండ్రికోసం, ఆమె నివసిస్తున్న సమాజంకోసం ఆమె చేయవలసిందంతా చేసింది.

నార్వే గురించి తనకు లభించిన ప్రతీదీ చదివింది. నార్వే భాష జర్మన్‌కు పోలి వుండడంచేత ఆమెకు ఏమంత కష్టం అనిపించక ఆ భాషను నేర్చుకుంది. ఆమె ఆ చిన్న జాతిని గురించి, కష్టపడి పనిచేసే ఆ విశ్వసనీయమైన జాతిని గురించి చదివినప్పుడు, ఆ జాతి చిన్నదనడం, వారు కష్టపడి పనిచేసేవారనడం, వారు విశ్వసనీయులైన వారనడం నిస్సందేహంగా వాస్తవమనే కారణమే, పావెల్ అకీమొవ్ మరణాన్ని సమర్థనీయమైన దిగా చేస్తూందనే భావన ఆమెకు ఊరడింపుకలుగజేసింది.

పావెల్ తల్లిదండ్రుల్ని చూసేందుకు కొవ్‌రోవ్ వెళ్లాలని ఆమె ఒక నాడు నిశ్చయించుకుంది. అది 1946 వేసవికాలం. ఆమె సాయంత్రం రైల్లో బయల్దేరి మర్నాడు ఉదయంకల్లా కొవ్‌రోవ్ చేరుకుంది. ఆమె అబెల్‌మానొవ్‌స్కయా వీధి గుండా వెళ్లింది. ఆ తర్వాత బజార్ వీధిగుండా రాతితో కట్టిన షాపులను త్వరత్వరగా దాటి వారధిమీదికి వెళ్లింది. అక్కడ్నుంచే ఆమె జరేచ్‌నయా స్లొబోద్‌కకు చేరుకుంది. ఇక్కడ ఆమె చిన్న చిన్న కలప యిండ్లు చెట్లల్లో మునిగిపోయి ఉండడం చూసింది.

చుట్టుప్రక్కలనుబట్టి గుర్తించడానికి ఏమీ లేకపోయినా, ఆమె ఏ యింటికోసం వెతుకుతోందో దానిని సునాయాసంగా కనుక్కోగలిగింది. ఆ యింటి వెలుపల ఒక వృద్ధురాలు బెంచీమీద కూర్చుంది. ఆమె పావెల్ తల్లి అని ఆనిచ్క వెంటనే గుర్తుపట్టింది. ఆమెకూ ఆమె కొడుక్కీ కొన్ని పట్టుదొరకని పోలికలు ఉన్నాయి. కరుణను ప్రకాశింపజేసే అలాంటి ఒక చిన్న చక్కని వృద్ధురాలికి పావెల్‌వంటి స్థూలకాయుడు పుట్టాడంటే విచిత్రమేనని పిస్తుంది. కొడుకు మరణించిన తర్వాత కూడా ఆమె అలా ఆ బెంచీ మీద కూర్చోగలగడం కూడా చిత్రమేనని పిస్తుంది.

''ఎలా ఉన్నారు మరీయా కపితోనొవ్న?'' అన్నది ఆనిచ్క. ''నేను అన్న బెలొజ్యోరొవను. నేను మీకు ఒక ఉత్తరం వ్రాశాను.''

ఆ వృద్ధురాలు ఆమెను భావోద్వేగంతో కౌగలించుకుంది. ఒక్కమాటైనా మాట్లాడకుండా ఆనిచ్కను లోపలికి తీసుకువెళ్లింది.

ఆమె మనస్సు కాస్త నెమ్మదైన తర్వాత అడిగింది: ''నా చిన్ని మనమరాల్ని తీసుకు రాలేదేవమ్మా? లేదా ఒకవేళ తీసుకొచ్చావేమో?''

''తీసుకు రాలేదండి. ఈదఫా తప్పక తీసుకు వస్తాను.''

''మంచిదమ్మా. ఏదీ నువ్వెలా ఉన్నావో ఒక్కసారి చూడ నివ్వు,'' అని అన్నది వృద్ధురాలు తన విషాదనయనాలను ఆనిచ్కపై కేంద్రీకరిస్తూ.

ఆనిచ్క వచ్చినసంగతి యిరుగింటి పొరుగింటి వాళ్లకు తెలిసింది. పావెల్ వితంతువు ఎలా ఉంటుందోనని కుతూహలంగా చూడవచ్చే యిరుగుపొరుగు వాళ్లు విధవిరామం లేకుండా ఆ యింటికి అలా వస్తూనే వున్నారు. వాళ్లల్లో చాలామంది నేత పారిశ్రామికులు. మగవాళ్లూ ఆడవాళ్లూ వయసు మీరుతున్నారు. కొంతమంది తమతోపాటు పిల్లల్ని తీసుకు వచ్చారు. వాళ్లంతా కూడా ఆనిచ్కను కొంత గాంభీర్యంతో కుశల

ప్రశ్నలడిగారు. ఆమె ఒక ప్రఖ్యాత డాక్టరు బిడ్డనీ ఆమె తండ్రి జనరల్ కూడాననీ వారికి తెలుసు. కాని వారికి కుతూహలతను కలిగించింది ఆ విషయం కాదు. వాళ్లలో కొందరి కొడుకులు జనరళ్లు, పార్టీ కార్యకర్తలు, మేనేజర్లు, పలుకుబడి ఉన్నవాళ్లూ ఉన్నారు. అధికార్లతో వారు బుజాలు రాసుకు తిరిగేవారు, ఇక ఆ మాటకొస్తే వాళ్ల కార్మికకర్షక రాజ్యంలో ఎక్కువ ఎక్కువకెక్కువగా అధికారం వారి చేతుల్లోనే వుంది. అందుచేత వాళ్లు ఆమె స్థితిగతులకు అంతగా ప్రాముఖ్యతను యివ్వలేదు. అసలైన కారణం ఏమంటే వారు పావెల్‌ను బాగా ఎరుగుదురు. వారతనిని ప్రేమించేవారు. అతడు జరేచ్‌నయా స్లొబోద్‌కలోని అత్యంత బలవంతులైన కుర్రాళ్లలో ఒకడు. అందరికంటే చాలా మంచి పిల్లవాడు, అంతేకాకుండా ఆ రోజుల్లో అతడు ప్రసిద్ధికెక్కిన షాక్ కార్మికుడు, పార్టీ పనిలో చురుకైనా వాడు.

అక్కడున్న కొంతమంది వృద్ధస్త్రీలకు అకీమొవ్‌ను తమతమ అల్లుడుగా చేసుకోవాలన్న సంకల్పాలుండేవి. అతడు ఎలాంటి భార్యను ఎన్నుకున్నాడో చూడాలనే కుతూహలం వాళ్లకు కలిగింది, ఎందువల్లనంటే అతడు ఆ విషయంలో అంత తేలికగా సంతృప్తిపడే యువకుడు కాడని వారికి తెలుసు. వాళ్లు ముచ్చట్లు చెప్పుకొనేందుకు కూర్చున్నారు. చెర్రీపండ్ల జామ్‌తో రొట్టె తిని దానితోపాటు కొంత టీ తాగారు. అతడెంత మంచి భార్యను ఎన్నుకున్నాడమ్మా అని అనుకుంటూ వెళ్లిపోయారు.

త్వరలోనే అకీమొవ్ చిన్న చెల్లెలు వార్య పనినుండి వచ్చింది. ఆమెకు యింకా వివాహం కాలేదు. ఆమె ఒక బడిలో ఉపాధ్యాయురాలు. పావెల్ చదువుకున్న ఒకటవ నంబరు బడిలో ఆమె క్రిందితరగతులకు బోధిస్తుంది. ఆ బడి అంతక్రితం ఉన్నత పాఠశాల. ఆమెకూ పావెల్‌కూ ఎంతదగ్గరి పోలికలున్నాయంటే ఆమెను చూడగానే ఆనిచ్క చకితురాలైపోయింది. ఆమె వార్యను ఎంతో సంతోషంతో కౌగిలించుకుంది. వార్యకు దుఃఖం వచ్చింది.

చివరికి పావెల్ తండ్రి గొర్దేయ్ పెత్రోవిచ్ పనినుండి యింటికి వచ్చాడు. అతడింకా నేతమిల్లులో ఫోర్‌మన్‌గా పనిచేస్తూనే ఉన్నాడు. పొడుగరి. జీవకళ ఉట్టిపడే కళ్లు. పొదల మాదిరిగా దట్టమైన కనుబొమలు, ముఖ్యంగా కుడివైపుది. అది కుడికన్నుమీద నిటారుగా ఉల్లాసంతో దాదాపు బడాయిలుకోట్టే దాని వలె నిలుచుంది. అతడు లోపలికి వచ్చి ఆమె ఎవరో తెలియకపోయినా ఆనిచ్కను పలకరించాడు కుశలం అడుగుతూ.

"మంచిది. నేను వచ్చాను. కుర్రాళ్లంతా ఎలా ఉన్నారు? అక్కడున్న ఆ అందమైన పిల్ల ఎవరు? ఆమెను నేనెన్నడూ కొవ్‌రోవ్‌లో చూడ్లేదే," అని అతడన్నాడు.

అతని మాటలకు సమాధానం లేకపోవడంవల్ల అతడు కొంత జాగ్రత్తపడ్డాడు. తర్వాత అతడు బల్లమీద ఉన్న పావెల్ ఫోటో చూశాడు. అతని విశాలమైన ముఖం లోని చిరునవ్వుస్థానే విషాదంతో కూడిన వర్చస్సు నెలకొంది.

''సరే. ఇప్పుడు తెలిసింది.'' అని అతడన్నాడు. ఆ తర్వాత అడిగాడు: ''మన మరాలు ఎలా ఉందమ్మా?''

''బాగానే ఉంది. మిమ్మల్ని చూడ్డానికి మరో పర్యాయం తీసుకొస్తాను,'' అని ఆనిచ్కా సమాధానం చెప్పింది.

మర్నాడు వూరు చూసేందుకు ఆనిచ్కా వెళ్ళింది. వార్యా, ఆమె తండ్రి ఆనిచ్కాకు అకీమొవ్ పని చేసిన పెద్ద ఎక్స్కవేటర్ వర్క్స్‌ను చూపించారు. దాని విషయమై తనకు జ్ఞాపకం ఉన్నదంతా చెప్పాడా ముసలాయన. అది కేవలం వర్కుషాపుగా మాత్రమే ఉండేదనీ అక్కడ ప్రతి పనీ చేత్తోనే చేయవలసివచ్చేదనీ, పెట్రోలు దీపాలవల్లనే వెలుగు అక్కడ ఉండేదనీ అతడు ఆ రోజుల్ని యింకా జ్ఞాపకం చేసుకోగలిగాడు. ఆ రోజుల్లో కొలిమిలో ఎంత విపరీతంగా పొగ ఉండేదంటే ఎవరైనా సరే ఉక్కిరిబిక్కిరి అయిపోవలసిందేనని అతడన్నాడు. కమ్మరి ఆ పొగకు యిక ఆగ లేకపోయినప్పుడు బయటికి పరుగెత్తి కాసేపు మంచులో పడుకొని మళ్ళీ తన పనికి వెళ్ళేవాడు.

ఇప్పుడు ఆ భవనం చాలా పెద్దది. పెద్దపెద్ద కిటికీలు ఉన్నాయి. ట్రాముబళ్ల మాదిరిగా ఎర్ర రంగు వేయబడ్డ కొత్త 'కావ్‌రోవెత్స్' ఎక్స్కవేటర్‌లు ఆవరణలో వరుసలు తీర్చి ఉండడం ఆనిచ్కా చూసింది.

ఎక్కడైతే ఊరేగింపులూ, రహస్య సమావేశాలు జరిగేవో ఆ 'మౌంట్ షిరినా'ను ఆమెకు చూపించాడు ముసలాయన. పూర్వపు రోజుల్లో అక్కడ ముష్టి యుద్ధాలు జరుగుతుండేవి.

అది లోహ కార్మికుల, నేత కార్మికుల బస్తీ. అది విప్లవంకోసం, సామ్యవాదం కొరకు తన శక్తినీ, రక్తాన్నీ ధారవోసినటువంటి అనేక రష్యన్ బస్తీలలో ఒకటి. లెఫ్ట్ సోషలిస్టు-రివల్యూషనరీ తిరుగుబాటు జరిగినప్పుడు కొవ్‌రోవ్ బస్తీ మాస్కో కార్మికులకు సహాయం చేసేందుకుగాను 250 వ పదాతి రెజిమెంటును ఉయేజ్డ్ పార్టీ కమిటీ కార్యదర్శి, సోవియట్‌యొక్క చైర్మన్ అబెల్‌మాన్ నాయకత్వంక్రింద స్థానిక బోల్షెవిక్కులను పంపింది. అబెల్‌మాన్ నేలకొరిగాడు. మాస్కోలో ఒక గేటుకి అతని పేరు కూడా. బేల్‌కొవ్ క్ల్యాచ్నికొవ్ ప్రాంతాలలోని కులాక్కుల తిరుగుబాటును అంతమొందించేందుకూ, మూరొమ్ వైట్‌గార్డ్ విప్లవ ప్రతిఘాతకుల తిరుగుబాటును అణిచేం

దుకు కూడా కొవ్‌రోవ్ బోల్షెవిక్కులు, కార్మికులు మనుషుల్ని పంపారు. తర్వాత వారు తమ కర్మాగారాలను, ఫ్యాక్టరీలను యథాస్థితికి తెచ్చేందుకై గొప్ప పట్టుదలతో పనిచేయడానికి పూనుకున్నారు. మొదటి ఎక్స్కవేటర్ 1931 లో నిర్మించబడింది. రెండు సంవత్సరాల తర్వాత క్రమోత్పత్తి ప్రారంభమైంది.

"దేశభక్తయుత మహాసంగ్రామంలో..." అని వృద్ధుడు ఆగి ఆ తర్వాత చురుకుదనం అగుపించని కంఠధ్వనితో అన్నాడు: "కొవ్‌రోవ్ ప్రజలు తాము సమర్పించవలసిందంతా సమర్పించారు."

## 3

మేం పావెల్ అకీమొవ్ కథను యిక్కడ ముగించి, అతని తర్వాత జీవించిన వారి సుఖదుఃఖాలను చెప్పుకుంటూ పోవచ్చు. మన నాయకుడ్ని దుఃఖంతో విడిచిపెడుతున్నప్పటికీ నిజానికి మేం యిక్కడ్నే సమాప్తి అని వ్రాసి కలాన్ని క్రిందుంచి వేరే ఆలోచనలకు తావిద్దామనుకున్నాం.

కాని దురదృష్టవశాత్తు మేం అలా చేయలేం.

1951 ఆగస్టు నెలలో మనుషులు పలుగులు, గడ్డపారలు, మందుగుండు సామాన్లు, బుల్‌డోజర్లతో నార్వేలోని రష్యన్ మిలిటరీ శ్మశానాలకు వచ్చారు. వాళ్ళు సమాధులను నాశనంచేసి కళేబరాలను గోతుల్లో పారేశారు. ఆ మరణించిన వారే గనక బ్రతికున్నట్లైతే ఇప్పుడు వచ్చిన ఆ అపవిత్రుల సంఖ్యకంటే ఎక్కువ మందినే కాళ్లకు బుద్ధిచెప్పేట్టు చేసేవారు. స్థానికవాసుల పవిత్ర హస్తాలతో ఉంచిన పువ్వులను తుడిచివేస్తూ మట్టిలో పూడ్చివేస్తూ వారు భారీ రోలర్లతో భూమిని చదునుచేశారు.

ఆ విధంగా అపవిత్రంచేసిన శ్మశానాలలో అకీమొవ్ శరీరాన్ని భూస్థాపితంచేసిన ఫిన్‌మార్క్‌లోని శ్మశానం ఒకటి. ఏ దేశమైతే నార్వే స్వాతంత్ర్యంకోసం మొదట తన సైన్యాలను పంపిందో, ఏ దేశం నార్వేకు స్వాతంత్ర్యం లభించిన తర్వాత తన సైన్యాల్ని మొదట తరలించేసుకుందో ఆ దేశం పైనే బాంబులు వేసేందుకుగాను ఆ పర్వత పీఠభూమిపై విమానాశ్రయాన్ని నిర్మించడం ప్రారంభించారు.

ఇతరుల కృషిపై బ్రతికే మనుషులు ప్రజలకు ప్రతికూలంగా యుద్ధసన్నాహాలు చేయ సంకల్పిస్తారు. ఇటీవలనే జరిగిన సన్నివేశాల స్మృతులు వారి పన్నుగడలకు అడ్డంకులవడంవల్ల వారు ఆ స్మృతులను భూమినుండి తుడిచి వేయాలని వారు నిశ్చ

యించుకున్నారు. మరణించినవారు వారి మార్గానికి అడ్డంగా ఉన్నారు. అంచేత వారిని మరో పర్యాయం చంపాలని కృతనిశ్చయులయ్యారు.

ఈ దుష్కార్యాల వార్తను వెంటనే బహిరంగ పరచలేదు. అది అనేక డిప్లొమేటిక్ మార్గాలు తదితర మార్గాలద్వారా గాలించబడి మళ్లీమళ్లీ తనఖీ చేయబడింది. అలాంటి అసహ్యం కలిగించే విషయాలు నిజంగా జరిగాయా అన్నది నమ్మడం కష్టం.

జనరల్ వెర్స్తొవ్స్కీ నార్వేలోని మిలిటరీ అటాచీ ద్వారా అక్కడ ఏం జరిగిందీ తెలుసుకున్నప్పుడు అతడు తడబడి కంపించిపోయాడు. అతడెక్కువగా బాధపడింది, అకీమొవ్ శరీరం అక్కడ సమాధి చేయబడడంవల్లనే.

అతడు ప్రొఫెసర్ బెలొజ్యోరొవ్‌ను చూడ్డానికి వెళ్లాడు. అతనికి రహస్యంగా తాను విన్నదంతా చెప్పాడు. ప్రొఫెసర్ మొహంమీది రంగు విస్మయంతో వివర్ణమై పోయింది. చీకటి పడిపోతూండగా ఆ చీకట్లోనే యిద్దరూ అలా కూర్చున్నారు, ఆనిచ్కతో చెప్పడమా లేదా అనే విషయాన్ని నిశ్చయం చేసుకోలేక. అవతలిగదినుండి పెద్దగా పాపాయి నవ్వు, సద్దుచేయని గొంతులు వినిపించాయి.

"ఆ విషయం ఆమె ఎలాగైనా వింటుంది. త్వరలోనే ఆ సంగతి తెలిపి తీరాలి," అని వెర్స్తొవ్స్కీ అన్నాడు.

"అయితే మనం ఏం చేద్దాం? ఆమెతో చెప్పుదామా?"

"ఆమె మళ్లీ పెళ్లి చేసుకోవాలి."

"ఆమెకు యిష్టం లేదు."

బాగా చీకటి పడిన తర్వాత ఆనిచ్క తలుపు తట్టి నెమ్మదిగా అడిగింది: "నాన్నా, నిద్రపోతున్నావా?"

ఆ యిద్దరి జనరల్స్‌లో సమాధానం చెప్పేందుకు ఎవరికీ ధైర్యం చాల్లేదు. ఆనిచ్క తన గదికి తిరిగి వెళ్లిపోయింది.

"మరణించినవారు కూడా వాళ్ల మార్గానికి అడ్డు వచ్చారు," అని వెర్స్తొవ్స్కీ విచారంతో అన్నాడు.

ప్రొఫెసర్ తన ముసలి మీసాన్ని తాకాడు, అలాంటి విషయాలు యీ లోకంలో జరిగినందుకు విస్మయ విచారాలను పొందుతూ. అతని ముఖవర్చస్సు భయంకరంగా రాయి లాగైపోయింది. ప్రపంచంలోని గడియారాలన్నిటిని ఆపవచ్చుగాని కాలగమనం మాత్రందేనికీ ఆగదని అతడు తలపోశాడు. ఎక్కడో దూరంలో యూరప్ ఉత్తర కొనలో వీరుల సమాధులను

నాశనం చేయడమనేది కాలగమనాన్ని ఆపగలుగుతామనే అవివేకమైన ఆశతో ఉత్తర ధ్రువపు రాత్రిసమయంలో టిక్కుటిక్కుమనే చిన్ని గడియారాలను ఆపివేయడంలాంటిదే.

"మనం ఆమెకు చెప్పితీరాలీ," అని అతడు అకస్మాత్తుగా అన్నాడు. ఆనిచ్కాను పిలిచాడు.

ఆనిచ్కా వెర్స్తోవ్‌స్కీ చెప్పిన విషయాన్ని విన్నది. ఆమె నిశ్చేష్టురాలై నిలబడి పోయింది. ఆశ్చర్యం, భయం, అవమానాలతో ఆమె నిండిపోయింది. మానవత్వంపై ఆమెకున్న విశ్వాసం అంతరించి పోయినట్లను పించింది. భీభత్సయుగంగా కనిపించిన ఒక క్షణంసేపు ఆమె అకీమోవ్‌ను అడిగింది: "అక్కడికి ఎందుకు వెళ్లావు? దేనికోసం నీ జీవితాన్ని త్యాగంచేశావు? ఎవరికోసమని నీవు నీ ఉదాత్త భావాలనీ, నీ సాహసాన్నీ, నీ ప్రేమనూ బలిచ్చావు?"

కాని అదృష్టవశాత్తూ ఆమె ఆ మనోస్థితిలో చాలా సేపటివరకు ఉండలేదు. ఆ అవమానం జరిగింది తన ఒక్కర్తెకే కాదని ఆమె గుర్తించింది. అది మొత్తం మానవ జాతికే సిగ్గుచేటు. ఉదాత్తమైన మానవజాతిని కబళించడానికి వచ్చిన గోముఖవ్యాఘ్రాలను మానవులక్రింద పరిగణించడం పొరబాటని ఆనిచ్కా అర్థం చేసుకుంది. ఆమె త్వరలోనే తన ఉద్రేకాన్ని అణచుకొని దాదాపుగా ప్రశాంతంగా ఉన్న కంఠధ్వనితో అన్నది: "అతను బ్రతికున్నప్పుడు ఎంత భీతిని శత్రువులకు కలిగించాడో అంత భీతినే, ఇప్పుడ తను మరణించినప్పటికీ అతడు శత్రువులలో కలిగించాలి." అతని అదృష్టం అపురూపమైనదనీ, మరణానంతరం కూడా జీవిస్తున్నటువంటి దేననీ ఆమె భావించింది.

ఆనిచ్కా తన తండ్రికి, ఆ జనరల్‌కు నమస్కారం చెప్పి తన గదిలోకి వెళ్లిపోయింది.

మర్నాడు పాఠశాలలు తెరిచే మొదటి రోజు. పావెల్ అకీమోవ్ కుమార్తె, చిన్ని కాత్యకు అప్పుడే ఏడేళ్లు వచ్చాయి. ఇదే ఆ బిడ్డ బడికి వెళ్లే మొదటి రోజు. తన బిడ్డ పినఫోర్‌ను ఆనిచ్కా ఇస్త్రీ చేసింది. దానిమీద నీళ్లుజల్లే అవసరం లేదు. మాతృ హృదయంనుండీ ఆమె నయనాలనుండీ వర్షపు బిందువుల్లాగా వెలువడిన పెద్దపెద్ద కన్నీటి చుక్కలచే ఆ గుడ్డ చెమ్మగిల్లి పోయింది.

1952

## పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించిగాని దీని పేర్పు కూర్పూ గురించిగాని మీ అభిప్రాయాలను మీ సలహాలనూ భావిప్రచురణల సహాయార్థం మాకు పంప ప్రార్థన. మా చిరునామా:

Foreign Languages Publishing House,
21, Zubovsky Boulevard,
Moscow, USSR.

